# అంకితము.

---

నారీమతల్లియు, దయాపాతివ్రత్యాది సకలగుణ సంపన్నయు, పరమపావనియు, శ్రీరామచంద్ర పాదారవింద మరంద రస నిరంతర పాన తృప్తయు, స్వర్గలోకవాసినియు నగు నాతల్లి లక్ష్మిదేవమ్మ పాదపద్మముల కీగ్రంథమును సమర్పించుచున్నాఁడను.

గ్రంథకర్త.

ఓం

# భక్తియోగము.

దేశభక్తుఁడగు,

శ్రీ బాబు అశ్వినీకుమారదత్తు

యం. ఏ., బి. యల్., గారిచే రచింపంబడిన

బంగాళీగ్రంథమున కాంధ్రీకరణము.

---

ద్వితీయముద్రణము.

---

విద్వత్కవివర్యులగు, బ్రహ్మశ్రీ

విద్వాన్ వేదము వేంకటరాయశాస్త్రిగారిచేత

పరిష్కరింపఁబడి,

మచిలీపట్టణములోని

"సరస్వతీనికేతనము" వారిచే

ప్రచురింపఁబడినది.

---


చెన్నపురి:

జ్యోతిష్మతీ ముద్రాక్షరశాలయందు

ముద్రితమైనది.

1914


దీనివెల]  [రు. ౧-౦-౦

(౧) భక్తియోగము.—కాలికో బైండు. వెల రు. ౧-౦-౦

,, కాగితము బైండు. ౦-౧౨-౦

(౨) తుకారాము చరిత్రము.—కాలికో బైండు. ౧౫౦ పుటలు. చిత్రపటము గలదు. } ౦-౮-౦

(3) సీతాదేవివనవాసము.—పండిత ఈశ్వర చంద్ర విద్యాసాగరులవారి గ్రంథమున కాంధ్రీకరణము. కరుణారసపూరితము. ౧౦౦ పుటలు. ప్రతి స్త్రీయును తప్పక చదువఁదగినది. } ౦-౪-౦

పై గ్రంథములు ఈ క్రింది విలాసమునకు వ్రాసికొనినఁ బడయగలరు.

కార్యనిర్వాహకుఁడు,

సరస్వతీనికేతనము,

మచిలీపట్టణము.

# విషయసూచిక.

పుట.

పుట.

# విజ్ఞాపనము.



ఆర్యులారా!

తొలుదొలుత నే నేతద్గ్రంథమాతృకను వంగభాషలోఁ జదివినప్పుడు, తప్పక దాని నాంధ్రీకరింపవలయుననుసంకల్పము గలవాఁడ నైతిని. నేఁటికాసంకల్పమును దైవానుగ్రహము వలన నెఱవేర్చుకొనఁ గలిగితిని. పేరెన్నికఁ గాంచిన వంగదేశగ్రంథకర్తలచేతను, విద్వాంసులచేతను, భక్తులచేతను, ఏకగ్రీవముగఁ గొనియాడఁ బడినట్టిదియు, పిన్నపెద్దలును, పేదసాదలును, పండితపామరులును, స్త్రీలుపురుషు లను భేదము లేక భగవద్గీతకు మాఱుగ ప్రతిగృహమందు పఠించుచుండునట్టిదియు నీగ్రంథముయొక్క ప్రాశస్త్యమును వేఱుగ విన్నవించుకొనుట యనవశ్యమని తలంచుచున్నాను. కాని యట్టియుత్కృష్టగ్రంథమున కాంధ్రీకరణ మగుదీనియం దనేక లోపములు గనఁబట్టవచ్చును. ఆలోపములు నావలనఁ గలిగిన విగ భావించి మాతృకాగ్రంథముపైని దోషారోపణము చేయకుందురు గాత.

నాప్రార్థన నంగీకరించి యమూల్య మగు తమకాలమును వినియోగించి, ఏతద్గ్రంథరచనయందలి పలులోపంబుల సంస్కరించుటయే కాక, స్వకీయ జ్యోతిష్మతీముద్రా

లయంబునఁ జక్కఁగను, బహుత్వరితముగను ముద్రింపించిన సంస్కృతాంధ్రాంగ్లేయవిద్యాపారగాములును, విద్వత్కవి వర్యులు నగు, బ్రహ్మశ్రీ, విద్వాన్ వేదము వేంకటరాయ శాస్త్రిగారికి వినయపూర్వక వందనసహస్రము లర్పించు చున్నాఁడను.

ఏతద్గ్రంథముద్రణమున కనేకవిధములఁ దోడ్పడిన మిత్ర బృందమునకును, అర్థసాహాయ్య మొసంగిన భాషాభిమానులకు ను, ప్రాఁతప్రతి నామూలాగ్రముగ వినిన, యాంధ్రజాతీయకళా శాలలోని సంస్కృతోపాధ్యాయులగు, విద్వాన్ శ్రీ పెద్దింటి తిరుమల వేంకట నరసింహాచార్యులుగారికిని కృతజ్ఞుఁడ నై యున్నాను.

“బం॥ కీ॥” అనుగుర్తును బంగాళీకీర్తన యనియును, “బం-ప” అనుగుర్తును బంగాళీపద్య మనియును పాఠకులు చదువుకొనవలయును.

ఇట్లు

గ్రంథకర్త.

# ఉపోద్ఘాతము.



ధర్మాందోళనము మిక్కుటముగ జరుగుచున్న యిక్కాలమున వేలువేలుమతములవారు తమతమమతములఁ గైకొని వివాదములను కాలు ద్రివ్వుచున్నారు. ఒకమతమువాఁడు ఇంకొకమతములోనిదోషములను వెల్లడించి సంతసించుటకు వెనుదీయకున్నాఁడు. ఉపన్యాసములయం దితరమతములను నిందించినకొలందిని శ్రోతల కరతాళధ్వనులు మిన్నందుచుండును. ఈధర్మాందోళనమందు పరమతసహనము లేక వర్తించుటవలన మనమెల్లరమును ధర్మముయొక్క మూలవిషయమును మఱచిపోవుచున్నా మనుట నిక్కువము. మనజీవితములనిత్యములు, వానిపరిమితి బహుస్వల్పము. ఇట్టిస్థితియందు కర్తవ్యనిర్వహణమునుగూర్చి యణుమాత్రమైనఁ బ్రయత్నింపక కేవలము పరస్పరకలహములతోడ మనజీవితములను నశింపఁ జేసికొనుచున్నారము. కావునకొంచెమైనను కాలమును వ్యర్థపఱుపక ధర్మాన్వేషణముకొఱకుఁ బ్రయత్నించుట మనకు విధాయకకృత్యమైయున్నది. మనము విచారించిచూచినకొలందిని వివిధధర్మములయొక్క మూలస్వరూప మొక్కటియే యని తెలిసికొందుము. కాఁబట్టి, కొబ్బరకాయలోనికొబ్బర

మాత్రమే గ్రహించి పైపెంకులను పాఱవేయునట్లు బాహ్యాను ష్ఠానసంబంధము లగువివాదములను వదలి ధార్మికతత్త్వమును గ్రహించుటకుఁ బ్రయత్నింతము. చూచుటకు మన కెన్నిమత ములు కాన్పించుచున్నను, ఆయామతములు దేశకాలపాత్ర ముల ననుసరించి, యేయేమార్గముల నవలంబించియున్నను, సమస్తమతములవారిగమ్యస్థాన మొక్కటియే యని యంగీకరింపనివా రుందురా? "ఉద్దేశమునం దేవిధమగు భేదము లేదు. ఒక్కఁడే బ్రహ్మ. వేద మొక్కటియే. యోగము,భక్తి,పుణ్య మును ప్రతిమతమునందును నొకటేవిధమగు మూలపదార్థము వలన నేర్పడుచున్నవి. దయాస్నేహములతోడనే మానవ దేహము పోఁత పోయఁబడినది. ప్రతిమానవునిశరీరమందలి రక్తము ఎఱ్ఱగనే యుండును. వేలువేలు మతములయొక్క వేలువేలుసిద్ధాంతము లన్నియుఁ జేరెడుగమ్యస్థాన మొక్క టియె. కావున, స్టీమరుమీఁదఁగాని రైలుమీఁదఁగాని గమ్య స్థానమును జేరుటకుఁ బ్రయత్నింపుఁడు" (బం॥కీ॥) ఈయాథా ర్థమును గ్రహింప లేక పోట్లాడుకొను చుందుమేని మనము మనజీవనలక్ష్యమునుండి భ్రష్టుల మగుదుము.

త్రయీ సాంఖ్యం యోగః పశుపతిమతం వైష్ణవ మితి।
ప్రభిన్నే ప్రస్థానే పరమిద మతః పథ్య మితి చ।
రుచీనాం వైచిత్ర్యా దృజుకుటిల నానాపథజుషామ్।
నృణా మేకో గమ్య స్త్వమసి పయసా మర్ణవ ఇవ॥

మహిమ్నః స్తవము.

"త్రయీమతము, సాంఖ్యమతము, యోగమతము, పశుపతిమతము, వైష్ణవమతము వీనిలో నొక్కొక్కటి యొక్కొక్కస్థలమునం దాదరింపఁబడుచున్నది. కాని కొందఱీమతము శ్రేష్ఠమైనదనియుఁ గొందఱామతము శ్రేష్ఠమైనదనియుఁ జెప్పుచుందురు. నదులు ఋజుగామిను లైనను వక్రగామినులైనను సముద్రమునే చేరునటుల, రుచిననుసరించి యేమార్గము ననుసరించినను మానవుఁడు నిన్నే చేరుచున్నాఁడు." కావున దేనివలనమనగతి భగవానునిదిక్కున కేఁగుచుండునో దానిని చేయుచుండుట ప్రయోజనకరము. బియ్యమును వదలి ఊఁకకొఱకు పోరాడువారు మూర్ఖులు గదా?

"గోఁకలిని భజించుటచేత భవనదిని దాఁటుటకు వీలగునని నమ్మినయెడల, లోకులమాటలను గణనసేయకుము. నీమార్గమున నీవు నడువుము. అప్పుడు ప్రేమామృతరసమును గ్రోలఁగలవు" (బం॥ కీ.) పరిపూర్ణప్రేమతోడను, భక్తిరసపూరితమగు హృదయముతోడను, భగవానుని ఏభావమునఁ బ్రార్థించినను, అజ్ఞానాంధకారము నశించును. అప్పుడు జ్ఞానజ్యోతి పొడగట్టును. ఆయనసాన్నిధ్యము దొరకును. కావున అజ్ఞానాంధకారమును నశింపఁజేసికొని జ్ఞానప్రకాశమును బొందుటకుఁ బ్రయత్నించుట మనకు కర్తవ్యము. "వివాదములవలనఁ గాని, బాహుబలమునుపయోగించుటవలనఁ గాని, అంధకారము నశింపదు. వెలుతురు సమీపించినకొలఁదిని క్రమక్రమముగ చీఁకటి నశించును." (బం॥ కీ॥) అజ్ఞానాంధకారమును నశింపఁ

జేసికొనుటకు మనజీవనమును దీప్తిమంతముగ నొనర్చుకొనవల యును. మహాభక్తుల జీవనములందుఁగాని, జ్ఞానజ్యోతివలన దీప్తిమంతులగువారి జీవనములందుఁగాని, వివాదములను చూచితిమని చెప్పఁగలవారున్నారా? వారెల్లరును సమదర్శులు. పర్వతశృంగముమీఁదనివసించువానికి, దానిక్రిందనున్నవృక్షములయొక్క హెచ్చుతగ్గులుగాని, భూమియొక్క మిట్టపల్లములు గాని కాన్పింపవు.

ఒకానొకదినము ప్రతాపచంద్రమజుందారు మహర్షి దేవేంద్రనాథఠాకూరు దర్శనమునకేఁగి, ఆయన బల్లమీఁద నున్న విఖ్యాతక్రీస్తుమతగ్రంథమొకదానిని జూచి, ఆశ్చర్యాన్వితచిత్తుఁడై, క్రీస్తుమతముమీఁద ననురాగములేనియీయన బల్లమీఁద నీగ్రంథముండుటకు కారణమేమనితలంచి, మహర్షినిఁ జూచి మీబల్లమీఁద నీగ్రంథము నేల యుంచితి రని ప్రశ్నించెను. ఈప్రశ్నకు మహర్షి యీవిధముగ ప్రత్యుత్తరం బొసంగెను. "నేనుభూమిమీఁద నడచుచుండినప్పుడు నేను నడచు భూమియొక్క నలువైపులనుండుగట్లను చూచుచుండువాఁడను. ఈభూమి యొకరిదనియు, దీనికి నలువైపుల గట్లు గలవనియు దీనికావలనుండుభూమి యింకొకరిదనియు దానికి నలువైపుల గట్లు గల వనియుఁ దలంచుచుండువాఁడను. భూమిని వదలి కొంచెము పై కేఁగినప్పటికి, చిన్నిచిన్నిగట్లువలన వేఱువేఱుగాఁ గాన్పించిన భూప్రదేశములన్నియు, నొకరివిగనే కాన్పించుచున్నవి." అటువలెనే

జ్ఞానాభివృద్ధి నైనకాలఁదినిని, ధర్మమును జుట్టియుండు చిన్న చిన్న యెల్లలు దృగ్గోచరము కాకుండుటయే కాక హృదయము ప్రశాంతమగును.'' సమస్తధర్మావలంబులను పరమప్రీతిమెయి నాలింగనమొనర్చుకొనును. వేలువేలు మతముల లోనిభక్తులు ఒకరిపై నొకరు పవిత్రప్రేమ గలిగి యుండిరనుట యెల్ల రెఱింగినవిషయమే గదా? హిందూమతావలంబి యగు శ్రీరామకృష్ణపరమహంసస్వామియు, బ్రాహ్మమతావలంబి యగు శ్రీకేశవచంద్రసేనుఁడును, పవిత్రప్రేమచే బంధింపఁబడియుండి రనువిషయమును సర్వజనవిదితము. మహాభక్తులు సమస్తమానవులను సమముగఁ బ్రేమించుచుందురు. ఏభావముతోఁ గూడుకొనియున్నను సమస్తమతావలంబులొక శేపదార్థముకొఱ కన్వేషించుచున్నారని విచారించినకాలందిని దెలిసికొందును. నేను శ్రీరామకృష్ణ పరమహంసస్వామినిఁ జూచి ''అయ్యా హిందూమతమునకును బ్రాహ్మమతమునకును గలభేదమేమి?'' అనిప్రశ్నించితిని. ఆయన యిట్లు ప్రత్యుత్తరం బొసంగెను. ''సన్నాయిమేళమునం దొకఁడు ''ఊఁ'' అని శ్రుతియూఁదుచుండును. రెండవవాఁడనేకస్వరములతోడ సన్నాయిని వాయించుచుండును. ఈరెంటికిని భేదముగలదా? అటులనే బ్రాహ్మమతావలంబులు ''బ్రహ్మ'' యని స్మరించుచున్నారు. హిందూమతావలంబులాబ్రహ్మను పలుభావములతోడ నానామూర్తికల్పన చేసి, ఆయామూర్తి నామముల స్మరించుచున్నారు. దీనియందు భేద మే ము

న్నది? వివిధమతస్థులను జూచినప్పుడు మనమనస్సున కీ విధముగఁ బొడగట్టును. ఒక పెద్దచెఱువునకు నలుప్రక్కల నాల్గురేవులు గలవు. ఆచెఱువునకు నలువైపుల నాల్గుజాతుల వారు నివసించియున్నారు. ఇందొక్కొక్కజాతివా రొక్కొక్క రేవునుండి నీరుదెచ్చుకొనుచుందురు. ఇందొక రేవుకడ కేఁగి మీరేమి తీసికొని వెళ్లుచున్నారని ప్రశ్నించినయెడల "జలము" అని ప్రత్యుత్తరం బొసంగుదురు. ఇటులనే రెండవరేవుకడ కేఁగి ప్రశ్నించినయెడల "వాటర్" అనియు, మూఁడవరేవుకడ కేఁగి ప్రశ్నించినయెడల "పానీ" అనియు నాల్గవరేవుకడ కేఁగి ప్రశ్నించినయెడల "ఆక్వా" అనియు ప్రత్యుత్తరమును బడయుదుము. ఒక్కజలము నేగదా వివిధ మతస్థులు వివిధనామములతోడ వ్యవహరించుచున్నారు" సకలధర్మములయందలిసత్య మొకటియే యని నిర్ధారణ యైనప్పుడు వివాదములతోడఁ బ్రయోజనము లేదుగదా; కావున వివాదములనువదలి రండు. శ్రేష్ఠమగుభక్తిని ఆర్జించుకొందము.



# భక్తియోగము



## ప్రథమప్రకరణము.



### భక్తి యని దేని నందురు?

"సా కస్మైచిత్ పరమా ప్రేమరూపా"

నారదభక్తిసూత్రము.

తా. ఎవరిమీఁదనైనను శ్రేష్ఠమగుప్రేమభావము గలిగి యుండుట.

"సా పరాఽనురక్తి రీశ్వరే" శాండిల్యసూత్రము.

తా. భగవానునియం దంతము లేనియనురాగము గలిగి యుండుట.—భగవంతునియం దంతము లేనియనురాగము గలిగి యుండుటను శ్రేష్ఠభక్తి యందురు.

(౧) రాగాత్మకభక్తి. (౨) అహేతుకభక్తి.
(3) ముఖ్యభక్తి యని భక్తి మూఁడువిధములు.

## ౧. రాగాత్మకభక్తి.

“ఇష్టే స్వారసికో రాగః పరమావిష్టతా భవేత్।
తన్మయీ యా భవేద్భక్తిః సాఽత్ర రాగాత్మికోదితా॥
భక్తిరసామృతసింధువు.

అభిలషితవస్తువుమీఁద హృదయము రసపూర్ణమై అత్యంతగాఢవేగము గలిగి యుండుటయే రాగము. ఈరాగమయమగుభక్తినే రాగాత్మకభక్తి యని చెప్పుదురు. “నదులు సముద్రమువైపున కేఁగువిధమునను, కుసుమములు సుగంధమును వెదచల్లునటులను నీయందనురాగము గలవానిమనస్సెప్పుడును నిన్నే కోరుచుండును.” (బం॥ కీ॥) ఏవిధమగు ప్రయత్నము లేక తనంతట తాను భగవానునికొఱకు వ్యాకులముఁ జెందుప్రాణియొక్క భక్తిని రాగాత్మక భక్తి యందురు.

## ౨. అహేతుకభక్తి.

ఏటువంటికోరికలులేని భక్తిని ‘అహేతుకభక్తి’ యని చెప్పుదురు. ‘పుత్త్రం దేహి, యశో దేహి, ధనం దేహి’— మొదలగు కోరికలను కోరకుండుటయేగాక, చివరకు ముక్తిని గూడ కోరక కేవలము భగవానునిశ్రీచరణములు కావలయునని మాత్రమే కోరుచుండుటను ‘అహేతుకభక్తి’ యందురు.

శ్లో॥ న పారమేష్ఠ్యం, న మహేంద్రధిష్ణ్యం
న సార్వభౌమం న రసాధిపత్యం
న యోగసిద్ధీ రపునర్భవం వా
మయ్యర్పితా త్మేచ్ఛతి మద్వినాన్యత్॥ భాగవతము.

నా కాత్మను సమర్పించినవాఁడు, బ్రహ్మపదమును ఇంద్ర పదమును, సార్వభౌమపదమును, పాతాళలోకాధిపత్య మును, యోగసిద్ధిని, మోక్షమును గూడ కోరఁడు. అట్టివానికి నామీఁద తప్ప ఏయితరవస్తువుమీఁదను కోరిక యుండదు. మహాభక్తుఁ డగు రామప్రసాదుఁ డీవిధముగ నుడివి యు న్నాఁడు. "అన్నటికిని మూలము భక్తి. ముక్తి భక్తికి దాసి."

శ్లో॥ యది భవతి ముకుందే భక్తి రానందసాంద్రా
విలుఠతి చరణాబ్జే మోక్షసామ్రాజ్యలక్ష్మీః॥

భగవానునియం దానందరసముతోఁ గూడినభక్తి యుత్ప న్న మగునట్టి భక్తునిపాదపద్మములపైఁబడి మోక్షసామ్రాజ్య లక్ష్మి నన్నుఁ గైకొను మని మొఱలిడును. భక్తుఁడు ముక్తి కొఱ కాశలుఁడు గాఁడు. ముక్తి భక్తునిపాదాశ్రయముకొఱ కాతురతను చెందుచుండును. మోక్షపదమునుగూడ తుచ్ఛ మని తలంచునట్టి భక్తిని 'అహేతుకభక్తి' యందురు. భగ వానుఁ డీయాసుఖములను ప్రసాదించినందువలన ఆయనయం

దు భక్తిని చూపుచున్నా ననుకృతజ్ఞతకుఁ గూడ అహేతుక భక్తియందు స్థానము లేదు. ఈ భక్తియందు కృతజ్ఞతకు స్థానమే యున్నయెడల లభించినవస్తువునం దభిలాష గనపట్టుచున్నది. అందువలన, సహేతుకభక్తి యగునుగాని, అహేతుకభక్తి కానేరదు. 'అహేతుకి' యనఁగా 'హేతువులేనిది' అనియర్థము. ఇందువలన వీనిని పొందితిని లేక వీనిని పొందఁగల నను హేతుమూలకభక్తి 'అహేతుకభక్తి' కానేరదు. 'ప్రేమించుట యన్న ప్రేమించుటయే' 'నాస్వభావము నిన్ను తప్ప వే ఱెఱుంగదు' (బం॥ కీ) ఈవాక్యములె అహేతుకభక్తికి మూలసూత్రములు. అహేతుకభక్తిని, ముఖ్యభక్తి యనికూడ చెప్పెదరు. దీనికంటె నింకొక శ్రేష్ఠతరముగు భక్తి లేదు.

దేవర్షి యగు నారదుఁడును మహర్షి యగు శాండిల్యుఁడును ఈవిధమగు భక్తికి లక్ష్యమై యున్నారు.

అధికారిభేదము ననుసరించి, భక్తిని రెండుభాగములుగ భాగింప నగును.

## మొదటి తరగతి.

(౧) రాగాత్మకభక్తి. (౨) అహేతుకభక్తి. (3) ముఖ్యభక్తి.

## రెండవ తరగతి.

(౧) వైధభక్తి. (౨) సహేతుకభక్తి. (3) గౌణభక్తి.

రెండవతరగతియందు చూపించిన, వైధభక్తి మొదలగు వానిని భక్తి యని చెప్పుచున్నను దోషము లేదు. కాని, వీని వలన శ్రేష్ఠభక్తి లభ్యమగుటచేత వీనికిఁగూడ భక్తి యను నామము లభించినది. అనేకు లీయుత్కృష్టాదర్శమును తలంచుకొని తాము భక్తులగుటకు వీలులేదని తలంపవచ్చును. కానియిట్లు నిరాశను జెందఁగూడదు. రెండవతరగతియందు వివరించినవైధభక్తి మొదలగువానిని అవలంబించి సాధన చేయుచుండినయెడల మొదటి తరగతి భక్తిపదము లభ్యమగును.

౧. వైధభక్తి.

శ్లో॥ వైధభక్త్యధికారీ తు భావావిర్భావనావధి ।
తత్ర శాస్త్రం తథా తర్క మనుకూల ముపేక్షతే ॥

భక్తిరసామృతసింధువు.

శాస్త్రములమీఁదను అనుకూలతర్కములమీఁదను, వైధభక్తి యాధారపడి యుండును. కావున భావము పుట్టునంతవఱకును, వైధభక్తి నవలంబింపవలయును. భావము పుట్టఁగనే రాగము గలుగును. రాగము గలుగఁగనే రాగాత్మక భక్తి యుదయించును. క్రమానుగతముగ శాస్త్రాధ్యయనము చేయుచుండుటవలనను, శాస్త్రశ్రవణమువలనను, భగవత్స్వరూపప్రతిపాదకము లగుతర్కము లొనర్చుచుండుటవలనను, భగవంతునియందు భక్తి నిలుచును. ఇందువలన భావోదయ

మగును. ఇట్టి మధురవిషయములను గూర్చి విచారించుచున్నప్పుడు, లోభము గలుగకుండుటకు వీలు లేదు. కావున లోభము గలిగినంతనే ప్రాణాకర్షణము గలుగును. ప్రాణాకర్షణము గలుగఁగనే, రాగాత్మకభక్తి యుదయమగును. మాటిమాటికిని భగవన్నామామృతరసమును గ్రోలుమనుష్యుఁ డెన్నిదినములు స్థిరచిత్తుఁడై యుండఁగలడు? భగవన్నామస్మరణమును వినివిని యెంతమంది నాస్తికులు మహాభక్తులు కాలేదు ?

౨. సహేతుకభక్తి.

ఏదోయొకహేతువును పురస్కరించుకొని సహేతుకభక్తి జనించును. ఈశ్వరుఁడు సుఖసంపదల నొసంగియున్నాఁడనియును, ఇంక నెన్నియో సుఖసంపదల నొసఁగ నున్నాఁడనియును, ఎన్నియో విపత్తులనుండి రక్షించి యున్నాఁడనియును, ఇంక నెన్నియో విపత్తులనుండి రక్షింపనున్నాఁడనియును, చింతించుచు, ఆయనతోఁ బోల్పఁదగిన దయామయుఁ డెవ్వఁడున్నాఁడని తలఁచినకొలందిని గలుగుభక్తినే సహేతుకభక్తి యందురు. భూతకాలమందలి మంగళముల వలనఁ గలుగు కృతజ్ఞతామూలకమును, లేక, భావికాలమందు శ్రేయస్సు లొసఁగుఁగూర్చ వలయు నను నాశామూలకము నగు భక్తినే సహేతుకభక్తి యందురు. "ధనం దేహి యశో

దేహి" మొదలగుప్రార్థనలు సహేతుకభక్తియం దంతర్గ
ములై యుండును. కావున నీవిధమగుభక్తి అతనికృష్టమై
నది. కాని దీనిని అవలంబించి సాధనముచేయుచుండుటవలన,
అహేతుకభక్తి లభ్యమగును. మొదటినుండియు ప్రహ్లాదుని
చరిత్రయందు అహేతుకభక్తి కనఁబడుచుండును. ఆయన
అహోరాత్రములు భగవన్నామమును స్మరించుచుండెడి
వాఁడు.* కాని యేల స్మరించుచున్నావని అడిగినప్పుడు
బదులు సెప్పఁజాలకుండెను. ధ్రువునిజీవితమునందు మొట్ట

శా॥ * పానీయంబులు ద్రావుచుం గుడుచుచున్
భాషించుచున్ హాసలీ
లానిద్రాదులు సేయుచుం దిరుగుచున్
లక్షించుచున్ సంతత
శ్రీనారాయణపాదపద్మయుగళీ
చింతామృతాస్వాదసం
ధానుండై మఱచెన్ సురారిసుతుఁ డే
తద్విశ్వమున్ భూవరా॥ ౧౨౩॥

సీ॥ వైకుంఠచింతావివర్జితచేష్టుఁడై
యొక్కఁడు నేడుచు నొక్కచోట
సశ్రాంతహరిభావనారూఢచిత్తుఁడై
యుద్ధతుఁడై పాడు నొక్కచోట

మొదట సహేతుకభక్తి యుదయించెను. తదుపరి దానివలన నీయనహృదయమునందు "అహేతుకభక్తి" సంచరింప సాగెను. భగవానుఁడు భక్తవాంఛాకల్పతరు వనుస్థిరవిశ్వాసమున తనతండ్రిరాజ్యపదమునకంటె గొప్పరాజ్యపదముతనకు లభింపవలయు ననుకోరికతో ధ్రువుఁడుతపోనిమగ్నుఁడై భగవానునిఁబ్రార్థింపసాగెను. ప్రార్థించినకొలఁది నీయనకుభక్తి వృద్ధి కాఁజొచ్చెను. చివరకు భగవానుఁడు ప్రత్యక్షు మై "వత్సా! వరము గైకొమ్ము." అని నుడివినప్పుడు ధ్రువుఁడు నివ్వెరపడి "ఏమివరము?" అని యడిగెను. భగవానుఁడు, "నీవెందులకు నన్నుఁ బిలువ నారంభించితివి" అని యడిగెను. కాని యెందుకొఱకు తపము చేయమొదలిడెనో యాసంగతినే ధ్రువుఁడు మఱచియుండెను. అందువలన

---

విష్ణుఁ డింతియకాని వేఱొండు లేదని
యొత్తిలి నగుచుండు నొక్కచోట।
నలినాక్షుఁ డనునిధానము గంటి నే నని
యుబ్బి గంతులు వైచు నొక్కచోటఁ
ఆ॥ బలుకు నొక్కచోట బరమేశుఁ గేశవుఁ
బ్రణయహర్ష జనితబాష్పసలిల।
మిళితపులకుఁ డై నిమీలితనేత్రుఁ డై।
యొక్కచోట నిలిచి యూరకుండు॥ ౧౨౪॥
సప్తమస్కంధము. భాగవతము.

భగవానుఁడు "నీవు రాజపదముకొఱకు తపమాచరించితి" వని ధ్రువుని జ్ఞాపకమునకుఁ దెచ్చెను. అంత ధ్రువుఁడు,

శ్లో॥ స్థానాభిలాషీ తపసి స్థితోఽహం
త్వాం ప్రాప్తవాన్ దేవమునీంద్రగుహ్యామ్।
కాచం విచిన్వన్ సమవాప్య రత్నం
స్వామిన్ కృతార్థోఽస్మి వరం న యాచే॥

భక్తిసుధోదయము.

"ఓ దేవా! నేను రాజపదాభిలాషినై తపమాచరించితి ననుట నిక్కువము. కాని అనేకమునీంద్రులు యోగీంద్రులు తపస్సుచేసియుఁ బొందఁజాలనట్టి నిన్ను నేను బొందినాఁడను గాజుముక్కకొఱకు వెదకుచుండ, నాకాకస్మికముగ దివ్య రత్నము దొరకినది. ఓ స్వామీ! కృతార్థుఁడ నైతిని. మఱి వరమును గోరను." ఏమి! ఈ ధ్రువుని యపూర్వ పరిణామము! సహేతుకభక్తి యెచ్చటి కేఁగెను? అహేతుకభక్తి ధ్రువుని హృదయమునందు పూర్ణమై యుండెను.

ఒకానొక భక్తునకు మాత ప్రత్యక్షమై నీ కెట్టివరము వలయు నని యడిగెను. వెంటనే యాతఁడు భక్తిపరవశుఁడై యి ట్లనియె.

శ్లో॥ మాతః కిం వర మపరం యాచే
సర్వం సంపాదిత మితి సత్యమ్

యత్త్వచ్చరణాంబుజ మతిగుహ్యామ్
దృష్టం విధి హర మురహర జుష్టమ్॥

సర్వానందతరంగిణి.

"తల్లీ! ఏవరమును గోరుదును? బ్రహ్మవిష్ణుమహేశ్వరు లేచరణములను బూజించుచున్నారో అట్టి దుర్లభమగు నీ పాదములను దర్శించిన తరువాత ఇంక నేనెట్టి వరమును గోరుదును? తల్లీ! నాకోరిక లన్నియు ఫలించినవి." నే నొకప్పుడు హరిద్వారమునందు నివసించుచున్న కామరాజ స్వామిని దర్శించి "తమకేదయినను భగవంతుని బ్రార్థింపఁ దగినది యున్నదా లేదా?" అని ప్రశ్నింపఁగా నతఁడు "నామనస్సు భగవానునియం దహర్నిశము నిలిచియుండవలె ననుటకంటె నాకు మఱొక్క ప్రార్థన లేదు." అని ప్రత్యుత్తర మిచ్చెను. ప్రాణనాథుని సందర్శించి కృతకృత్యుఁడగుభక్తుఁ డింకెట్టివరములు గోరును? ఇంకెట్టియాశలు గలిగియుండును? "మధుపానము చేయుమధుకరము జలపానమున కాశించునా?"* భ్రమకులోనై మానవుఁడు

*సీ॥ మందారమకరందమాధుర్యమునఁ దేలు
మధుపంబు వోవునే మదనములకు
నిర్మలమందాకినీవీచికలఁ దూఁగు
రాయంచ సనునె తరంగిణులకు

సహేతుకభక్తి నవలంబించి యితరవస్తువులు కావలయు నని భగవానుని ప్రార్థించుటకు మొదలిడును. భగవానుని ప్రార్థించుచు భగవద్విషయములను చర్చించుచుండినకొలఁదిని ఆకస్మికముగా ఆనందరసమును చవిచూచును. ఆనందరసమును చవిచూచినవానికి భగవానునియెడఁ గాక, అన్యవస్తువులయం దభిలాష యుండ దనుట నిక్కువము. అట్టివానిని ఎవరైనను "నీవేల భగవానుని ప్రేమించు చున్నావు?" అని యడిగినయెడల "నేను చెప్పఁ జాలను; ప్రేమించుట యన్న ప్రేమించుటయే; కావున నేల ప్రేమించుచున్నావనిన నేమి చెప్పుదును?" అని ప్రత్యుత్తర మిచ్చును. "వైధభక్తి, సహేతుకభక్తి, గౌణభక్తి" అను నీ మూఁడును

---

లలిత రసాలపల్లవ ఖాదియై చొక్కు
కోయిల సేరునే కుటజములకుఁ
బూర్ణేందుచంద్రికాస్ఫురితచకోరక
మరుగునే సాంద్రనీహారములకు
తే॥ నంబుజోదరదివ్యపాదారవింద
చింతనామృతపానవిశేషమత్త
చిత్త మేరీతి నితరంబుఁ జేరనేర్చు.
వినుతగుణశీల! మాటలు వేయు నేల? ॥ ౧౪౦॥

సప్తమస్కంధము భాగవతము.

క్రమముగా రాగాత్మకభక్తి, అహేతుకభక్తి, ముఖ్య భక్తి, వీనిని బొందుటకు సోపానప్రాయము లని తలంప వలయును.

## 3. గౌణభక్తి.

గౌణభక్తి గుణభేదమువలన మూఁడువిధములు. ఆర్తాది భేదమువలన మూఁడు విధములు. గుణ భేదము వలన "(౧) సాత్త్వికభక్తి (౨) రాజసభక్తి (3) తామసభక్తి" అని మూఁడు విధములు ఆర్తాదిభేదమువలన "(౧) ఆర్త భక్తి (౨) జిజ్ఞాసుభక్తి (3) అర్థార్థిభక్తి" అని మూఁడు విధములు. తామసభక్తినుండి రాజసభక్తియు, రాజస భక్తి నుండి సాత్త్వికభక్తియు జనించును. తదుపరి సాత్త్విక భక్తి ముఖ్యభక్తిగ పరిణమించును.

శ్లో॥ అపిచే త్సుదురాచారో భజతే మా మనన్యభాక్
సాధు రేవ స మంతవ్య స్సమ్య గ్వ్యవసితో హి సః.
శ్లో॥ క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వ చ్ఛాన్తిం నిగచ్ఛతి ॥
కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి॥3౧

నవమాధ్యాయము. భగవద్గీత.

"మిగుల దురాచారము గలవాఁడైనను, ఇతర దేవతలను పూజింపక నన్నే శరణుపొంది భజించుచుండినయెడల, అట్టివాఁడాత్మతత్త్వ మెఱింగిన నాభక్తుఁడగుచున్నాఁడు.

కావున వాఁడు సదాచారుఁ డని యెఱుంగుము. అట్టివాఁ
డతిత్వరితముగా ధర్మాత్ముఁడై నిత్య మైన పరమశాంతిని
జెందుచున్నాఁడు. ఓయర్జునా! అట్టి నాభక్తుఁడు నాశము
జెందఁ డని ప్రతిజ్ఞ చేయుము.''

౧. తామసభక్తి.

దొంగలు మొదలుగాఁగలపరులకపకారము చేయుదుర్మా
ర్గులు తమతమ ఘోరకృత్యములు నెఱవేఱుటకు భగవంతుని
ప్రార్థించుచుండుటను తామసభక్తి యందురు. కాళీపూజ
చేసి దొంగతనమున కేఁగుదొంగలను, తప్పుడువ్యాజ్యములు
గెలుచుటకు కాళీనామమును జపించుచు, కాళీపూజలొనర్చు
వారిని మన మనుదినమును చూచుచున్నాము. ఇట్టివారి
భక్తినే తామసభక్తి యందురు.

౨. రాజసభక్తి.

భోగాభిలాషచేత, పుత్త్రులు, యశము, ధనము, ఐశ్వర్య
ము, మొదలగునవి కావలయునని కోరుచు, తన కన్యాయ
మొనర్చినవారికి నష్టము కలుగుఁగాక యని భగవానుని
ప్రార్థించుటను రాజసభక్తి యందురు.

౩. సాత్త్వికభక్తి.

పృథివియందలి భోగములమీఁద నణుమాత్ర మైనను దృష్టి
లేక పరోపకారము చేయుచు, ముక్తిమాత్రమే కోరుచు,

భగవానుని ప్రార్థించుచుండుటను సాత్త్వికభక్తియందురు. ఈమూఁడును కామముతోఁ గూడుకొని యున్నవి. ముఖ్య భక్తి నిష్కామమైనది. అందువలననే ముఖ్యభక్తియందు చివరకు ముక్తి కావలయు ననుకోరిక కూడ లేదు. కాని గౌణభక్తివలన క్రమక్రమముగ ముఖ్యభక్తి లభించును.

౧. ఆర్తభక్తి.

తాను దగుల్కొనిన విపత్తునుండి తప్పించుకొనుటకు, భగవానుని ప్రార్థించుటకు, "ఆర్తభక్తి" యందురు. అనఁగా రోగము వచ్చినప్పుడును, దుఃఖములు గలిగినప్పుడును; చిక్కులయందు తగుల్కొనునప్పుడును, భగవానుని ప్రార్థించుచుండుటను, "ఆర్తభక్తి" యందురు. నదీమధ్యమునందు నౌక మునుఁగు నని తోఁచినప్పుడు మనమెల్లరమును ఆర్తభక్తుల మగుదుము.

౨. జిజ్ఞాసుభక్తి.

భగవత్తత్త్వమును తెలిసికొన వలయు ననుకోరికతోడ ఆవిషయముల నాలోచించుచుండుటను జిజ్ఞాసుభక్తి యందురు. అనఁగా, భగవానునిపైని ప్రేమ లేకున్నను, ఆయనవలననే యేకార్యము లెట్లెట్లు జరుగుచున్నవో తెలిసికొనుటకు భగవత్తత్త్వమును పరిశీలించుటను జిజ్ఞాసుభక్తి యందురు.

3. అర్థార్థిభక్తి.

ఏదోయొక యర్థమును సంపాదించుటకు భగవానుని ప్రార్థించుటను "అర్థార్థి భక్తి" యందురు. అనఁగా పుత్త్రులు కావలయును, ధనము కావలయును, యశస్సుకావలయు నని భగవానుని ప్రార్థించుచుండుటను అర్థార్థిభక్తి యందురు.

ఈపైని వివరించిన మూఁడువిధము లగు భక్తిమార్గము లతినీచము లైనవి. కాని క్రమానుగతముగ సాధన చేసిన యెడల శ్రేష్ఠభక్తి లభ్య మగును. కష్టములయందు తగుల్కొని భగవానుని ప్రార్థించుట కలవడినవాని హృదయమునందు కష్టములు తొలఁగినతర్వాతఁ గూడ, కొంతకాలము వఱకా భావము నిలిచియుండును. అందువలన భగవత్ప్రార్థనను విడువఁజాలఁడు. కావున వీనికి ముఖ్యభక్తి లభించును. జిజ్ఞాసుభక్తుఁడు భగవత్తత్త్వమును గుఱించి విచారించినకొలందిని మృదు మధుర భక్తిరసము నాస్వాదించును. అందువలన భగవద్విషయకచింతను విడువఁజాలక ముఖ్యభక్తి పదవి నధిష్ఠించును. అర్థార్థిభక్తున కేవిధముగ ముఖ్యభక్తి లభ్యమగునో దీనికి ధ్రువుఁడే దృష్టాంతము.

# ద్వితీయప్రకరణము.

## భక్తిపదమున కధికారి యెవ్వఁడు?

"యదృచ్ఛయా మత్కథాదౌ జాతశ్రద్ధస్తు యః పుమాన్
న నిర్విణ్ణో నాతిసక్తో భక్తియోగోఽస్య సిద్ధిదః ॥

భాగవతము.

"వైరాగ్య మన నెట్టిదియో తెలిసికొనకున్నను, సంసారమునం దత్యంతాసక్తి లేక నాప్రసంగమునం దొకింత శ్రద్ధ గలిగినవానికి భక్తియోగము సిద్ధించును." ఈశ్వరునిమీఁద శ్రద్ధలేక సంపూర్ణసంశయముతోఁ గూడుకొని యున్నవాఁ డేవిధముగ భక్తిసాధనము చేయఁగలఁడు? ఇట్టివానికి భక్తియోగము దుర్లభమే కాని, సర్వకాల సర్వావస్థలయందు కాకున్నను, అప్పుడప్పుడైనను భగవానునిమీఁది కేఁగుచుండు మనస్సు గలవానికి భక్తియోగము ప్రయోజనకారి యనుట నిస్సంశయము.

భక్తియోగము జాతి, మతము, వయస్సు మొదలగు భేదములమీఁద నాధారపడి యుండునది గాదు. వార్ధకమునందు భక్తియోగము నవలంబింపవలయును గాని, బాల్య

కౌమార యౌవనావస్థలయందు నవలంబింపరాదనువారి నుడువులు సంపూర్ణముగ భ్రమకు లోనై యున్నవి. కావున ప్రతివాఁడును భక్తిసాధనకు బాల్యకాలమునందె కడంగుట కర్తవ్యము. "బాల్యకాలమునందు హృదయము కోమలముగ నుండుటవలన భక్తిబీజము నాఁటుట కది మంచి సమయము. పరిణతకాలమునందు సంసారమునందు మునిఁగి యుండుటవలన హృదయము గట్టిపడియుండును. అందువలన భక్తిబీజము మొలకెత్తదు" అని శ్రీరామకృష్ణ పరమహంస నుడివియున్నాఁడు. "వార్ధక్యమునందు ధర్మసాధనను జేయుట యనఁగా, కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములవలన విడువఁబడిన యుచ్ఛిష్ట పదార్థమును భగవానున కర్పించుటవంటిది" అని నాస్నేహితుఁ డొకఁడు చెప్పియున్నాఁడు. బాల్యకాలమునందు ధర్మసాధనను జేయఁగూడదనియును, బాల్యకాలమునందు విద్యను, మధ్యకాలమునందు ధనమును, వార్ధక్యమునందు ధర్మమును సంపాదింపవలయునని సాధారణముగఁ జెప్పుచుందురు. కాని భగవానునియభిప్రాయ మిది గాదనుట నిక్కువము. విద్య, ధనము, మొదలగువానిని భగవత్సాహాయ్యముతోడనే సంపాదింపవలయును. కావున, ధర్మముతోఁ గూడని విద్యయు ధనమును సంపాదింపఁదగినవి కావు. ఏలయనఁగా, ధర్మముమీఁద చిత్తముండనియెడల, ధనమును, విద్యయుఁ గూడ ధూర్తత్వమును, మూర్ఖత్వమును బలపఱు

చును. అందువలన చివరకు "అయ్యో అయ్యో" యని హాహా కారములు చేయవలసివచ్చును.

శ్లో॥ శిశౌ నాసీ ద్వాక్యం జనని తవ మన్త్రం ప్రజపితుమ్
కిశోరే, విద్యాయాం, విషమవిషయే, తిష్ఠతి మనః
ఇదానీం భీతోహం మహిషగళఘంటాఘనరవా,
న్నిరాలంబో లంబోదరజనని కం యామి శరణమ్॥

లంబోదరజననీస్తవము.

ఒకానొకఁడు ధర్మవిహీనుఁడై కాలమునంతయుఁ గడపి వార్ధక్యమునం దీవిధముగ రోదనము చేయసాగెను.

"ఓలంబోదరజననీ! దుర్గా! శైశవకాలమునందు నుడువుటకే శక్తి లేనందువలన నీమంత్రమును జపింప లేదు. బాల్యమున విద్యయందు, తదుపరి విషయసౌఖ్యములయందు మనస్సు లగ్నమై యుండుటవలన నేకాలమునందును గూడ ధర్మమును సంపాదింప లేదు. ఓతల్లీ! ఇప్పుడు మహిషగళమందున్న గంటల చప్పుడునకు తల్లడిల్లుచున్నాను. కేవలము చచ్చిపోవుచున్నాననుచింతతప్ప వేఱుచింత లేదు. ఓతల్లీ! ఆశ్రయవిహీనుఁడ నగు నే నెవని శరణుచొత్తును?" బాల్యమునందు ధర్మసాహాయ్యమును బొందనివాఁడు దుఃఖముతోడ కాలమునంతయుఁ గడపి వార్ధక్యమునందు మృత్యుభయమువలన నస్థిరుఁడై భక్తిసాధనకు కాలము దొరకక పరితపించును. "ఓమృత్యువా! నన్ను నీవు భయపెట్టఁగలవా?

నీభయమువలన నాచిత్తము చలింపకుసుమా'' అని ధర్మము నాశ్రయించి కాలముం గడపినభక్తుఁడే నుడువఁగలఁడుగాని తదితరు లెట్లు నుడువఁగలరు? మృత్యువు బాలకులను యౌవనులను వృద్ధులను సమముగ భక్షించుచుండును. కావున మృత్యువుకొఱకు మన మెప్పుడును, సంసిద్ధులమై యుండుట కర్తవ్యము. మఱియును,

శ్లో॥ యువైవ ధర్మశీల స్స్యాత్ అనిత్యం ఖలుజీవితమ్।
కో హి జానాతి క స్యాద్య మృత్యుకాలో భవిష్యతి॥

మహాభారతము.

జీవితము నిత్యముగాదు. ఈదినముననో రేపో మృత్యువు సంభవించునని యెవఁ డెఱుంగును? బాలునైనను మృత్యువు విడువదు. కావున బాల్యకాలమునందే ధర్మము నాశ్రయింపుము. భక్తచూడామణి యగుప్రహ్లాదుఁ డీవిధముగ నుడివియున్నాఁడు.

శ్లో॥ కౌమార ఆచరేత్ ప్రాజ్ఞో ధర్మాన్ భాగవతా నిహ।
దుర్లభం మానుషం జన్మ త దప్యధ్రువ మర్థదమ్॥

భాగవతము.

"మనుష్యజన్మయే దుర్లభము. అట్టిమనుష్యజన్మయందు సఫలకాముఁడగుట మిక్కిలి యనిశ్చయము. కావున బాల్యమునందే భాగవతధర్మము నాచరించుచుండవలయును.''

మానవజాతిలో ప్రఖ్యాతికెక్కినమహాపురుషు లనేకులలో బాల్యజీవనమునందే భగవద్భక్తి కానంబడుచుండును. కావున బాల్యమునందు భగవద్భక్తిని సంపాదింపనియెడల మిక్కుటమగుదుఃఖమును బొందవలసివచ్చును. కాఁబట్టి యేబాలుఁడునుగూడ. వార్ధక్యమునందు భగవద్భక్తిని సంపాదింపవచ్చుననుతలంపున, యుక్తకాలమును పోఁగొట్టుకొనకుందురుగాత.

ఆ నింద్యయో న్యధిక్రియతే॥ శాండిల్యసూత్రము.

"చండాలురు మొదలగు వారికిఁ గూడ భగవద్భక్తిని అవలంబించుట కధికారము గలదు. భక్తిరాజ్యమునందు జాతి మత కుల భేదముల కవకాశము లేదు. చండాలుఁడు భగవానునియం దాత్మసమర్పణమును జేసి ఆయనను ప్రార్థించుటకు మొదలిడినయెడల నాయన స్థిరముగ నుండఁగలఁడా? భగవానునిసమీపమునం దందఱు సమానులు." అచ్చట జాతివిచారణ లేదు. ఒక్కమనుష్యజాతిసంబంధముననే కాక, సమస్తము భగవానునిసాన్నిధ్యమునందు సమానము. నీ వెంతగొప్ప వంశమునందు జన్మించినను నిన్ను ప్రేమించుటకు చెప్పులు కుట్టుచండాలున కధికారములేదా? మఱియును నిన్ను ప్రేమించినవానిని వదలి నీవెన్ని దినము లుండఁగలవు? ప్రేమరాజ్యమునందు బ్రాహ్మణుఁడు చండాలుఁడు నను భేదమున కవకాశము లేదు. గుహుఁడు శ్రీరామచంద్రుని "ఓరీ రామా" యని పిలిచినప్పుడు లక్ష్మణుఁ డామాటవిని వానిని

చంపుటకు ప్రయత్నించెను. అప్పుడు శ్రీరామచంద్రుఁ డిట్లని యె. "లక్ష్మణా! నీవు ప్రాణములను దీయఁబోవుచున్నవాఁడు నాకు పరమమిత్రుఁడు. వాఁడు చేసినయపరాధము లేదు. ప్రేమవలన ఓరీ రామా యని పిలిచినాఁడు. ఓరీ యని పిలుచువాని నేను మిక్కిలి ప్రేమింతును. భక్తుఁడగు చండాలుని దరి చేరుదును గాని, భక్తిలేని బ్రాహ్మణునిదరి చేరను. భక్తిశూన్యుఁడగువాఁ డమృతమిచ్చినను ద్రాగను. భక్తుఁడు విషము నిచ్చినను ద్రాగుదును." (బం। ప॥) పంచవటీతీరమునందు చండాలకన్యక యగు శబరివలన నర్ధభుక్తమైన ఫలమును శ్రీరామచంద్రుఁ డాదరముతోడ భుజించెను. ఇందువలన భక్తునియొక్క సమస్తమును పవిత్రమనియే గదా భావింపవలయును.

శ్లో॥ భక్తి రష్టవిధా హ్యేషా యస్మిన్ మ్లేచ్ఛేపి వర్తతే
స విప్రేంద్రో మునిః శ్రీమాన్ స యతిః స చ పండితః॥

గారుడపురాణము.

అష్టవిధభక్తులు ప్రకాశించుచున్న మ్లేచ్ఛుఁడు మ్లేచ్ఛుఁడుగాఁడు. వాఁడు బ్రాహ్మణోత్తముఁడును మునిశ్రేష్ఠుఁడును యతియును పండితుఁడునై యున్నాఁడు.

దరిద్రుఁడు ధనికుఁడు నను భేదములు భక్తులయందు లేవు. ఈశ్వరుఁడు ధనవంతుల గృహములకు మాత్రమే యేఁగి దరి

ద్రుల గృహముల కేఁగనియెడల నాయనను "దీనబంధూ" "పతితపావనా" యనిపిలుచుట కంగీకరించువారుందురా? ధనికునికంటె దరిద్రునకే భక్తియోగము సహజముగ లభించును. ధనికుఁడు నలువైపుల నుండులోభజనకవస్తువులచే నాకర్షింపఁబడుచుండుటవలన నధర్మకార్యములయందు పడిపోవుటకు మిక్కిలి యవకాశము గలదు. కాని దరిద్రుఁడు ధనికునివలె లోభజనకవస్తువులయందుఁ దగుల్కొనియుండ కుండుటవలన ధర్మమార్గమున ననాయాసముగ నడువఁగలఁడు. "సూదిబెజ్జములోనుండి యొంటెయైనను, అనాయాసముగ వెళ్లవచ్చునుగాని, ధనికుఁడు మాత్రము స్వర్గమును ప్రవేశించుట సాధ్యమైన పని గాదు" అని మహాభక్తుఁడు ఏసుక్రీస్తు నుడివియున్నాఁడు. భాగవతమునుండి యొకమంచికథ నుదాహరించుచున్నాను.

తనరాజ్యమునందు ప్రవేశించినకలిని జూచి పరీక్షిన్మహారాజిట్లనియెను. "ఓకలీ! నీకెప్పుడును నారాజ్యమునందు నివసించుటకు వీలులేదు. కావున వెంటనే నారాజ్యమును విడిచి పొమ్ము." అనుమాటలకు, కలి, భయపడి యిట్లు విన్నవించుకొనియెను. "మహారాజా! అందఱకును మీరురాజులగుట వలన నేను గూడ నివసించుటకు తగుప్రదేశమును నిర్ణయింపుఁడని కోరుచున్నాను." ఈమాటలకు పరీక్షిన్మహారాజిట్లు ప్రత్యుత్తరం బొసంగెను.

శ్లో॥అభ్యర్థిత స్తదాతస్మై స్థానాని కలయే దదౌ
ద్యూతం పానం స్త్రియః సూనా యత్రాధర్మశ్చతుర్విధః॥

"(౧) జూదము (౨) మద్యపానము (౩) స్త్రీసంగమము (౪) జీవహింస- అనునీనాలుగు కార్యములు జరుగుచుండు స్థలములయందు నీవు నివసింపవలయును." అనుమాటలువినికలి నాలుగుచోట్ల నివసించుట కష్టమని తలఁచి యీనాలుగు విధములగు దోషములుగలయొక శ్రేష్ఠానమును నిర్దేశింపుఁడని రాజును ప్రార్థించెను.

శ్లో॥పునశ్చ యాచమానాయ జాతరూప మదాత్ ప్రభుః
తతోఽనృతం మదం కామం రజో వైరం చ పంచమమ్॥

ఈవిధముగ తిరిగి కలి, రాజును ప్రార్థింపఁగా కలి నివసించుటకు సువర్ణమును దానము చేసెను. సువర్ణమునందు ద్యూతక్రీడాజనితానృతమును సురాపానజనితమత్తయు స్త్రీసంగరూపమగు కామమును జీవహింసామూలకరజోభావము నుండుటయేగాక యైదవదియగు వైరభావముగూడఁగలదు. అందువలన కలి ధనము నాశ్రయించి యుండెను. ధనమువలన ననేక జనులు సర్వనాశనము నొందుచున్నారు. ఎంతమంది ధనికులు సాధుసజ్జనుల సాంగత్యము చేయుచున్నారో యోజింపుఁడు. ధనమదాంధునకు స్వర్గమునందు స్థానము లేనే లేదు. ధనికునిపటాటోపములు భగవానుని సమీపింపఁ జాలవు. కావున నెట్టిధనికుఁడైనను దీనహృదయుఁడుగానియెడల భగవానునిఁ

బొందఁజాలఁడు. దీనహృదయమున భగవానుని ప్రార్థించు వాఁడు మాత్రమే ఆయనపాదపద్మములను సమీపింపఁ గలఁడు. సన్న్యాసియై "ఎక్కడ నున్నావురా దీనదయాళూ" యని మొఱలిడువానిసమీపముననే దీనదయాళుఁ డుండును. కాని యాగములవలనను బాహ్యానుష్ఠానములవలనను భగవానుని పొందఁజాలినవాఁడు లేఁడు.

"కేవల మనురాగమువలన నిన్ను వశపఱచుకొనవచ్చును. కాని యనురాగము లేని యజ్ఞములవలన నిన్నుఁబొందుట యశక్యము. ధన మిచ్చి నిన్ను కొనఁగలవాఁ డెవ్వఁడు?" (బం. కీర్తన) విదురుఁడు పెట్టినయన్నము భగవానుని కమృత తుల్యము కాని, రాజాధిరాజు పెట్టిన షడ్రసోపేత మగు భోజనము భగవానునకు విషతుల్యము. విద్యలేక భగవద్భక్తి చేకూఱునా యని తోఁపవచ్చును. విద్య భక్తియోగమునకు మిక్కిలి సహకారి యనుట నిక్కువము. కాని విద్యలేనివాఁడు భక్తుండగుటకు వీలు లేదని చెప్పఁదగదు. దీనికి శ్రీ రామకృష్ణపరమహంసయే తార్కాణము. ఈయనకు చదువు రాదు. కాని యీయనతోఁ బోల్పఁదగినజ్ఞాను లెందఱు న్నారో, యోజింపుఁడు. గొప్పగొప్పవిద్వాంసు లీయనయొద్ద జ్ఞానామృతమునుపానముచేయుచుండెడివారు. భక్తియొక్క తీవ్రవేగమువలన ఈయనహృదయము వికసించిన కొలఁదిని ఈయనకు దివ్యజ్ఞానము లభ్య మగుచుండెను. ఇదే విధముగ

ననేక భక్తులు వ్రాయుటను చదువుటను నేర్చుకొనకున్న
ను భక్తావతంసులుగ పరిగణింపఁబడియున్నారు. వీరంద
ఱును ప్రకృతిగ్రంథమును పఠించి దివ్యజ్ఞానమును సంపాదించు
కొనిరి. శ్రీరామకృష్ణపరమహంస విశ్వగ్రంథమును పఠించి
మననము చేసినవిధముగ నెంతమంది విద్వాంసులు విశ్వ
గ్రంథమును చదివి యున్నారో చెప్పఁజాలను. భక్తితోఁ
గూడ జ్ఞానవికాసము గలుగుచుండును.

ఈశ్వరుఁడు సమస్తమానవులకు తల్లియు, తండ్రియు నై
యున్నాఁడు. తలిదండ్రులను పిలుచుటకు విద్యావశ్యకత
గాని వాగాడంబరములుగాని అవసరములు గావు. కావున
తలిదండ్రులను పిలుచుట కేశాస్త్రముల నభ్యసింప నక్కఱ
లేదు. అక్షరజ్ఞానశూన్యుఁ డగుభక్తుఁడు సరళమైన హృద
యముతోడ తల్లిని పిలుచుటకు మొదలిడినయెడల నామె
ప్రేమవలన నాక్రమింపఁబడును. అందువలన నా ప్రేమను
గుఱించి యోజించినకొలఁదిని ప్రభూతజ్ఞానసంపన్నుఁడగును.
భక్తుఁడు తల్లిని పిలుచుచుండిన కొలఁదిని తల్లి నిజస్వరూ
పము భక్తునకు చూపించుచుండును. ఆమె జ్ఞానస్వరూపిణి
గదా? కావున తల్లియొక్క ప్రేమభావమువలన భక్తుని
హృదయమందుండు జ్ఞానకోశము వికసించును. వైష్ణవ
గ్రంథమునందలి మనోహరమగు కవిత్వము నొకదానిని
ఈక్రింద నుదాహరించుచున్నాను.

శ్లో॥ వ్యాధ స్యాచరణం, ధ్రువస్య చ వయో,
విద్యా గజేంద్రస్య కా ।
కుబ్జాయాః కిము, నామరూప, మధికం
కిం వా సుదామ్నో ధనం ।
వంశః కో విదురస్య, యాదవపతే
రుగ్రస్య కిం పౌరుషం ।
భక్త్యా తుష్యతి కేవలం న చ గుణై
ర్భక్తిప్రియో మాధవః ॥

శ్రీవత్సాంకశ్రీసూక్తిః.

"వ్యాధునినడవడిక యెట్టిది? ధ్రువునివయ సెంత? గజేంద్రునకు వచ్చినవిద్య యెంత; కుబ్జ యెట్టి సౌందర్యవతి? సుదామవిప్రుఁ డెంతటి ధనికుఁడు? విదురునివంశ మెద్ది? యాదవపతియైన యుగ్రసేనుఁ డెట్టిపౌరుషవంతుఁడు? అయినప్పటికిని మాధవుఁడు వీరియెడల విశేషకృపను చూపించెను. భక్తిప్రియుఁడగు మాధవుఁడు కేవలముభక్తివలన నే సంతుష్టిఁ జెందును. కాని యితరగుణములకొఱకు నిరీక్షింపఁడు." సరళమైన విశ్వాసమున నాయనను గోరువాఁ డాయనను బొందును. కాని కఠోరసాధనలవలన భగవానునిఁ బొందఁజాలఁడు. ఇందుల కుపమానముగ నొకకథ నుదాహరించుచున్నాను. ఒకానొకయోగి ఘోరతపస్సు చేయుచుండుట వలన సగమువఱ కాయనశరీరముపుట్టయందు పూడిపోయెను.

ఈమార్గముననే గోలోకవిష్ణుని సందర్శించుటకు వెళ్లుచున్న నారదునిఁ జూచి యోగి యిట్లనియెను. "ఓ నారదా! భగవానునికొఱకు నేకదినములనుండి కఠోరతపస్సునం దున్నాను. ఇంక నాకెన్నిదినములకు భగవత్కారుణ లభించునో యాయనను ప్రశ్నింపుము." ఈవాక్యములకంగీకరించి కొంతదూరమేఁగునప్పటికి గంజాయి పొగను పీల్చుచు, సదానందుఁడై పిచ్చివానివలె నున్న శాంతిరాముఁడు నారదుని చూచి "పూజయు, భజనయు లేని నాగంజాయి తడియునా? లేదా? యని గోలోకనాథుని నడుగుము" అని చెప్పెను. నారదుఁడు గోలోకనాథునియొద్ద కేఁగి యిరువుర వాక్యములను విన్నవించుకొనియెను. శాంతిరాముని పేరు చెవిసోఁకినంతనే గోలోకనాథునికన్నులవెంట నీరు కాఱఁ జొచ్చెను. "వత్సా! నారదా! శాంతిరామునివంటి భక్తుఁడు పృథివియందు మఱియొక్కఁడు లేఁడు. నీవు చెప్పుయోగి యెవఁడో నేను గుర్తింపలేదు" అని చెప్పెను. ఆవాక్యములను విని తిరిగివచ్చునప్పుడు నారదుఁడు, శాంతిరామునకు గోలోకనాథుని వాక్యములను చెప్పెను. శాంతిరాముఁ డీవాక్యములను విని చంకను కొట్టుకొనుచు, నృత్యము చేయుచు, ఈవిధముగఁ బాడ నారంభించెను. "సరళమైన విశ్వాసము గలవాని గంజాయి గోలోకమునం దావిధముగఁ దడియుచుండును."

నా స్తి తేషు జాతి విద్యా రూప కుల ధన క్రియాది భేదః.
౩౭ నారదభ క్తిసూత్రము.

"జాతియొక్కయు, విద్యయొక్కయు, కులముయొక్కయు, రూపముయొక్కయు, ధనముయొక్కయు, భేదము విచారణ భ క్తులయందు లేదు." కావున భ క్తులలో బ్రాహ్మణుఁడనియు, శూద్రుఁడనియు, చండాలుఁడనియు, మ్లేచ్ఛుఁ డనియును, భేదము లెట్లుండును? వారిలో సురూపమనియు లేక కురూపమనియు, పండితుఁడనియు లేక పామరుఁడనియు, ధనికుఁడనియు లేక దరిద్రుఁడనియు బ్రాహ్మణుఁడనియులేక చండాలుఁడనియు,శూద్రుఁడనియు మ్లేచ్ఛుఁడనియు, భేదమే యున్నయెడల పృథివియందు శాంతికి స్థానమే యుండదు. ఉపాస్యుఁ డెట్టివాఁడో యుపాసకుఁడు గూడ నట్టివాఁడుగనే యుండును. కావున భగవానునకు సమ స్తము సమాన మైనవిధముగనే భ క్తునకుఁ గూడ సమ స్తమును సమానము.

సంసారమునం దుండువారలు భ క్తులగుటకు వీలులేదని కొందఱు తలంపవచ్చును. కాని సంసారమందున్న భ క్తులు వేనవేలుగఁ గాన్పించుచున్నారు. రామానందరాయి గౌడాధిపతికి దివానుగ నుండెను. రాజ్యభారము నంతయు మోయుచుండు వీనిని చైతన్యుఁడు భ క్తశ్రేష్ఠునిఁగఁ బరిగణించె ననువిషయము సర్వజనవిదితము గదా? ఒకానొకదినమందు

పుండరీకవిద్యానిధిని జూచుటకు, గదాధరుని వెంట నిడుకొని ముకుందుఁ డేఁగెను. వీరు విద్యానిధియొద్ద కేఁగి చూచునప్పటికి, ఆయనగృహమంతయు సుగంధమయమై యుండుటయే కాక శయ్యపైఁ గూర్చుండి తాంబూల చర్వణము చేయుచుండెను. ఈస్థితియం దీయనను జూచి గదాధరుఁ డతృప్తిని చెంది యాయనయెడల గౌరవము లేనివాఁ డయ్యెను. ముకుందుఁడు గదాధరుని మనోభావమును గ్రహించి హరికీర్తనను పాడుటకు మొదలిడఁగనే విద్యానిధి వివశుఁడై, భావతరంగంబులు లేచినకొలఁదిని నిలువఁజాలక పడిపోయెను. ఈదృశ్యమును జూచి గదాధరుఁడు నిశ్చేష్టితుఁడై, విద్యానిధివిషయమున తానొనర్చిన యమర్యాదకు పశ్చాత్తాపపడి యాయనను క్షమింపవేఁడుకొని ప్రాయశ్చిత్తరూపముగ నాయనకు శిష్యుఁ డాయెను.

ఈసంసారము భగవానుని సృష్టియే కనుక, తలిదండ్రులను పరివారము నొసంగిన భగవానుని చరణకమలములయం దాత్మసమర్పణము చేసి సంసారకార్యములను నిర్వహించుచుండవలయును. సంసారసంబంధమగు సమస్త కార్యములాయనవియే యని తలంచి యాకార్యములను నిర్వహించుచుండినయెడల మనలను పాపము లంటకుండుటయే గాక చిత్తము స్థిరముగ నుండును. సర్వదా హృదయ మానందపూర్ణమై యుండును. కావున సంసారకార్యములను నిర్వ

హించుచుండునప్పుడు భగవానునియందే మనోదృష్టి నుంచ వలయును.

శ్లో॥ భుఞ్జానుభుఞ్జ విషయా నుపసేవమానో ।
ధీరో న ముఞ్చతి ముకున్దపదారవిన్దమ్ ।
సఙ్గీతవాద్యగతి తాన వశఙ్గతాఽపి ।
మౌళిస్థకుంభ పరిరక్షణ ధీ ర్నటీవ ॥

నాథముని శ్రీసూక్తి.

సంగీతమునకు తాళమునకు వశవర్తియై భావమును ప్రకటించునట్టి యభినయముతోఁ గూడుకొని నృత్యముఁ జేయుచు తలపైనుండు కుంభమును పడిపోకుండఁ జూచు కొనుచుండు నటివలెనే ధీరుఁడగువాఁడు తండోపతండములగు విషయ భోగముల ననుభవించుచున్నను గూడ ముకుందపాదారవింద ములను పరిత్యజింపఁడు. సర్వదా ఆయన చరణములయందే వానిమనస్సు లగ్నమై యుండును.

శుకుఁడు జనకునికడ యోగశాస్త్రము నభ్యసించుట కేఁగెను. ఆయన యైశ్వర్యమును జూచి యిట్టి సంసారాసక్తుఁ డేవిధమున యోగియగునని మనమునందు శంకింపఁ దొడంగెను. జనకుఁడు శుకునిమనోగతభావమును గ్రహించి ఆయనకు నూనెచే నిండియుండిన బిందె నొకదానిని యిచ్చి దీనినుండి యొకబిందువయినను క్రింద పడకుండునట్లు జాగరూకత వహించి ఆరాజధాని నంతయు చూచిరావలయునని

చెప్పెను. శుకుఁ డదేవిధముగ నొనర్చెను. శుకునిఁ జూచి జనకుఁడు నీవు చూచివచ్చిన వానినిగూర్చి వివరముగఁ జెప్పు మని యడుగఁగా, శుకుఁడు తాను చూచివచ్చిన వానిని గూర్చి వివరముగఁ జెప్పి యొక నూనెబిందువైనను క్రిందను పడలేదని నుడివెను. జనకుఁ డొక్క నూనెబొట్టయినను క్రిందను పడలేదా యని తిరిగి ప్రశ్నింప శుకుఁ డిట్లనియె. "నే నటునిటు చూచుచుఁ దిరుగుచుండునప్పుడు గూడ నామనస్సు తైలపాత్రము మీఁదనే యుండెను. అందువలన నొకబిందువైనను క్రిందను పడలేదు." అంత జనకుఁడు "నేను సంసారసంబంధ మగుకార్యములను చేయుచుండు నప్పుడుగూడ నామనస్సు భగవానునిమీఁదనే స్థిరముగనిలిచి యుండును." అని చెప్పెను.

సంసారమునం దున్నవాఁ డీవిధ మగుభక్తుఁడు కావల యును. సంసారకార్యములయం దన్నిటిలోఁగూడ భగవా నుని చూచుచుండువాఁడే పరమభక్తుఁడు. అట్టివాని కెట్టి భయములును లేవు. వాఁడు సంపదలకు సంతసమును గాని, విపత్తులకు దుఃఖమును గాని చెందఁడు. మన తలమీఁద నేదయిన చిన్నవస్తువు పడినను గూడ హాహాకారములు సేయుచు తల్లడిల్లుదుము. కాని యట్టివాని తలపైని హిమా లయము పడిననుగూడ తల్లడిల్లఁడు. జనకుఁ డిట్లు చెప్పి యున్నాఁడు.

శ్లో॥ అనన్తం బత మే విత్తం యస్య మే నాస్తి కిఞ్చన
మిథిలాయాం ప్రదీప్తాయాం నమే దహ్యతి కిఞ్చన

"నాకు మిక్కిలి ధనము గలదు. కాని యీధనము నాది కాదు. మిథిలాపురమంతయు దగ్ధమైపోయినను, నాది కొంచెమైనను దగ్ధముకాదు. అందువలన నాకు లభించునది కొంచెమైనను లేదు." 'దుఃఖేష్వనుద్విగ్నమనాః। సుఖేషు విగతస్పృహః॥' "దుఃఖములవలన మనస్సు క్షోభింపదు. సుఖములకు సంతసింపదు." ఇట్టి మహాత్ముని నేను ప్రత్యక్షముగఁ జూచియున్నాను. ఆయన వయసుచెల్లినవాఁడు. ఆయన పెద్దకుమారుఁడు డాక్టరు పరీక్షయందు తేరి పతకమును బహుమతిగఁ బడసెను. ఆకొమారుఁడు తన యిరువదియైదవ యేఁట మృత్యువువాతఁ బడియెను. ఈయన చనిపోవునదినము నందే వీరిగృహమునందు మాయొక్క సభ యొకటి జరుగ వలసి యుండెను. అందువలన తోడివిద్యార్థులతోడ వారి గృహమునకు వెళ్లితిమి. ఇంటిముంగిట ఆవృద్ధుఁ డిరువురితో మాటలాడుచుండెను. ఆయిరువురిలో నొకఁడు మేము సభ చేయఁదలఁచిన గృహమువైపున కేఁగుచుండఁగా వృద్ధుఁ డా యనవంకఁ జూచి యక్కడికి కేల వెళ్లుచున్నా వని ప్రశ్నించెను. అందుల కాతఁడు "ఎడ్యుకేషనల్ గెజట్టును" తెచ్చుకొనుటకు వెళ్లుచున్నానని నుడివెను. ఆమాటలు విని వృద్ధుఁడు స్థిరచిత్తముతోడ "ఆయింటిలోనికి వెళ్లవలదు. ఆయిల్లు

నాది కాదు. ఆయింటియధికారి యీదినము నాలుగు గంటలవేళ మరణించెను" అని చెప్పెను. నాసహపాఠి యీ వాక్యములను విని "న యయౌ నతస్థౌ" (వెళ్లనులేదు. ఉండను లేదు.) "ఏమిది? ఇట్టిసుపుత్త్రునిఁ గోల్పోయినవృద్ధునికంటి వెంట నొక్కనీటిబిందు వైనను రాదు. ఇట్టిదృశ్యమును నేనెన్నఁడును జూచి యెఱుంగను" అని నుడువుచు నివ్వెఱ పడెను. ఈయనహృదయము భక్తిరసపూర్ణము గానియెడల నీవిధముగ స్థిరచిత్తుఁడై యుండుటకు వీలు లేదుగదా? ఈయనసంబంధముననే యింకొకకథను వినియుంటిని. ఈయ నకుఁ గల యిరువురుపుత్త్రులలో రెండవపుత్త్రుఁడు గూడ మరణించెను. రెండవకుమారునిమృత్యువునకుఁగూడ దుఃఖింప కుండుటను చూచి యొకానొకఁ డీయనను సమీపించి "అయ్యా! స్థిరచిత్తులరై మీ రెట్లుండఁగలిగితిరి?" అని యడిగెను. ఆయన "దానముమీఁద హక్కేమికలదు" అని నుడివెను. అనఁగా పుత్త్రునొసఁగిన భగవానుఁడే పుత్త్రునిఁ దీసికొనివెళ్లెను. కావున దానముపై హక్కేమియున్నది?" ఈయనపుత్త్రిక భాగల్పూరునందు మరణించె ననువార్తను విని యీయనభార్య విలపింపసాగెను. ఈయన యామె యెద్ద కేఁగి "నీవేల యేడ్చెదవు? నీకొమార్త భాగల్పురము నం దున్నదని యనుకొనరాదా? భాగల్పురమునం దున్న యెడల సంవత్సరమున కొకమారైనను చూడవచ్చు నని

తలంతువేమో కాని, ఇప్పుడును నీవు కొంతకాలము వేచి యుండినయెడల నీకొమార్తను చూడఁ గలవు. మఱియు నీ చూపునందు మీ కిద్దఱకు విచ్ఛేద ముండదు సుమా!'' అని బోధింపసాగెను. ఆహా! ఈయనవిశ్వాస మెంతసరళ మైనది! ఈమహాపురుషుఁ డిప్పటికిని సజీవుఁడై యున్నాఁడు. ఇట్టిమహాపురుషుఁడు మనదేశమునకు గౌరవస్వరూప మని చెప్పుటకు సందియము లేదు గదా!

నే నింకొకమహాభక్తునిఁ జూచియుంటిని. ఆభక్తునికుమారుఁడు మృత్యుశయ్యపై నుండఁగా తల్లి నేలమీఁదఁ బడి యేడ్చుచుండెను. అప్పు డాయన తనభార్యవంకఁ జూచి, ''కుమారుఁడు మరణించినందులకు నేనంతగా మనోదుఃఖమును బొందుట లేదు. కాని నీయొక్క యవిశ్వాసమువలన కాఱు కన్నీళ్లను జూచి మిక్కుటముగ మనోదుఃఖమును బొందుచున్నాను.'' అప్పుడు నే నాయనప్రక్కనే కూర్చుండి చూచుచుంటిని.

ఇట్టియుపమానములవలన సంసారమునం దుండినయెడల భక్తుఁ డగుటకు వీలులేదని చెప్పుటకు సాహసింపఁ జాలము గదా? భక్తుఁ డగుటకు ప్రయత్నించువానికి భగవానుఁడు సాహాయ్యము చేయుచుండును. మఱియును వానికోరికలను నెఱవేర్చుచుండును. కావున సంసారమునందుండి భక్తుఁడగుటకు వీలు లేదనువాక్యములను స్మరణకుఁ గూడ రానీయఁ

జనదు. స్మరణకు వచ్చినను గూఁడ భగవానునిపైని భయం
కర మగుదోషారోపణము చేసినవారల మగుదుము. ఈసం
సారమున కాయనయే కర్త. ఆయనయే "గృహిణాం గృహ
దేవతా." తామసభక్తుఁడైనను ముఖ్యభక్తుఁ డగుటకు వీలు
గలదని లోఁగడ చెప్పియున్నాను. పరమదురాత్ముఁడుఁ
గూఁడ భగవానుని ప్రార్థించుచుండుటకు మొదలిడినయెడల
ధర్మాత్ముఁ డగుటకు వీలుగలదని నుడివియున్నాను. ఇందుల
కుపమానముగ గీతావాక్యమును చూపించియుంటిని. కాఁబట్టి
నిరాశనుజెందక భక్తిసాధనకు పూనుకొనినయెడల నెల్లరును
కృతార్థు లగుదురు. జాగాయివలెను, మాధాయివలెను మన
మందఱును గూఁడ నుద్ధరింపఁబడుదు మనుట నిక్కము.

---

# తృతీయ ప్రకరణము.



## భక్తిసంచార మేవిధముగ నగును?

"మహత్ కృపయావా భగవత్ కృపాలేశా ద్వా"

నారదభక్తిసూత్రము.

"మహాపురుషులయొక్క కృపవలనఁగాని లేక భగవత్కృపాలేశముచేత నైనఁగాని కలుగును." సాధుపురుషుల కృపగూడ భగవానుని కృపాలేశమువంటిదై యున్నది. భగవానునికృప యెప్పు డేవిధమునఁ గలుగునో యనువిషయము మనుష్యబుద్ధి కగోచరము. నిన్నటివఱకును దురాత్ముఁడై సంచరించుచుండినవాఁడు నేఁడు పరమభక్తుఁడు కావచ్చును. మనమట్టివానిపాదధూళిని తాఁకుటవలన కృతార్థుల మైతిమని తలంపవచ్చును.

భక్తమాలనుండి యొకకథ నిం దుదాహరించుచున్నాను. ఒకానొకరాజు శయనించియుండఁగా పాకీవాఁడొకఁడు దొంగతనము చేయుటకు రాత్రి రెండవజామున వచ్చి రాజు శయనించియున్నగదికి కన్నము వేయుచుండెను. ఆసమయమునందు రాజుతోడ రాణి యీవిధముగ చెప్పుచుం

డెను. "ఎంత చెప్పినను పెద్దపిల్ల వివాహమును గుఱించి యో
జించినవారలే కారు." రాజు "తగినవాఁడు దొరకనప్పు
డేమిచేయుదును? ఏమూర్ఖునిచేతియందు పిల్లను బెట్టుదును?"
ఈమాటలను లెక్కసేయక రాణి తొందరపెట్టి మాటలా
డుచుండుటవలన విరక్తిఁ జెంది కొంతవడికి రాజు "రేపటి
యుదయమున నే లేచి తపోవనమున కేఁగుదును. అప్పుడు
నాకంటికి ముందఱ నగపడినయోగికి పిల్ల నిచ్చి వివాహ
మొనర్చి రాజ్యమునందు సగముభాగము వాని కిత్తును."

కన్నము వేయుచున్న పాకీవాఁ డీమాటలనువిని "నన్నిప్పు
డెవరయినను చూచినయెడల నాప్రాణములుగూడదక్కవు.
కాకున్నను నే నేల వృథా శ్రమపడవలయును? యోగివేష
మును ధరించి తపోవనసామీప్యమందుఁ గూర్చుండినయెడల
ననాయాసముగనర్ధరాజ్యమును రాకొమరితయుఁ లభించును."
అని తలంచుచు వెంటనే గృహమున కేఁగి యోగివేషమును
ధరించి తెల్లవాఱకమునుపే తపోవనసామీప్యమున కేఁగి మార్గ
మునందె కూర్చుండి యోగివలె నటించుచుండెను. రాజు
తెల్లవాఱకమునుపే లేచి తపోవనమార్గమున వచ్చుచు, మార్గ
మునందె కూర్చుండి యున్నయీతపసిని జూచి సాష్టాంగ
దండప్రణామం బొనర్చి సమాధినుండి లేచువఱకును చేతు
లు జోడించుకొని నిరీక్షించుచుండెను. ఈయోగి కొంత
వడికి కన్నులు దెఱచి చూచి, రాజుప్రార్థన నంగీకరించి

యీయనతోడ పట్టణములోని కేఁగెను. అంత రాజదంపతు లీయోగికాళ్లు గడిగి పాదోదకమును శిరస్సునఁ జల్లుకొని యీయనను సింహాసనముపైఁ గూర్చుండఁబెట్టిరి. రాణి విసరుచు నిలుచుండెను. ఈవిధముగ కొంచెముసేపు ఉపచారమొనర్చిన పిమ్మట నాదంపతులిరువురునుతిరిగి సాష్టాంగదండప్రణామంబొనర్చి యిట్లు విన్నవించుకొనిరి. "యోగివర్యా, మా కొకరూపవతి యగుకూఁతురు గలదు. తమయాజ్ఞ యైనయెడల నర్ధరాజ్యముతోడ నాబాలికను తమయొక్క చరణములయం దర్పించి కృతార్థులముగా నెంచియున్నాము" అను నుడువు లాలించి యావేషధారి యిట్లు విచారింపఁ జొచ్చెను. "నేను యోగివేషమును ధరించినంతమాత్రముననే రాజదంపతులు పాదాక్రాంతులై యర్ధరాజ్యముతోడ కొమార్తను స్వీకరింపుఁడని ప్రార్థించుచున్నారు. నిజముగా యోగినే యైనయెడల యెంతమంది రాజదంపతులు పాదాక్రాంతులగుదురో, యెంతమంది రాజకన్యకలను రాజ్యములను చేకొనఁ దగుదునోకదా!" అని భావించుచుండునంతలో పరివృత్తచిత్తుఁడై రాజుప్రార్థనను నిరాకరించి చివ్వున సింహాసనమునుండిలేచి వ్యాకులహృదయముతో భగవన్నామమును స్మరించుచు కానల కేఁగెను. మఱియును, వానిని విషయసౌఖ్యములు స్పృశింప వయ్యె. భక్తిమార్గము తెలియఁబడఁగానే పాకివానిజన్మము సార్థకతఁ జెందెను. కావున భగ

వానుని కృప గలిగినయెడల నమావాస్యారాత్రులు పండు వెన్నెలలతో ప్రకాశించుపూర్ణిమారాత్రులుగ మాఱు ననుట నిక్కువము.

ఇంకొకకథ నుదాహరించు చున్నాను. ఒకానొకకిరాతుఁడు పక్షులను బట్టుకొనుటకు విల్లునంబులును చేఁ బూని యొకానొకసరోవరతీరమునకు వచ్చెను. కిరాతునిఁ జూచినంతనే పక్షులన్నియు పాఱిపోవుటవలన తిరిగి పక్షులు వచ్చునంతవఱ కతఁ డొకవృక్షముచాటున పొంచుండెను. ఇంతలో నొకానొక వైష్ణవుఁడు వచ్చి యాసరోవరమునందు స్నానము చేయుచుండ పక్షులు తిరిగి సరోవరమునకు వచ్చి వైష్ణవునిఁ జూచి భయపడి పాఱిపోక, అచ్చటచ్చట ఆనందమున విహరించు చుండెను. కిరాతుఁ డీదృశ్యమును జూచి "నేను కూడ వైష్ణవవేషమును ధరించినయెడల నన్నుఁజూచి యొకపక్షి యయినను పాఱిపోకుండుటవలన విల్లునంబులు నక్కఱ లేకయే కావలసినన్ని పక్షులను బట్టుకొనవచ్చు" నని తలంచి, యింటికేఁగి వైష్ణవునివేషమును ధరించి తిరిగి సరోవరతీరమునకు వచ్చెను. ఇప్పు డీదొంగవైష్ణవునిఁ జూచి పక్షు లణుమాత్రమైనను భయముచెందక స్వచ్ఛందముగ విహరించు చుండెను. కాని యిప్పుడు పక్షుల ననాయాసముగఁ బట్టుకొనుటకు వీలున్నను గూడ, కిరాతుఁడు పక్షులను బట్టుకొనఁ బ్రయత్నింప కుండెను. ఏలయన, భగవానుని ప్రేమామృతము

కిరాతుని హృదయమునందు వర్షింప సాగెను. అందువలన పరివృత్తచిత్తుఁడైనకిరాతునియశ్రుధారలవలన వానిగతుఁ స్థలము తడియుచుండెను. "కరుణాప్రవాహమువలన కఠిన శిలలుగూడఁ గరఁగును" అనుమాటయథార్థముగదా? హృదయమునందు ప్రేమతరంగములు లేచువారిజన్మమే జన్మము. వారలే ధన్యులు. కిరాతుఁడు సరోవరమునందుండి "వైష్ణవ భక్తునివేషమును వేసినంతమాత్రముననే నన్ను చూచి పక్షులు భయపడక నానలుప్రక్కలఁ జుట్టుకొని యానందమున సంచరించుచున్నవి. కాని, అణుమాత్రమైనను వెఱపొందుట లేదు. కావున దివారాత్రములు హరినామస్మరణమును జేయుచు భక్తుఁడ నయ్యెదను. ఎప్పుడును నే నిట్టిగమ్య వేషమును పరిత్యజింపను." అని తలపోయుచు కిరాతుఁ డాశుభముహూర్తముననే భక్తుఁ డాయెను. ఇట్టియుపమానము లనేకములు గలవు. కాని, వాల్మీకిచరిత్ర నీసందర్భమునందు స్మరణకుఁ దెచ్చుకొన్నఁ జాలును.

అత్యంతదయాపాత్రుఁ డగునీచశలస్థుఁడొకఁడుగలఁడు. ఆతఁ డిప్పటికిని సజీవుఁడై యున్నాఁడు. వాఁ డద్భుతము లగు ఘోరకృత్యములు చేయుచుండెను. ఆతఁడు చేయుపాప కార్యములు లెక్కకు మిక్కుటములు. ఈతఁడు గంజాయి దమ్మకును సురాపానమునకును ప్రఖ్యాతి కెక్కియుండెను. ఈతఁడొకదినమందు తనవిరోధినిఁ జంపవలయు ననుతలఁపున

వానిగదియందు విడుచుటకు క్రూరసర్పము నొకదానిని కుండ యందుఁ బెట్టి తీసికొని వెళ్లుచుండెను. ఈశ్వరుఁడు సమస్త మానవులను సంరక్షించువాఁడు గదా? వీఁడు వెళ్లుచు మార్గ మధ్యమందలి వెదుళ్లతోఁ గట్టినవంతెనమీఁదికి వచ్చునప్పటి కి వంతెన విఱిగి నీళ్లలో కూలెను. ఈపాతకుఁడు వంతెనతో కూడ నీళ్లయందుఁ బడి కొంతవడికి గట్టు చేరఁ గల్గెను గాని సర్పము తప్పించుకొని పాఱిపోయెను. ఇందువలన వీఁడు తలంచినకార్యము నెఱవేఱినది గాదు. కాని యింకొకదినమునందు వీఁడు సురాపానమత్తుఁడై యొకా నొకయింటిసమీపమునకు వచ్చి కూర్చుండియుండెను. ఆ సమయమునం దాగృహములోనుండి యొకభక్తుఁ డీయభి ప్రాయముగలకీర్తనను మృదుమధురముగఁ బాడుచుండెను. “ఓదీననాథా! మమ్మాశీర్వదింపుము. దీనులును, హీనులు ను, దుర్బలులునైన నీసంతతియొక్క నాలుక జీవితమందును, మరణమునందును, నీనామమును ఘోషించునట్లు మమ్మాశీ ర్వదింపుము.” ఈగానము చెవియందుఁ బడినశుభముహూ ర్తమునుండియే వీని జీవనమార్గము మార్పు చెందెను. పరమే శ్వరునికృపవలన సురాపానమత్తత పటాపంచలైనంతనే, వాఁడిట్లు ప్రతిజ్ఞ యొనర్చుకొనెను. “ఇఁక నే నెప్పుడును త్రాగుట మొదలగుదురభ్యాసములకు లొంగకుండుటయే కాక, ఈనిముసమునుండియు సన్మార్గమునఁ బ్రవర్తింతును.”

నిజముగా నానిముసమునుండియు వానిజీవనము నూతనభావముతోఁ గూడుకొని యుండెను. ఆయన యేవిధ మగు కళంకములును లేక భక్తిమార్గము నవలంబించి, వైద్యమును జేయుచు దానివలన నొకరూపాయకు మించి యెంతసొమ్ము ఎక్కువగ నెప్పుడు దొరకిన నప్పుడు దానినంతయు బ్రహ్మసమాజమునకు దానముఁ జేయుచు, రూపాయకు మించని సొమ్ముతో మాత్రమే జీవించుచుండెను.

ఇదేవిధముగ ననేకదుర్మార్గు లొక్కనిముసములో భగవానునికృపవలన పావనులై యున్నారు. జాగాయి, మాధాయి, యనుఘోరకిరాతబ్రాహ్మణులు, భగవత్కృపవలనను, నిత్యానందస్వామి యనుగ్రహమువలనను, పరమపవిత్రులైరి. కాని మహాపురుషులకృపగూడ నీశ్వరకృప నపేక్షించియే యుండును. ఈశ్వరకృప లేనియెడల నిత్యానందస్వామి జాగాయి మాధాయులయొద్ద కేఁగి యుండునా? భక్తుల మహిమ వారికన్నులకు గోచరించునా?

అహోరాత్రము, నీశ్వరకృప సంతతధారగా వర్షించుచున్నది. నేత్రములు గలవారలు మాత్రమే యాకృపావర్షము జూడఁగలరు. "భగవత్కృపకు విరామము లేదు. అది సెలయేటివలెఁ బ్రవహించుచుండును" (బం॥ ప॥) దూడను వెంబడించి తిరుగుగోవువలెనే యీశ్వరుఁడు మనలను వెంబడించి తిరుగుచుండును. కాని మనము స్వేచ్ఛాబలమువలన

దూరముగఁ బరుగిడుచుందుము. "స్వేచ్ఛవలన మనుష్యుఁడు పాపముల ననుభవించుచుండును." భగవత్కృప నెదురు చూచుచుండువాఁడు సహస్రధారలతోఁ గురియుభగవానుని కృపావర్షమును జూడఁగలఁడు. మనకేలాటి కష్టమైనను భగవానుఁడు వ్యాకులతఁ జెందుచుండును. కావున మనము గూడ భగవానునికొఱకు వ్యాకులతను జెందుచుండినయెడల పాపములు పలాయన మగుటయే కాక హృదయమున భక్తి జ్యోతివలన ప్రకాశించుచుండును.

శ్రీ రామకృష్ణపరమహంస యీవిధముగఁ జెప్పి యున్నాఁడు. "సూదంటురాయి యినుము నాకర్షించువిధము ననే యీశ్వరుఁడు మనల నాకర్షించుచుండును. ఇనుము నకు బురద పూసినయెడల సూదంటురాయి యాకర్షింపఁ జాలదుగదా? అటులనే మనహృదయములు బురదచేఁ గప్పఁ బడి యుండుటవలన భగవానుని యాకర్షణకు లోఁబడ కున్నవి. కావున మన మాయనకొఱకు విలపించినయెడల మన హృదయమును గప్పియున్నబురద కడిగినట్లుగఁ బోవును. అప్పుడు మన మాకర్షింపఁబడుదుము." కాఁబట్టి మనమనుదిన మును భగవానునిప్రార్థించుచు, మనపాపములకు పరితపించు చుండవలయును. ఇట్లొనర్చుచుండినయెడల మనమీఁద భగవానునికి కృప గలుగు ననుట నిశ్చయము. ఆయనను బ్రార్థించువానిమీఁద నాయనకు కృప గలుగుచుండును

ఆయనకృప ననుభవించుచున్నవాఁడు మాత్రమే యాయన స్వరూపమును జూడఁగలఁడు. భక్తుఁడగుటకు విద్యామాన విత్తములతోడ ప్రయోజనము లేదని వెనుకనే నుడివి యున్నాను. శ్రుతి యీవిధముగ నుడువుచున్నది.

" నాయ మాత్మా ప్రవచనేన లభ్యో,
న మేధయా న చ బహునా శ్రుతేన;
య మే వైష వృణుతే తేన లభ్య,
స్తస్యైష ఆత్మావృణుతేతనూంస్వామ్॥ " కఠోపనిషత్తు.

వేదాధ్యయనమువలనఁగాని, అనేకగ్రంథార్థములను దెలిసికొనుటవలనఁగాని, అనేకశాస్త్రములను వినుటవలనఁగాని, పరమాత్మను బొందఁజాలరు. ఆయనకృప గలిగినవానికి మాత్రమే యాయన చిక్కును. వానిసమీపమందే తన నిజస్వరూపమును ప్రకాశింపఁ జేయును.

—ంంశంం—

## చతుర్థ ప్రకరణము.



## భక్తిమార్గమునం దుండుకంటకములు.

## వానిని దొలఁగించుమార్గములు.



మనము భగవానుని ప్రార్థించుటయును, ఆయనకృపను బడయుటయును, ఆ యనయ ప్రాణసమర్పణము చేయుటయును మార్గమధ్యమునం దుండుకంటకములను దొలఁగించుకొనుట మిక్కిలి యావశ్యకము. భక్తిమార్గమునం దుండుకంటకము లను దొలఁగించుకొననియెడల మన మామార్గమున నడువఁ జాలము. ఈకంటకములలోఁ గొన్ని బాహ్యమందునను, కొన్ని యంతరంగమందునను గలవు. బాహ్యకంటకములలో ముఖ్యమైనది దుస్సాంగత్యము.

"దుస్సఙ్గః సర్వథైవ త్యాజ్యః." నారదభక్తిసూత్రము.

"సర్వదా దుస్సాంగత్యమును మానవలయును." దురాత్ముల సహవాసము చేయుట? వారితో ప్రసంగించుట మొదలగువానిని మాత్రమే దుస్సాంగత్య మని భావింపఁజనదు. దుష్టగ్రంథములను జదువుటయు, హేయము లగుచిత్రములను

సందర్శించుటయు, బూతుమాటలను బలుకుటయు లోనుగాఁ గల వన్నియును, దుస్సాంగత్యమునందుఁ జేరియున్నవి. పవిత్రులుగ నుండఁదలంచినవారలు నపుంసక జంతువులను గూడ చూడఁగూడ దని మనశాస్త్రములు సెప్పుచున్నవి. కావున మనహృదయములందు దుశ్చింతలను గలిగించువానిని వినఁగూడదు, ఉచ్చరింపఁ గూడదు, చింతింపఁ గూడదు, చూడఁగూడదు. మనుష్యులయొక్క గాని ఇతర ప్రాణులయొక్క గాని యవస్థావిశేషమును దర్శించుటవలన కలుషితములైన చిత్తములు గలవారలనేకులున్నారు. హేయము లగుచిత్తరువుఁను చూచుటవలనను, బూతుసంగీతమును వినుటవలనను, దుష్టగ్రంథములను చదువుటవలనను, మనస్సు చెడుటకు మిక్కిలి వీలు గలదు. నీతిదాయకము లగుగ్రంథములను చదువుటవలన హృదయము సద్భావపూరిత మగునప్పుడు, దుర్నీతిదాయకము లగుగ్రంథములను చదువుటవలన హృదయము నీచభావపూరిత మగుననుట వింత గాదు. నీతిబోధకము లగు చిత్తరువులను చూచుచుండుటవలన హృదయమునందు పవిత్రభావములు పుట్టునప్పుడు దుర్నీతిబోధకము లగుచిత్తరువులను దర్శించుటవలన హృదయమునం దపవిత్రభావము లుదయించు ననుటకు సందేహము లేదు. మంచిసంగీతము లేక మంచి వాక్యములను వినుటవలన హృదయము సద్భావమువలన పరవశ మగునప్పుడు, చెడుసంగీతము లేక చెడువాక్యములను

వినుటవలన చెడుభావములతోడ ప్రాణము తల్లడిల్లు ననుట నిశ్చయము. నే నొకచక్కనిప్రవర్తన గలవిద్యార్థి నెఱిఁగి యుంటిని. అతఁడు విశ్వవిద్యాలయమునందు చదువుకొను చుండెను. ఆయన పఠింపవలసినగ్రంథములలో నొకసంస్కృత గ్రంథమునందలి యశ్లీలవాక్యములవలన ననేకపర్యాయములు నీచము లగుస్వప్నములకు లోనగు చుండెను. నే నీవిద్యార్థి వంటి విశుద్ధచరిత్రగలవారిని, పవిత్రతకొఱకుఁ బ్రయత్నించు వారిని కొలఁదిమందిని మాత్రమే యెఱిఁగి యున్నాను. దీని కంటెనుగూడ చెడుసంగీతముయొక్క శక్తి గురుతరము. చదు వుటకంటెను గూడ సంగీతశ్రవణ మతియున్మాదకారి యని యెల్ల రంగీకరించెద రనుకొనుచున్నాను.

దుస్సాంగత్యముతోడఁ బోల్పఁదగినది మఱొక్కటి లేదు. చెడిపోయినవారిలో నెవ్వరి నైనను బ్రశ్నించిన యెడల దుస్సాంగత్యమే తాము చెడుటకు మూలకారణ మని చెప్ప వచ్చును. చెడుమార్గమున నడిపించువారలు లెక్కకు మిక్కు టము కాని మంచిమార్గమున నడిపించుస్నేహితులు మిక్కిలి యరుదు. దుస్సాంగత్యమువలన చెడిపోయినవాఁ డెవఁ డైనను బాగుపడవలయు నని ప్రయత్నించినయెడల వందలకొలఁది స్నేహితు లడ్డముగ వచ్చి వెక్కిరించియు పరిహసించియు వానిని నిరుత్సాహునిఁగ నొనర్చెదరు. ఈరాజ్యమునందు సైతానునిశిష్యులకు మేర లేదు. చెడుమాటలను జెప్పియు

హేయము లగుదృశ్యములను జూపించియు దుర్మార్గకార్యము లొనర్చియు లోకులను లోభింపఁ జేయుదుర్మార్గులకార్య ములను సంపూర్ణముగ వివరించి చెప్పుట కష్టము, తలిదం డ్రులుగూడ సంతానమును చెడుమార్గములయందు నడిపింపఁ గలందులకు పలుప్రయత్నములు సేయుచుందురు. కావున నీప్రపంచమునందు హిరణ్యకశిపులసంఖ్య లెక్కలకు మిక్కు టము. ఈశ్వరునియందొకింతభక్తి గలిగినబాలుని జూచి నంతనె వానితలిదండ్రు లాతనిమన సూదిక్కునుండి మరలి విషయసౌఖ్యములయందుఁ దగుల్కొనుటకు విశ్వప్రయత్న ము లొనర్తురు. ఇట్టియుపమానములను వేలకొలఁది చూపింప వచ్చును. అయ్యయ్యో! మనమందఱ మొక్కమూలగ నధో గతిపా లగుచున్నాము గదా? ధర్మమార్గావలంబనమునకు తలిదండ్రులుగూడ శత్రువులుగ నున్నస్థానము పేరు దలంచి ననుగూడ మహాపాతక మనుకొనుచున్నాను. ప్రతిమనుష్యుఁ డును సాధ్యమైనంతవఱకు దుస్సాంగత్యమునకు దూరముగ నుండవలయును. భక్తియోగమునకు దుస్సాంగత్యముతోఁ బోల్పఁదగిన శత్రువు మఱొక్కటి కానరాదు. దీనివలననే సమస్తపాపము లుద్భవించును. కావున "దుస్సఙ్గః సర్వ దైవ త్యాజ్యః॥"

కామ క్రోధ మోహ స్మృతిభ్రంశ బుద్ధినాశ సర్వనాశ కారణత్వాత్॥ నారదభక్తి సూత్రము.

"దుస్సాంగత్యమువలనఁ గలుగు కామక్రోధమోహములు స్మృతిభ్రంశమును బుద్ధినాశమును గలిగించి సర్వనాశనమునకుఁ గారణములగును." దుర్మార్గులసహవాసమువలనను, వారి ననుకరించుటవలనను, దుర్నీతిదాయకమగు సంగీతశ్రవణమువలనను, దుష్టగ్రంథముల పఠనమువలనను, ఇట్టివానిని గూర్చి చింతించుచుండుటవలనను, కామము పుట్టును. కామమువలన భోగాసక్తి మిక్కుటమగును. భోగేచ్ఛను తృప్తిపఱుచుట కేదాటంకము గలిగినను గూడఁ గ్రోధోద్రేకము గలుగును.

శ్లో॥ 'ధ్యాయతో విషయాన్ పుంసస్సఙ్గస్తేషూపజాయతే।
సఙ్గాత్సఞ్జాయతే కామః కామాత్క్రోధోఽభిజాయతే॥

౬౨ సాంఖ్యయోగము-భగవద్గీత.

'పురుషుఁడు విషయముల నభిలషించుటచేత వానియం దాతనికి ఆసక్తి గలుగును. ఆయాసక్తివలన కామము గలుగును. కామమువలన క్రోధము గలుగును.' విషయములను గూర్చి చింతించుచుండుటవలన వానియం దాసక్తి జనించును. కాఁబట్టి విషయములనుగూర్చి చింతించకుండుటయే గాక మిక్కుటముగ విషయలోలునిసహవాసముంగూడఁ జేయవలదు. భగవదాదేశమువలన నే నీకార్యములను జేయుచున్నా నను భావమున సంసారకార్యములను నిర్వహించుచుండవలయును. "ఏపదార్థములను తిందును? ధన మెచ్చట దొరకును? ఇంద్రియపరితార్థత్వ మేవిధముగ నగును?" అనుచింతలేద భగవా

నని మఱచి యెప్పుడును సంసారకార్యములను చేయఁగిట్టదు. భ్రమచేతనైనను, భగవన్నామమును స్మరింపక సంసార చక్రమునందే పడి తిరుగుచుండువానిసహవాసము చేయ వలదు. ఇట్టివారితో సాంగత్యము చేసినను, వీరివలె విషయ భోగము లనుభవించుచున్నను, విషయసుఖములయం దాసక్తి జనించును. ఈయాసక్తివలన భోగములయందు ప్రవేశించుట కటస్థించును. దీనివలన క్రోధము పుట్టును. భోగములు నెఱవేఱుట కాటంకములు గలుగునప్పుడు క్రోధ ముద యించును.

శ్లో॥ 'క్రోధాద్భవతి సమ్మోహస్సమ్మోహాత్ స్మృతివిభ్రమః।
స్మృతిభ్రంశా ద్బుద్ధినాశో బుద్ధినాశా త్ప్రణశ్యతి॥'
౬౩ సా॥ గీత.

'క్రోధమువలన మోహము గలుగును. మోహమువలన స్మృతివిభ్రమ మగును. స్మృతివిభ్రమమువలన బుద్ధి నశిం చును. బుద్ధినశించుటవలనఁ దానే నశించును.' క్రోధము గలిగి నంతనే చిత్త మంధకారావృత మగును. అందువలన స్మృతి విభ్రమము గలుగును. అనఁగా, చింతించుటవలనను, దృష్టాంతములచేతను, మంచివాక్యములను వినుటవలనను, మంచి మార్గమున నడువవలయు నను జ్ఞాన మంతయు నప్పుడు చిత్త మునకు పొడగట్టదు. ఇంతియేగాక సమస్తమును తలక్రిం దగును. ఈస్మృతివిభ్రమమువలన బుద్ధినాశము గలుగును;

అనఁగా సదసద్వివేచనాశక్తి నశించును. బుద్ధి నాశమైనయెడ చుక్కాని లేనినౌకవలె సర్వనాశనము గలుగును. భూమండలమునందు జరుగుఘోరహత్యలు, న్యాయస్థానములయందు విచారింపఁబడు భీషణవ్యాజ్యములు బుద్ధినాశనముయొక్క ఫలితములే గదా? మొట్టమొదట కామమువలన క్రోధము జనించును. కొన్నిస్థలములయందు ధనాసక్తియు, కొన్నిచోట్ల నింద్రియవాంఛయు క్రోధమునకు హేతువు లగుచున్నవి. క్రోధము చిత్తమును మోహపరవశముగఁ జేయును. అప్పు డేకార్యమున కేట్టిఫలము గలుగునను జ్ఞాన ముండనందువలన, బుద్ధినాశ మగును. మంచిచెడుగులజ్ఞానము లోపించుటవలన ప్రాణమును దీయుటకుఁగూడ వెఱవరు. కావున భోగాసక్తివలన మనుష్యుఁ డీవిధ మగుదుర్గతియందు పడిపోవును. దుస్సాంగత్యమువలన భోగాభిలాష వృద్ధినొందును. కావున దీనిని సమీపమునకుఁ జేరనీయఁజనదు. ప్రతి మనుష్యుఁడును కామక్రోధములదౌర్జన్యమువలన తత్తఱం బొందుచుండును. దానికి దుస్సాంగత్యము తోడుపడినయెడల బాగుపడు టెట్లు?

'తరఙ్గాయితా అపీమే సఙ్గాత్ సముద్రాయన్తే'

నారదభక్తిసూత్రము.

'సమస్తమానవులును, కామక్రోధములచే నాక్రమింపఁబడుచుందురు. కావున నీతరంగములు దుస్సాంగత్యమను వాయువునందుఁ దగుల్కొనినయెడల సముద్రాకారముగను

దాల్చును.' చిన్నిచిన్నితరంగముల సాధారణముగ నడంప వచ్చును గాని సముద్రాకారమును దాల్చినయెడల నడం చుట సాధ్యము గాదు. కొంతమంది తపుంతట తాము పాపమును సమీపించి గంభీరభావమున నిట్లందురు.

శ్లో॥ వికారహేతౌ సతి విక్రియన్తే
    యేషాం న చేతాంసి త ఏవ ధీరాః ॥

కుమారసంభవము. ౧౫౯ ప్రథమసర్గ.

"వికారమును గలిగించువానివలనఁ గూడ నెవరి చిత్తము మాఱిపోకుండునో అట్టివారలే ధీరులు. కావున పాపము కడనుండి యేల పలాయనము గావలయును? తన్ను చుట్టి యుండు పాపములను జయించువాఁడే మహావీరుఁడు." కాని యట్టివీరులు కాఁగలందుల కెవ్వరును బ్రయత్నింప కుందురు గాక. మహాభక్తుఁ డగు క్రీస్తు గూడ సైతానునివలన వంచింపఁబడెను. మహాపురుషుఁ డగు శాక్యసింహుఁడు తపస్సునందు మిక్కుటముగ పాపముతోడఁ బోరాడవలసి వచ్చెను. మహాయోగి యగుశివునకుఁగూడ సమాధియందు చిత్తచాంచల్యము సంభవించెను. కావున నిట్టివారి దాసాను దాసుల పాదధూళిని ముట్టుటకుఁగూడ పనికిరానట్టివారము ను కీటకతుల్యులము నగుమనము పాపమునందు ప్రవేశించి పా పమును నాశము చేయఁగలమా? పైని పేర్కొన్నవారికంటె మనము బలవీర్యములు గలవారమా? కావున మన మీవిధ

మగు తేజమును జూపఁగలమని యెప్పుడును కలయందయినను దలంపకుందుముగాత. క్రీస్తు తనభక్తుల కిట్లు ప్రార్థనను జేయుటకు నేర్పియున్నాఁడు. "మమ్ము లోభమధ్యమునుండి తీసికొనిపోవలదు. పాపమునుండి మమ్ము రక్షింపుము." కాఁబట్టి దుర్బలుఁ డెప్పుడును పాపమునకు దూరమునం దుండుటకు ప్రయత్నించుచుండవలయును. అణుమాత్రమైనను పాపమును రగులనీయవలదు. కాని క్రోధ లోభ మోహములను ప్రజ్వలింపఁ జేసినయెడల మనలను మనము సంరక్షించుకొనఁ జాలము. ఇందువలననే మహాత్ము యగు నారదుఁడును, భక్తులందఱునుగూడ దుస్సాంగత్యమును విడువవలయు నని నుడివియున్నారు. సర్వనాశనకారి యగుదుస్సాంగత్యము మనలను చేరకుండఁ జేసికొనఁగలందులకు ఈక్రింది విధులను విధించియున్నారు.

"స్త్రీ ధని నాస్తిక వైరి చరిత్రం న శ్రవణీయమ్"

౬౩ నారదభక్తిసూత్రము.

స్త్రీలయొక్కయు, ధనికులయొక్కయు, నాస్తికులయొక్కయు, వైరులయొక్కయు చరిత్రలను వినవలదు.

౧. స్త్రీలచరిత్రలు.

స్త్రీలయొక్క రూపయౌవనములతోఁ గూడినట్టియు, హావభావములతోఁ గూడినట్టియు వర్ణనలను వినఁగూడదు. అందువలన మనస్సు చలించుట కవకాశము గలదు. ఇట్టివర్ణనలను విని మనోవికారము నొందనివార లత్యల్పసంఖ్య కలవా రని

నుడువుచున్నాను. అనేకులు భావను నేర్చుచున్నా మను మిషచేత "మిష్టరీస్ ఆఫ్ ది కోర్ట్ ఆఫ్ లండన్" అనుగ్రంథ మును చదివెదరు. ఆగ్రంథమును చదివి మనోవికారమును బొందనివార లెందఱు గలరో నుడువఁజాలను. కావున చెడు స్వభావము గలస్త్రీలచరిత్రలను వినుటవలన చెడుభావములు వృద్ధియగును గాన నట్టివానిని వినవలదు.

౨. ధనికులచరిత్రలు.

ధనికులచరిత్రలను వినరాదు. ధనికులు ధన మార్జించు విధమును వారు భోగము లనుభవించు పద్ధతిని ఇంద్రభవన మునుబోలు వారిగృహములను, వారిగృహములయం దుండు విలువగల వస్తువాహనములను, వారిని పండితులు మొద లగువారు స్తుతించుచుండుట, మొదలగు వర్ణనలను వినిన కొలఁదిని ధనము సంపాదింపవలయు ననుబుద్ధి పుట్టును. ఇందువలన ధనతృష్ణ గలిగి తదుపరి చిత్తచాంచల్యము గలు గును. అప్పుడు సదసద్వివేకములకు స్థాన ముండదు. తన్ను లోకులు ధనికుఁడనియు యశస్వియనియుఁ జెప్పవలయునని యును, పండితులు మొదలగువారలు స్తుతించుచుండవలయు ననియును భావించుచు ననేక లధర్మాచరణులై లోకుల కట్టికష్టములఁ గలిగించిరైనను, ధనమును సంపాదించుటకు ప్రయత్నించుచుందురు. ఇట్టివారలు చిట్టచివరకు మిడుతల వలె తమదేహమును బుద్ధిని లోభాగ్ని యందు విసర్జింపుదురు.

కాని దీనివలన న్యాయ్యముగ ధనమును సంపాదించినవారి చరిత్రలను వినఁగూడ దని భావింపఁజనదు.

3. నాస్తికులచరిత్రలు.

నాస్తికుల చరిత్రలు వినఁగూడదు. వీరిచరిత్రములను వినినకొలఁదిని భగవద్విషయమునందు పలువిధము లగు సంశయములు పుట్టుటయే కాక చిత్తము చలించి మోహావృత మగును. 'జాన్ స్టూఆర్టు మిల్లు, ఆగస్టుకోమత్' మొదలుగాఁగల నాస్తికులచరిత్రలను విని తాము కూడ నాస్తికుల మని ప్రకటింపుకొనినయెడల బుద్ధిమంతులుగ లెక్కింపఁ బడుదు మనుతలంపున అజ్ఞాను లనేకులు స్వబుద్ధిపరిచయముకొఱకు నాస్తికు లగుచున్నారు.

౪. శత్రువులచరిత్రలు.

శత్రువులచరిత్రములను వినినకొలఁదిని క్రోధాగ్ని ప్రజ్వలించును. అందువలన రాజసప్రకృతి హెచ్చగుటయే గాక అపకార మొనర్చుటకుఁ జిత్తము తత్తఱ పడును. కావున దీనితో సమముగ శత్రువు భక్తియోగమున కింకొకటి లేదు. ప్రేమకు ప్రబలవిరోధి అప్రేమ. కామక్రోధలోభములను ప్రోత్సాహపఱుచువానిని ఎప్పుడును చూడవలదు, వినవలదు, తాఁకవలదు. చెడుతలంపులను బుట్టించు నాటకములను, నవలలను, చదువవలదు. చెడు

దృశ్యములు, చెడుభావములు పుట్టించుచిత్తరువులు, మొద లగువానిని చూడవలదు. చెడువాక్యములను చెడుసంగీత మును వినవలదు. ఇందువలననే శిష్యులతోఁగూడి ఋషు లీ విధముగఁ బ్రార్థన చేసియున్నారు.

"ఓం భద్రఙ్కర్ణేభిః శృణుయామ దేవాః
భద్రమ్ పశ్యేమ అక్షిభిర్యజత్రాః
స్థిరైరఙ్గైస్తుష్టువాంస స్తనూభి
ర్వ్యశేమ దేవహితం య దాయుః."

'ఓ దేవతలార! మేమెప్పుడును శుభమును గలిగించు శబ్ద మునే వినుచుందుము. అట్టివానినే చూచుచుందుము. లోపము లేని యవయవములతోడ మిమ్ము స్తుతించి దేవతల కుపయుక్త మగునాయువును బొందుదుము." అనఁగా నశు భప్రద మగునది చెవులకుఁగాని కన్నులకుఁగాని సమ్ముఖమం దుండనియెడల నింద్రియవికారములు గలుగవు. అందువలన జితేంద్రియుఁ డగును. జితేంద్రియుఁడైనయెడల సంగములు స్థిరమగును. మఱియును దీర్ఘాయువు చేకూఱును.

ఇఁక నాంతరంగికకంటకములను గూర్చియు, వానిని పాఱఁద్రోలుమార్గములను గూర్చియు, విచారించెదము. ఆంత రంగికకంటకములు నశించునప్పుడు బాహ్యకంటకము లేవిధ మగునష్టమును గలిగింపఁజాలవు. కాని యీమార్గమునం దున్నతిని బొందుట సులభము గాదు. ఇది మిక్కుట మగు

సాధనతోఁ గూడుకొనియున్నది. ఆంతరంగికకంటకములలో ప్రధానములగువాని నుదాహరించుచున్నాను. (౧) కామము (౨) క్రోధము (౩) లోభము (౪) మోహము (౫) మదము (౬) మాత్సర్యము, దానియనుచరులు (౭) స్వేచ్ఛాచరణము (౮) సాంసారికదుశ్చింత (౯) కౌటిల్యము (౧౦) వదరుఁబోతుతనము (౧౧) కుతర్కేచ్ఛ (౧౨) ధర్మాడంబరము.

మనస్సును తల్లడిల్లఁ జేయు కామమువలనఁ బుట్టు పదిదోషములను జూపుచున్నాను.

"మృగయాఽక్షో దివాస్వప్నః పరివాదః స్త్రియోమదః
తౌర్యత్రికం వృథాట్యా చ కామజో దశకో గణః॥"

మనుసంహిత.

వేటాడుటయు, జూదమాడుటయు, పగలు నిద్రించుటయు, పరులదోషములను కీర్తించుటయు, స్త్రీసంగమమును, సురాపానమును, నృత్యమును, గీతమును, వాద్యములును, వేడుకగా తిరుగుటయు ననునీపదియు కామమువలనఁ బుట్టు దోషములు.

చిత్తమును చలించునట్టి క్రోధమువలనఁ బుట్టు నెనిమిది దోషముల నుదాహరించుచున్నాను.

"పైశున్యం సాహసం ద్రోహ ఈర్ష్యాసూయార్థదూషణమ్।
వాగ్దండజం చ పారుష్యం క్రోధజోఽపి గణోష్టకః॥"

మనుసంహిత.

దుష్టత్వమును, సాహసకృత్యములొనర్చుటయు, పరులకు హానికర మగుకార్యములను చేయుటయు, అన్యులగుణములను జూచి యోర్వలేకుండుటయు, పరుల గుణములనుండి దోషములను వెల్లడించుటయు, ఈయఁదగినదానిని ఈయకుండుటయు, దానముచేసినపదార్థముల నపహరించుటయు, కఠినపుమాటలను పలుకుటయు, దయారహిత మగుపనులు చేయుట యనునీయెనిమిదియును, క్రోధమువలనఁ గలుగు దోషములు.

కామక్రోధములవలనఁ గలుగుదోషములు మనదరికి రాకుండునట్లుగఁ జేయఁ బ్రయత్నించుచు, సమీపించినయెడల వెంటనే వానిని పారఁదోలుటకు ప్రయత్నించు చుండవలయును. పృథివియందుండుసమస్తదోషములను దూరమునందుంచుటకును, వానిని సమీపమునకు రాకుండఁ దఱుముటకునుకొన్ని సాధారణోపాయములును, విశేషదోషములకొఱకు విశేషోపాయములును గలవు. కావున సమస్తదోషముల సంబంధమునను సాధారణోపాయములను గమనించుచు, ఏదోషమును దూరముచేయుట కేయుపాయము సహాయ మని తోఁచునో దానిని దృఢభావమున నాచరించు చుండుట కర్తవ్యము.

---

# సాధారణోపాయములు.



(౧) తనంతట తాను హృదయమునం దుదయింపనిపాపమును సమీపమునకు రాకుండునట్లు తెలుసుకొనవలయును.

“న ఖల్వ ప్యరసజ్ఞస్య కామః క్వచన జాయతే
సంస్పర్శా ద్దర్శనా ద్వాపి శ్రవణా ద్వాపి జాయతే
అప్రాశన మసంస్పర్శ మసందర్శన మేవ చ
పురుషస్యైష నియమో మన్యే శ్రేయో న సంశయః॥”

శాంతిపర్వము. మహాభారతము.

భీష్ముఁడు ధర్మరాజున కీవిధముగ నుపదేశించి యున్నాఁడు. ఏమనుష్యుఁ డేవిషయమునందు రసజ్ఞుఁడు కాకుండునో వాని కావిషయమునందు కోరిక జనింపదు. కాని దర్శనస్పర్శనశ్రవణములవలన కోరిక జనించును. అందువలన దుశ్చింత లుదయింపఁజేయువానిని చూడవలదు, ముట్టుకొనవలదు, వినవలదు, తినవలదు. ఈనియమము ప్రతివానికిని శ్రేయోదాయక మనుట నిస్సంశయము. మనోవికారమును లేక లోభమును గలిగించు నట్టివానిసమీపమునకు బుద్ధిని గాని ఆవిషయము నుపయోగించుకొను నేయింద్రియమును

గాని పోనీయవలదు. కావున సమస్తలోభములనుండియు చిత్తమును దూరముగ నుంపవలయును.

(౭) తన్నావరించియుండిన పాపములవలనఁ గలుగు ఫలితమునుగూర్చి చింతించుచుండవలయును. కామమున కెట్టి ఫలము చేకూఱునో అనియును, క్రోధమున కెట్టిఫలము సంభవించునో అనియును, కామక్రోధజనిత దోషములయందొక్కొక్కదాని కెట్టిఫల మొనఁగూడునో అనియును, మొత్తముమీఁద పాపముల కెట్టిఫలము లభించునో అనియును చింతించుచు, ప్రతిపాపమునకొ అకును, పరలోకమందుఁగాని ఇహలోకమందుఁగాని దండన ననుభవింపవలయు నను సత్యమును, స్థిరభావమున నాలోచించుచుండినయెడల పాపముల దిక్కునకు మన స్సేఁగఁజాలదు. మఱియును వీనివలనఁ గలుగు ఫలమిహలోకమునందే యనుభవింపవలయును.

"త్రిభి ర్వర్షై స్త్రిభి ర్మాసై స్త్రిభిః పక్షై స్త్రిభిర్దినైః
అత్యుత్కటైః పాపపుణ్యై రిహైవ ఫలమశ్నుతే"

హితోపదేశము.

అత్యుత్కటము లగు పాపపుణ్యమువలనఁ గలుగు ఫలమును మూఁడుదినములలోఁగాని, మూఁడుపక్షములలోఁగాని, మూఁడుమాసములలోఁగాని, మూఁడువత్సరములలోఁగాని, లేక ఎప్పుడో ఒకప్పు డిహలోకమునందే యనుభవింపవలయును.

ఈవిషయము మనస్సునం దున్నయెడల కామక్రోధలోభమోహమదమాత్సర్యములనుండి సహజముగ మనస్సు మరలును. సద్గ్రంథములను చదువుటవలనఁగాని, సత్పురుషులయుపదేశములవలనఁగాని, సన్మార్గులయాదర్శములవలనఁగాని, లేకతనంతట తాను చింతించుచుండుటవలనఁగాని, ఇంద్రియవాంఛలను తృప్తినొందించుకొనువాఁడు భయంకర మగువలుగోగముల యందుఁ దగుల్కొను ననియును, వానివ స్త్రీసౌఖ్యము లేనిగహిత మగు ననియును, నరములు బలహీనములగుననియును జ్ఞాపకశక్తి తగ్గిపోవు ననియు, సౌందర్యము నశించు ననియును, చిత్తవికారము గలిగి క్షీణించు ననియును, దెలిసికొనఁగలఁడు; మఱియును, ఈమార్గమునందు నడచినకాలం దిని మృత్యువును పిలుచుటయే యనియును, దీనివలన నిహపరములయందు దుర్గతి సంభవించుననియును దెలిసికొనును.

"మరణమ్బిన్దు పాతేన జీవన మ్బిన్దు ధారణాత్ ॥"

"శుక్లపతనమువలన మరణమును, శుక్లధారణమువలన నాయుర్వృద్ధియుఁ గలుగును" కావున నీవెప్పుడును ఇంద్రియవాంఛలను తృప్తిపఱుచుటకు సాహసింపవలదు. కామక్రోధములనుగూర్చి తరువాతి ప్రకరణములలో పూర్తిగఁ జర్చింపఁబడును.

(3) పాపులు పొందుకష్టమును, ధర్మాత్ములు చెందు సుఖమును గూర్చి యోజించుచుండవలయును. పాపాత్ముఁ

డెట్టిక్లేశముల నొందుచుండునో పుణ్యాత్ముం డేవిధముగ నానం
దము పొందుచుండునో గ్రహింపవలయు నన్నచో చరిత్రల
యందును, జీవనచరిత్రలయందును దృష్టాంతములు వేనవేలుగఁ
గాన్పించును. ప్రతివాఁడును కడచినతనజీవనమును గూర్చి
యోజించుకొనినయెడల పాపప్రవృత్తివలనఁ గలిగినకష్టము
లనుగూర్చియు పుణ్యేచ్ఛవలనఁ గలిగినశుభమునుగూర్చియుఁ
దెలిసికొనవచ్చును. అంతరదృష్టివలన తనహృదయాభ్యంతర
మును చూచికొనఁ గలిగినయెడల పాపముయొక్క అంతర్దా
హమును, పవిత్రతయొక్క పరమానందలహరిని చూడఁ
గలఁడు. చరిత్రలను చదువుచుండినయెడల ప్రతిపుటయందును
ఎవఁడో యొకసామాన్యపురుషుఁడు తనజీవనమును పవిత్రి
వంతముగ నొనర్చుకొనుటవలన రాజాధిరాజుల కిరీటములు
వానిపాదసమీపమునందు వ్రాలుచుండెననియును, ఎవఁడో
యొకసామ్రాజ్యాధిపతి పాపప్రవాహమునందుఁ బడి కొట్టు
కొనుచుండుటవలన సమస్తమానవులనిందకు పాత్రుఁ డగు
చుండెననియును, గ్రహింపవచ్చును. పాపముయొక్క ఫలము
దుఃఖము, పుణ్యముయొక్క ఫలము సుఖము. ఏజాతియొక్క
వృద్ధిక్షయములనుగూర్చి విచారించినను గూడ నీసత్యము
బయల్పడును. పుణ్యప్రభావమువలననే ఒకానొకదినమందు
మనభారతవర్షము జగత్తునకు శిరోమణియై ప్రకాశించెనని
యును, నేఁ డేదియో యొకపాపఫలితమువలన సమస్తవిధ

యములయందును క్రిందఁ బడియున్న దనియును, గ్రహింపఁ జాలనివార లుండరుగదా! ఏదో యొకవ్యక్తియొక్కగాని, లేక ఏదోయొకజాతియొక్కగాని భూతభవిష్యద్వర్తమాన స్థితుల నాలోచించిచూచినయెడల ఈవిషయము స్పష్టముగ బోధపడును.

"శ్లో॥ దుర్భిక్షాదేవదుర్భిక్షం, క్లేశాత్ క్లేశం, భయాద్భయం।
మృతేభ్యః ప్రమృతిం, యాన్తిదరిద్రాః పాపకారిణః॥
ఉత్సవాదుత్సవంయాన్తిస్వర్గాత్ స్వర్గం సుఖాత్ సుఖమ్।
శ్రద్దధానాశ్చ దాన్తాశ్చ ధనాఢ్యాః శుభకారిణః॥"

శాంతిపర్వము, మహాభారతము.

పాపాచారు లగుదరిద్రులు దుర్భిక్షమునుండి దుర్భిక్షమునందును, క్లేశములనుండి క్లేశమునందును, భయమునుండి భయమునందును, మృత్యువునుండియు మృత్యువునందును పడిపోవుదురు. జితేంద్రియులును, శ్రద్ధావంతులును, పుణ్యాత్ములునగుధనికులు ఆనందమునుండి యానందమునకును, స్వర్గమునుండి స్వర్గమునకును నిర్గమింతురు. శ్రీమద్వ్యాసాచార్యుఁడు పాపాత్ములను దరిద్రులనియును, పుణ్యాత్ములను ధనికులనియును వర్ణించియున్నాఁడు. యోజించి చూచినయెడల పాపాచారివంటిదరిద్రుఁడును కృపాపాత్రుఁడును మఱొక్కఁడుండఁడు. హృదయమునం దుండుతీవ్రవేదనవలనను, బహిర్గతమగు తీవ్రతిరస్కారములవలనను పాపాత్ముఁడీలోకమును

పరలోకమును గూడ పోఁగొట్టుకొనుచున్నాఁడు. సుఖులై యున్న కొంతమంది పాపాత్ములను మేము నెఱిఁగియున్నామని యెవరైనను నుడువవచ్చును. కాని యీలోకమునం దెవరిని చూచి సుఖులని తలంచుచున్నారో అట్టివారిహృదయము నందు సుఖము గలదా లేదా యని విచారించి చూచినయెడల వారు పాపములు చేసి హృదయశాంతి గలిగియుండువాని నొక్కనినైనను జూడలేదని చెప్పఁగలరు. పుణ్యాత్ముఁడగు వ్యక్తియే ధనికుఁడని చెప్పుటకు సందియము లేదు. భోగములయం దాసక్తి లేనివాఁడు త్రిలోకాధిపత్యమును గూడ లెక్క సేయఁడు. కావున నొకానొక సన్న్యాసి రాజును సంబోధించి యిట్లనియెను.

"శ్లో॥ వయ మిహ పరితుష్టా వల్కలై స్త్వం దుకూలైః।
సమ ఇహ పరితోషో నిర్విశేషో విశేషః।
స తు భవతు దరిద్రో యస్య తృష్ణా విశాలా।
మనసి చ పరితుష్టే కోఽర్థవాన్ కో దరిద్రః॥"

వైరాగ్యశతకము.

"నేను సామాన్యమగు వల్కలములను ధరించి సంతుష్టి నొందుచున్నాను. నీవు బహుమూల్యములగు దుకూలములను ధరించి సంతుష్టి నొందుచున్నావు. ఇందువలన మనమిరువురమును సంతోషమునందు సమానులము. కాని నేను దుకూలములను ధరించుటవలన ఏవిధముగ సంతుష్టిని పొందుచు

వలన క్రమముగా రాజు నంటియున్న వ్యాధులన్నియు
నశించి బలము పట్టినకొలందిని ఆయన శరీరసౌష్ఠవము పూర్తి
గాఁ జొచ్చెను. కాని తేజము వృద్ధి యైనకొలందిని రాజు
యొక్క హృదయమునం దతినీచభావములు పుట్టుటవలన తల్ల
డిల్లుచు, సన్న్యాసిని జూచి యిట్లనియెను. "భవదాజ్ఞాను
సారముగ నాకులరసమును పానముచేయుటవలనఁ గోల్పో
యినశక్తిని తిరిగి సంపాదించుకొనఁగలిగితిని. కాని నాచిత్తము
నీచభావములతో నిండియుండుటవలన నస్థిరుఁడ నై పాప
పంకమునందుఁ దగుల్కొనుచున్నాను. నాకంటె నాలుగు
రెట్లధికముగ నాకులరసమును పానముచేసియుఁ గూడ తా
మెట్లు బ్రహ్మచర్యమును కాపాడుకొనఁ గలుగుచున్నారో
వినఁగోరుచున్నాను." అనియడుగ, "రాజా, నీప్రశ్నకు పిమ్మట
సదుత్తరం బిత్తును. కాని నీవు రాఁబోవు ముప్పదవదినమున
మరణించెదవు. కనుక నొకటిరెండుదినము లీరసమును నాలు
రెట్లు త్రాగవలయును" అని సన్న్యాసి ప్రత్యుత్తరము
చెప్పెను. సన్న్యాసి చెప్పినవిధముగా రెండుదినము లాకుల
రసమును త్రాగెను గాని, మృత్యుచింతవలన రాజుహృదయ
మునందు దుర్భావములకు స్థానమే లేకుండెను. మూఁడు
నాల్గుదినములు గడచినపిమ్మట రాజును జూచి సన్న్యాసి
"రాజా పాపేచ్ఛ మిమ్మెట్టుల బాధించుచున్నది" అని
ప్రశ్నింపఁగా "నాహృదయమునందు మృత్యుచింత ప్రవేశించి

నప్పటినుండియు దుశ్చింతయే కనఁబడుట లేదు." అని రాజు బదులుచెప్పెను. "మృత్యుచింతవలన నాలుగుదినములలోనే నీమనస్సునం దుండుదుశ్చింతలు దూర మైనవి. కావున నీ వెప్పుడును మృత్యువును గూర్చి చింతించుచుండినయెడల దుశ్చింతలు నీకడఁ జేరఁ జాలవు. నే నెప్పుడును మృత్యువును సమ్ముఖమందే చూచు చుందును. అందువలన నాహృదయమునందు పాపప్రవృత్తికి స్థానమే లేదు." అని సన్న్యాసి పలికెను. పాపనాశనమునకు మరణచింత మహౌషధము. కావున మృత్యునామమును విన్నంతనే పాపములు పలాయన మగును.

(౫) మహాపురుషులజీవనచరిత్రములను చదువుచు, వినుచుండవలయును. మఱియును పాపదూరు లగుటకు వారవలంబించినమార్గముల నవలంబించి సన్మార్గప్రవర్తకులతోడ సహవాసము చేయుచుండవలయును. పవిత్ర మగు జీవనము గలవారిసహవాస మేవిధముగఁ గలిగినను గూడ మన హృదయములయందు మహత్తైన తేజము ప్రజ్వలించును. "సైతాన్, నాయొద్దనుండి దూరముగఁ బొమ్ము" అని క్రిస్తు నుడివినవాక్యములను చదువువాఁడు తానుగూడ సైతానుని తఱుమఁగల ననితలంచునుగదా? మారునితోడ యుద్ధమునకుఁ గడంగి నప్పటి శాక్యసింహునియొక్క దుర్దమనీయ తేజోవికాసమును, అప్రతిహతశక్తిచలనమును, సింహగర్జనతుల్య

మగుహుంకారధ్వనిని దలఁచుకొన్నవారి హృదయమునం దద్భుత మగుశక్తి సంచరింప కుండునా? యోగభ్రష్టునిఁగ నొనర్పవలయు నని తలంచి సమీపమునకు వచ్చినకామమును జూచి ధర్మవీరుఁడగుశాక్యసింహుఁడు మేఘగంభీరస్వరమున ని ట్లనియెను.

"మేరుపర్వతము స్థానభ్రష్టత్వము నొందినను సమస్త జగత్తు శూన్యమైనను, సూర్యచంద్రనక్షత్రములు ముక్కలు ముక్కలై భూమిమీఁదఁ బడినను, ఈవిశ్వమండలి సమస్త జీవులు నేకాకారమును దాల్చినను, సముద్రము శుష్కించి ననుగూడ న న్నీవృక్షమూలమునుండి అణుమాత్రమైనను గదలింపఁ జాలవు." (లలితవిస్తరము) మారుఁడు ఒఱఁదీసిన కత్తిని ధరించి దుర్బలులమగు మనల నాక్రమించువిధమున నే శాక్యసింహుని నాక్రమించుట కుంకింపఁగా నాయన దిక్కులు కంపించునటుల మారునిఁ జూచి యి ట్లనియెను.

"ఈమూఁడువేల భూఖండములు గూడ మారునిప్రభుత్వమునకు లోఁబడి నప్పటికిని మారుఁడు ఖడ్గప్రకాండమును చే ధరించి వచ్చి భయంకరయుద్ధ మొనర్చిననుగూడ నే ధరియించి యున్న దృఢ మైన కవచమును పగులఁ గొట్టఁ జాల కుండుటయే గాక కించిన్మాత్ర మైనను నన్ను కదలింపఁ జాలఁడు." శాక్యసింహునివలన నిశ్చయముగా మారుఁడు పరాభవింపఁబడెను. (లలితవిస్తరము.)

మన మెల్లరమును మారుని దాసానుదాసుల మై యున్నాము. కావున నీవిధ మగుట తేజఃపుంజములతోఁ బ్రకాశించుచున్న మహాపురుషుల జీవనచరిత్రములను మాటిమాటికి పఠించుచు, బ్రహ్మచర్యవ్రత మవలంబించి తమయొక్క మహాశక్తిని జూపించినవారియొక్క పాదధూళిని శిరస్సునందుఁ జల్లుకొనుచుండినయెడల మనమును బలవంతులము కాఁగలము. మఱియును మనలఁ జుట్టుకొని యుండినపాపపు గొలుసులను అనాయాసముగఁ ద్రుంచివేయఁ గలము. సన్మార్గప్రవర్తకు లగుధార్మికస్నేహితులతోడ సహవాస మొనర్చుచు, సదా వారితోడ ధర్మాలోచనను సల్పుచు, వారి విషయములనుగూర్చి చింతించుచుండుటవలన పాపము మనల నంటకుండును. బాల్యమునుండియు ధార్మికు లగు తలిదండ్రులచేత సన్మార్గమునందు నడిపింపఁబడినవారలు సౌభాగ్యవంతులు. ఇట్టి సౌభాగ్యమునుండి వంచింపఁబడి ధార్మికస్నేహితుల సహవాసము చేయుచున్నవార లట్టివారి సహవాసమువలన తమకుఁగలిగినమహోపకారములను బేర్కొనఁ గలరు. ధార్మికస్నేహితుఁ డని చెప్పినప్పుడు కేవలము తన శాఖకుఁ జెందినవాఁడే ధార్మికస్నేహితుఁ డని తలంపఁ జనదు. కావున వేర్వేఱు ధర్మసాంప్రదాయికులతోఁ గూడ నకృత్రిమస్నేహము గలిగియుండవలయును. పవిత్రభావమున ప్రేమించుట కలవడినవాఁడు పాపమార్గమున నిర్గమిం

పఁ జాలఁడు. అనేకు లీవాక్యముయొక్క సత్యతను గ్రహిం
చియే యుందు రనుకొనుచున్నాను. పాపము చేయుటకుఁ
బ్రయత్నించునప్పుడు వాని ప్రాణమిత్రుఁడు ఎదు రైన
యెడల వాఁ డాపాపమును చేయఁజాలఁడు ఎవని నైనను
ధర్మభావమున తనప్రాణ సమముగ ప్రేమించుట కలవడిన
దినమునుండియు, నా స్నేహితుని సహవాసమువలన వాని
యొక్క పాపాసక్తి క్రమక్రమముగఁ దగ్గిపోవు ననుట
నిశ్చయము. దీనికి మూఁడుకారణములు గలవు.

(క) తగుచరిత్ర లేనివానితోఁ బ్రాణస్నేహము కుదురదు.
తగుచరిత్ర గలవానితో స్నేహము కుదురుటకు శ్రద్ధ యుండ
వలయును. పాపరహితుఁడును, పవిత్రుఁడును, మృదువునుగ
చరిత్రుఁడు నగు వానియందే మనకు శ్రద్ధ జనించును. శ్రద్ధ
జనించినయెడల అతని ననుకరింపవలయు ననుకోరిక మనసుఁ
గలుగును. ఇందువలన పవిత్రతయు, పుణ్యము, దినదినము
వృద్ధి యగుచుండును. మఱియును, స్నేహితుని గుణములు
మధురముగఁ దోఁచినకొలఁదిని, నిజదోషములయం దసహ్యము
జనించుచుండును. అందువలన నిజదుర్గుణములను పరిత్యజించి
స్నేహితునిగుణములను సంపాదింపవలయు నని ప్రయత్నిం
తుము.

(ఖ) ధార్మిక స్నేహితులయందు సర్వదా సన్మార్గ చర్చ
జరుగుచుండును. కాని దుర్మార్గపుఁజర్చలు జరుగుచుండవు.

సర్వదా సదాలోచన మిక్కిలి యుపకారి యని యెల్లరకుఁ దెలిసినవిషయమే గదా!

(౮) పరస్పరము మంచివిషయములను గూర్చి చింతించు చుండుటవలనను, సద్భావములందు ప్రీతి జనించుటవలనను, హృదయమునందు బలము సంచరించును. అందువలన నా ప్రాణమిత్రుఁడు హేయముగఁ జూచువానిని నే నేవిధముగఁ జేయుదు ననియును, అట్లొనర్చినయెడల వాఁడు నన్ను ప్రేమించునా యనియును విచారణము ప్రారంభ మగును. ఇదియునుగాక కొంచెమైనను దాఁపక హృదయమును విప్పి నిజదోషములను స్నేహితులకు చెప్పినకొలందిని ఆపాపముల నశింపఁజేసికొనుటకు వారిసహానుభూతియు, సాహాయ్యమును గలుగును. ఇందుల కుపమానముగ నొక సామాన్య ఘటనను జూపుచున్నాను.

ఒకానొక బాలుఁడు తన పదునాలుగవ సంవత్సరముననే తలిదండ్రులను విడిచి యింకొక స్థలమునందు నివసించు చుం డెను. దాదాపుగ నీబాలుఁడు నివసించు గృహములోని వా రెల్లరును ఇంద్రియ లోలురును త్రాగుఁబోతులు నై యుండిరి. ఇందు కొందఱ అప్పుడప్పు డీబాలునిసమ్ముఖమందే త్రాగు చుండెడివారు. ఆగృహస్వామి తనగృహమునకు వేశ్యను రప్పించుకొనుటకు వెలువ కుండెను. ఇందులో కొందఱొకనాఁ డీబాలునిసమ్ముఖమందు సురాపానమును

చేయుచు, సురయొక్క మహిమను వర్ణించుచు, ఈతనిని త్రాగవలయు నని బలవంత పెట్టుచు ప్రోత్సాహపఱుప సాగిరి. ఇందువలన కొంతవడికి బాలునికి సురాపానేచ్ఛ జనించి సురాపాత్రను దీసికొనుటకు చేయి చాపఁ బోవు సమయమునందు, విదేశమునందు నివసించుచున్న ప్రాణ మిత్రునిరూపము బాలునిహృదయమునకుఁ బొడకట్టెను. ఆస్నేహితునిమీఁద నితనికి మిక్కిలి యనురాగము గలదు. అనేకపర్యాయములు వీరిరువురును గలసి సురాపానము వలనఁ గలుగు నష్టములనుగూర్చి విచారించుచుండెడివారు. అందువలన నీబాలుఁడు మనమునం దీవిధముగఁ దలపోయ సాగెను. "నే నెట్టికార్యమును చేయఁబోవుచున్నాను? నేఁడు నేను సురాపానమును జేసి యావిషయమును స్నేహి తునియొద్ద దాఁచుదునా? దాఁచినయెడల నావంటి విశ్వాసఘాతకుఁడు మఱియొక్కఁ డుండఁడు గదా! స్నేహితునియొద్ద నేవిషయమునుగూడ దాఁచుట న్యాయ్యము గాదు. కావున సురాపానమును చేసినవిషయమును స్నేహి తునియొద్ద నేవిధముగ దాఁచుదును? దాఁపనియెడల వాఁడు నన్ను ప్రేమించునా? అతనితోఁ గలసి యున్నియీ దినములు సురాపానమువలనఁ గలుగుచెడుగులను గూర్చి చర్చించి యుంటిని. అందువలన నాతఁడు నన్నెప్పుడును ప్రేమింపఁడు గదా? కావున నే నిప్పుడు సురాపానమును

జేయుదునా? లేక, ప్రాణమిత్రుని ప్రేమను గాపాడుకొందునా?" అని యీవిధముగ నాలోచించుచుండుటవలన బాలకునిహృదయము తల్లడిల్ల సాగెను. సురయొక్క మోహ మొకదిక్కునను, రెండవదిక్కున పవిత్రప్రేమయు నాకర్షించుచుండెను. స్వల్పకాల మీరెంటికిని హృదయరంగమునందు సంగ్రామము జరిగినపిమ్మట ప్రేమయే జయించెను. ఇదే విధముగ పవిత్రమతులగు స్నేహితులయొక్క సహవాసము వలన మహోపకారమును బొందినవారిని వేలకొలందిఁ జేర్కొనవచ్చును. కావున ధార్మిక స్నేహితులు మనకు ముఖ్యాదరణీయులు. వారు మనపాపదమనమునకు విశేష సహకారులు.

(౬) భగవత్స్వరూపమును చింతించుచు, భగవానునిఁ బ్రార్థింపవలయును. దినమున కొకమారైనను భగవానుని సాన్నిధ్యమును జేరి మనవిశేషపాపములను జేర్కొనుచు వానిని దూరము చేయవలయు నని ప్రార్థించుచు ఈశ్వరుని యొక్క పాపదమనస్వరూపమును చింతించుచుండినయెడల ఆయనకృపవలనను, నిజాంతర్దృష్టిబలముచేతను క్రమముగ నాపాపములు నశించును. ఈయుపాయ మతిమధురము, అత్యుపకారి. కాఁబట్టి ఒక్కొక్కపాపమును విశేషభావమునఁ జేర్కొని యది నాశన మగుటకు భగవానునిఁ బ్రార్థించుచుండుము. మొత్తముమీఁద పాపనివృత్తికొఱకుఁ

ప్రార్థించు ప్రార్థన యంతగా నుపకారి కాజాలదు. "నేను పిశాచమును. పైశాచికప్రవృత్తి నన్ను సర్వనాశన మొనర్చుచున్నది. ఆదినమున నేనెట్లు ప్రవర్తించితిని? నేనెట్టి కుచింతలోఁ గూరుకొని యున్నాను. ఓనిష్కళంక దేవా! నన్ను పవిత్రునిఁగఁ జేయుము." "నేను క్రూరుఁడను. క్రోధము నాజీవనమును వికృతముగ నొనర్చుచున్నది! మంచి కార్యములవిషయమై నే నెట్టియనుభావములను వెల్లడించి యున్నాను? ఓశాంతిస్వరూపా! నాక్రోధమును నాశము చేయుము." ఈవిధముగ నొక్కొక్క పాపమును పేర్కొని దానినుండి విముక్తి నొందుటకు భగవానుని ప్రార్థించుచుండవలయును. మఱియును, ఈపాపములకు వ్యతిరేకమైన భగవత్స్వరూపమును చింతించుచుండినయెడల పాపనివృత్తి యగును. ఈవిషయమును గూర్చి యనేకులు తమజీవితముల నుండి సాక్ష్య మీయఁగలరు. భగవత్స్వరూప చింతనము వలనను ఆయనను ప్రార్థించుటవలనను వేలకొలఁది పాపులు రక్షణను బొందియున్నారు.

(౭) భగవానుని సర్వవ్యాపకత్వమును సంపూర్ణముగఁ దెలిసికొనవలయును. ఆయన "విశ్వతఃచక్షుః" విశ్వమంతయు భగవానుని దృష్టియందే యున్నది. ఆయన దృష్టి యందనిస్థానము లేదు. ఆయన లేనట్టి బాహ్యజగత్తు గాని అంతర్జగత్తు గాని లేదు. మనుష్యులదృష్టినుండి మనము తప్పిం

మన్యతే పాపక న్కృత్వా నకశ్చి ద్వేత్తిమా మితి
విద న్తి చైనం దేవాశ్చ యశ్చై వా న్తరపూరుషః॥
మహాభారతము. ఆదిపర్వము.

"నీవు నీవొక్కఁడవే యున్నా వనుకొనుచున్నావు. కాని నీ హృదయాభ్యంతరస్థితుఁడై పుణ్యపాపదర్శియగుపురాణ పూరుషుని నీవు చూచుట లేదు. ఆయన నీవు చేయుసమస్త పాపకార్యములను చూచుచున్నాఁడు, గ్రహించుచున్నాఁడు. ఆయనసమ్ముఖమునందే నీవు పాపము లొనర్చుచున్నావు. పాపి పాపముల నాచరించి తనపాపము నెవరు నెఱుంగరని తలంచుచుండును. కాని నీవు చేయుపాపకార్యములను దేవతలును ఆ న్తరపూరుషుఁ డగుయమధర్మరాజును తెలిసి కొనుచున్నారు." ఈవిధముగ నాలోచించుచు భగవానుని యంతర్దర్శిత్వమును సర్వవ్యాపకత్వమును దెలిసికొని సర్వదా జాగరూకు లై యుండువా రెప్పుడును పాపకార్యములను జేయుటకు సాహసింపరు.

(౮) నిజశక్తిసామర్థ్యములను చింతించుచు, ఆంతరంగిక బ్రహ్మశక్తినలనఁ గలుగు తేజముతోఁ గూడుకొని పాపవినాశమున కగ్రేసరులము కావలయును. మన మందఱమును సర్వశక్తిమంతుఁడగుభగవానునిసంతతి యనియు ఆయన మనకు పరమసహాయుఁ డనియును, చింతించు చుండినయెడల జీవచ్ఛవమైపడియున్నవానిహృదయమందుఁగూడ బ్రహ్మతేజము

న్నానో ఆదేవిధమున వల్కలములను ధరించుటవలనఁగూడ సంతుష్టిని పొందుచున్నాను. నీకు భోగాభిలాష మిక్కుటముగ నున్నందువలన వల్కలములను ధరించుటకు మిక్కిలి కష్టమును బొందుదువు. దరిద్రునియాశకు మేర యుండదు. మనస్సంతుష్టియే ఉన్నయెడల దరిద్రుఁడు ధనికుఁడను భేదమే లేదుగదా? కావున మనస్సంతుష్టి గలవారెల్లరును ధనికులు. పుణ్యాత్మునిహృదయ మెప్పుడును సంతోషభరితమై యుండుటవలన ఆతఁడు మహాధనికుఁడు. పాపాత్ముఁడాశచే పీడింపఁబడుచుండుటవలన సామ్రాజ్యాధిపతి యైనను గూడ ఘోరదరిద్రుఁ డగును. అనఁగా ప్రతివిషయమందును లేమి గలిగి యుండువాఁడు దరిద్రుఁడు. ఏవిషయమునందును లేమిని ఎఱుంగనివాఁడు ధనికుఁడు ఎవరి కంతయాశ యుండునో వారి కంతయభావజ్ఞాన ముండును. ఆ భావజ్ఞానము లేనియెడల ఆశ యుండదు. ఎవరి కేవిషయమునం దభావజ్ఞాన ముండదో వారి కావిషయమునం దాశ యుండదు. భోగముల ననుభవించుటవలన,ఆశానివృత్తి యగునని తలంపవచ్చును. కాని,

“శ్లో॥ న జాతు కామః కామానా ముపభోగేన శామ్యతి।
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే॥”

మనుసంహిత.

"విషయముల ననుభవించుటవలన కామనివృత్తి కానేరదు. ఆజ్యము పోసిన అగ్నివలెనే విషయభోగముల ననుభవించుటవలన కామము వృద్ధి యగును."

(౪) మృత్యువును గుఱించి చింతించుచుండుటవలన మిక్కిలి మేలు కలుగును. మృత్యుచింతే పాపనాశనమునకు మంచిసాధనము. నీగౌరవమునకు పాత్రుఁ డగువాఁ డెవ్వఁడైనను వచ్చి కొన్నిగంటలలో నీవు చనిపోదు వని చెప్పినయెడల నీవు చేయఁదలఁచినపాపకార్యమైనను చేయఁ జాలవు. కావున నీనిముసముననో మఱునిముసముననో మృత్యువునాతఁ బడినఁ బడవచ్చునని తలంచుచుండువానిహృదయమునందు పాపేచ్ఛకు స్థాన ముండదు. కామము మొదలుగాఁగల శత్రువర్గము మృత్యునామమును విన్నంతమాత్రముననే తల్లడిల్లుచున్నది. ఇందులకు తార్కాణముగ నొకకథను చెప్పుచున్నాను. ౧.కానొకరాజు నానావిధము లగుసాంక్రామికరోగములచేతి పీడింపఁబడుచు జీవచ్ఛవమై యుండెను. ఈయనయొద్ద కొకానొకసన్న్యాసి వచ్చి ౧.కియాకు రసమును ద్రాగినయెడల రోగములు పోవు నని చెప్పెను. సన్న్యాసి నుడివిన నియమపద్ధతిని రాజు ప్రతిదినమును ఆ యాకులరసమును ద్రాగు చుండెను. సన్న్యాసియు, రాజు సమ్ముఖమందే ఆయాకులరసమును ద్రాగు చుండెను. రాజుకంటె నాల్గురెట్లు మిక్కుటముగఁ ద్రాగుచుండెను. ఇంచు

పరిపూర్ణముగఁ బ్రకాశించుచుండును. "మర్భేద్య మగుభగవత్కవచమును, ధరించిన నన్ను కామక్రోధములు పరాభవింపఁ గలవా? భగవత్కవచమును భేదించుటకు పాపములకు సాధ్య మగునా? నేను మృతుఁడను గాను. మహాశక్తి సంపన్నుఁడను. కావున నే నేల ఈనీచపాపములకు భయపడవలయును. వాయువేగమునకు తృణము లెగిరిపోవునటుల నే నాహంకారధ్వనివలన పాపములు పటాపంచలై పాటిపోవును. నేను సింహకిశోరమనై నక్కలను భయపెట్టుదును." మనస్సునం దీవిధముగ మాటిమాటికిఁ దలఁచుచుండినయెడల పాపజయ మనాయాస మగును. "తల్లిపోయినపిల్లవానివలె నీ వేల విచారపడుచున్నావు? కప్పను జూచి పాము భయపడుట ఆశ్చర్యముగదా? మహాశక్తిశాలినియొక్క కొమరుఁడ వగునీవు మరణబాధలను జూచి వెఱచుచున్నావా?" (బ౧ కీ౧) మహాత్ముఁడగు, "కార్లైల్" ఈభావమున నుజ్జీవితుఁడై సాంసారికకష్టములను తృణప్రాయముగ నైనను పరిగణింపఁ డయ్యె. ఈతనిని ఏవిధమగు ప్రలోభనములును కదలింపఁజాలవయ్యెను. సాంసారిక ఘోరవిపత్తునందుఁ బడి యున్న యీయనయొద్ద నున్న ధనమంతయు వ్యయ మయ్యెను. కాని రేపటిగతి యేమను నాలోచనయే. యీయనమనమునందు లేకుండెను. అణుమా

త్రము సత్యము దప్పిననుగూడ, మిక్కిలిధనము చేకూఱుటకు మార్గము కనఁబడుచుండిననుగూడ, ఆంతరంగికభగవచ్ఛక్తిపై నాధారపడి చలింపనివాఁడయ్యె. అంతరంగమందు ప్రజ్వలించుచున్న బ్రహ్మతేజమును సర్వదా చూచుచుండువారల నేపాపములును ముట్టఁజాలవు.

అన్నివిధములైనపాపములను నశింపఁజేయుటకు సాధారణోపాయములను జేర్కొనియున్నాను. ఇప్పుడు ప్రధానకంటకములలో నొక్కొక్కదానిని దొలఁగించుటకు విశేషోపాయములను జెప్పుచున్నాను.

# కామము.



(౧) కామమువలనఁ గలుగునష్టములను| మాటిమాటికిఁ దలం
చుకొనుచుండవలయును. రక్తముయొక్క ముఖ్యసారమే శుక్ల
రూపముగ పరిణమించునని శారీరకతత్త్వవేత్త లేకగ్రీవముగ
నుడివియున్నారు. చికిత్సాశాస్త్ర నిపుణుఁడగు డాక్టరు
"లూయీ" ఈవిధముగ నుడివియున్నాఁడు. "దుర్మార్గ
చింత గలిగి దుష్ప్రవర్తనతోడ కామసేవ నొనర్చువాని
శుక్లము నష్టమగును. రక్తముయొక్క పరమోత్కృష్టసార
మగుశుక్లము చెడి వ్యయ మగుటకంటె మనుష్యున కనిష్ట
దాయక మగునది మఱియొకటి లేదు. బ్రహ్మచర్యము నవలం
బించి యీతేజమును రక్షించుకొను వారలశరీరమనోబలములు
పూర్ణముగ వృద్ధి నొందును." డాక్టర్ నికల్సన్ ఈవిధముగ
వ్రాయుచున్నాఁడు.—"చికిత్సాశాస్త్రములును శరీరవిజ్ఞాన
శాస్త్రములును శరీరమునందలి రక్తముయొక్క ముఖ్యసారమే
స్త్రీపురుషుల జననశక్తికి మూలోత్పాదనకారణమని సిద్ధాం
తీకరించుచున్నవి. నియమబద్ధముగను, పవిత్రముగను,
జీవనమును గడపువారల శరీరమందీపదార్థము కలసి తిరిగి
రక్తమునందు సంచరించుచు అత్యుత్కృష్టములగుమస్తిష్క-

స్నాయువులను మాంసపేశికలను నిర్మించును. పిమ్మట ఈ మానవజీవనశక్తి తిరిగి రక్తమునందు ప్రవేశించి శరీరమంతటను వ్యాపించి సమధిక మనుష్యత్వసంపన్నునిగను, దృఢకాయునిగను, సాహసికునిగను, ఉద్యమశీలునిగను వీర్యశాలిగను నొనర్చును. ఈపదార్థము వ్యయమైనమనుజుఁడు హీనవీర్యుఁడును, దుర్బలుఁడును, చంచలస్వభావుఁడు నగుటయే గాక యతని శారీరక మానసికశక్తులు హ్రాస్వము లగును. మానసిక శత్రువులయొక్క యుత్తేజనము మిక్కుటము మగుటవలన శారీరకయంత్రక్రియలు వైపరీత్యమును జెంది యింద్రియవృత్తులు వికృతము లగును. మాంసపేశికలక్రియలు వ్యత్యస్తము లగును. హృదయయంత్రము మిక్కిలి శక్తిహీన మగును. అందువలన మూర్ఛ, ఉన్మాదము, మృత్యువు దీని ననుసరించియే యుండును.'' ఇంద్రియలోలత్వమువలన మృత్యువు గలుగును. బ్రహ్మచర్యమువలన జీవితము వృద్ధిఁ జెందును.

''శ్లో॥ మరణ బ్బిన్దుపాతేన, జీవన బ్బిన్దుధారణాత్ ॥''

శివసంహిత.

'శుక్లపాతమువలన మరణమును, శుక్లధారణమువలన నాయుర్వృద్ధియుఁ గలుగును.'

''బ్రహ్మచర్యప్రతిష్ఠాయాం వీర్యలాభః.''

యోగసూత్రము.

"విచలితముగాని బ్రహ్మచర్యము నవలంబించినవారల శారీరకమానసికవీర్యములువృద్ధియగును." డాక్టరు 'నికల్సు' ఇంకొక స్థలమున నీవిధముగ వ్రాయుచున్నాఁడు.—"జననేంద్రియ వ్యవహారములు కట్టువడినయెడల శారీరకమానసిక తేజములు వృద్ధి యగును. అందువలన నాధ్యాత్మిక జీవన మున్నతి నొందును." నిత్యబ్రహ్మచర్యము నవలంబించిన సెంటుపాలు సర్ అయిజక్ న్యూటనులయొక్క దృష్టాంతమును జూపుచు డాక్టరులూయీ యిట్లు చెప్పియున్నాఁడు. "వారి శరీరమునందు పవిత్రములగు రక్తబిందువులు తేజస్స్వరూపమున పరిణమించును. అందువలన వారి స్వభావము సన్మార్గమునందు ప్రవర్తించుచుండును." "ప్రకృతిదేవి యారక్తమార్గమున మస్తిష్కశక్తిని సుతీక్ష్ణముగను, స్నాయువులు మాంసపేశికలను దృఢతరముగను, జీవనశక్తిని పరిపూర్ణముగను చేయును." జ్ఞానసంకలన తంత్రమునందు సదాశివుఁడీవిధముగ నుడివియున్నాఁడు.

"శ్లో॥ నతప స్తప ఇత్యాహు ర్బ్రహ్మచర్య న్తపోత్తమమ్ ।
ఊర్ధ్వరేతా భవే ద్యస్తు స దేవో న తు మానుషః॥"

"విద్వాంసులు తపస్సును తప స్సనరు. బ్రహ్మచర్యమునే సర్వోత్కృష్ట మగు తప స్సందురు ఊర్ధ్వరేతస్సు గలవాఁడు దేవత గాని మనుజుఁడు గాఁడు." బ్రహ్మచర్యము నాచరించుకొనుదిని హృదయము ప్రఫుల్ల మగును.

మస్తిష్కమునకు బలము వచ్చును. శరీరము శక్తిమంత మగును. చిత్తము సుస్నిగ్ధముగను, ముఖశ్రీ సుందరముగను నగును. బ్రహ్మచర్యము లేకుండుటవలన చిత్తము విషణ్ణ మగును. మస్తిష్కము దుర్బల మగును. శరీరము నిస్తేజ మగును. ముఖము లావణ్య విహీనముగను, హేయముగను నగును. కొంతమంది దుర్మార్గప్రవర్తకులు బలమైనయాహార మును భుజించి శరీరమును తేజస్వంతముగ నొనర్చుకొన వలయునని ప్రయత్నింతురు. కాని యట్టివారు సహస్రప్రయ త్నములు చేసిననుగూడ తమశరీరమును తేజస్వంతముగఁ జేసి కొనఁజాలరు. మఱియును, అంతస్సారవిహీనులై యుందురు. మానసికదుర్బలత్వమునుగూర్చి ష్యాలరేష్ ఈవిధముగ వ్రా యుచున్నాఁడు.'ఇంద్రియపరాయణులమానసికవికారమును, బుద్ధిప్రవృత్తివలనను, ముఖ్యముగ జ్ఞాపకశక్తియొక్క దుర్బ లత్వమువలనను దెలిసికొనవచ్చును. ఇంద్రియసంయమము లేనందువలన ననేకయావనులు మస్తిష్కముయొక్కదుర్బల త్వముచేతను, ధారణాశక్తియొక్క అభావమువలనను, జ్ఞాప కశక్తియొక్క హీనతచేతను, మనస్సుయొక్క యాదాసీన్య మువలనను, చిత్తచాంచల్యము, స్నాయు దౌర్బల్యము, హృత్కంపము, అరుచి, శిరోవేదన మొదలగు నానావిధ రోగములవలనను బాధపడుచుండుటను గాంచుచున్నాము.'

కావున సర్వదా స్త్రీలు మొదలుగాఁ గలలోభజనకము

లగువానికి దూరమం దుండవలయును. కామమును నశింపఁ జేసికొనఁదలంచువాఁ డెప్పుడును దుశ్చింతలవిషయమునందు ఖడ్గహస్తుఁడై యుండవలయును. దుశ్చింతకు స్థాన మొసంగిన యెడల పాపములు నశింపవు. దుశ్చింతయే పాపములకుఁ బునాది. కావున దుశ్చింతలను దూరము చేసికొనినయెడల హృదయము నిర్మల మగును. ఏవిధ మగు దుష్కార్యము లొనర్పకున్నను, కొంతమంది సర్వదా దుశ్చింతలయందు మునిఁగి యుందురు. వారు తమహృదయములనుండి దుశ్చింతను దూరము చేసికొనవలయు నను కోరిక గలిగి యుండియుఁ గూడ వానినిదూరముచేసికొనఁజాలకున్నారు. ఒకానొకఁడు దుశ్చింతలచేత పీడింపఁబడుచు డాక్టర్ లూయీ యొద్దకు చికిత్సార్థము వచ్చెను. వానికి డాక్టరు క్రిందివిధముగ బోధించెను. "స్థిరచిత్తము గలిగి యుండుము. దుశ్చింతలు మిక్కిలి భయానకములును, అనిష్టదాయకములునైయున్నవి. కావున నే దుశ్చింత యుదయించి నంతట విచలితుఁడ వగుదువు. అట్టి సమయమునందు వెంటనే మనమును నేఁటివిషయములవైపునకుఁ ద్రిప్పుకొనుము. దుశ్చింతలను దూరము చేసికొనవలయు నను కోరిక పుట్టినయెడల మనోవ్యాకులత గలుగును. అందువలన నిద్రావస్థయందు దుశ్చింత యుదయించినను గూడ వెంటనే మేల్కొను నంతటి భయము నీహృదయమునం దుదయించును. జాగ్రదవస్థయం దీశత్రువు

ప్రవేశించినయెడల వెంటనే జాగరూకుఁడ వైనయెడల శ్రమ లేకయే శత్రువును దూరముచేయుశక్తి గలవాఁడ వగుదువు. కాని యొకముహూర్తములో దుశ్చింతను దూరముచేయఁ గలనా యనుసందియముపొడమినప్పుడు వెంటనే లేచి విశేషముగ శరీర పరిశ్రమమును జేయుము. ఈవిధముగఁ జేయుటకుఁ బ్రారంభించినయెడల పదునైదు దినములలో దుశ్చింతలు నీవశ మగును.

మఱియును, ఆరోగ్యవిషయమును బాగుగ గమనింపవలయును. మందస్వభావులు, మిక్కుటముగ భుజించువారలు, ఇంద్రియవాంఛలవలన పలుకష్టములనొందుచుందురు. కావున దినమున కొకటిరెండుమారులు మిక్కుటముగ చెమట బయటకు వచ్చునట్లు పరిశ్రమ చేయుచుండవలయును. ఉద్రేకజనకములు గానట్టియు, పుష్టికరములును, సులభముగ జీర్ణించునట్టివియు నగు పదార్థములను మాత్రమే భుజింపవలయును. చాలప్రొద్దుపోవువఱకు, రాత్రులయందు మేల్కొనఁజనదు. ఉషఃకాలముననే నిద్రనుండిలేవవలయును. నిద్రకుపూర్వము మందుమశీతలోదకమును ద్రాగవలయును. నిర్మలవాయువు వీఁచు స్థలమందుఁబరుండవలయును.'' ఏతదుపదేశానుసారముగ ప్రవర్తించుటవలన నీతఁడును ఇంక ననేకులును ఈపాపమునుండి విముక్తులై యున్నారు.

(౨) కామముయొక్క బాధనుండి తప్పించుకొనఁదలఁచినవా రేవిధమగు శారీరనియమములఁ బాటించుట కర్తవ్యమో

వానిని సంక్షేపముగఁ జేర్కొనియున్నాను. ఆహారసంబంధమున దీక్రిందినియమములను బాటింపవలయును.

"శ్లో॥ కామఏష క్రోధఏష రజోగుణసముద్భవః॥"

కర్మయోగము 32 భగవద్గీత.

రజోగుణమువలన కామము పుట్టును. రాజసభోజనమును పరిత్యజింపవలయును.

శ్లో॥ కట్వామ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహినః।
ఆహారా రాజస స్యేష్టా దుఃఖశోకామయప్రదాః॥

౯. ౧౭ వ అధ్యాయము, భగవద్గీత.

"దుఃఖమును శోకమునురోగమును గలుగఁజేయునట్టియు, మిక్కిలి చేఁదు, ఉప్పు, పులుసు, గలిసి కారమైనవేఁడిపదార్థములను రజోగుణప్రధాను లిష్టముతో నంగీకరింతురు." ఈవిధమగు పదార్థములను భుజింపవలదు. చేఁపలు, మాంసము, గ్రుడ్లులు, ఎండ్రకాయలు, ఉల్లిపాయలు, ఆవాలు, ఉప్పు, కారము, అతిమధురపదార్థములు, గురుత్వము చేయుపదార్థములు, మిక్కుటముగ మసాలాచేత పక్వమైనపదార్థములు, జితేంద్రియసాధనకు ప్రతికూలమైనవని డాక్టరు "లూయీ" చెప్పియున్నాఁడు.

మనదేశమునందు వితంతువులు తినఁగూడదని నిషేధించిన పదార్థములు కామోద్రేకమును గలిగించునవి యై యున్నవి. కావున బ్రహ్మచారిణు లగువితంతువులకొఱకు ఋషులు నియ

మించినపద్ధతులు పవిత్రత కనుకూలము లైనవి. అందువలన వితంతువులు భుజింపఁ దగినపదార్థములను మాత్రమే భుజించుట కర్తవ్యము.

"శ్లో॥ సైంధవ కదళీ ధాత్రీ పనసామ్రహరీతకీ ।
గోక్షీర గోఘృత శ్చైవ ధాన్యముద్గతిలా యవాః॥"

లవణము, అరఁటి, పనస, ఉసిరిక, మామిడి, కరక్కాయ, ఆవుపాలు, ఆవునెయ్యి, ధాన్యములు, ధనియాలు, పెసలు, తిలలు, యవలు భుజించుటకు ప్రశస్తములైనవి. భోజనానంతరము ఉసిరికకాయలను దినుట మంచిది. తాంబూల ముద్రేకమును గలిగించును గనుక నిషిద్ధము. కఠినశయ్యయు, గట్టిదిండును ఉపయోగించుకొనుట మంచిది. దూదిపరుపులు శరీరారోగ్యమునకు హానికరములు. వేషభూషణముల సంబంధమునందును విలాసేచ్ఛను సంపూర్ణముగ విడువవలయును.

జాగరణము చేయవలదు. ఏ సద్గ్రంథమునందైనను కొంత భాగము చదివి, భగవంతునకు ఆత్మసమర్పణము చేసి పతి శయనింప వలయును. అప్పుడప్పుడు, ఉపవాసములు సేయుచుండవలయును. ఏకాదశ్యుపవాసమువలన శరీరముయొక్క రసవృద్ధి క్షీణించుటయేకాక, శరీరమునకును, మనస్సునకును, మిక్కిలిమేలు గలుగును. అమావాస్యా పూర్ణిమల రాత్రుల యందన్నమును దినకుండుట మంచిది. ప్రతిదినమును వ్యా

యామముమీఁదఁ బూర్ణముగ దృష్టి యుంచవలయును. బాగుగ గాలి వీచుప్రదేశములయందు వడిగాఁ దిరుగుటవలన కామము కొంతవఱకు తగ్గిపోవును. శరీరమునుండి చెమట బయటికి వచ్చునట్లు, దినమున కొకటి రెండుసార్లు పరిశ్రమను చేయుచుండుట యుత్తమము. యోగు లవలంబించునాసనములు, ముద్రలు, ప్రాణాయామము మొదలగునవి, కామదమనమునకు శ్రేష్ఠములగు సాధనములు. జితేంద్రియత్వము కొఱకేఁగాను ఋషులు ఆసనములు మొదలగువానిని ఏర్పఱచి యున్నారు. పద్మాసనసిద్ధాసనములం దుండి ప్రాణాయామ మొనర్చుచుండినయెడల దానివలనఁ గలుగులాభములను, కొన్ని దినములలోనే గ్రహింపనగును. ఈయాసనములింద్రియవికారములను నశింపఁజేయుటకు శ్రేష్ఠములగు సాధనములు. వీనియందు కూర్చుండుపద్ధతినిబట్టియే యింద్రియవికారము లడఁగును. ప్రాణాయామమువలన చిత్తము స్థూలమునుండి సూక్ష్మమున కేకాగ్ర మగును. మఱియును, ఇది ఉత్తేజనకారి యగు కామమునకు ఘోరశత్రువు. హృదయమునందు దుశ్చింత పుట్టినంతనే, సిద్ధాసనమునందుఁగాని పద్మాసనమునందుఁగాని, కూర్చుండి ప్రాణాయామ మొనర్చిన యెడల, ప్రత్యక్షఫలమును బడయవచ్చును. ఈయుపాయమసాధ్య మైన దనియును, అకర్తవ్య మనియును, దలంచువారు హృదయమునందు కుచింత ఉదయ మైనంతనే యేది

యో యొక శరీరపరిశ్రమకుఁ గడంగవలయును. ఇట్టిసమయ మునందు ఉచ్చైస్స్వరమున హరినామమును బాడుచుండిన యెడల మిక్కిలి ప్రయోజనకరము. ఇంద్రియజయమునకు కౌపీనధారణము మిక్కిలిసహకారి.

"అనాతురః స్వాని ఖాని న స్పృశే దనిమిత్తతః ।
రోమాణి చ రహస్యాని సర్వాణ్యేవ వివర్జయేత్ ॥"

మనువు.

"జబ్బు లేనప్పుడును, కారణము లేనుండఁగను, ఇంద్రియ ద్వారములను, వానియందుండురోమములను స్పృశింపఁజనదు. బాగుపడవలయు ననునిచ్ఛ లేనియెడల శరీరసంబంధమునందు చూపింపఁబడినయీనియమముల ప్రకారము వర్తించుటవలనఁ బ్రయోజనము లేదు. పవిత్రుఁడను గావలయు ననుతలంపు తోడ ఏతన్నియమానుసారముగఁ బ్రవర్తించువాఁడు ఫల మును బొందును.

(౩) సదా యేదో యొక కార్యమునందు మునిఁగి యుం డుట కామనివృత్తికి మంచియుపాయము. సర్వదా కార్య ములయందు మునిఁగియుండువానికి ఇంద్రియవికారము అత్య ల్పముగ నుండును. దయానందసరస్వతీస్వామిని ఒకానొ కఁడు, "స్వామీ! మీకెప్పుడును ఇంద్రియవికారములు గలుగలేదా?" అని యడిగెను. "నేనెప్పుడును కార్యముల యందు మునిఁగి యుండుదును. అందువలన నింద్రియవికారము

లు నన్ను సమీపింపఁ జాలవు.'' అని దయానందసరస్వతీ స్వామి చెప్పెను.

(౪) మనజీవితమునందు భగవానునిపైని గాఢమగు భక్తి యుదయించుచుండుటయు, భయమువలన పశ్చాత్తాపము సంభవించుచుండుటయు అప్పుడప్పుడు హృదయము ప్రేమతో నిండియుండుటయు, జీవిత మనిత్యమని రూఢిగఁ దోఁచుచుండుటయు, మొదలుగాఁగల యవస్థలను పుస్తకము నందు వ్రాసికొని యుంచుకొనవలయును. దుశ్చింత లుదయ మగునప్పు డీయవస్థలను దలంచుకొనినయెడల పాపములు పలాయన మగును. ఈయుపాయము మహోపకారి.

(౫) సర్వదా "పవిత్రత" యను నామమును స్మరించు చుండవలయును. ఈనామము స్మరించుచుండుటయే గాక సర్వదా మనమునం దుంచుకొని ప్రతి దినమును కాగితము మీఁద వ్రాయుచుండవలయును. ఆహారముఁ బుచ్చుకొను నప్పుడును, నడచునప్పుడును, కూర్చుండు నప్పుడును ఈ నామమును స్మరించుచు మనమునందుంచుకొని శరీరమునకును మనస్సునకును, పవిత్రతవలనఁ గలుగు లాభములను గూర్చి చింతించు చుండవలయును. యోగవాసిష్ఠరామాయణము నందు పవిత్రతకు ఈవిధ మగు దృష్టాంతము చూపఁబడి యున్నది. శిఖిధ్వజరాజుయొక్క భార్య "చూడాల" వృద్ధవయస్సునం దీవిధముగ నుండెను.

"శ్లో॥ స్వవివేకఘనాభ్యాసవశాద్ధాత్మోదయేన సా।
శుశుభే శోభనా పుష్పలతే వాభినవోద్గతా॥"

"పవిత్రతనుగుఱించి మాటిమాటికిఁజింతించువానిహృదయమందు తేజము పుట్టును. కావున వృద్ధవయసునందీమె నవముకుళితపుష్పభరితలతవలె సౌందర్యశోభాన్వితయై యున్నది." పవిత్రతవలన ముఖవికాస మెంత సుందరముగ నుండునో చూడదలఁచినవారు కాశీ హరిద్వారములలో నివసించువృద్ధసన్న్యాసులయొద్ద కేఁగినయెడల చూడవచ్చును. "పవిత్రత" అనుశబ్దమును జపించుచు చింతించుచుండిన యెడల అపవిత్రత పలాయన మగును.

(౬) "ఈశరీరము భగవానుని మందిరము" అని చింతించుచుండినయెడల మనశరీరమునందు కామము ప్రవేశింపఁజాలదు. మనగృహమును పరిశుభ్రముగ నుంచుకొను విధముననే ఈశరీరము భగవానునిమందిరము అను చింత గలిగి యుండినయెడల దీనిని పవిత్రముగ నుంచుకొనవలయుననుకోరిక తనంతటతాను గలుగును. శరీరమునందును, మనస్సునందును, అపవిత్రత ప్రవేశింపకుండుటకుఁగాను సర్వదా జాగరూకుఁడవై యుండుము. షట్చక్రము మొదలగునవి, శరీరమునందంతటను భగవానుఁడు విరాజమానుఁడై యున్నాఁడనువిషయమును దెలిపి జాగరూకతను గలిగించును. సెంటుపాలు పాపులను సంబోధించి యీవిధముగ నుడివి యున్నాఁడు. "మీశరీరములు భగవా

నుని మందిరములు. వానియం దాయనశక్తి విరాజిల్లుచున్న
దని మీ రెఱుంగరా? భగవానునిమందిరమును అపవిత్ర
ముగ నొనర్చువానిని ఆయన నాశనము చేయును. భగవా
నునిమందిరము పవిత్రమైనది. మీరే ఆయనమందిరములు.”
ఇట్టి వాక్యములను వినినపిమ్మట అపవిత్రతను జేరనిచ్చుట
కెవ్వఁడు సాహసించును? కావున ఈభావము హృదయము
నందు సర్వదా మెలంగుచుండినయెడల కామము మొదలగు
పిశాచములు సమీపింపఁజాలవు.

(౭) దుశ్చింతలచేత పీడింపఁబడువాఁ డెప్పుడును జన
సంఘమునందుఁ గలసియుండుట ఉత్తమము. నిర్జనప్రదేశముల
యందు నివసింపఁజనదు. భక్తి ప్రారంభమునందు భగవ
న్నామమును స్మరించుచు, నిర్జనస్థానములయందు నివసించుట
మంచిదే కాని ప్రథమావస్థయందే నిర్జనస్థానములయందు
నివసించుటకుఁ బ్రారంభించినయెడల దుశ్చింతలు పుట్టుటకు
వీలు గలదు.

(౮) దార్శనికుఁడైనను, వైజ్ఞానికుఁడైననుగూడ సర్వదా
యేదో యొకగంభీరాలోచనయందు నిమగ్నుఁడై యుండవల
యును. గంభీరవిషయమును చింతించుచుండుటవలన చిత్తము
ఉన్నతస్థానమున కేఁగుటకిచ్ఛగించును గాని, నిమ్నగామిని
యగుట కంగీకరింపదు. నే నెఱిఁగియున్న విద్వాంసుఁ
డొకఁడు వృక్షశాస్త్రమునందు ప్రవీణుఁడు. దాదాపుగ

నహర్నిశము నాశాస్త్రవిషయమునందు నిమగ్నుఁడై యుం డెడివాఁడు. ఆయన "నాజీవితమునం దెప్పుడును స్త్రీల విషయమునుగూర్చి చింతించియే యెఱుఁగను." అని నుడివి యున్నాఁడు. ఈవిషయమునం దొక మంచియుపదేశమును జూపుచున్నాను.

"శ్లో॥ ఆసుప్తే రామృతేః కాలం నయేత్ వేదాన్తచిన్తయా।
దద్యాన్నావసర ఙ్కించిత్ కామాదీనాం మనాగపి॥"

పంచదశి ॥

"నిద్రాభిభూతుఁడవు గానంతవఱకును, మృత్యుముఖము నందు పడనంతవఱకును, వేదాంతచింతయందు కాలమును బుచ్చుచుండవలయును. కాని కామము మొదలగువాని కణుమాత్రమైనను స్థానమియ్యఁజనదు." వేదాంతచింతయందు 'నేనెవరు ? జగత్తెట్టిది ? జగత్తుతోడ నాకుఁ గలసంబంధ మెట్టిది ? పరమాత్మస్వరూప మెట్టిది?' అను సూక్ష్మవిషయ విచారణయందు చిత్తము మునిఁగిపోవుటవలన కామము మొదలగునవి పలాయనమగును. శరీరము తుచ్ఛపదార్థమని తలంచుచుండువాఁడు కామమును ఆత్మచింతకు శత్రు వని తలంచుచుండును. అట్టివాఁడు భోగాభిలాషలను తృప్తి నొందించుటకుఁ బ్రయత్నింపఁడు. మరణమునకుఁ బూర్వము "సాక్రటీసు"ను జూచి యొకానొకఁడు "మీరు మృత్యువున కణుమాత్రమైనను భయమును జెందకుండుటకుఁ గలకారణ

మేమి?'' అని ప్రశ్నించెను. శాక్రటీసు "నేఁ డీదేహము నుండి నాయాత్మ విడిపోవుచున్నది. కావున నా కానందము గలుగుచున్నది. సర్వదా నాజ్ఞానాలోచన కీదేహము పలు బాధలను గలిగించుచుండెను. ఇంద్రియవికారములవలన చిత్త చాంచల్యము గలుగుచుండెను. కాని నేఁ డీదేహము నా యాత్మను ముట్టుకొనఁజాలదు. కావున మృత్యువు నాకు పరమానందజనకమై యున్నది.'' అని ప్రత్యుత్తరం బొసంగెను. పండితు లీదేహమునుండి ఆత్మ దూరమైనకాలఁదిని సంతసించెదరు. ఏదో యొక గంభీరవిషయవిచారమందు మునిఁగి యున్నప్పుడు ఇంద్రియవికారము లాచింతకు పలు విధములగు విఘ్నములు ఘటిల్లఁ జేయుచుండును. కావున సంపూర్ణముగ శరీరమును మఱచనంతవఱకును, సద్విషయ సంబంధమగువిచారము పూర్ణమగుటకు వీలు లేదు. భగవత్స మాధియం దుండునప్పుడు శరీరముకలదనుజ్ఞానమే యుండదు. నైని జేర్కొనఁబడిన విద్వాంసునియొద్ద మాలెస్టిసెంటు గవర్న రొకఁడు వృతుశాస్త్రమును చదువుచుండెను. ఒక్కొక్క సమయమునం దీయన వృతుశాస్త్రాలోచన యందు నిమగ్నుఁడై యుండి బాహ్యజ్ఞానశూన్యుఁడై యుండెడివాఁడు. కావున అట్టివారికైని కామాధిపత్యముండుటకు వీలు లేదు గదా ? దీనియుపద్రవములనుండి న్యూటను నిముక్తుఁడైనాఁ డనుసంగతి యెల్లరకుఁ దెలిసినవిషయమే గదా?

(౯) మాతృచింతనము, కామదమనమునకు మిక్కిలిసహాకారి. ఈజగత్తునందు దల్లివంటి పవిత్రమును, మధురము నగుపదార్థ మింకొకటి లేదు. తల్లి తలంపునకు వచ్చినంతనే హృదయమునందు పరమపవిత్రభావము ఉదయించును. సమస్తమానవులకుఁ దల్లి పవిత్రమును ప్రేమాస్పదము నై యున్నది. తల్లినిగుఱించి చింతించినకొలఁదిని హృదయము నుండి యపవిత్రభావములు దూరమగుచుండును. ఈశ్వరుని తల్లీయని పిలిచినప్పుడు గలుగునట్టియానందము మఱి యేనామమును బెట్టి పిలిచినను గూడఁ గలుగదు. సర్వదా భగవానుని యందలిమాతృభావము హృదయమునం దుద్దీపిత మగుచుండువాని ప్రాణ మెప్పుడును సరళముగ నుండుటయే గాక, ఏ విధమగుకళంకముచేతను కళంకితము గాకుండును. జగన్మయమగుమాతృభావము గోచరమైనంతనే సమస్తపృథివియు పవిత్రముగఁ గాన్పించును. స్త్రీలను జూచినంతనే తల్లి జ్ఞాపకమునకు వచ్చినవాని హృదయమునం దపవిత్రభావము లెట్లుండఁ గలుగును? జ్ఞానులదృష్టికి స్త్రీలు మాతృస్వరూపలు. అందువలన స్త్రీలను జూడఁగనే వారిహృదయముల యందు పవిత్రత పొంగి పొరలుచుండును. వారిచిత్తములు కామాధికారమునకు లోఁబడియుండుటకు వీలు లేదు. శ్రీ రామకృష్ణపరమహంసస్వామికిని, ఆయనభార్యకును, శారీరకసంబంధము లేనే లేదని యెల్ల రెఱింగినవిషయమే గదా?

ఒకానొకదినమునం దాయనభార్య ఆయనతోడ రాత్రి గడుపవలయునను కోరికను వెల్లడించెను. అందుల కాయన సమ్మతించెను. కాని రాత్రి ఆయనభార్య పాదములొత్తుటకు ప్రారంభింపఁగనే శ్రీరామకృష్ణపరమహంస తనయిష్టదేవత నుద్దేశించి "తల్లీ, నీవు వేఱుకకు నాభార్యవేషమును ధరించి నాయొద్దకు వచ్చితివా? రా. రా. నీవు రా. భయమేమి?" అని చెప్పుచు రాత్రి నంతయుఁ గడపెను. కాని యేవిధ మగుదుశ్చింతవలనను పీడింపఁబడఁ డయ్యెను.

(౧౦) కొంతమంది శరీరముయొక్క—నీచత్వము నరసికొనుటవలన మిక్కిలి మేలును బొందియున్నారు. శరీరముయొక్క—నీచత్వమును దలంచుకొనినయెడల, భోగాసక్తి యుండుటకు వీలు లేదు.

"శ్లో॥ అమేధ్యపూర్ణే క్రిమిజాలసఙ్కులే।
స్వభావదుర్గన్ధ ఇనిన్దితాన్తరే।
కలేబరే మూత్రపురీషపూరితే ।
రమన్తి మూఢా విరమన్తి పణ్డితాః॥"

యోగోపనిషత్తు.

"అపవిత్రతతో నిండి యున్నదియును, క్రిమిజాలసంకులమును, స్వభావదుర్గంధమును, మూత్రపురీషపూర్ణమును, అగు నీకళేబరముకొఱకు, మూర్ఖులు భోగాసక్తి గలిగి యుందురు. పండితులు భోగాసక్త గలిగియుండరు." ఈశరీరము

యొక్క నవద్వారములనుండి బయటికి వచ్చుచుండుమలమును దలంచుకొనినయెడల శరీర మెంతటి యసహ్యపదార్థమో తెలియనగును. అసహ్యమును ననిత్యమును నగుశరీరము మరణానంతరము ఏవిధముగ నుండునో భావించినయెడల సౌందర్యము గాన్పించునా ? యోగవాసిష్ఠరామాయణమం దీవిధముగ శ్రీరామచంద్రుఁడు నుడివియున్నాఁడు.

"త్వఙ్మాంసరక్తబాష్పామ్బు పృథక్కృత్వావిలోచన।
సమాలోకయ రమ్యఞ్చేత్ కిం వృథా పరిముహ్యసి॥"

యోగవాసిష్ఠము.

"(నీవు సౌందర్యవతియని భ్రాంతిపడుచున్న స్త్రీయొక్క) చర్మమును, మాంసమును, రక్తమును, బాష్పములను, వాయువును వేఱుగ భావించి చూడుము. అప్పుడు నీవు చూచుచున్న సౌందర్య మంతయు మిథ్య యగును. కావున నీ వేల ముగ్ధుఁడవు గావలయును?"

"శ్లో॥ ఇతోమాంస మితోరక్త మితోఽస్థీనీతి వాసరైః।
బ్రహ్మన్ కతిపయైరేవ యాతి స్త్రీగతచారుతా॥"

"ఓబ్రాహ్మణుఁడా, స్త్రీలసౌందర్య మొకదినమున నొక స్థలమున రక్తమును వేఱొక్కస్థలమున మాంసమును మఱియొక్క స్థలమునందు ఎముకలును బడి ఛిన్నమగును."

యోగోపనిషత్తునందు శుకుఁ డిట్లు నుడివియున్నాఁడు?

"శ్లో॥ వ్రణముఖ మివ దేహ మ్మాపతిచర్మావనద్ధమ్।
క్రిమికులశతపూర్ణం మూత్రవిష్ఠానులేపమ్।
విగతబహుళరూపం సర్వభోగాధివాసమ్।
ధురివమరణనిమిత్తం జ్ఞాన్తు మోహప్రసక్త్యా।
ఇద మేవ క్షుతద్వారం న పశ్యసి కదాచన।
క్షయస్తే యత్ర సర్వాణి యౌవనాని ధనానిచ।"

'గాయముయొక్క— మొనవలెనే దుర్గంధచర్మముతోఁ గప్పఁబడినట్టియు, వందలకొలఁది పురుగులు గలిగినట్టియు, మూత్రపురీషములతో నిండి అనేకమార్పులను జెందుచున్నట్టియు, ఈదేహము మోహాసక్తివలన సకలవిధములైన భోగముల కాటపట్టైనయెడల నిది మరణమునకుఁ గారణ మగుచున్నది. మఱియు యౌవనము, ధనము, మొదలగున వన్నియు సమూలముగ నాశన మగుచున్నవి.'

ఇట్టిశరీరమును విశ్వసింపఁదగునా? అసహ్య మగు, నీశరీరమును సుందరమని భావించువారలు పిచ్చివాండ్రు. రక్తము మాంసము మూత్రపురీషములు వీనితోఁ గూడుకొనియున్న శరీరమువిూఁద నాసక్తిగలిగి యుండువారి రుచి మిక్కిలి యసహ్యము. ఇట్టిశరీరమును ప్రియమైనదానినిగా భావించి మలమూత్రములయందు ప్రీతిని బొందువారలు బురదగుంటను పుష్పవనమని తలంచి విహరించువారని చెప్పవచ్చును. వారిని

పిశాచము లనిన దోషము లేదు. ఏవస్తువునం దెవఁ డెట్టి యాసక్తి గలిగియుండునో వానిపరిణామమావిధముగ నగునని తెలుపుటకుఁగాను ఈవిధముగ నుడివియున్నాఁడు.

"క్వైవత ద్వక్త్రారవిన్ద జ్క్వ తదధరమధు
క్వాయతా స్తే కటాక్షాః।
క్వాలాపాః కోమలా స్తే క్వ చ మదనధను
ర్భఙ్గురో భ్రూవిలాసః।
ఇత్థం ఖట్వాఙ్గకోటీప్రకటితదశనం
మఞ్జుగుఞ్జత్సమీరమ్।
రాగాన్ధానా మివోచ్చై రుపహసతి మహా
మోహజాల జ్కపాలమ్॥"

శాంతిశతకము.

శ్మశానమునం దొక స్త్రీయొక్క యస్థిపంజరము పడియుండెను. తలపుర్రెకు పండ్లు వెలుపలకు వచ్చియుండెను. వాయు వాపుర్రెయందుఁ బ్రవేశించి కామాంధులగువారలం జూచి "ఆముఖపద్మ మిప్పు డెక్కడ నున్నది? ఆయధరోష్ఠ మిప్పు డెక్కడ నున్నది? ఆవిశాలకటాక్షము లిప్పు డెక్కడ కేఁగినవి? ఆయాలాపము లెచ్చటి కేఁగినవి? మదన ధనువునుబోలు నాకుటిలభ్రూవిలాసము లెచ్చట?" అని పరిహసించుచుండెను. ఈమార్పును దలంచుకొనినయెడల భోగవాసనల కవకాశ ముండదు గదా?

గృహమును విడువకపూర్వము శాక్యసింహుని మనోగతిని త్రిప్పఁగలందులకుఁగాను, సుందరస్త్రీలాయన ప్రమోద మందిరమునందు నియుక్తలై యుండిరి. శాక్యసింహుఁడొకానొకదినమందు నిద్రించుచున్న యాస్త్రీలను చూచుట తటస్థించెను. వారిలోఁ గొంతమందితలలు వికృతములుగ నుండెను. కొంతమంది మిక్కిలి కురూపలుగనుండిరి. కొంతమందినోట నుండి విరామము లేక చొంగ కాఱుచుండెను. కొంతమంది పటపట పండ్లు కొఱుకుచుండిరి. కొంతమంది స్వప్నమునందు మునిఁగి వికారముగ నవ్వుచు భయము గలిగించుచుండిరి. కొంతమంది అసహ్యముగ నున్నవిధ మతిహేయముగ నుండెను. ఈదృశ్యమును చూచి "ఇది యంతయు శ్మశానమువలెనున్నది. తిరిగి వీరితోడ ప్రమోదక్రీడలు సల్పనగునా?" యని తలంచెను. అంతట నీయనచిత్తమెప్పుడును వికృతము గానట్టియు నిత్యస్థాయియు నైనసౌందర్యము దిక్కునకు నిర్గమించెను.

(౧౧) కామమునునశింపఁజేయుటకు కామమేయుత్తమ మార్గము. మత్తుపదార్థములను సేవించువాని నింకొకమత్తు పదార్థముచేత మఱలింపవచ్చును. ఇదేవిధముగ కామము వలన చెడిపోవుచుండువారిని, చెడిపోవనుండువారిని ఉత్కృష్ట మధురపదార్థముచేత నాకర్షించి మంచిమార్గమునకుఁ ద్రిప్పవచ్చును. రసప్రియుఁడెప్పుడును రసమును గోరు

చుండును. కావున అట్టివానికి ఉత్కృష్టోన్మాదకరసము దొరకనియెడల నికృష్టరసమునందుఁ బడిపోవును. కావున నికృష్టరసప్రియుఁడైనవానికి వేఱొకరసము దొరకనియెడల వాఁడారసమును విడువఁజాలఁడు. నికృష్టరసమునకుమాఱుగ నుత్కృష్టరసమును చవిచూచినయెడల క్రమక్రమముగ నికృష్టరసమువిూఁద నుండు వాంఛ తగ్గిపోవును. భగవద్భక్తిరసమును చవిచూచినవాఁ డాభక్తిరసమును గ్రోలఁగలందులకుఁగాను, మాటిమాటికిని ప్రయత్నించుచుండును. భక్తిరసమును గ్రోలినకొలఁదిని చెడుభావములుతమంతట తాముగనే సెలవుగైకొనును. సర్వదా సత్ప్రసంగరసామృతమును గ్రోలి వివశుఁ డగువానియానందమునకు మేరలేదు. అట్టివానిహృదయమందు దుశ్చింతలకు స్థానము దొరకదు. భక్తిరసము నాస్వాదనము చేయువారల హృదయములయందు, నికృష్టరస మెట్లుండఁగలదు? సురాపానమొనర్చినవాఁడు, శవాకారమును బొంది చూచుటకు హేయముగ నుండును. భక్తిరసమును గ్రోలినవానిహృదయమునం దానందతరంగములపైని ఆనంద తరంగములు లేచుచుండును. ఆయానందలహరికి మేరలేదు. విరామము లేదు. పూర్తియగుట లేదు. కావున అనంతకాల మాయానందమును బొందుచుండును. దీనివలన నొకనిమిష మైనను విషాదముగలుగదు. సురాపానమువలన శరీరము నాశనమగును. భక్తిరసపానమువలన శరీరము తేజోబలములతోడ

నపూర్ణశోభను వహించును. సురాపానము చేయువాఁడు రోగపూరితుఁడై, హృదయవేదనను బొందుచుండును. భక్తిరసామృతమును పానముచేయువాఁడు ఆత్మవికాసమువలన పరిపూర్ణతేజస్సంతుఁ డగును. ఒకటిరెండు దినములలో కామము సుందరపుష్పోద్యానమును శ్మశానముగ మార్చివేయును. ఒక్కమహూర్తకాలములోపల ప్రేమ భయంకరశ్మశానమును సుందరపుష్పోద్యానముగ నొనర్చును. కామము దేవతలవంటివారిని గూడ పశువులుగ నొనర్చును. ప్రేమ పశువులవంటివారిని గూడ దేవతలుగ మార్చును. కామము, మనశ్శరీరములఁ గలుషితములుగ నొనర్చి వానిని మృత్యుహస్తములయందుఁ బెట్టును. ప్రేమ మనశ్శరీరముల పవిత్రములుగ నొనర్చి దేవభోజ్య మగునట్టి అమృతరసపానమున కధికారిఁగ నొనర్చును. కామమువలన హాహాకారములతోఁ గూడిన "పోయెను. పోయెను" అనుశబ్దములు బయలు వెడలుచుండును. ప్రేమవలన నిత్యనూతనోత్సవానందముతోఁ గూడిన "జయ, జయ" ధ్వనులు వచ్చుచుండును.

> "త దేవ రమ్యం రుచిరం నవం నవమ్
> త దేవ శశ్వ న్మనసో మహోత్సవమ్
> త దేవ శోకార్ణవశోషణం నృణామ్
> యదు త్తమంశ్లోకయశోఽనుగీయతే॥" భాగవతము.

భగవానుని యశోగానము రమ్యమును నవనవరుచులతోఁ గూడుకొని నిత్యమహోత్సవమై శోకాబ్ధి నింకింపునదియై యున్నది. ఇట్టి దింకొకటి గలదా? భక్తిరసమును గ్రోలిన వారలు దుష్కామము నాహ్వానింపరు. లోభజనకమగు కామము సమీపమునకు వచ్చినను గూడ భక్తునకు దానియం దాకర్షణపదార్థమే కాన్పింపదు.

గ్రీసుదేశపుఁ బురాణములోని జాసక్, యూలిశసుల యొక్క చరిత్రలను జదివినయెడల వానినుండి మంచినీతిని గ్రహింపవచ్చును. మధ్యధరాసముద్రమునం దొకద్వీప ముండెను. దానియందు ముగ్గురుస్త్రీలు వాసము చేయుచుండిరి. వారియొక్క వేణునాదమును విన్నవారెల్ల రాకర్షింపఁబడి సర్వనాశన మగుచుండిరి. యూలిశస్ ఈద్వీపసమీపమునుండి వెళ్లుచు తననావికు లావంశీధ్వనిని విని ఆకర్షింపఁబడకుండుటకై వారిచెవులలో గుడ్డలు గ్రుక్కెను. తా నాకర్షింపఁబడకుండుటకుఁ గాను తన్నుఁ దాను ఓడకు బంధించుకొనియెను. కాని యీద్వీపసమీపమునకు వచ్చినకాలఁ దిని ఆస్త్రీలవంశీధ్వని వినఁబడఁ జొచ్చెను. ఇట్టిసమయమందు తన్నుఁదా రక్షించుకొనఁగలవాఁడెవ్వఁడు? యూలిశస్ ఈవంశీధ్వనివలన నస్థిరచిత్తుఁడై ద్వీపమును ప్రవేశింపవలయునని యెన్నియో ప్రయత్నములు చేసెను. కాని తన్నుఁ దాను బంధించుకొని యుండుటచేత ప్రాణము గొట్టుకొను

చుండినను గూడ కోరిక నెఱవేఱుటకువీలు లేకుండెను. చివరకు మితిలేనికష్టము మీఁద యూలిశేస్ బ్రతికి బయటికి వచ్చి పడెను. జాసన్ ఆర్గోనాటిక యాత్రకేఁగఁదలఁచి యాస్త్రీలుండుద్వీపసాన్నిధ్యమునుండి వెళ్లునపుడువారియొక్క వేణు నాదమును వినినయెడల తనకుఁగాని నావికులకుఁగాని క్షేమ ముండదని యెంచి గాయకశిఖామణి యగు ఆర్ఫియస్ తోడ నిట్లనియెను—"నీవు మాతోడ రమ్ము; ఆద్వీపసమీపమునకేఁగు నంతనే సంగీతమును బాడుట కుపక్రమింపుము. అప్పుడు అచ్చటిస్త్రీల వంశీధ్వని మమ్మెటు లాకర్షించునోచూతము." ఈయనసంగీతము రాలఁగరఁగించునది. దానిప్రభావమున నదీ జలములు పొంగిపొరలుచుండెను. పశుపక్షులు చిత్రప్రబొమ్మ లవలె నిశ్చేష్టితము లగుచుండెను. ఇట్టి మహాగాయకుని వెంటనిడుకొని జాసన్ బయలుదేఱెను. కొంతదూర మేఁగు నప్పటికి ఆద్వీపము సమీపించె నని తెలిసికొని ఆర్ఫియస్ సంగీతమును పాడుటకు మొదలిడెను. ఆసంగీతముచలన నెల్ల రానందప్రవాహమున మునిఁగిపోవుచుండిరి. నావికు లాసంగీ తమును వినినకొలఁదిని మత్తెక్కి త్రాటిని వదలివైచిరి. కోకిలస్వరముతోఁ బోల్పఁదగిన ఆర్ఫియస్ యొక్క మృదు మధుర గానమును వినునప్పుడు స్త్రైరాణుల గానము కప్పకూఁతల వలె కర్ణకఠోరముగ వినఁబడుచుండెను. కావున వారునిర్విఘ్న ముగా నామృదుమధుర గానమును వినుచు, గమ్యస్థానమును

జేరిరి. ఇందువలన నాస్త్రీలయొక్క మోహనశక్తి పరాభ
వము నొందెను.

యూలిశెస్ అనువానిని కంఠగతప్రాణునిఁగ నొనర్చిన
లోభమును జాసన్ అనువాఁడు నితాంతము తుచ్ఛమని తలం
చుటకుకారణము "ఆర్ఫియస్" యొక్క మృదుమధురగానమే
గదా? సర్వదా, "ఆర్ఫియస్" యొక్క వేణునాదమును విను
చుండువారలకు కామము మొదలగు వానియాకర్షణ తుచ్ఛ
ముగఁగాన్పించుచుండును. తనమీఁద తాను నిర్భరపడి పాప
దమనమునకు నానావిధోపాయముల నవలంబించువాఁడు
యూలిశెస్ వలె కష్టము లొందును.

"శ్లో॥ క్వ నిరోధో విమూఢస్య యో నిర్బన్ధం కరోతి వై
స్వారామ స్యైవ ధీరస్య సర్వదా సావకృత్రిమః॥"

అష్టావక్రసంహిత.

"ఇంద్రియసంయమముకొఱకు భగవానునిమీఁద నిర్భర
పడక నిజతేజమును ప్రకటింపఁదలఁచుకొను మూర్ఖున కింద్రి
యదమన మెట్లగును? సర్వదా ఆత్మతోఁ గూడుకొని యా
నందక్రీడ చేయుజ్ఞానియందు కృత్రిమము గానియింద్రియ
నిరోధము గాన్పించుచుండును."

భక్తులతో భగవానుఁడు ప్రేమపాశముచేత బంధింపఁబడి
యున్నాఁడు. దివారాత్రములు భగవానునితోడను భక్తుల
తోడను ప్రేమాలాపములవలన ముగ్ధుఁడగుచుండువానిగ్రహ

మున కాలుత్రోసులదూరమందైనను కామము నిల్వఁజాలదు. భక్తిరసమునందు మునిఁగియుండిన హాఫీజ్ (పరిషియా దేశపుఁ గవీశ్వరుఁడు) సమీపమున కేయపవిత్రరసమైనను వచ్చుటకు వీలు గలదా? హృదయాభ్యంతరమందు భగవానుని వంశీనాదమును వినుచు మహా ప్రేమనిమగ్నచిత్తుఁడగువానిని పాపపువంశీధ్వని యాకర్షింపఁ జాలునా? ప్రేమస్వరూపునితోడ స్వయముగ నృత్యగీతలీలావిలాసములఁ జేయుచు, ప్రేమసాగరమందు మునుఁగుచుఁ దేలుచు నీఁదుచుండువారిని నికృష్టరసము స్పృశించు టెట్లు? అమృతరసము నాస్వాదించువాఁడు మరుమరీచికలను చూచి భ్రమించునా?

కొందఱు మితిలేని భయముతోడ ప్రార్థనసమయమందు గడ్డగూబలవలెఁ గూర్చుండుదురు. అయ్యో! ఇది యెట్టిమూర్ఖత్వము. భగవానునితోఁ బోల్పఁదగిన కౌతుకలీలావినోది యింకొకఁడు గలఁడా? ఆనందమయుఁ డగు భగవానునితోడ ఆమోదప్రమోదముల నొందక మఱెవ్వరితోడ నానందమును బొందుదురు? ఆయన సహవాససుఖ మతులము. ఆసుఖ మణుమాత్ర మనుభవించినవాఁడయినను గూడ నీవిధముగ నుడువును. "నీచరణామృత పిపాసితుఁడు ధనమును లెక్క సేయునా? విషయసుఖములవలన మనమునకుఁ గలుగు తృప్తిని మన్నించునా? మకరందమును

విడిచి నీరు ద్రాగుటకు మధుకర మేఁగునా?" (బం॥ప) సురను త్రాగువాని కొకమా ఱీగాలి సోఁకినయెడల సురను పరిత్యజించును. విషయలంపటుఁడొకమా ఱీసుఖముయొక్క నీడను ద్రొక్కినయెడల వాని నావరించియుండు దుశ్చింతలు పటాపంచ లగును. ఇట్టి యానందముతోఁ బోల్పఁదగినది మఱొక్కటి లేదు. ఇంకొకటి యగుటకును వీలులేదు. త్రాగుఁబోతులు శ్రీరామకృష్ణ పరమహంసయొద్దకు వచ్చుచుఁబోవుచుండిరి. వీరిని ఎవరైనను "వాఁడు త్రాగుచున్నాఁడా ?" యని యడిగినప్పుడు పరమహంస "అది యాఁగిపోదా? ఎన్నిదినము లుండును?" అని చెప్పుచుండువాఁడు. ఆయన సమ్ముఖమందుండు భక్తిరసమును గ్రోలుటకుఁ బ్రారంభించిన తర్వాత సురనెంతకాలము పానము చేయఁగలఁడు? దానిని పరిత్యజించుననదియే దీని తాత్పర్యము.

మాతృమరణానంతరము నారదుఁడు భగవదన్వేషణకై గృహమును విడిచి తిరిగి తిరిగి చివర కొకయరణ్యమధ్యమునం దొకరావిచెట్టుక్రిందఁ గూర్చుండి భగవద్ధ్యానమునందు నిమగ్నుఁడై యుండ భగవానుఁడు దర్శన మిచ్చి, వెంటనే యంతర్హితుఁడై నారదునితో ని ట్లనియెను.

"హన్తాస్మిన్ జన్మని భవా న్నమాం ద్రష్టు మిహార్హతి,
అవిపక్వకషాయాణాం దుర్దర్శోహం కుయోగినామ్॥"

భాగవతము.

'ఈజన్మమునందు నీవు నన్ను జూచుటకు యోగ్యుఁడవు గావు. కామము మొదలగు వానిని దగ్ధము చేసికొనఁబాలని కుయోగులు నన్ను దర్శింపఁజాలరు.'

'ఉ॥ ఏల కుమార శోషిలఁగ నీజననంబున నన్నుఁగానఁగాఁ।
బాలవు నీవు కామముఖషట్కము నిర్దళితంబుఁ జేసి ని।
ర్మాలితకర్ముఁడైనమునిముఖ్యుఁడుగానికుయోగిగానఁగాఁ
జాలఁడు నీదుకోర్కికొనసాఁగుటకై నిజమూర్తిఁజూపితిన్॥'

భాగవతము.

నారదుఁడు—"అట్లయినయెడల మెఱపువలె నొకమాఱు దర్శన మిచ్చుటకుఁ గలకారణ మెద్ది?"

"సకృత్ యద్దర్శితం రూప మేతత్ కామాయ తే௨నఘ।
మత్ కామః శనకైః సాధు స్సర్వా న్ముఞ్చతి హృచ్ఛయాన్॥" భాగవతము.

'నామీఁద నీకు ప్రేమగలుగఁగలందులకుఁగాను, నీకొకమాఱు దర్శన మిచ్చియున్నాను. నామీఁద కామము జనింపుచు సాధువులు లేమ చిత్తములయందుండు సమస్త వాసనలను క్రమక్రమముగ వర్జింతురు. భగవానునియందను రక్తుఁడగువానికి ఏవిధమగు కోరికలు నిలిచియుండవు.' భగవానునిఛాయ దగిలినవస్తువు లతిమనోహరము లైయుండును. చిరమనోమోహనుఁడైన భగవానునికొఱకు సాధుపుంగవు లెల్లరు సమస్తమును మఱచి పిచ్చివాం డ్రగు చుందురు.

కావున మనయనురాగ మాసౌందర్యముయొక్క అనాదినిర్ఝ
రిణీ దిక్కున కేఁగుఁగాత. పిశాచవిహారస్థానములు మన మెప్ప
డును లక్ష్యములు గాకుండుఁగాత.

ఈవిశేషోపాయములమీఁదనే నిర్భరపడి సామాన్యోపా
యములను మఱచిపోఁ గూడదు. పాపదమనమునకు విశేషో
పాయములతోపాటు సామాన్యోపాయములు గూడ సమాన
సహకారులు.

పూర్వోల్లిఖితము లగు కామజనితదశదోషములనుండి
విముక్తినొందుటకు సర్వదా ప్రయత్నించు చుండవలయును.
కావున ప్రమాదవశమున నైనను, ఆదోషములదిక్కునకు
బుద్ధిని పోనియ్యఁజనదు. ఏవిధమగు దోషములచే నావరింపఁ
బడినవాఁడైనను, సమానదోషులతోడ పోటి పెట్టుకొనుట
వలన మిక్కిలి యుపకారము చేకూఱును. "ఎవఁడీవిధముగ
నెన్ని దినములు పవిత్రతను రక్షించుకొనఁగలఁడో చూతము."
అను భావముతోడ నెవరితోనైనను పోటి పెట్టుకొనిన
యెడల హృదయమునందొకవిధమగు తేజ ముదయించును.
అందువలన ననేకదినములవఱకు మంచిప్రవర్తన గలిగియుండ
వచ్చును.

ఇతరులను పవిత్రులుగ నొనర్పవలయునని ప్రయత్నించుట
వలనఁ గూడ చాలలాభము చేకూఱును. ఇతరులను దోషవిము
క్తులుగఁ జేయఁ గలంతలసఁ గాను ప్రయత్నించువానికి

తనమీఁద పూర్ణమగుదృష్టి యుండును. కావున తనయొద్ద నేవిధమగు కళంకమున్ననుగూడ పోఁగొట్టుకొనుటకుఁగాను కోరిక వొడమును. "ఇతరులు ఎట్టి దోషములకు దూరులు గావలయునని చెప్పుచున్నానో యట్టిదోషములు నన్నావరించి యుండినయెడల లోకులు నన్నేమందురు." అనుజ్ఞానము గలుగుటవలన తన్నావరించి యుండుదోషములను దూరము చేసికొనవలయు నను బుద్ధి పుట్టును. ఇంతియ కాక ఇతరుల క్షేమముకొఱకై యేదో యొకపాపమునకు విరుద్ధముగ సర్వదా చింతించుచుండుటవలన దానికి తగుఫలమును తన జీవితమునందుఁ బొందవచ్చును. సర్వదావిరుద్ధముగ మాటాడు దానిమీఁద విరక్తి జనించుట సహజము గదా? అందువలన నాదోషమును సులభముగ నశింపఁజేయవచ్చును. కాని యితరులను పవిత్రులుగ నొనర్పవలయునని ప్రయత్నించి చివరకు తామే చెడినవార లనేకులు గలరు. నే నెఱిఁగి యున్న పవిత్రచరిత్ర గలయొకానొక యౌవనవంతుఁడు వేశ్యలను బాగుచేయుటకుఁ బ్రయత్నించి చివర కాతఁడే వేశ్యాలోలుఁడయ్యెను. కావునపరిపూర్ణ మగునీతిబలములేనివారలు దుర్మార్గులదరి కేఁగకుండుట యుత్తమము. కాని తనకంటె నధికదోషములు లేనివానితోఁ గలసి బాగుపడఁ గలందులకుఁ గాను, పరస్పరము ప్రయత్నింపనగును.

గృహస్థుఁడు జితేంద్రియుఁ డయినయెడల సంసారము నడచు టెట్లని కొందఱు ప్రశ్నింపవచ్చును. ఇట్లనుటవలన గృహస్థుఁడుగనుండువాఁడు జితేంద్రియుఁడుగనుండఁగూడ దనునభిప్రాయము తేలుచున్నది. కాని, జితేంద్రియులగు మహర్షులు గృహస్థాశ్రమమునకు విధికర్తలై యున్న దేశమునందు నేఁడెట్టి భ్రమ రాజ్యము చేయుచున్నది? ఇంతకంటె కష్టతరమగు విషయ మింకెద్ది కలదు? జితేంద్రియుఁడై వివాహమాడవలయుననియే ఋషులవిధియై యున్నది. ప్రథమమున బ్రహ్మచర్యాశ్రమమును, తదుపరి గృహస్థాశ్రమమును స్వీకరింపవలయును. శైశవము గడవఁగనే బ్రహ్మచర్యము నవలంబింపవలయును. దీనివలన జీవనము పవిత్ర మగును. పిమ్మట గృహస్థాశ్రమము నవలంబింపవలయును.

శ్లో॥ "ఏవంబృహద్వ్రతధరో బ్రాహ్మణోఽగ్ని రివ జ్వలన్ ।
మద్భక్త స్తీవ్రతపసా దగ్ధకర్మాశయోఽమలః ।
అథానన్తరమావేక్ష్యన్ యథా జిజ్ఞాసితాగమః ।
గురవే దక్షిణాం దత్త్వా స్నాయాద్ గుర్వనుమోదితః ।
గృహం వనం వో పవిశేత్ ప్రవ్రజేద్వా ద్విజోత్తమః ।
ఆశ్రమాదాశ్రమఙ్గచ్ఛే న్నాన్యథామత్పరశ్చరేత్ ।
గృహార్థీ సదృశీమ్భార్యా ముద్వహే దజుగుప్సితామ్॥"

భగవానుఁడు బ్రహ్మచర్యమును గూర్చి యిట్లు వర్ణించి యున్నాఁడు. "ఈవిధముగ బ్రాహ్మణబ్రహ్మచారి యై

ఘోరతపస్సుచే కర్మలయొక్క విషయవాసనలను సంపూర్ణ
ముగ దగ్ధముచేసికొని నిర్మలజితేంద్రియుఁడై యగ్నితుల్య
ముగ బ్రహ్మతేజమున ప్రజ్వలించుచుండునప్పుడే యాశ్రమ
మందుఁ బ్రవేశింపవలయు ననుకోరిక యుండినను గూడ వేద
పరీక్షయం దుత్తీర్ణుఁడై గురువునకు దక్షిణ నిచ్చి తదాజ్ఞాను
సారముగ స్నానమాచరింపవలయును. పిమ్మట ద్విజోత్త
ముఁడు నిజేచ్ఛానుసారముగ గృహస్థుఁడు కావచ్చును. లేక
వానప్రస్థుఁడు గావచ్చును. పరివ్రాజకుఁడు గావచ్చును.
ఇచ్ఛయున్నయెడల నొకయాశ్రమమునుండి యింకొకయాశ్ర
మమున కేఁగవచ్చును. ఏయాశ్రమమం దున్నను వానిహృద
యము నన్ను విడిచి యన్యథా వర్తింపఁ జనదు. గృహ
స్థుఁడు గావలయు ననునిచ్ఛగలవాఁడు పవిత్రచరిత్రగలదై
తనతోఁ బోల్పఁదగిన స్త్రీని వివాహమాడవలయును.''

విషయవాసనలను దగ్ధముచేసికొనినపిమ్మట విషయభోగ
ముల ననుభవింపవలయును. జితేంద్రియుఁడైనపిమ్మట స్త్రీని
గ్రహింపవలయును. "ఛాగచ్ఛాగులసంబోతె" (మేఁక మేఁక
ను పెంచువాఁడు) జీవనయాత్ర గడపుటకుఁగాను ఋషులు
గృహస్థాశ్రమమునకు విధులను విధించియుండలేదు.

మహాభారతమున వనపర్వమునం దీవిధముగ సావిత్రితండ్రి
చెప్పుచున్నాఁడు.

"అపత్యోత్పాదనార్థ శ్చ తీవ్ర న్నియమ మాస్థితః।
కాలే నియమితాహారో బ్రహ్మచారీ జితేన్ద్రియః॥"

"సంతానము గలుగఁగలందులకుఁగాను కఠిననియమముల నవలంబింపవలయును. నియమానుసారముగ మితాహారుఁడై బ్రహ్మచారియై జితేంద్రియుఁడు కావలయును." శ్రేష్ఠమగు గృహస్థాశ్రమ మని దేని నందురు? సంతానోత్పాదకవిషయము నందుఁగల అర్హతను విచారింపుఁడు. అజితేంద్రియావస్థయం దిట్టిగురుతరకార్యమునందు ప్రవృత్తుఁడైనయెడల సర్వనాశ నము గలుగు ననియే గదా దీనితాత్పర్యము? జితేంద్రియుఁడు కాని గృహస్థుఁడు గృహస్థుఁడుగాఁడు. జితేంద్రియుఁడు కానివానికిని పశువునకును భేద మేమి?

సర్వదా మనము కామనాశనముకొఱకు నానావిధో పాయముల నవలంబించుచు స్నేహితులను పవిత్రమార్గము నందు నడచునట్లు ప్రోత్సాహపఱుచు చుండినయెడల పర స్పరసాహాయ్యము గలుగును. అందువలన కామమును నశింపఁజేసికొని భక్తితోడ మనజీవితములను ధన్యములం గా వించుకొనఁ గలము.

---

# క్రోధము.



(౧) క్రోధమువలనఁ గలుగునష్టములనుగూర్చియు క్రోధనాశనమువలనఁ గలుగు లాభములనుగూర్చియు బాగుగ విచారించి "నే నెప్పుడును క్రోధమునకు లోఁబడను" అని దృఢప్రతిజ్ఞ నొనర్చుకొని మెలంగుచుండవలయును. క్రోధమువలన నాశనముచెందిన మనుష్యులను జాతులనుగూర్చి చింతించుచుండవలయును. మహాభారతమునందు ధర్మరాజు ద్రుపదపుత్రికి నీవిధముగ చెప్పియున్నాఁడు.

"శ్లో॥ క్రోధమూలో వినాశో హి ప్రజానా మిహదృశ్యతే
క్రుద్ధః పాపం నరః కుర్యాత్ క్రుద్ధోహన్యాద్ గురూ నపి
క్రుద్ధః పరుషయా వాచా శ్రేయసో ఽప్యవ మన్యతే
వాచ్యావాచ్యం హి కుపితో నప్రజానాతి కర్హిచిత్
నాకార్యమస్తి క్రుద్ధస్య నా వాచ్యం విద్యతే తథా।
హింస్యాత్ క్రోధాదవధ్యాంస్తు వధ్యాన్ సమ్పూజయేతచ
ఆత్మాన మపి చ క్రుద్ధః ప్రేరయే ద్యమసాదనమ్
క్రుద్ధో హి కార్యం సుశ్రోణి న యథావత్ ప్రపశ్యతి
న కార్యం న చ మర్యాదాం నరః క్రుద్ధోఽనుపశ్యతి॥"

"జీవులవినాశమునకు క్రోధమే మూలకారణము. క్రోధము వలన మానవులు పాపకార్యములను చేయుచుందురు. క్రోధి గురువును వధించుటకుఁగూడ వెఱవఁడు. కఠినవాక్యములతో మంచివానికి మానభంగము గావించును. క్రోధికి యుక్తాయుక్తజ్ఞాన ముండదు. క్రోధి చేయనికార్యము గాని పలుకని వాక్యములుగాని లేవు. క్రోధమువలన మానవుఁడు చంపఁగూడనివారిని చంపును, చంపఁదగినవారిని పూజించును. క్రోధి తనంతట తానుగనే యమాలయమున కేఁగుమార్గమునందుఁ ప్రవేశించును. క్రోధాంధుఁడైనవాఁడే కార్యమున కెట్టిఫలము గలుగునో తెలిసికొనఁజాలఁడు. మంచికార్యము లెవ్వియో తెలిసికొనలేఁడు. మర్యాదను రక్షించుకొనవలయు ననువిషయము క్రోధపూరితుఁ డెఱుంగఁజాలఁడు."

క్రోధము మానవునకు పరమశత్రువు. ఇది మనుష్యుని మనుష్యత్వమును నాశము చేయును. భూలోకమును నరకముగ మార్చుఘోరకృత్యములకు క్రోధమే గదా మూలము?

క్రోధము మనుష్యుని పశుస్వభావము గలవానినిగ నొనర్చును. కావున కుపితవ్యక్తియొక్క మోమును క్రోధసమయమునందు చూచినయెడల సుస్పష్టముగ పశుస్వభావము గాన్పించును. ఎవరి మోమును చూచినప్పుడు నీ కానంద ముప్పతిల్లుటయేకాక పరమప్రీతి జనించునో యట్టివాఁడు క్రోధావిష్టుఁడై యున్నప్పుడు వానిమోమును జూచినయెడల దానియందు స్వర్గతేజము గాన్పింపకుండుటయేకా

నరకాగ్నివలన వికృతరూపమును ధరించి ఎఱ్ఱనికన్నులతో డను కంపించునధరముతోడను తీవ్రముగ విడుచుశ్వాసతో డను రాక్షసభావము ప్రతిఫలించుచుండును. అప్పుడు వాని నాలింగనము చేసికొనవలయు ననుతలంపు జనింప కుండుటయే గాక వానిని సమీపించుటకుఁగూడ నిచ్ఛ వొడమదు. ఒక్కనిముసములో సుందరపదార్థమును వికృతముగ నొనర్పఁగలశక్తి క్రోధమునకుఁగాక మఱియేశత్రువునకుఁ గలదు?

క్రోధమువలనఁ గలుగురోగములను దలంచుకొనినయెడల హృదయము తల్లడిల్లును. చికిత్సాశాస్త్రపారంగతు లగు స్వదేశవిదేశపండితులెల్ల రేకగ్రీవముగా నిట్లు నుడివియున్నారు. చిత్తచాంచల్యము పిచ్చి మూర్ఛ రక్తవమనము మొదలుగాఁగల రోగములన్నియు క్రోధమున కనుచారులై యుండును. ఒక్కొక్కసమయమునందు క్రోధోద్రేకము వలన మరణముగూడ సంభవించును. ఈ క్రింది వృత్తాంతమును నేను వినియున్నాను. ఒకప్పుడు బాఖర్గంజి జిల్లాయం దొకప్రసిద్ధగ్రామమునం దిద్దఱుస్త్రీలు పోట్లాడుచు కొంతవడికి కొట్టుకొనుటకుఁ బ్రారంభించిరి. ఇం దొకస్త్రీ యోడి పాఱిపోయి యొకయింటఁదూఱి తలుపులు బిగించుకొనెను. రెండవస్త్రీ వెంటఁబడి పరుగెత్తి యాగృహమును జేరునప్పటికి ద్వారము బంధింపఁబడియుండుటచేత తలుపును పగులఁగుద్దుటకుఁ బ్రారంభించెను. కానియిట్లొనర్చుచు కొంతవడికి అలసి క్రింద పడిపోయెను. శరీరము కంపింపసాగెను.

అనంతర మొకముహూర్తములో మూర్ఛయు తదుపరి మరణమును సంభవించెను. ఆహా! క్రోధ మెంతటిభయంకర మైన శత్రువు! ఒకానొక యింగ్లీషుడాక్టరు "కారాగార ముల రిపోర్టులవలన క్రోధమే యున్మాదమునకు ముఖ్య కారణమని తేలుచున్నది. క్రోధము గలిగినప్పుడు భుజించుట కిష్ట ముండకుండుటయు ఆఁకలి నుందగించుటయు నానేకు లనుభవించి యుందు గనుకొనుచున్నాను. క్రోధమువలన రక్తము తీవ్రముగ సంచరించును. అందువలన మిక్కిలినష్టము గలుగును. క్రోధమువలన మస్తిష్కమునకు దెబ్బ తగులును. ఈదెబ్బలు మిక్కుటమైనయెడల పచ్చి యెత్తును. శరీరాభి వృద్ధి క్షీణించును." అని చెప్పియున్నాఁడు. క్రోధమువలన తనకుఁ గలిగినకీడులను దలంచుకొనినవాఁడు పరులను పరుష వాక్యములచేత నొవ్వఁజేయఁడు.

"శ్లో॥ రోహతే సాయకైర్విద్ధంవనమ్పరశునాహతమ్।
వాచా దురుక్తయావిద్ధం న సంరోహతి వాక్ క్షతమ్॥"

భారతము.

"బాణముచేత దెబ్బతినినను లేక గొడ్డటిచేత నఱుకుడు వడినను గూడ వృక్షము తిరిగి చిగుర్చును. కాని దుర్వాక్య క్షత మైనహృదయము తిరిగి స్వస్థపడదు." క్రోధము దౌర్బల్యసూచకము. తేజస్వి యగువానిమన స్సెప్పుడును క్రోధము వలన చలింపదు.

"శ్లో॥ తేజస్వీతి య మాహుర్వై పణ్డితా దీర్ఘదర్శినః।
న క్రోధోఽభ్యన్తర స్తస్య భవతీతి వినిశ్చితమ్॥"
మహాభారతము.

దీర్ఘదర్శు లగుపండితులు చెప్పునట్టి తేజస్వంతుల హృదయములందు క్రోధ మనునది యుండదు."

"శ్లో॥ యస్తు క్రోధంసముత్పన్నం ప్రజ్ఞయా ప్రతిబాధతే।
తేజస్వినం తం విద్వాంసో మన్యన్తే తత్త్వదర్శినః॥"
భారతము.

"ప్రజ్ఞచేత క్రోధమును వశపఱుచుకొన్నవానినే తేజస్వి యని తత్త్వదర్శు లగుపండితులు దలంతురు."

క్రోధమువలనఁ గలుగునష్టములను క్రోధజయముయొక్క మహాత్త్వమును జింతించుచుండువాఁడు "నే నెప్పుడును క్రోధమునకు వశవర్తుఁడను గాను" అనుదృఢప్రతిజ్ఞను జేసికొనును. ఇందువలన క్రోధమువచ్చుట తటస్థించినప్పుడాప్రతిజ్ఞ తనంతటతాను జ్ఞప్తికివచ్చుటచే వాఁడు క్రోధమునకు వశుఁడు గాఁడు.

క్రోధోద్రేకమును గలిగించుమనుష్యునకుఁగాని వస్తువునకుఁగాని దూరమందుండుట కర్తవ్యము. నీ యెవనిని జూచిన క్రోధము గలుగుచుండునో అట్టివానికిదూరమందుండుటకుఁ బ్రయత్నింపుము. క్రోధమును గలిగించువిషయముయొక్క విచారమునుచిత్తమునకు రానియ్యఁజనదు. చిత్తముప్రశాంతమైన వెంటనే క్రోధముపలాయితమగును. క్రోధముపలాయితమయి

నంతనే క్రోధమునకు కారణభూతుండగు మనుష్యునిగాని విషయమును గాని నిశ్చింతగా సమీపింపనగును. కావున చిత్తము ప్రశాంతము గానంతవఱకును అట్టివానికి దూరముం దుండుట యుక్తము.

(౨) క్రోధమునకు స్థానము చిక్కకుండుటకు ప్రయత్నింపవలయును. స్థానము చిక్కనియెడల క్రమక్రమముగ క్రోధము నశించును. బైబిలునం దొకమంచివాక్యము గలదు. "మీకు క్రోధముండినయెడల సూర్యాస్తమయమునుగానియ్యవలదు" ఈవాక్యము మిక్కిలి యుపకారి. దీనికి సంబంధించినకథ నిందుదాహరించుచున్నాను. ఇంగ్లీషువారిరువురకెదియో యొకకారణమున వివాదము సంభవించెను. ఇందువలన వారు పరస్పరము క్రోధాన్వితులైరి. ఆక్రోధము భయంకరాకారమును దాల్చినప్పు డిర్వు రిరువంకల కేగిరి. పిమ్మట సంధ్యాసమయముం దొకఁడు రెండవవానిగృహద్వారమును సమీపించి తలుపులు గ్రుద్దుటకుఁ బ్రారంభించెను. రెండవవాఁడు తలుపుదీయఁగనే వాఁడిట్లనియె "సోదరా! సూర్యాస్తమయ మయ్యెను. ఇంకెంతసేపు?" అనఁగానే యిరువురును గాఢాలింగన మొనర్చుకొనిరి; క్రోధము వెంటనే పలాయితమయ్యెను. ఇంతకంటె మృదుమధుర సగు దృశ్యమింకొకటి యుండదు గదా? కావున కొన్ని మహావాక్యములను మనస్సునందుంచుకొనినయెడల మిక్కిలి లాభము చేకూఱును. ఏసుక్రీస్తుయొక్క యుపదేశ మింకొకటి కలదు. "నై

నైవేద్యము నర్పించుటకుగాను వేదిసమీపమునకు వచ్చినప్పుడు
ముందుగా నీమీఁద కోపముగలసోదరునియొద్ద కేఁగి స్నేహ
మును నెరపిరమ్ము. పిమ్మట నైవేద్యమును నివేదన సేయు
ము.'' ఈయుపదేశమువలన నొకబాలుఁడు పొందినమేలును
ఇం దుదాహరించుచున్నాను. ఒకపట్టణమునం దిద్దఱు బా
లురు మిక్కిలిస్నేహము గలిగియుండిరి. వీరియం దొకఁడు
హైస్కూలునందును రెండవవాఁడు కాలేజియందును
చదువుకొనుచుండిరి. ఒకదినమున నీయుభయుల కేదియో
యొక కారణమున కలహము సంభవించెను. కలహము సం
భవించినమఱుదినమున హైస్కూలునందలి ప్రధానోపాధ్యా
యుఁడీవిషయమును గ్రహించియీవిద్యార్థిని కాలేజివిద్యార్థి
యొద్ద కేఁగి క్షమాపణ కోరుమని నుడివెను. అంత నాబాలుఁడు
"నే నేవిధమగు తప్పును జేయలేదు. అపరాధమొనర్చియుండిన
యెడల క్షమాపణను గోరుటకు సంసిద్ధుఁడనై యుందును.''
అని చెప్పుచు అభిమానమువలన నేడ్చుటకుఁ బ్రారంభించెను.
ఈబాలుఁడు సాధారణముగ ప్రతిదినమును రెండవవాని
యింటికి కేఁగుటను మానుకొనెను. ఇందువలన రెండవవాఁడు
మిక్కిలి బాధనొందుచు ఈశ్వరోపాసనకుఁ గడంగునప్పుడు
పై నుదాహరించిన క్రీస్తుయొక్క వాక్యములు అతనికి
జ్ఞప్తికి వచ్చుచుండెను. కావున నాబాలునితో స్నేహము
నెరపనియెడల భగవానుఁడు తనప్రార్థనల నంగీకరింపఁ
డనియు ఆయన ప్రేమమయుఁడగుటవలన నుపాసకునిహృద

యమునం దణుమాత్రము క్రోధ మున్నను గూడ నాయనదరి కేఁగుట కధికారము లేదనియుఁ దలంచుచు భీతుఁడగుటచేత జ్వరపీడితుఁడయ్యెను. జ్వరము విడిచినంతనే ప్రథమబాలుని యొద్దకేఁగి "సోదరా! మనమిద్దఱము స్నేహమును నెఱపు కొనుచుండవలయునే కాని మనహృదయములయందు క్రోధ మునకు స్థాన మియ్యరాదు." అని నుడివెను. ఆమాటలను విని మోము చిట్లించి "అట్లుండుటకు వీలు లేదు. అప్పప్పు ముక్కలతుకునా?" అని యాతఁడు ప్రత్యుత్తర మొసంగెను. ఈమాటలను విని రెండవబాలుఁడు నిరుత్సాహుఁడై బయలుదేఱివచ్చుచు తిరిగి మనకిరువురకు స్నేహము గలుగు నంతవఱకును ప్రతిదినము నీయొద్దకు వచ్చుచుండెదనని చెప్పి మఱుదినము వానియింటి కేఁగెను. కాని వాఁ డింటియందు లేఁ డయ్యెను. రెండవదినమున హైస్కూలునం దొకసభ జరిగెను. విద్యార్థులు పిలువఁగా రెండవబాలుఁ డాసభ కేఁగెను. ఆసభయం దొకానొక బాలుఁ డొకవిషయమును గూర్చి వ్యాసమును జదివెను. ఈవ్యాసమును విమర్శింప వలయునని రెండవవానిని కొందఱు ప్రోత్సాహ పఱుప సాగిరి. అంత నాబాలుఁడు లేచి, "నే నిచ్చటికి వ్యాసమును విమర్శించుటకు వచ్చియుండ లేదు. నాస్నేహితుఁ డొకఁడు బలవంతపెట్టుటవలన వచ్చియున్నాను. కావున నేను ప్రసం గింపవలసిన దేమున్నది?" అని చెప్పికూర్చుండఁగ నే ప్రథముఁడు లేచి నాయనురోధమున వీరందఱీసభకు వచ్చి యున్నారు.

ఇందు కొంతమంది నేనాతనిని క్షమాపణ గోరుదునని తలంచు చున్నారు. నేనిప్పుడుగాని యిఁకముందుఁగాని క్షమాపణను గోరవలసిన యవసరము లేదు." అని నుడువుచు రెండవవానిని దూలనాడుటకుఁ బ్రారంభించెను. ప్రధానశిక్షకుఁ డిదివఱకె తనవిద్యార్థిని శిక్షింపవలయు నని ప్రయత్నించెను గాని, రెండవబాలుని యనుక్రోధమువలన తనప్రయత్నమును మాను కొనెను. రెండవవాఁడు, "నేనీదినముననే వానిస్నేహమును సంపాదింపవలయును. స్నేహమును సంపాదింపనియెడల భగవానుఁడు నాప్రార్థన నంగీకరింపఁడు. క్రోధముగలవాని మీఁద ప్రేమమయుఁ డెట్లు ప్రేమను చూపును?" అని తలంచుచు నాబాలుఁడు పలుకుమాటల కాగ్రహమును జెందక వానిసమీపమున కేఁగి స్నేహమును గోరెను. కాని ప్రథముఁడు తీవ్రముగ శ్వాసను విడుచుచు, "స్నేహము గలయుటకు వీలు లేదు." అని నుడివెను. ఈమాటల కణుమాత్రమైనను కష్టమును జెందక, రెండవబాలుఁడు ప్రేమయొక్క మహిమను వర్ణించుచు క్షమాపణను గోరుకొనుచుండెను. ప్రాణమును స్పృశించు నీబాలుని వాక్యములవలన వానిచిత్తము కరఁగసాగెను. ఈబాలు రిరువురేగాక సభయందున్నవా రందఱికన్నులనుండి నీళ్లు కాఱఁజొచ్చెను. ప్రథముఁడు లేచి తనగ్రంథములను దీసికొనఁబోవుచుండఁగా, రెండవబాలుఁడు మనోవేదనను బొందుచు, "మిత్రమా! కొంతవడి నిల్వుము. వెళ్ళవలదు. ఈమాటలను విని పొమ్ము. నన్ను

క్షమింపుము. నిర్దయుఁడను గాను." అని యతిదీనస్వరమునఁ జెప్పఁదొడంగెను. మొదటివాఁడు తనమాటల నిరాకరించి వెళ్లుచున్నాఁడని రెండవవాఁడు తలంచెనుగాని వాస్తవ మది గాదు. సర్వమును జయింపునది ప్రేమయే గావున రెండవ బాలుని మృదుమధుర ప్రేమపూరితవాక్యములవలన మొదటి వానిహృదయ మల్లకల్లోల మై వాఁడు కూర్చుండియుండఁ జాలక రెండవవానిసమీపమునకు వచ్చి, పాదములమీఁదఁ బడి యేడ్చుచు క్షమింప వేఁడుకొనఁజొచ్చెను. ఆహా! ఈ దృశ్యమునం దెట్టిప్రేమ ప్రకాశమాన మగుచున్నది! ఇట్టి దృశ్యమును వర్ణించుట కెవ్వరతరమగును? మఱునాఁడు మధ్యాహ్నము మామూలుగా, ప్రథముఁడు రెండవబాలుని యింటి కేఁగెను. అప్పు డాతఁడు స్నేహితునిఁజూచి "అద్దపుముక్క లతుకవా? స్నేహము గలయుటకు వీలు లేదా?" యని నవ్వెను. క్రీస్తుయొక్క మహావాక్యములను మననముచేయుట వలననే గదా విద్యార్థిహృదయము పవిత్ర మయ్యెను.

(౭) క్రోధము గలిగినవాఁడు తనక్రోధము గ్గినంతనే, ఆత్మదోషముల నంగీకరించుచు, క్షమింపవలయు నని ఎవని మీఁద క్రోధము కలిగి యుండెనో వానిని బ్రార్థించుటవలన క్రోధము నశించును. మాటిమాటికి తనదోషములను తలఁపు నకుఁ దెచ్చుకొనుచు క్షమింపవలయు నని ప్రార్థించుచుండు టవలన, క్రోధమును నశింపఁజేసికొనుటకు దృఢేచ్ఛ గలు గును. భృత్యునిమీఁద నాగ్రహము గలిగినను కూడ క్షమింప

వలయునని వానిని గోరవలయును. అనేకులు తమభృత్యులను మానవజాతిలోనివారనియే భావింపరు. కాని భగవానుని దృష్టియందు ప్రభు వెట్టిమనుష్యుఁడో భృత్యుఁడు గూడనట్టిమనుష్యుఁడేగదా? నేఁడెవ్వఁడునీపాదములొత్తుచు నీచముగఁ గాలముఁ గడపుచున్నాఁడో అట్టివానిపాదములు ముట్టుకొనినయెడల పవిత్రుఁడనని కాలాంతరమునందు నీవు దలంపవచ్చును. కాఁబట్టి యెవ్వరినిగాని నీచులని తలంపక సమస్తమానవులసమ్ముఖమందు నీనిజదుర్బలత్వమును ప్రకటించుకొనుచు, పుణ్యపథమునందు నడచుచుండుము.

(౪) నిజదోషముల కేదో యొకగుర్తును వ్రాసి సమ్ముఖమందుంచుకొనుటవలన మిక్కిలి మేలు గలుగును. బంగాళా రాజధానియందొకపట్టణమున కోపస్వభావుఁడగు వకీలొకఁడుండెను. ఇతఁడొకనాఁడు క్రోధపరవశుఁడై యొకానొక బ్రాహ్మణుని మిక్కిలి నిందించెను. అందువలన పశ్చాత్తప్త హృదయుఁడై కాగితపుముక్కలమీఁద "తిరిగి" అని వ్రాసి వానిని దాను తిరుగుస్థలములయందెల్ల నతికించెను. పిమ్మట కోపమువచ్చినప్పుడెల్ల నా కాగితములు కనఁబడుచుండుటచే లజ్జితుఁడై క్రోధమునకు వశుఁడు గాకుండెను.

క్రోధము గలుగునప్పుడు నిజదుర్బలత్వమును స్మరణకుఁ దెచ్చుటకుఁ గాను ఎవరినైన నియమించుకొనినయెడల క్రమక్రమముగ క్రోధము తగ్గిపోవును. ప్రతివాఁడును క్రోధసమయమునందు తన్నుఁదాను మఱచిపోవుచుండును. కాఁబట్టి

అట్టిసమయమునం దెవ్వఁడైనను, మృదుమధురవాక్యముల తో కోపమువలనఁ గలుగునష్టములను స్మరణకుఁ దెచ్చిన యెడలఁ గోపము చల్లాఱుననుట నిశ్చయము. కాని యీ విధముగ స్మరణకుఁదెచ్చువాఁడుకోపస్వభావముగలవాఁడైన చో మేలు గలుగుటకు మాఱుగఁ గీడు గలుగును. క్రోధపర వశుఁడైనప్పుడు కఠినవాక్యములతో దోషములను గనఁబఱు చినయెడల క్రోధము తగ్గకుండుటయే గాక వృద్ధి యగును. క్రోధపరవశుఁడై యున్నప్పు డద్దమును జూచుకొనినయెడల తనవికృతాకారము తనకే యసహ్యముగఁ దోఁచుటవలన క్రోధనివృత్తి యగును.

(౫) కోపమువచ్చినప్పుడు మాటాడకుండుటవలన కోపము చల్లాఱును. "ప్లేటో" ఈయుపాయమువలన కోపమును నశింపఁజేసికొని యున్నాఁడు. ఆయన క్రోధావిష్టుఁడై నప్పుడు నీరవముగ నుండువాఁడు. తదుపరి దేని నేవిధముగ శాసింపవలయునో దాని నావిధముగ శాసించువాఁడు. ఒకా నొకదినమున క్రోధాన్వితుఁడై నీరవముగఁ గూర్చుండి యుండిన ప్లేటోను జూచి యేమిచేయుచున్నారని యొకానొ కమిత్రుఁ డడుగఁగా, "నేనొకక్రుద్ధవ్యక్తిని శాసించు చు న్నాను." అని చెప్పెను. కావున క్రోధసమయమునం దెవ్వ రిని దండింపఁజనదు. క్రోధము తగ్గి చిత్తము ప్రశాంతముగ నున్నప్పుడు దండింపవలయును.

క్రోధము గలిగినప్పుడు, స్థానమును మార్చుకొనుట మంచిది. "నూటివఱకు అంకెలను లెక్కించినపిమ్మట క్రోధమును వెల్లడింపుము." అనుసామెత క్రోధశమనమునకు మిక్కిలి సహకారి. అంకెలను నూటివఱకు లెక్కించునంతలో క్రోధోద్రేకము తగ్గిపోవును. క్రోధము గలిగినప్పు డుచ్చైస్స్వరమున నీశ్వరనామమును స్మరించినయెడల విముక్తుఁడ వగుదువు. మన స్సన్యవిషయములలోనికిఁ జొప్పించినను గూడ క్రోధశమన మగును.

(౬) ఉపేక్ష క్రోధమునకు భయంకర మగుశత్రువు. కాఁబట్టి యుపేక్షాభావము గలిగి యుండువానిహృదయమునందు క్రోధతరంగములు పుట్టఁజాలవు.

"శ్లో॥ సుఖం హ్యవమతః శేతే సుఖఞ్చ ప్రతిబుధ్యతే।
సుఖఞ్చరతి లోకేఽస్మి న్నవమన్తా వినశ్యతి॥" మను.

"అవమానింపఁబడినవాఁడు సుఖముగా శయనించును. సుఖముగా మేలుకొనును. సుఖముగా సంచరించును. అవమానముచేసినవాఁడు నాశమునొందును." అన్యాయ్యమును జేసినవాఁడు దానివలనఁ గలుగుఫలము ననుభవించును. కావున మూర్ఖతవలన వాఁ డన్యాయ్యమునర్చినాఁడని తలంచి తిరిగి వానికి నే నన్యాయ్యమునర్చుట న్యాయ్యము గాదనియును, భగవద్విధి ననుసరించి నా కర్తవ్యముల నేను నెఱవేర్చుచుందు ననియును, చింతించుచుండినయెడల చిత్తము

ప్రశాంత మగును. చిత్తము ప్రశాంత మైనంతనే క్రోధము పలాయిత మగును.

(౨) కామము, లోభము, అహంకారము, పరదోష కీర్తనము మొదలగునవి తగ్గిపోయినకొలఁదిని క్రోధము తగ్గిపోవుచుండును. కామము, లోభము మొదలగువానికి ఆటంకములు గలిగినను, పరులదోషములను దర్శించినను, క్రోధము పుట్టును.

"శ్లో॥ లోభాత్ క్రోధః ప్రభవతి పరదోషై రుదీరితః।
క్షమయా తిష్ఠతే రాజన్ క్షమయా వినివర్తతే॥"

మహాభారతము.

భీష్ముఁడు ధర్మరాజున కీవిధముగ బోధించియున్నాఁడు. "లోభమువలన క్రోధము పుట్టును. అది పరదోషకీర్తనము వలన నుద్దీప్తమగును. అది క్షమవలన బంధింపఁబడినివృత్తమగును." క్షమయు, శాంతియును, దయయు వృద్ధియైన కొలఁదిని క్రోధము హ్రస్వమగును. తత్త్వజ్ఞానము వృద్ధియైన కొలఁదిని క్రోధముయొక్క బలము తగ్గిపోవును. పరగుణకీర్తనామృతమును గ్రోలినకొలఁదిని క్రోధము నశించిపోవుచుండు ననుట నిక్కువము.

శ్లో॥ "పరాసూయా క్రోధలోభావన్తరా ప్రతిముచ్యతే।
దయయా సర్వభూతానాం నిర్వేదా ద్వినివర్తతే।
అవద్యదర్శనా ద్దేతి తత్త్వజ్ఞానాచ్చ ధీమతామ్॥"

మహాభారతము.

క్రోధలోభములనుండి అసూయ జన్మించును. సర్వభూత దయవలన అసూయ నశించును. నీచమును, నిందనీయమునగు దానిని చూచినప్పుడు అసూయ జన్మించును. అది తత్త్వ జ్ఞానమువలన నివృత్తి యగును. స్వల్పకాలములోనే యసత్యము నశించుననియును, సత్యము శాశ్వతముగ నిలిచియుండుననియును, దలంచు చుండినయెడల అసూయ మొదలగునవి దూర మగును.

"ప్రతికర్తుం నశక్తా యే బలస్థా యాపకారిణే।
అసూయా జాయతే తీవ్రా కారుణ్యాద్వినివర్తతే॥"

"అపకార మొనర్చిన బలవంతునకు ప్రత్యపకారము జేయుటకు సమర్థత లేనివానికి మిక్కిలి అసూయ కలుగును. అది కరుణను చూపుటవలన నివృత్తి యగును." భగవద్దత్తమైన శక్తిని దుర్వినియోగపఱచు శత్రుండు మిక్కిలి కృపాపాత్రుండని తలంచుచుండినయెడల అసూయ దూర మగును.

ఇందువలన అసూయతోడను, అన్యాయముతోడను, అపవిత్రతతోడను ప్రతిఘటింపరా దని తలంపఁజనదు. వీనికి ప్రతీకార మొనర్పఁజనదు గాని, ప్రతివాదము చేయనగును. అన్యాయముగాని, అసత్యముగాని, అపవిత్రతగాని, కనఁబడినయెడల వానికి విరుద్ధముగ మేఘగంభీరవాక్యములతోడ గర్జించుటయేగాక, వానిని దొలఁగించుటకుఁగాను ప్రాణము నర్పించి పని చేయవలయును కాని మనోవికారము గలుగ

నుండునటుల జాగ్రత్త గలిగి యుండుము. ప్రశాంతభావమున ఖడ్గమును చే ధరించి పాపమునకు విరుద్ధముగ నగ్రేసరుండవు గమ్ము. శ్రీకృష్ణుం డర్జునునకు యుద్ధముచేయ ననుజ్ఞ యిచ్చినభావమున పాపముతోడం బోరాడుము. కర్తవ్యానురోధమువలన భగవద్విధిని సంరక్షించుటకొఱకు బద్ధపరికరములతోడ అసత్యముతోడను, అన్యాయముతోడను, అపవిత్రతతోడను సంగ్రామ మొనర్పవలయును. కాని చిత్తమునం దణుమాత్రమైనను క్రోధముండంజనదు. ఈవిధముగ సంగ్రామమునందు ప్రవర్తింపనివాండు రాక్షసుండు. వాండు భగవద్విరోధి. జోసఫ్ మ్యాజ్జిని యీవిధముగ నుడివియున్నాండు. “ నీసమీపమునం దేవిధమగు నపవిత్రత కనంబడినను గూడ దానికి విరుద్ధముగ అస్త్రధారణ మొనర్పనియెడల నీవు విశ్వాసఘాతకుండ వగుదువు.” పాపమునకు విరుద్ధముగ నడుము గట్టనివాండు, భగవత్సాన్నిధ్యమునందు విశ్వాసఘాతకుండు. మహాభాగతమునందు కశ్యపుండు ప్రహ్లాదున కిట్లు చెప్పియున్నాండు.

> “ విద్ధో ధర్మో హ్యధర్మేణ సభాం యత్రోపపద్యతే।
> న చాస్య శల్యం కృన్తన్తి విద్ధాంస్తత్ర సభాసదః।
> అర్ధం హరతి వై శ్రేష్ఠః పాదో భవతి కర్తృషు।
> పాదశ్చైవ సభాసత్సు యే న నిన్దన్తి నిన్దితమ్।

అనేన భవతి శ్రేష్ఠో ముచ్యన్తే చ సభాసదః।
ఏనోగచ్ఛతి కర్తారం నిన్దార్హో యత్ర నిన్ద్యతే॥”
సభాపర్వము. భారతము.

“అధర్మముచేత బాధింపఁబడిన ధర్మము ప్రతీకారము కొఱకు సంఘమును జేరును. అనఁగా నొకనరహత్య జరిగిన దను కొనుఁడు. అప్పుడు సాంఘికులు ధర్మమును రక్షించుటకు ప్రయత్నింపనియెడల, సగముపాపము సంఘనాయకునకును సంక్రమించును. నాల్గవవంతు మూకీభావమును వహించినవారి కిఁ జెందును. మిగతనాల్గవవంతు మాత్రమే అపరాధిని చుట్టుకొనును. కావున పాపి శిక్షింపఁబడనంతవఱ కాపాపము సంఘముదేయై యుండును.

(౮) క్రోధనివారణకొఱకు కొన్ని శారీరకనియమములను గమనించుట కర్తవ్యము. క్రోధమును బలపఱుచునట్టి వస్తువులను, భుజింపఁజనదు. క్రోధము రజోగుణమువలనఁ బుట్టునని వెనుకనే చెప్పియున్నాను. అందువలన రాజస పదార్థములు వర్జనీయములు. క్రోధస్వభావము గలవారలు శరీరమును శీతలముగ నుంచుకొనుటకును పైత్త్యమును వృద్ధి కానీకుండుటకును, సర్వదా యత్నించు చుండవలయును. ప్రతిదినమును బాగుగ కాళ్లు చేతులు మోమును గడుగు కొను చుండినయెడల కొంతవఱకు క్రోధము తగ్గిపోవును. మహమ్మదీయు లీకారణముననే నమాజునకు పూర్వము కాళ్లు

చేతులు మోమును కప్పుకొనుచుందురు. చిత్తము ప్రశాం
తముగ నుండుటయే దీనియుద్దేశము.

పైని వివరించిన యెనిమిదివిధములగు క్రోధజనిత దోష
ములనుండియు, సర్వదా రక్షించుకొనుచుండుటకుఁ బ్రయ
త్నించుచుండవలయును. క్రోధముయొక్క అవసరముగల
స్థలములయందు క్రోధమును గనఁబఱుపనియెడల సంసార
కార్యములు నడచుట కష్టమని కొందఱు దలంపవచ్చును.
అట్టివారు క్రోధమునకంటె మృదుత్వమువలన నధికఫలము
చేకూఱునని యెఱుంగరు. చెడుమార్గమునందు సంచరించు
బాలుని మంచిమార్గమునందు నడిపించుటకు, మృదుత్వము
పనిచేసినట్లు క్రోధము పనిచేయఁజాలదని ఉపాధ్యాయులు
మాత్రమే సాక్ష్యమీయఁగలరు. కఠినశాసనమువలన నేది
యిన ఫలము చేకూఱినయెడల దానికంటె వేయిరెట్లు
ఫలము మృదుత్వమువలన చేకూఱుననుట నిక్కము. కావున
క్రోధాన్వితుఁడగువాఁ డెవ్వఁడైనను నీకపకారము నొనర్ప
వలయునని వచ్చినయెడల అట్టిసమయమునందు నీవు మృదు
త్వమును గనఁబఱిచినచో క్రోధము పరాభవింపఁబడును.

“ మృదునా దారుణం హన్తి మృదునా హన్త్యదారుణమ్।
నాసాధ్యం మృదునా కిఞ్చి త్తస్మాత్తీవ్రతరం మృదుః॥”

మహాభారతము.

"మృదుత్వమువలన కఠినత్వమును మృదుత్వమునుగూడ వశపఱుచుకొనవచ్చును. మృదుత్వమున కసాధ్య మగు కార్య మెద్దియును లేదు. కావున కఠినత్వముకంటె మృదుత్వమే బలవత్తరమైనది." కావున మృదుత్వమునే యవలంబించుట కర్తవ్యము. ఎప్పుడైనను మృదుత్వమువలన ఫలము చేకూఱదని తోఁచినయెడల సాధుపురుషులవలె క్రోధమును వెల్లడింపుము.

"సాధోః ప్రకుపితస్యాపి మనో నాయాతి విక్రియామ్ ।
నహి తాపయితుం శక్యం సాగరాంభ స్తృణోల్కయా॥"

"సాధుపురుషుఁడు కోపపూరితుఁడైననుగూడ వానిచిత్తము వికృతముగాదు. సాగరజలము నెప్పుడును తృణోల్కముల చేత నుష్ణమును చేయఁజాలము." సాధుపురుషులు మాఱటంపు క్రోధము క్రోధము గాదు. వారు బాహ్యమునందు నన్యాయములను శాసించుటకై క్రోధమనుబాణమును ప్రయోగింతురు. కాని యందువలన, వారిహృదయములం దేవిధమగు వికారములును బుట్టవు. అవసరము తటస్థించినప్పుడు సాధుపురుషులవలెనే మనముగూడ వికృతములుగాని చిత్తము లతోడ క్రోధమును జూపవచ్చును. క్రోధమును జూపుముగాని అపకారము చేయఁబనదు. ఒకానొకదినమున నారదుఁడు వీణాపాణి యై హరినామమును బాడుచు, వైకుంఠమున కేఁగుచుండెను. మార్గమధ్యమునం దొకసర్పము నారదునిఁజూచి "వైకుంఠమునకు మార్గమెద్ది?" అని ప్రశ్నిం

చెను. నీ వెవరిని కఱవకుండుటయే మోక్షమార్గ మని నారదుఁడు ప్రత్యుత్తరమిచ్చి వైకుంఠమున కేఁగెను. అప్పటి నుండియు సర్పము నారదోపదేశానుసారముగ అతి ప్రశాంతభావమున జీవయాత్ర గడపుచుండెను. పసుల కాపరు లగుబాలు రాసర్పమును బాధింపఁజొచ్చిరి. కాని సర్పము పడగ విప్పదాయెను. సర్పము బాలురు కొట్టు దెబ్బల కోర్చి యతికష్టముమీఁద కాలయాపనముఁ జేయు చుండఁగా తిరిగి నారదుఁ డామార్గమునం దొకానొకదినము సం దేఁగుచు దీనిని జూచి "ఏవిధముగనున్నావు?" అనియడి గెను. సర్పము "అయ్యా! నారదా! భవదుపదేశానుసారముగ ప్రవర్తించుటవలన నాశరీర మెట్లయినదో చూడుము' కాఁపువాండ్రపిల్లలు పెట్టు బాధలవలన నాప్రాణము కంఠగతమై యున్నది. కప్పలుగూడ నన్నుఁజూచి పరిహసించు చున్నవి. ఇట్లు జీవనయాత్ర గడపు టెట్లు? నేనేమి చేయుదును?" అని చెప్పెను. నారదుఁడు నేను నిన్ను బుసకొట్టఁగూడదని నిషేధించి యుండలేదు. కాటు వేయఁగూడదని మాత్రము నిషేధించియున్నాను." అని ప్రత్యుత్తరమిచ్చెను. ఈవాక్యములను విని సర్పము తిరిగి బుసకొట్టుటకుఁ బ్రారంభించెను. ఇందువలనదీనిని భయపెట్టువారలుపలాయితులైరి. కావున పృథివియం దప్పుడప్పుడు కోపముండునటుల నటింపవలసిన యవసరముండును గాని, అపకారము చేయవలసినయవ

సరము మాత్రముండదు. మనమెవ్వరికిని ఎప్పుడును అపకార
మును చేయకుందుము గాక. ఈశ్వరుని కృపవలన మనహృ
దయసీమలనుండి క్రోధమును పాఱఁద్రోలఁగల శక్తిని సంపా
దించుకొందుము గాక.

---

# లోభము

(౧) "లోభముయొక్క విషయము లెవ్వి? లోభమును సార్థకము చేసికొనిన యెడల దానివలనఁ గలుగుసుఖ మెంతకాలముండును? లోభముయొక్క పరిణామ మేమి?" అనువిషయమునుగూర్చి చింతించుచుండు నెడలలోభము క్రమ క్రమముగఁ దగ్గిపోవును. భోగములయొక్క అస్థిరత్వమును గ్రహించినకొలందిని లోభము పలాయిత మగుచుండును. భీష్ములవారు ధర్మరాజున కిట్లు నుడివియున్నారు.

"శ్లో॥ అజ్ఞానప్రభవో లోభో భూతానాం దృశ్యతే సదా।
అస్థిరత్వఞ్చ భోగానాం దృష్ట్వాజ్ఞాత్వా నివర్తతే॥"
మహాభారతము.

"అజ్ఞానమువలన లోభము పుట్టును. భోగములయొక్క అస్థిరత్వమును గ్రహించినయెడల లోభము నశించిపోవును." కన్నులు చెవులు ముక్కు నాలుక మొదలగు నింద్రియములకు భోగ్యవస్తువు లగు ధనము, యశస్సు మొదలగునవి లోభమునకు విషయములు. స్థిరచిత్తమున చింతించినయెడల లోభముయొక్క విషయము లస్థిరములనియును, నీచములని యును దెలియనగును. ఇంద్రియభోగ్యము లగువిషయములే

కాక, యశస్సు మానము సంభ్రమము మొదలగునవి గూడ నస్థిరములు. వీనియొక్క అసారత్వమును అస్థిరత్వమును గ్రహించి బుద్ధదేవుఁడీవిధముగ ఛందకునను నుడివియున్నాఁడు. "ఓ ఛందకా! ఈభోగ్యవిషయవస్తువులన్నియు, మార్పు చెందునవియును అనిత్యములు నైయున్నవి. వీనిపరిణామము మిక్కిలి దుఃఖజనకము. ఇవి క్షణస్థాయులై, చపలములై, సెలయేళ్లవలె వేగముగఁ బ్రవహించుచుండును. శిశిరబిందువుల వలె స్థిరత్వములేక మిక్కిలి శోకమును గలిగించుటకు కారణములైయున్నవి. పిడికిటియం దేదియో గలదని యాసనొంది చూచునప్పటికి పిడికిటియం దేమియు లేనటుల నే యివి యన్నియు శూన్యములు. అరఁటిచెట్టునకుంబోలె దుర్బలతయు ఉడుకనిభోజనపదార్థములకుంబోలె వేదనాకరలయు మెఱుపుదీఁగకుంబోలె చంచలతయు విషభోజనమువలె దుఃఖమును వీనివలనఁ గలుగు ఫలములైయున్నవి. మాలులతవలె అసుఖప్రదములును, బాలకుఁడు వ్రాసినచిత్తరువువలె నసారములును జలబుద్బుదమువలె క్షణభంగురములును ఎండమావులవలె మిథ్యలును అగునివి చిత్తవికారమువలనఁ బుట్టుచున్నవి. ఇవి మాయాసదృశ మగుచిత్తవిభ్రమముచే నుద్దీపితము లగుచున్నవి. స్వప్నసదృశములగు వీనివలన జ్ఞాననేత్రములు తలక్రిందగుటచే మానవులు వీనిననుకరించెదరు. ఇవి సాగరమువలె దుఃఖతరంగపరిపూర్ణములును, లవణోదకమువలె

తృష్ణావర్ధకములునై యున్నవి. కావున అనుభవించినకొలం దిని భోగాసక్తి వృద్ధి యగుచుండును. అందువలన సర్పశిర మునుంబోలె వీనిని స్పృశింపఁగూడదు. భయంకరజలధారవలె పండితులచేతను, భయము విషాదము అభిమానము మొద లగుదోషములతో పరిపూర్ణ మగుటవలన ప్రజ్ఞావంతులచేతను విడువఁబడినట్టియు, విద్వాంసులు గర్హించునట్టియు, ఆర్య కులముచేత నిందింపఁబడినట్టియు, బుధులచేత పరిత్యజింపఁ బడినట్టియు, మూర్ఖులచేత స్వీకరింపఁ బడినట్టియు, నివి బాలస్వభావులచేత పోషింపఁబడుచున్నవి. సర్పమస్తకము వలె బుధులచేత విడువఁబడినవియు, మూత్రభాండారము వలె గర్హితములును అగు నీసర్వసుఖములు నాశనమునొందు నట్టివి గావున, కామవిషయమునందు నాకు రతి జన్మించుట లేదు. ("లలితవిస్తరము") శాక్యసింహుఁడు వర్ణించిన నీచ ములును సర్వనాశనకరములును, నగువిషయభోగముల నను భవించినను గూడ అసుఖ మెంతకాలమువఱకు నిలిచియుం డును? మహాకవియగు భారవి యిట్లు నుడివియున్నాఁడు.

"శ్వస్త్వయా సుఖసంపత్తిః స్మరణీ యాధునాతనీ
ఇతిస్వప్నోపమాన్మత్వా కామాన్మాగా స్తదఙ్గతామ్॥"

"నేఁడనుభవించుసుఖములయొక్క యనుభవము రేపటి కుండునెక్కడ? వానిస్మరణమాత్రమునిలిచియుండును. దీనిని దెలిసికొని యెప్పుడును కామముయొక్క విషయసముదా

యములను స్వప్నతుల్యముగ భావించి, వానికి లోఁబడఁ
జనదు."

క్షణస్థాయి యైనసుఖ మేవిధముగ సుఖ మగును? ఇది అతిమధుర మైనప్పటికిని గూడ చివరకు విషమయ మగును. లోభముయొక్క విషయసముదాయములను గూర్చి బుద్ధదేవుఁడు "విషభోజనమివ విపరిణామదుఃఖాః" (విషభోజనమునందువలె దుఃఖమే దీనియొక్క పరిణామము) అని చెప్పియున్నాఁడు.

"శ్రద్ధేయా విప్రలబ్ధారః ప్రియా విప్రియకారిణః ।
సుదుస్త్యజా స్త్యజన్తో ఽపి కామాః కష్టాహిశత్రవః॥"

కిరాతార్జునీయము.

"కామముయొక్క ఆకర్షణముమీఁద ప్రథమమందు విశ్వాసము పుట్టుననుట నిక్కమే కాని చివరకు మిక్కుటముగ వంచనగలుగును. ప్రథమమునందు దీనిమీఁద ప్రీతి యుత్పన్నమగుననుట నిక్కమే గాని చివరకు మిక్కిలి దుఃఖకారి యగును. దీనిని విడువవలయునని మనమునందుఁ దలంచుచుండియుఁగూడ దీనిని విడువఁజాలము. కావున నిది ఘోరశత్రువు. "లోభమువలన పాపము గలుగును, పాపమువలన మృత్యువు గలుగును." అనుసామెత మంచిసత్యమును వెల్లడించుచున్నది.

" లోభాత్ క్రోధః ప్రభవతి లోభాత్ కామః ప్రజాయతే
లోభా న్మోహ శ్చ నాశ శ్చ లోభః పాపస్యకారణమ్॥"
హితోపదేశము.

"లోభమువలన క్రోధము, కామము, మోహమును బుట్టుచున్నవి. ఇందువలన వినాశనము గలుగుచున్నది. కావున లోభమే పాపములకుమూలము." లోభమును చరితార్థత నొందించుకొనుట కేవిధమగు నాటంకము గలిగినను క్రోధము పుట్టును. కావున లోభము గలుగు విషయముల యందు హృదయాకర్షణము మిక్కుటమై మానవుని మోహాంధునిగ నొనర్చును. అందువలన నాశివంయమును సమస్థాయిచ్చెట్లని భావించుటచే సత్యాసత్యజ్ఞానము నశించును. సత్యాసత్యజ్ఞానము లేనప్పుడు వినాశము గలుగును. ధనము యశస్సు అభిమానము మొదలగువానియాశవలన జ్ఞానము శూన్యముగుటయే గాక బుద్ధి చలించి, నానావిధము లగుదుర్మార్గముల నవలంబించి లోభపరితృప్తికొఱకుఁ బ్రయత్నించుచుండును.

" లోభః ప్రజ్ఞాన మాహన్తి ప్రజ్ఞాహన్తి హతా హ్రియమ్।
హ్రీ ర్హతా బాధతే ధర్మం ధర్మోహన్తి హతః శ్రియమ్."
మహాభాగతము.

"లోభము ప్రజ్ఞను నాశముచేయును. ప్రజ్ఞ నాశమైనంతనే లజ్జ నశించును. లజ్జనశించుటవలన ధర్మనష్టము గలుగును.

ధర్మము నష్టమగుటవలన, శ్రీ, శౌర్యము, మొదలగునవన్నియు నాశనమగును.''

“శ్లో॥ లోభేన బుద్ధి శ్చలతి లోభో జనయతే తృషాం।
తృషార్తో దుఃఖమాప్నోతి పరత్రేహ చ మానవః॥''
హితోపదేశము.

లోభమువలన బుద్ధి చలించును. లోభమువలన తృష్ణ జనించును. తృష్ణార్తుఁ డగువాఁ డీలోకమందును పరలోకమందును దుఃఖమును బొందును. లోభవిషయములనుగ్రహించినప్పటికిని గూడ లోభనివృత్తి గానియెడల లోభమును చరితార్థతనొందింపవచ్చునని యెవఁ డనను దలంపవచ్చును. భోగములవలన లోభమును దూరముచేయవలయునని తలంచుట లోభాగ్నియం దింధనములను వేయుటయే యని మనజీవితముల నుండియే తెలిసికొనవచ్చును. వృద్ధుఁ డగు యయాతిమహారాజు, యౌవనమును సంపాదించుకొని లోభనివృత్తుఁడ నగుదు నని తలంచి తనపుత్రులయౌవనమును దన కిమ్మని కోరెను. వారిలో “పురువు'' తన యౌవనమును తండ్రికి ధారపోసెను. కుమారునియౌవనముతోడ యయాతి సహస్రవత్సరములు నానాప్రకారములు లోభమును చరితార్థత నొందించుటకు ప్రయత్నించెను. కాని చివరకు లోభమున కంతములేదని తెలిసికొని పుత్రునిఁ బిలిచి యిట్లనియె.

“ యథాకామం యథోత్సాహం యథాకాలమరిన్దమ।
సేవితా విషయాః పుత్త్ర యౌవనేన మయా తవ॥
న జాతు కామః కామానా ముపభోగేన శామ్యతి।
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏ వాభివర్ధతే॥
యత్ పృథివ్యాం వ్రీహియవం హిరణ్యం పశవః స్త్రియః।
ఏకస్యాపి న పర్యాప్తం తస్మాత్తృష్ణాం పరిత్యజేత్।
యా దుస్త్యజా దుర్మతిభి ర్యా న జీర్యతి జీర్యతః।
యోఽసౌ ప్రాణాన్తకో రోగ స్తాం తృష్ణాం త్యజతః సుఖమ్॥
పూర్ణం వర్షసహస్రం మే విషయాసక్తచేతసః।
తథా ప్యనుదినం తృష్ణా మమైతే ష్వభిజాయతే।
తస్మాదేనామహం త్యక్త్వా బ్రహ్మణ్యాధాయ మానసమ్।
నిర్ద్వన్ద్వో నిర్మమో భూత్వా చరిష్యామి మృగై స్సహ॥ ”

మహాభాగవతము. నవమస్కంధము.

ఓ పుత్త్రా, నీ యౌవనమును గైకొని, యెప్పు డేకోరిక జనించినను, ఉత్సాహము గలిగినను, ఆవిధముగ విషయభోగములననుభవించియున్నాను. మఱియును, కాలము ననుసరించి విషయభోగము లనుభవించియున్నాను. కామభోగములవలన కామనివృత్తి గాకుండుటయే గాక, ఆజ్యమిడిన హోమాగ్నివలె వృద్ధినొందును. పృథివియం దున్న ధాన్యము, యవలు, సువర్ణము, పశువులు, స్త్రీలనందఱి నొక్క

నోఁ జేర్చినను గూడ నొక్కనితృష్ణయైనను నివృత్తి గాదు. కావున నీవు తృష్ణను పరిత్యజింపుము. దుర్మతులు విడువఁజాలనట్టిశరీరము సంపూర్ణముగ జీర్ణమైపోయినను, ప్రాణాంతకమును, మహారోగతుల్యమును నగు తృష్ణజీర్ణము గాదు. కావుననిట్టితృష్ణను త్యజింపఁగలిగినవాఁడే సుఖవంతుఁడు. నేఁటికి వేయివత్సరములనుండి విషయాసక్తచిత్తుఁడనై యున్నాను. కాని ప్రతిదినమును లోభముయొక్క విషయ సముదాయములయందు తృష్ణ జన్మించుచునే యున్నది. కావున నీతృష్ణను పరిత్యజించి బ్రహ్మయందు మనస్సునులగ్నముచేసికొని, సుఖదుఃఖాతీతుఁడను, మమతారహితుఁడనునై మృగములతోడ సంచరించుచుందును.'' తృష్ణకు మించినరోగ మింకొకటి లేదు. లోభము వృద్ధి యగుచుండువానికి చిత్తశాంతి యెట్లుండును? లోభశూన్యుఁడై విషయభోగములననుభవించుచుండినయెడల చిత్తము ప్రశాంతముగనుండును. కాని లోభరహితుఁడు గానియెడల చిత్తము శాంతముగనుండుటకు వీలు లేదు.

శ్లో॥ ఆపూర్యమాణ మచలప్రతిష్ఠం।
సముద్రమాపః ప్రవిశన్తి యద్వత్ ।
తద్వత్కామా యం ప్రవిశన్తి సర్వే ।
స శాన్తి మాప్నోతి న కామ కామీ॥

20 సాంఖ్యయోగము. భగవద్గీత.

" నదీనదముల ప్రవాహములవలన నిండుచున్నను, సముద్ర మెట్లు తనహద్దు మీఱక తనలోనికి వచ్చు జలము లన్నిటిని గ్రహించుచు, లేశమైనను వికారము చెందకయుండునో అట్లే శబ్దాదిసమస్తవిషయములను గ్రహించుచున్నను గూడ లేశమైనను వికారమును జెందకుండు యోగి, శాంతిని బొందును గాని, విషయసుఖములను కోరువాఁ డెన్నఁటికిని శాంతిని జెందఁడు."

(౨) లోభము గలుగు దిక్కునుండి చిత్తమును మరలింపవలయును.

శ్లో॥ యతో యతో నిశ్చలతి మన శ్చంచల మస్థిరమ్।
తత స్తతో నియమ్యైత దాత్మన్యేవ, వశం నయేత్॥
౬ అ. ఆత్మసంయమయోగము. భగవద్గీత.

" చంచలమును అస్థిరమును నగు మనస్సు ఏయేవిషయములయందుఁ దిరుగుచుండునో ఆవిషయములనుండి దానిని మరలించి ఆత్మయం దుండునట్లు స్వాధీనముఁ జేసికొనవలయును."

లోభదమనమున కింతకంటె మఱియొక మంచిసాధనము లేదు. చాంచల్యమును గలిగించు విషయముల కభిముఖముగ మనస్సును నడువనీయక, దానిగోరికను నెఱవేర్పని యెడల లోభము తగ్గిపోవును. భోజనపదార్థములకొఱకుఁ గాని, వస్త్రములకొఱకుఁ గాని, ఇతరపదార్థములకొఱకుఁ గాని

మిక్కుటమగు వ్యాకులత గలిగినప్పుడు వానిని సంగ్రహిం
పనియెడల లోభము పరాభవముఁ జెందును. సాధారణ
నియమములప్రకారగ మేపదార్థములనైన ననుభవింపవచ్చును,
అనఁగా మర్యాదగలవారలు ధరించుచున్న వస్త్రములను
జూచి తానుగూడ నట్టివానిని ధరింపవలయునని తలంచుట
వలనఁ గలుగుదోషము మిక్కిలి కొంచెము. కాని యీవస్త్ర
మును ధరించినయెడల సొగసుగానుండు ననియును, ఈవస్తు
వును సంపాదించినయెడల లోకులు గొప్పవాఁడనుకొందురని
యును, దలంపు గలిగినప్పుడు వెంటనే చిత్తమును శాసించుట
కర్తవ్యము. భోగము మేళమును చూడవలయు ననునిచ్ఛ
వొడమినయెడల నాయిచ్ఛ నెప్పుడును పూర్తిచేయవలదు.
నేఁడు మధురపదార్థములను భుజింపవలయు ననునిచ్ఛ జనిం
చినయెడల వాని నాదినమునం దెప్పుడును భుజింపఁ జనదు.
యశము, మానము, మొదలగువానివలన చిత్తము కలుషిత
మగుచుండును. హృదయమం దెట్టికలంకమును స్థాన మియ్యఁ
జనదు. యోగవాసిష్ఠరామాయణమునందు వసిష్ఠుఁడు
శ్రీరామచంద్రున కీవిధముగ నుపదేశించి యున్నాఁడు.

" మనాగభ్యుదితైవేచ్ఛా, ఛేత్తవ్యాఽనర్థకారిణీ
అసంవేదన శస్త్రేణ విషస్యేవాఙ్కురావలీ॥"

"చెడుగు చేయునట్టికోరిక లేశమైనను హృదయమునం
దుదయించినయెడల, విషవృక్షాంకురమును ఛేదించునటుల,

అననుభూతిరూప మగు శస్త్రముతో ఛేదింప వలయును.'' అనఁగా నాయిచ్ఛ సంపన్నము గానుండుటవలన నది నాశన మగును.

'ప్రత్యాహారబడిశేన ఇచ్ఛా మత్స్యం నియచ్ఛతే॥'

ఇంద్రియనిగ్రహ మనుగాలముతో కోరిక యను చేప పట్టఁబడును. ఇచ్ఛ యెప్పు డేదిక్కునకు పరుగిడుచుండునో దాని నాదిక్కునుండి మరలించుచుండవలయును. ఆకర్షింపఁ బడు వస్తువునకు కొంతదూరము నుండఁగలిగిన నంతమంచిది. హస్తగతము కాని పదార్థముపైని అధికారమును జేయుటకుఁ బ్రయత్నింపకు. హస్తగతమైనపదార్థముయొక్క యాకర్ష ణము అనుభవమునకు వచ్చినయెడల దానికి దూరము నుండుటకుఁ బ్రయత్నింపవలయును. లోభమును గలిగించు పదార్థములకు దూరము నుండినకొలఁదిని ఉపకారము గలుగును. ఒకానొకలోభి తాను పాతిపెట్టిన ధనమును దినమున కొకటిరెండుమారులు చూచి సంతసించుచుండెను. వాని నాశ్నియం దాహుతి నిడఁ గలందులకుఁగాను, వీఁ డవలం బించిన నీచమార్గములు గణనాతీతములు. ఒకానొకప్పు డీతఁడింకొకస్థలమునకేఁగుట తటస్థించెను. ఆసమయమునందు వీని ధనమంతయు బందుగులు చూఱకొనిరి. లోభి తిరిగి స్వగ్రామమునకు వచ్చి చూచునప్పటికి ఇంట నొకచిల్లిగవ్వ యైనను లేకుండెను. అప్పటి వాని మానసికావస్థను సులభ

ముగ గ్రహింపవచ్చును గదా? లోభి తలను మోదుకొనుచు, బిగ్గరగ నేడ్చుటకుఁ బ్రారంభించెను. వీఁడీవిధముగ నేడ్చుచుండునప్పుడు బంధుగులువచ్చి గృహమునందుఁగల సమస్త వస్తువులను బలవంతముగ లాగుకొని వెళ్ళిరి. ఇందువలన వీని దుఃఖమునకు మేరలేదయ్యె. వీఁడీవిధముగ నేడ్చుచుండఁగా, చిత్తమునం దాకస్మికముగ వేదనాశూన్యుఁ డాయెను. "ఈసమస్తమును బోవుటవలన నాకు మహోపకారము గలిగినది. ఈధనమును, వస్తుసముదాయమును, నాలి యయినయెడల నాయొద్దనే యుండెడివి. కావున నా కేమి భయము? నాదేదియో యది చిరకాలము నావెంటనే యుండును. ఈధనరాసులుగాని యితరవస్తువులుగాని మృత్యుసమయమునందు నావెంట రావు. లోభముచే వంచితుఁడనై యీమిథ్యాసముదాయమునందు బద్ధుఁడనైయున్నాను. కావున మృత్యుసమయమునం దిట్టిప్రేమతోఁ గూడుకొని యుండిన వస్తువులను వెంటఁదిసికొని పోవుటకు వీలు లేనందువలన మిక్కుటముగా మనోవేదనను బొందవలసి యుండును. వీనిమీఁద నిలిచియుండిన ప్రేమవలన నిత్యధనమును, చిరసంగియు నగుదానిని పోఁగొట్టుకొనియున్నాను. అయ్యో! నాకేమి కానున్నదోగదా?" అని యీవిధముగ విచారించుచుండఁగా వాని హృదయమునందు వైరాగ్య జ్యోతి ప్రకాశింపఁజొచ్చెను. అంతటనుండియు వాఁడు బంధ

విముక్తుఁడై వైరాగ్యజయమును జాటుటకుఁ బ్రారంభించెను. అప్పుడు బంధుగులు వానికి ముఖ్యాదరణీయ మగు ధనమును, తదితరవస్తువులను, తిరిగి సమర్పింపఁ బూనిరి. కాని వాఁడు వానిని గైకొనకుండెను. లోభి సమ్ముఖమునం దుండి లోభ జనకవస్తువులను దప్పించుటవలన వానికి మహోపకారము గలిగెను. లేనియెడల వీఁడు లోభసముద్రమునందుండి లేవఁ జాలక మునిఁగిపోవుచుండెడివాఁ డనుట నిక్కువము.

లోభ విషయములకు సర్వదా దూరముందుండుమని చెప్పుట వలన సంసారకార్యములను నిర్వహింపఁగూడ దని తలంప రాదు. సంసారమునం దున్నప్పు డనేకసమయములయందు ధనము, మానము, యశస్సు మొదలగునవి గలుగును. ఇతర భోగ్యవస్తువులు సమ్ముఖమం దుండును. కావున నీశ్వరాదేశానుసారముగ కర్తవ్యములను నిర్వహించుచుండవలయును. “నేను భగవానునకు దాసుఁడను. కావున నాయన కార్యములను నిర్వహించుచున్నాను. కాని, యశమును, మానమును, అక్కఱకు మించినధనమును గోరను. అట్లు ప్రవర్తించుచుండినను గూడ, యశస్సు, మానము, ప్రయోజనమునకు మించినధనము లభించినప్పు డేమి చేయుదును? ఓ భగవానుఁడా! నేను మదాంధుఁడను, బద్ధుఁడను, వికృతచిత్తుఁడను గాకుండునట్లనుగ్రహింపుము.” అను భావమున లోభ సంబంధమునం దుదాసీనుఁడవై, నిజోన్నతికిని పృథివియొక్క యున్నతికిని బ్రయత్నించుచుండుము.

(3) మనము కొన్ని కల్పితము లగు లేములను సృష్టించుకొని లోభమును వృద్ధి చేసికొనుచుందుము. "ఏయేవస్తువులు లేనియెడల కాలము గడవదు? ఏయేవస్తువులవలన నాకు వాస్తవమైన ప్రయోజనము కలదు?" అని స్థిరభావమున చింతించునెడల మనకు బహుస్వల్ప విషయములతోడ మాత్రమే ప్రయోజనము గలదని తెలిసికొందుము. నీకు పాలు, మీఁగడ, వెన్న, నెయ్యి, పప్పు, పంచదార మొదలగునవి భుజించుటకుఁ గావలయును. కాని సాధారణాహారమును భుజించుకృషీవలుఁడు నీకంటె తక్కువబలము గలవాఁడు కాఁడు సుమా! నీకు చక్కనిశయ్యయు, దోమతెరయు లేని యెడల నిద్ర రాదు. కాని సన్న్యాసి వృక్షమూలమునందుండు మృత్తికపైని నీకంటె వేయిమడుంగు లెక్కుడు సుఖముగ నిద్రపోవుచుండును. నీకంటె నధికముగ వానియందు శాంతిని జూడవచ్చును. నీకుపయుక్తమగు వాసస్థానము మేడయే గదా? ఎవరిచరణధూళినిగూడ ముట్టుటకు నీ వనర్హుఁడవో అట్టి గృహస్థులు సామాన్యపర్ణకుటీరములయందు నివసించుచు మృదుమధుర మందహాసములతోడ కుటీరమును ప్రకాశింపఁ జేయుచు పరమానందముగ కాలమును గడపుచున్నారు. నీవు "నేను గొప్పవాఁడను, నాయభ్యాస మిది, దీనిని ఎట్లు విడువఁగలను?" అని చెప్పవచ్చును. ఇట్టి యభ్యాసములకు దాసుఁడవై నీకంటె మిక్కుటముగ రాజసుఖములను కామ

భోగములను, ననుభవించినభర్తృహరి యీవిధముగ నుడివి యున్నాఁడు.

"భూః పర్యఙ్కో, నిజభుజలతా కన్దుకః, ఖం వితానమ్,
దీప శ్చన్ద్రో, విరతివనితా లబ్ధ సఙ్గప్రమోదః।
దిక్కాన్తాభిః పవనచమరై ర్వీజ్యమానః సమన్తాత్।
భిక్షుః శేతే నృపఇవ భువి త్యక్తసర్వ స్పృహోఽపి॥"

భర్తృహరి.

"సన్న్యాసి సమస్తములైన యాశలను వీడి రాజువలె శయనించి యున్నాఁడు. మృత్తిక యాయనకు పాన్పయి యున్నది. స్వహస్తములు దిండ్లైయున్నవి. మస్తకోపరిభాగమునం దాకాశమువిశాలమై చాందినీవలె నున్నది. చంద్రుఁడు దీపమువలె వెలుఁగు నిచ్చుచున్నాఁడు. సంసారమునం దనాసక్తియనునది భార్యయైయున్నది. పవన మనుచామరము వీఁచుచున్నది." ఆసన్న్యాసి మృత్తికమీఁద శయనించి రాజువలె సుఖభోగముల ననుభవించుచున్నాఁడు. కాని నీవు "ఆవస్తువులేక సాగుటెట్లు? ఈవస్తువులేక బ్రతుకుటెట్లు?" అని ప్రలాపవాక్యములను బలుకుచు పిచ్చివానివలెఁ దిరుగుచున్నావు.

"స్వచ్ఛన్దవనజాతేన శాకేనాపి ప్రపూర్యతే।
అస్య దగ్ధోదరస్యార్థే కః కుర్యాత్ పాతకం మహత్॥"

హితోపదేశము.

"వనజాతములగు శాకములు మొదలగువానివలన నాఁకలి దీరుచుండునప్పు డీదగ్ధోదరముకొఱకు ఎవఁడు మహాపాప కార్యములను జేయును ?"

మేకలు, గొఱ్ఱెలు, పక్షులు, ఆవులు, మొదలగువానిని వధించినఁగాని నీ కాహారము పూర్తి యగుట లేదు. కాని ధాన్యములు శాకములు పండ్లు మొదలగువానిని భుజించిన యెడల నీపొట్టనిండదా? నిండును గాని నీవు కొన్ని లేములను కల్పించుకొని "ఇది లేక జరుగదు. అది లేక జరుగదు." అని ప్రలాపములు పల్కుచుందువు. భోగాసక్తిని వదలి అనాయాసలభ్యములును ఆరోగ్యప్రదములును నగుపదార్థములను దినుచు ఆరోగ్యకరమగుశయ్యయందు శయనించుచు ఆరోగ్యప్రద మగుగృహమందు నివసించుచున్నయెడల లోభము తగ్గిపోవును. మనస్సును ప్రాణమును శరీరమును, సుఖముగా నుంచుకొనుటకు మనకుఁ గావలసిన వస్తువులసంఖ్య బహు స్వల్పము. వానిని సంగ్రహించుటవలన లోభమువృద్ధినొందదు. మన సర్వనాశనమునకు కల్లలేములే కారణములు. "మర్త్యభూమియందు మానవుని లేము లతిస్వల్పములు. ఆలేములు గూడ నధిక దినములకొఱకుఁ గావు." అను నీసత్యమును చిత్తమునందుంచుకొని యిది కావలయు నది కావలయు నని కోరక లభించినదానితోడనే సంతుష్టినొంది యుండుము.

"సన్తోషామృతతృప్తానాం యత్సుఖం శాన్తచేతసామ్।
కుతస్తద్ధనలుబ్ధానా మితశ్చేతశ్చ ధావతామ్॥"

హితోపదేశము.

"సంతోషామృతమువలన తృప్తులగు శాంతచిత్తులకుఁగల సుఖమువంటి సుఖము 'ఇదికావలయు నదికావలయు' నని తిరుగుచుండు ధనలుబ్ధుల కెట్లు లభించును?"

—∞◆∞—

# మో హ ము.

మోహము సమస్తపాపములకు మూలము. అజ్ఞానమునే అవిద్యయనియు, మోహమనియును జెప్పుదురు. మోహమనఁగనే అనాత్మ యని ఆత్మగలవాఁడు గ్రహించును. మోహము వలన నష్టచిత్తుఁడైనవాఁడు అస్థాయిని అధ్రువమును కష్టమును తాపమును శోకమును, స్థాయియనియు ధ్రువమనియు పరమానందమునకు నిదానమనియుఁ దలంచి యెప్పుడును తనది కానిదానిని తనకు కొంచెమైనను నధికారములేని దానిని "నాది నాది'' యని చెప్పుచు నది లేమిచే నష్టరుఁడైయుండును. ఈదేహము నాదియా? నాదియైనయెడల తెల్లని వెండ్రుకలను నల్లనివానినిగాఁ జేయఁజాలనా? ఈగృహము నాదియా? నాదియే యైనయెడల చిరకాలమిందేల నివసింపఁజాలను? ఇవి యన్నియును మనవి గావు. చివరకు మన వాకిటియందున్న యిసుకరేణువు గూడ మనది గాదు. కాని క్రమానుగతముగ దివారాత్రము మనప్రక్కలందుండు వస్తువులు మనవి యనుభావము మనహృదయమునం దేల యుదయించు చుండును? తల్లి, తండ్రి, భార్య, పుత్త్రిలు గూడ నావారలు గావు. కాని సర్వదా హృదయమునందు

“నాది నాది” యని ధ్వని చేయుచున్న దేది? ఇట్టిభ్రమను గలిగించుదానిపేరు మోహము.

“ మమ పితా మమ మాతా మమేయం గృహిణీ గృహమ్।
ఏవంవిధం మమత్వం యత్ స మోహ ఇతి కీర్తితః॥”
పద్మపురాణము.

నాతల్లి, నాతండ్రి, నాభార్య, నాగృహము, “నాది నాది” అనుజ్ఞానమునే మోహమందురు. సమస్తపాపములను బుట్టించునది మోహము. మోహమే లేనియెడల అసారములును అనిత్యములును నగువిషయములయందు దేనికిని లోభము జనింపదు; ధనము మానము మొదలగువానివలన నెవ్వఁడును గర్వింపఁడు. పరులైశ్వర్యము మొదలగువానిని జూచి యెవ్వనిచిత్తమును కలుషితముగాదు. తుచ్ఛమును నీచమును నగు పిశాచములరంగభూమిని సుదృశ్యదృశ్యములతోడ రంజితముగఁ జేయుశక్తి కామమున కుండదు. సమస్తపాపములు మోహమువలన నన్నఁగా అజ్ఞానమువలనఁ బుట్టును.

(౧) అజ్ఞానమును నశింపఁజేయుటకు జ్ఞానమే బ్రహ్మాస్త్రము. జ్ఞానముగలిగినంతనే అజ్ఞానము నశించును. జ్ఞానసూర్యోదయమైనంతనే మోహాంధకారము పలాయితమగును. జ్ఞానోపార్జనకు తత్త్వచింతయు, శాస్త్రాలోచనయు, ముఖ్యసాధనములు. “నేనెవరు? మనమెవరు? ఈబంధనములెట్టివి? మోక్షమెట్టిది?” అనునీవిధముగ విషయవిచారణకుఁ గడంగిన

కొలఁదిని మోహము దూరమగుచుండును. "నాశరీరము నేను గాకున్నను, మాయచేత నిందు బంధింపఁబడి యున్నాను." అను నీవిధమగు తత్త్వాలోచనముఁ గడంగినకొలఁదిని మోహము నశించుచుండును.

"శ్లో॥ కృశోఽతిదుఃఖీ బద్ధోఽహం హస్తపాదాదిమానహమ్।
ఇతి భావానురూపేణ వ్యవహారేణ బధ్యతే।
నాహం దుఃఖీ న మే దేహో బన్ధః కస్యాత్మని స్థితః।
ఇతి భావానురూపేణ వ్యవహారేణ ముచ్యతే॥
నాహం మాంసం నచాస్థీని దేహాదన్యః పరోహ్యహమ్।
ఇతి నిశ్చయవానన్తః క్షీణావిద్యో విముచ్యతే।
కల్పితైవ మవిద్యేయ మనాత్మన్యాత్మభావనాత్।
పరమేణాప్రబుద్ధేన నప్రబుద్ధేన రాఘవ॥"

యోగవాసిష్ఠము.

మహర్షి యగువసిష్ఠుఁడు శ్రీరామచంద్రున కీవిధముగ నుపదేశించియున్నాఁడు. "నేను కృశుఁడను, దుఃఖిని, బద్ధుఁడను, హస్తములు పాదములుగల జీవుఁడను." అను నేతద్విధభావానురూపవ్యవహారమువలన మనుష్యుఁడు మోహపాశములచేత బద్ధుఁడగును. "నేను దుఃఖిని గానుకావున నాకు బంధనము లెట్లుండును?" అను నేతద్విధభావానురూప వ్యవహారమువలన మనుష్యుఁడు మోహపాశములనుండి విముక్తుఁడగును. "నేను మాంసము గాను, అస్థులును గాను. నేను

దేహమునకు భిన్నుఁడగు నాత్మను." అను నీవిధమగు నిశ్చయ జ్ఞానమువలన హృదయాంతరాళమందుండు నవిద్యను నాశన మొనర్చుకొనినవారలు ముక్తులగుచున్నారు. ఓ రాఘవా! అజ్ఞాని అనాత్మవస్తువునం దాత్మభావనమువలన అవిద్యను గల్పించుకొనును; కాని జ్ఞాను లట్లు కల్పించుకొనరు. శ్రీశంకరాచార్యులవా రిట్లు నుడివియున్నారు.

"కా తవ కాన్తా క స్తే పుత్రః
సంసారోఽయ మతీవవిచిత్రః।
కస్య త్వం వా కుత ఆయాత
స్తత్త్వం చిన్తయ త దిహ భ్రాతః॥"

"నీ భార్య యెవరు? నీ పుత్త్రుఁ డెవఁడు? ఈ సంసారము అతివిచిత్రము. నీ వెవరు? ఎచ్చటనుండి వచ్చితివి? ఓ భ్రాతా, ఈ తత్త్వమును చింతింపుము." ఈవిధముగ చింతించుటవలన జ్ఞానోదయమగును. అప్పుడు మోహము నిల్వఁజాలదు. మోహము దూరమైనంతనే పరమానందమునకు నివాసమగు బ్రహ్మనిష్ఠ జనించును. వసిష్ఠులవారీ జ్ఞానమువలన మోహము నశించి బ్రహ్మనిష్ఠ యుదయమగు నని తెలిసికొనుటకుఁగా నీవిధముగఁ జెప్పియున్నారు.

"ఇమాం సప్తపదాం జ్ఞానభూమి మాకర్ణయానఘ
నానయా జ్ఞాతయా భూయో మోహపఙ్కే నిమజ్జతి॥"

"ఓరాజా, జ్ఞానభూములు నాఁబరఁగు నీయేడింటిని వినుము. వీనిని దెలిసికొనినయెడల నీవు మోహపంకమునందుఁ దగుల్కొనవు."

"జ్ఞానభూమిః శుభేచ్ఛాఖ్యా ప్రథమా సముదాహృతా।
విచారణా ద్వితీయా స్యా త్తృతీయా తనుమానసా।
సత్త్వాపత్తి శ్చతుర్థీ స్యా త్తతో౽సంసక్తినామికా।
పదార్థభావనా షష్ఠీ సప్తమీ తుర్యగాగతిః॥"

"శుభేచ్ఛ" ప్రథమజ్ఞానభూమి. "విచారణ" ద్వితీయ జ్ఞానభూమి. "తనుమానస" తృతీయజ్ఞానభూమి. "సత్త్వాపత్తి" చతుర్థజ్ఞానభూమి. "అసంసక్తి" పంచమజ్ఞానభూమి. "పదార్థభావన" షష్ఠజ్ఞానభూమి. "తుర్యగగతి" సప్తమ జ్ఞానభూమి.

"స్థితః కిం మూఢ ఏవాస్మి ప్రేక్ష్యో౽హం శాస్త్రసజ్జనైః।
వైరాగ్యపూర్వమిచ్ఛేతి శుభేచ్ఛేత్యుచ్యతే బుధైః॥"

"నే నేల మూఢుఁడనై యున్నాను. వైరాగ్యభావముతోడ శాస్త్రాలోచనసేయఁగడంగుదును. సజ్జనులతోడఁ గలయుదును." అను నీవిధమగు నిచ్ఛను ప్రథమజ్ఞానభూమి యగు "శుభేచ్ఛ" యని పండితులు చెప్పుదురు.

"శాస్త్రసజ్జనసంపర్క వైరాగ్యాభ్యాసపూర్వకమ్।
సదాచారప్రవృత్తా యా ప్రోచ్యతే సా విచారణా॥"

శాస్త్రాభ్యాస సజ్జనసాంగత్యములవలనఁ గలుగు వైరాగ్యాభ్యాస పూర్వకమగు సత్యమేది? అసత్యమేది? స్థిరమేది? ఆత్మయేది? అనాత్మయేది? కర్తవ్యమేది? అకర్తవ్యమేది? బంధనమేది? మోక్షమేది? అను విచారణతో సదాచారప్రవృత్తుఁడగుటను, ద్వితీయజ్ఞానభూమి యగు "విచారణ" యని చెప్పుదురు.

"విచారణా శుభేచ్ఛాభ్యామిన్ద్రియార్థేష్వసక్తతా ।
యత్ర సా తనుతాభావాత్ ప్రోచ్యతే తనుమానసా॥"

శుభేచ్ఛ జనియించినపిమ్మట, సదసద్వివేక విచారణవలన నింద్రియభోగ్య విషయములయందు రతి జనియింపకుండుటను "తనుమానస" యందురు. అనఁగా, నీయవస్థయందు చిత్తము విషయములదిక్కున కేఁగుట కిచ్చగింపదు. అందువలన మనస్సునకు స్థూలత్వము నశించి సూక్ష్మత్వము ప్రాప్తించును.

"భూమికాత్రితయాభ్యాసాచ్చిత్తేర్థే విరతేర్వశాత్ ।
సత్త్వాత్మని స్థితే శుద్ధే సత్త్వాపత్తిరుదాహృతా॥"

శుభేచ్ఛ, విచారణ, తనుమానస, సత్త్వాపత్తి, యనునీ నాల్గింటిని అభ్యాసముచేయుటవలన సాత్త్వికభావముదయించును. అందువలన విషయాసక్తి సమూలముగ నష్టమగును. దీనినే "అసంసక్తి" యందురు.

"భూమికాపఞ్చకాభ్యాసాత్ స్వాత్మారామతయాభృశమ్
ఆభ్యన్తరాణాం బాహ్యానాం పదార్థానామభావనాత్,

పరంప్రయుక్తేన చిరం ప్రయత్నేన విబోధనమ్।
పదార్థభావనా నామ షష్ఠీ సఞ్జాయతే గతిః॥"

శుభేచ్ఛ, విచారణ, తనుమానస, సత్త్వాపత్తి, అసంసక్తి, యనునీయైదింటిని అభ్యాసముచేయుటవలన బ్రహ్మయందు లీనమగును. అందువలన బాహ్యాంతరములయందలి పదార్థములయందుండుచింతదూరమగును. ఈసమస్తచింతలు దూరమగుటవలన, యత్నముతోడ ఆత్మతత్త్వచింత గలుగును. దీనినే "పదార్థభావన" యందురు.

"భూమిషట్క చిరాభ్యాసాద్భేదస్యానుపలమ్భతః।
యత్ స్వాభావికనిష్ఠత్వం సా జ్ఞేయాతుర్యగాగతిః॥"

పూర్వోక్తములగు నీయాఱింటిని నభ్యసించుటవలన, స్వపరభేదజ్ఞానము తొలగిపోవును. అందువలన బ్రహ్మయందు స్వాభావికనిష్ఠ యుదయించును. దీనిపేరే "తుర్యగగతి" యందురు.

"యే హి రామ మహాభాగాః సప్తమీం భూమి మాగతా
ఆత్మారామా మహాత్మాన స్తే మహత్ పద మాగతాః॥"

ఓరామచంద్రా, మహానుభావులు జ్ఞానభూమియొక్క సప్తమావస్థయగు "తుర్యగగతి" ని బొందునప్పుడు భగవానునితోడ క్రమానుగతముగ ప్రీతి నెఱపుచుందురు. మఱియును బ్రహ్మపదమును జెందుదురు.

ఇంతకంటె నుచ్చతర మగుపదవి యేదిగలదు? జ్ఞానప్రభావమువలన హృదయమునందు మోహజనితసంకల్పములు నశించినవానికిఁ గలయానందమునకు మేర లేదు గదా?

“సఙ్కల్పసంక్షయవశాద్గలితే తు చిత్తే।
సంసారమోహమిహికా గలితా భవన్తి।
దృష్టం విభాతి శరదీవ ఖ మాగతాయామ్।
చిన్మాత్ర మేక మజ మాద్య మనన్త మన్తః॥”
యోగవాసిష్ఠము.

“వాసనాక్షయమువలన చిత్తవికారమునశించును. కావున మోహతుషారము నశించినంతనే శరత్కాలమందలి యాకాశమువలెనే హృదయాకాశమందు, చిత్స్వరూప, ఆద్య, అనంత, అద్వితీయ, జన్మరహిత, పరబ్రహ్మము గోచరమగును.” మేఘవినిర్ముక్త విమలశరదాకాశమునందు పూర్ణచంద్రుఁడు ప్రకాశించువిధముననే మోహవినిర్ముక్తుఁడగు జ్ఞానియొక్క విమలహృదయమం దద్వితీయపరబ్రహ్మ ప్రకాశించును.

ఈయవస్థయందుఁగూడ సంసారకార్యములు నిర్వహింపఁగూడ దని యెవరును దలంపఁజనదు. మోహము నశించిన తర్వాత సంసారకార్యమువలనఁ బ్రయోజన మేమి కల దని యెవ్వరును భ్రమవలనఁగూడఁ బలుకఁజనదు. అర్జునునకు శ్రీకృష్ణుఁ డీవిధముగ నుపదేశించియున్నాఁడు.

" సక్తాః కర్మ ణ్యవిద్వాంసో యథా కుర్వన్తి భారత,
కుర్యా ద్విద్వాం స్తథా సక్త శ్చికీర్షు ర్లోకసఙ్గ్రహమ్॥
౩॥ కర్మయోగము. భగవద్గీత.

"అర్జునా! అజ్ఞానులు ఫలాపేక్షు కలవారై యెట్లు కర్మ మును చేయుదురో, అట్లు జ్ఞాని ఫలాపేక్షులేనివాఁడై లోకు లకు సన్మార్గమును జూపుటకొఱకు కర్మమును చేయవల యును." మన మీసంసారమునకు పంపఁబడుటవలన ముఖ్య ముగ సంసార కార్యములను నిర్వహించు చుండవలయును. కావున వసిష్ఠుఁడు శ్రీరామచంద్రుని సంసారమందుఁ దిరుగ చుండు మని చెప్పినతెఱంగున సంసారకార్యములను నిర్వ హించు చుండవలయును.

" అ న్తః స న్త్యక్త సర్వాశో వీతరాగో వివాసనః ।
బహిః సర్వసమాచారో లోకే విహర రాఘవ॥"

ఓరాఘువా! ఆశను, ఆసక్తిని, వాసనలను, అంతరంగము నందు పరిత్యజించి, బాహ్యమునందు సంసారముయొక్క సమస్తకార్యములను జేయుచుండుము.

"బహిః కృత్రిమసంరమ్భో హృది సంరమ్భవర్జితః ।
కర్తా బహి రకర్తాన్త ర్లోకే విహర రాఘవ ॥"

ఓరాఘువా! అంతరంగమునందావేశవర్జితుఁడవై, బాహ్య మునందు కృత్రిమావేశమును గనఁబఱుచుచు, అంతరంగము

నందకర్తవై, బాహ్యమునందు కర్తవై, సంసారమునందు సంచరించుచుండుము.

"త్యక్త్వాహంకృతి రాశ్వస్త మతి రాకాశశోభనః ।
అగృహీతకలఙ్కాఙ్కో లోకే విహర రాఘవ॥

ఓరాఘవా! "నేనుజేసినాఁడను" అనునీయభిమానమును పరిత్యజించి, కార్యములయొక్క-సత్ఫలముల సంబంధమునం దుదాసీనుఁడవై ప్రశాంతచిత్తముగ మెలంగుచుండుము. ఏవిధముగాకళంకమున కళంకితుఁడవుకాక ఆకాశము సర్వత్ర శోభను పొందుచుండు విధముననే సంసారముయొక్క సమస్తకార్యములయందు వ్యాపృతుఁడవై కళంకము లేక సంచరించుచుండుము.

"అయం బన్ధు రయం నేతి గణనా లఘుచేతసామ్ ।
ఉదార చరితానా స్తు వసుధైవ కుటుమ్బకమ్॥"

'స్వల్పబుద్ధిగలవాఁడు "ఇతఁడు బంధువు ఇతఁడు బంధుఁడుగాఁడు" అని లెక్కించుచుండుఁ గాని ఉదారచరిత్రులకు వసుధయంతయు కుటుంబము.' ఆహా! ఈయుపదేశ మెంత సొగసైనది! భగవద్విధిని పరిపాలించుటకుఁగాను పృథివియందందఱను బంధువులని భావించి కర్తృత్వాభిమానమును పరిత్యజించుకొని, సంసారమునందు కర్తృత్వమును వహింపవలయును. బాహ్యమునందు శత్రుఁ డని చెప్పువానిని గూడ

బంధుభావమునఁ జూచు చుండవలయును. కాని కేవలము ధర్మానురోధమువలనను, దుర్నీతిని శాసించుటకును, వానికి ప్రతికూలాచరణ మొనర్పవలయును. బాహ్యమందు బంధువని చెప్పువాఁడైనను గూడ, నన్యాయ్యాచరణ మొనర్చినయెడల ముఖ్యముగ ప్రతికూలాచరణ నొనర్పుము. పాపము దుర్నీతియు మనకు శత్రువులుగాని, మానవులు గారు.

(౨) "అయంబన్ధు రయం నేతి" అను నీకవిత్వముయొక్క మర్మమును గ్రహింపఁ గలిగినయెడల మోహమును సునాయాసముగ నాశనము చేయవచ్చును. తత్త్వజ్ఞానమువలన మోహాంధకారము పటాపంచ లగుచుండును, సార్వజనిక ప్రేమవలన మోహ మనుకాలకూటము శక్తిహీన మగును.

సంకీర్ణతయందే మోహముండును. సంకీర్ణత నశించినయెడల మోహమునకు స్థానమే దొరకదు. సంకీర్ణ ప్రేమయందే మోహము జనించును. నే నొక్క మనుష్యునిఁదప్ప మఱియెవ్వరిని ప్రేమింపనియెడల వానికొఱకు నామనస్సు వ్యాకులతనొందు చుండును. కాని హృదయసహితముగఁ బ్రేమించుటవలన మోహాసక్తి జనింపఁబాలదు.

సాధారణముగ తల్లులకు పుత్త్రులపై నుండు ప్రేమ మోహపరిపూర్ణము. తనపుత్త్రుని ప్రేమించువిధమున నే ప్రక్కయింటి బాలుని ప్రేమించుతల్లులు మిక్కిలియరుదు. 'నాపుత్త్రుఁడు నాపుత్త్రుఁడు' అని ఏతలిదండ్రులు మిక్కుటముగఁ దలంపరు?

కొంతమంది తలిదండ్రులు ఏబాలుని నాచినను తమపుత్త్రుని యందు ప్రవర్తించువిధమున నే ప్రవర్తింతురు. కావుననిట్టితలి దండ్రుల హృదయమునుండి యపత్యజనితమోహము దూరమై నదని చెప్పనొప్పును. పారివారిక సంసర్గము లేనిస్నేహము వలనఁగూడ మోహము పుట్టును. అత్యంతముగ నీవు ప్రేమించు వాఁడు లేనిసమయమునందు నీకు మిక్కుటముగ వ్యాకులత గలుగును. మనశ్శాంతిగూడ దూర మగును. నియతములగు కర్తవ్యములు నిర్వహించుటయందు లోపములు గలుగుచుం డును. కావున నివియన్నియు మోహమువలననే గదా నీకు ఘటిల్లుచున్నవి. ఇట్టిరోగమునకు మహౌషధము "ఉదార ప్రేమ."

స్నేహితులసంఖ్య వృద్ధియైనకొలఁదిని పవిత్రప్రేమ వృద్ధి యగుచుండును. పవిత్రప్రేమవృద్ధియైనకొలఁదిని మోహము తగ్గిపోవుచుండును. "స్నేహితులసంఖ్య వృద్ధి యగు టెట్లు? ప్రేమ విస్తార మగు టెట్లు?" అని యుపశ్నను ప్రశ్నింప వచ్చును. పవిత్రప్రేమను మిక్కుటముగ నుపయోగపఱుచు చుండినకొలఁది, ప్రేమవృద్ధి యగుచుండును. ప్రేమవృద్ధియైన కొలఁదిని హృదయము మధుమయమగుచుండును. హృదయము మధుర మగునప్పు డనాకారవస్తువులు గూడ సుందరముగఁ గాన్పించును. సామాన్యమైన వృక్షమును ప్రేమ గలవాఁడు చూచుదృష్టితోడ మనము చూడఁజాలము. వానియొద్ద నీరస

పదార్థములు రసవంతముగ నుండును. మనకు రసవంతమగు పదార్థములు నీరసముగఁ గనఁబడుచుండును. నీహృదయము నందు ప్రేమ వృద్ధి యైనకొలఁదిని లోకులు నీచే నాకర్షింపఁ బడుదురు. నీవును లోకులచేత నాకర్షింపఁబడుదువు. ఇదియే భగవానునినియమము. హృదయమునందు మధుసంచయ మున్నకొలఁదిని మానవుఁడు మధుభోగి యగును. కావున నలువైపుల మధువు నన్వేషించుచుండును. పృథివియందు నుఘ గర్భకుసుమము లనంతములు. నీవు చూచు ప్రతిపదార్థము నందును కొంచెముగనో గొప్పగనో మధువుండును. ప్రేమించు భ్రమరము సకలపదార్థములనుండి మధువును గ్రోలు చుండును. భగవానుఁడు మహాపాపులహృదయములందుఁ గూడ మధువును బెట్టియున్నాఁడు. కాని యన్వేషించువాఁడు మాత్రమే దానిని బొందఁగలుగుచున్నాఁడు.

హృదయమునం దమృతరుచి మిక్కుట మైనకొలఁదిని మోహమునశించు చుండుననుట నిక్కువము. ఏదో యొకవిషయము మీఁదనుండు మోహమునందు చిత్తము దగుల్కొనుటవలన సంకీర్ణత గలుగును. కావున నట్టివిషయములయం దుదారత వృద్ధి యైనకొలఁదిని మోహము నశించును. కొంతమంది లేనిధర్మములమీఁద మోహభ్రాంతు లగుటవలన వివాదములకుఁ గడంగుచుందురు. కాని వారి హృదయములయందు సార్వభౌమికోదారత ప్రవేశించినకొలఁదిని సమస్తసాంప్రదాయిక

ధర్మాచలంబుల నాలింగనము చేసికొను చుందురు. అప్పుడు మోహము నశించును.

ఈ సార్వభౌమికప్రేమ బొంగి పొరలుచుండుటవలననే శాక్యసింహుఁడు ప్రాణముకంటె నధికురాలగు భార్యను విడిచి జగదుద్ధరణముకొఱకు సర్వసంగపరిత్యాగి యయ్యెను. ఈయన మహాప్రేమనిమగ్నుఁ డగుటవలననే మోహమును పదతాడనమొనర్చుటకు శక్తిగలవాఁడయ్యెను. "లైట్ ఆఫ్ ఏష్యా" అను మహాకావ్యమునందు శాక్యసింహుఁడు గృహమును వదలుటకుఁబూర్వము, భార్యతోఁ జెప్పినవాక్యములను చదివినయెడల మోహమును నశింపఁజేయు సార్వభౌమికప్రేమయొక్క రూపమును విశేషభావమునఁ గాంచవచ్చును. శాక్యసింహుఁడు భార్యతోడ నిట్లనియెను. "నేను విశ్వమందుండు సమస్తజీవరాసులను మిక్కుటముగఁ బ్రేమించుచుండుటవలన నిన్నత్యంతము ప్రేమించుచున్నాను." జగత్తునందుండు సమస్త జీవరాసులను ప్రేమింపనిప్రేమ ప్రేమ గాదు; అది మోహము. బుద్ధదేవునిప్రేమ పవిత్ర మగుప్రేమ గాని మోహముగాదు. మోహము వ్యక్తివిశేషములేక విషయ విశేషములయందు బంధింపఁబడియుండును కాని ప్రేమ జగత్తంతయును వ్యాపించియుండును. ఇట్టిప్రేమవలన మానవుని హృదయమునందు జన్మించుభావములను దెలిసికొనవలయు

నన్న, నిద్రించుచున్న భార్యనుసంబోధించి శాక్యసింహుఁడు నుడివినవాక్యములను చదివినయెడల గ్రహింపనగును.

“ ‘నిద్రించుచున్న యోప్రియతమా! నేనేఁగుకాలము సమీపించినది. నేనింకొకస్థలమున కేఁగుచున్నాను. నీకును నాకును నెడఁబాపు గలిగినను గూడ సమస్తపృథివ్యుద్ధారక మగుమహావ్రతసాధనకొఱకు నీయొక్క సుకోమలాధరము నన్నాహ్వానించుచున్నది.’ అనఁగా. ‘నాపేరు ప్రేమయే నైనయెడల నీహృదయానందమూర్తియు, చిరజీవనసంగియు నగునీభార్యను గూడ విడిచి, యీపాపపంకిలమును శోకపూరితము నగు పృథివిని మోహపాశములనుండి ముక్తి నొందింపుము. ఈమె ప్రేమవలన ముగ్ధుఁడవై యీజగత్తుయొక్క మంగళసాధన కుపక్రమింపనియెడల నానామధేయము ప్రేమ గాదు మోహము.’ అని నీమీఁద నాకుఁ గలప్రేమ నాకుఁ జెప్పుచున్నది.’’ శాక్యసింహుని ఛందకుఁ డీవిధముగ ప్రశ్నించెను. “నీవుజగత్ప్రేమవలన మత్తుఁడవైయున్నావు. కాని నీవేఁగినయెడల నీతలిదండ్రుల కెట్టికష్టము సంభవించునో యోజించుకొనుము. ఇప్పుడు నీవు వారికిని తదితరులకును కష్టము నిచ్చుటకు సంసిద్ధుఁడవై యున్నావు. కాని నీకు వారియెడఁ గలప్రేమ యెచ్చటికేఁగెను?’’ అనుమాటలకు శాక్యసింహుఁ డీవిధముగ బదులుచెప్పెను. “ఓబంధూ, ఆప్రేమ ప్రేమగాదు. నిజసుఖలాలసాతృప్తికొఱకు కొంచెమైనను ఉనికిపట్టును

వదలని ప్రేమనే ప్రేమ యనవలయును. నాసుఖభోగాపేక్ష
కంటెను, నాపరివారము కోరుకొను సౌఖ్యముకంటెను,
నేనధికముగ వారిని ప్రేమింతును. అందువలన వారికి నిర్మల
సౌఖ్యము లభించుటకొఱకుఁ గాను, అనఁగా, వారికి ముక్తిని
గలిగించుటకొఱకు, వారికేని, ఈవిశ్వమందుఁ గల సమస్తజీవ
రాసులకును, ప్రేమయొక్క చివర సాధనమును చూపించిన
యెడల నీబంధనములనుండి ముక్తి నొందుదురు. కావున
దానిని చేయఁగలందులకుఁ గాను నేనేఁగుచున్నాను." మోహ
మును పదతాడన మొనర్చి ప్రేమవలన విశ్వము నుద్ధరించు
టకుఁ గాను ప్రేమావతారుఁడగు శాక్యసింహుఁడు చిన్న
సంసారమును పరిత్యజించి మహాసంసారకార్యములయందు
ప్రవృత్తుఁ డాయెను.

భగవానునియనుగ్రహముచేత జ్ఞానమును ప్రకాశింపఁ
జేసికొని, ప్రేమపూరితహృదయముతోడ మోహమును
నశింపఁ జేసికొని, సంసారమందును, సమస్త జగత్తునందును,
భగవానునికార్యముల నిర్వహించుచు, జీవనయాత్రను గడపు
చుందుముగాక.

# మ ద ము.



(౧) ఆత్మపరీక్ష లేమియే మదమున కుత్పత్తిస్థానము. "నే నెవరు? నాజ్ఞాన మెంత? నాశక్తి యెంత?" అని స్థిరభావమున విచారించువాఁ డెప్పుడును అహంకారపూరితుఁడు గాఁడు. ఎవఁడేవిషయమునం దహంకారము గలిగియుండునో వాఁ డా విషయమునందు తన కెంతవఱకుఁ దెలియునో తనశక్తి యా విషయమునం దెంతదూరము నడువఁగలదో యని ముహూర్తకాలము ప్రశాంతచిత్తమున విచారించి చూచుకొనినయెడల ఈయహంకారమున కేవిధమగు కారణము గల దనుకొనఁడు. జ్ఞాని జ్ఞానమువలన నహంకారము గలిగియుండవచ్చును. కాని యట్టివానిని "నీ వసమస్తము దెలియునా? ఆత్మమాటయటుండ నీ శరీరమునం దున్న యొకరక్తబిందువును గూర్చి యైనను చెప్పఁగలవా? నీ వేపదార్థవిజ్ఞానశాస్త్రమునందు మహాజ్ఞానివని గర్వించుచున్నావో దానివలన నీయినుకరేణు వెచ్చట నుండివచ్చినదో ఏధాతువువలనఁ జేయఁబడినదో చెప్పఁగలవా? ఇనుమును సూదంటురాయి ఏల ఆకర్షించునో చెప్పుము. నలుదిక్కులఁ గనబడుచుండు జగత్తును, ఇందు కనఁబడు ధూళికణములను, జలబిందువులను గూర్చిన యథార్థమును జెప్పఁగలిగిన

యెడల నీవుజ్ఞానివని అంగీకరింతును.'' అని యడిగినఁ జాలును. ఉపన్యాసకుఁడు వక్తృత్వముచేతఁ బ్రజలను మోహింపఁ జేయఁగల నని తలంచి అహంకారి గావచ్చును. కాని యట్టివానిని "నీవక్తృత్వశక్తిని నీవు సృష్టించుకొంటివా? నీవక్తృత్వము మీఁద నీకధికారము గలదా? అయిన నో సమస్తసమయముల యందును మనోహరమగు వక్తృత్వ మొసంగఁ జాలకుండుటకుఁ గలకారణ మేమి? గతదినమున వేలకొలఁది మనుష్యులు నీయుపన్యాసమువలన నున్మత్తచిత్తు లైరి. కాని నేఁడదేస్థలమునందదేవిషయమునుగూర్చి, యుపన్యసించుటకుఁగడంగితివి, కాని, యొకఁడైన నున్మత్తచిత్తుఁడు గాకుండుటకుఁగల కారణమేమి?'' అనిప్రశ్నించినఁజాలును. కవీశ్వరుఁడు నాకవిత్వమును విన్నవాఁడు ముగ్ధుఁడు గాకుండునా యని నుడువవచ్చును. అట్టివానిని "ఈకవిత్వశక్తిని నీవు సృష్టించుకొంటివా? లేక ఇతరు లెవ్వరైనను నీకు ప్రసాదించినారా? నీకవిత్వశక్తిపైని నీకధికారము గలదా? గతదినమునం దొకనిముసమైనను చింతింపకయే హృదయమగు కవిత్వమును వ్రాసియున్నావు. నేఁ డెంత యోజించినను గూడ నొకపద్యమునైనను, రసవంతముగ వ్రాయఁజాల కున్నా వేల?'' అని యడిగినఁ జాలును. గణితశాస్త్రనిపుణుఁ డగువాఁడు నేనెటువంటి చిక్కుగణితము నైనను, జేయఁగల నని చెప్పవచ్చును. వానిని 'నీకుఁగలశక్తికి నీవేనా కర్తవు? ఒక్క-

క్షమా తాశక్తి నీవశమం దేల యుండదు? ఒకప్పుడు నీశి ష్యానుశిష్యుఁడే నిన్నోడించు చుండుటను చూచుచున్నాము గదా? కారణ మేమి?' అని యడిగినఁ జాలును. సమరవిజ యుఁ డగువాఁడు యుద్ధనైపుణ్యమునందు నాకు చాలినవాఁ డెవ్వఁడని నుడువ వచ్చును. కాని యట్టివానిని, "యుద్ధనై పుణ్యము నీయంతట నీకే గలిగినదా? ఆశక్తి యెప్పుడును త్వదాజ్ఞానువర్తినియై యుండునా? అటులయినయెడల ప్రతి యుద్ధమందు నీవేల జయమొందుట లేదు. గతదినమున నీవు లక్షలకొలఁది సైన్యమును జయించియున్నావు. కాని నేఁడు మూఁడువందల సైనికులచే, నీవు నీ సైనికులు నోడింపఁబడు టకుఁ గలకారణ మేమి?" అని యడిగినఁ జాలును.

ఈవిధముగ ప్రతివిషయమును గూర్చి యోజించి చూచిన యెడల మన మహంకారమును బొందుట కవకాశమే లేదు. కార్యములమీఁద మన కణుమాత్రమైన నధికారము లేదు. సమ్ముఖమందున్న పదార్థములను దీసికొనుటకు చేయి చాఁచు నంతలో వాయువునొప్పులవలన చేయి పడిపోవచ్చును. అప్పు డావస్తువును దీసికొనఁ జాలము. నాలుకతోడ ననేక వాక్యములను పలుకుచుందుము. కాని యొకమాట నుచ్చరిం చునంతలో జిహ్వ పడిపోవుటవలన మాటలాడఁజాలము. ఈ బారిసాలయం దొకవృద్ధుఁ డీవిధముగ నుడువు చుండెడి వాఁడు "నామీఁద నాకు స్వాతంత్ర్యము లేదు." ఈవాక్య

ము మంచిసత్యమును వెల్లడించుచున్నది. నేను నావాఁడనే యైనయెడల చేయవలయు నని తలంచువానిని జేయఁగలిగియే యుండును. అనేకసమయములయందు చేయవలయునని నిశ్చయించుకొనిన కార్యములు కాలచక్రము తిరుగుటవలనఁజేయఁ బాలనివార మగుదుము.

మనము భగవానునిశక్తిచేతనే కొంచె మైనను జేయఁ గలుగుచున్నాము. చింతింపఁగలుగుచున్నాము. కాని మన కేవిధమగు శక్తియు లేదు. ఆయన మనకుఁ బ్రసాదించిన శక్తిని తిరిగి గైకొనినయెడల మనకు కార్యనిర్వాహణశక్తి కొంచెమైన నుండదు. మతియు, ఉపాయవిహీనుల మగుదుము. ఆయనసాహాయ్యము లేక గడ్డిపోఁచ నైనను కదలింపఁ గలశక్తి మన కుండదు. కేనోపనిషత్తునందీతత్త్వ మొకకథవలన మనోహరముగఁ బ్రకాశించుచున్నది.

> “ బ్రహ్మ హ దేవేభ్యో విజిగ్యే తస్యహ
> బ్రహ్మణో విజయే దేవా ।
> అమహీయన్త త ఐక్షన్తా స్మాకమేవాయం
> విజయో స్మాకమేవాయం మహిమేతి ।”

బ్రహ్మ జగత్కల్యాణనిమిత్తము దేవాసురసంగ్రామము నందు దేవతలకు జయమును గలిగించెను. బ్రహ్మవలన, అగ్ని, యింద్రుఁడు, వాయువు, మొదలగు దేవతలు మహిమాన్వి

తు లై "మనదే యీజయము, మనదే యీమహిమ" అని
బ్రహ్మశక్తిని మఱచి యుండిరి.

"తద్ధైషాం విజజ్ఞౌ తేభ్యో హ ప్రాదుర్బభూవ ।
తన్న వ్యజానంత కిమిదం యక్ష మితి ॥"

అంతర్యామి యగుబ్రహ్మ దేవతలయొక్క వృథాభిమాన
మును దెలిసికొని దానిని దూరము చేయఁ గలందులకుఁగాను
అద్భుతరూపమును ధరించి వారిసమీపమునకు వచ్చెను. దేవత
లీమహావ్యక్తియే బ్రహ్మ యని తెలిసికొనఁ జాలరైరి.

"తేఽగ్నిమబ్రువఞ్ జాతవేద ఏతద్విజానీహి
కి మేతద్ యక్ష మితి తథేతి॥"

దేవత లీయన యెవ్వఁడో యని తెలిసికొనుటకు నిచ్చగల
వారై అగ్నిని జూచి "ఓజాతవేదా! ఈమహనీయవ్యక్తి
యెవఁడో దెలిసికొని రమ్మ" అని చెప్ప దానికి అగ్ని సమ్మ
తించెను.

"తదభ్యద్రవత్ తమభ్యవదత్, కోఽసీతి అగ్నిర్వా ।
అహ మస్మీత్యబ్రవీ జ్జాతవేదా వా అహమస్మీతి॥"

అగ్ని యామహావ్యక్తి సమీపమున కేఁగెను. ఆయన నీ
వెవ రని ప్రశ్నింపఁగా, 'అగ్నిని' 'జాతవేదుఁడను' అని
అగ్ని బదులు చెప్పెను.

"తస్మింస్త్వయి కిం వీర్య మిత్య పీదం సర్వం
దహేయం యదిదం పృథివ్యా మితి॥"

"నీకెట్టిశక్తిగల" దని యాయన యడుగఁగా "పృథివి యందున్న సమస్తపదార్థములను దగ్ధముచేయఁగల" నని అగ్ని బదులు చెప్పెను.

"తస్మై తృణం నిదధా వేతద్దహేతి ।
తదుప ప్రేయాయ సర్వజవేన ।
తన్న శశాక దగ్ధుం స తత ఏవ నివవృతే ।
నైతదశకం విజ్ఞాతుం య దేత ద్యక్షమితి॥"

అగ్నిసమ్ముఖమం దొకతృణము వైచి 'ఈతృణమును దగ్ధము చేసినయెడల నీవు బ్రహ్మాండములు దగ్ధము చేయఁగల వాఁడవే.' అని యాయన చెప్పెను. అగ్ని తనశక్తినంతయు వినియోగించి తృణమును దగ్ధముచేయుటకుఁ బ్రయత్నించెను. కాని తృణము దగ్ధము కాకుండెను. అందువలన తిరిగి దేవతలను సమీపించి 'ఆమహనీయమూపరాశి యెవ్వఁడో నాకుఁ దెలియ' దని చెప్పెను.

అథ వాయు మబ్రువన్ వాయ వేత ద్విజానీహి
కి మేతద్ యక్ష మితి త థేతి॥

అనంతరము దేవతలు వాయువును చూచి "నీవేఁగి యాతఁ డెవ్వఁడో తెలిసికొని రావలయును" అని చెప్పువాక్యములను వాయువు సమ్మతించెను.

తదభ్యద్రవత్ తమ భ్యవదత్ కోసీతి వాయు ర్వా
అహమస్మీత్య బ్రవీ న్మాతరిశ్వా వా అహ మస్మీతి॥

ఆ మహనీయునియొద్దకు వాయువు వెళ్లినంతనే "నీ వెవరు" అని యాయన యడుగఁగా "నేను వాయువను" "మాతరిశ్వుఁడ" నని చెప్పెను.

> "తస్మింస్త్వయికింవీర్యమిత్య పీదం సర్వ మాదదీయం
> యదిదం పృథివ్యా మితి॥"

నీ కెట్టిశక్తి గలదని యాయన ప్రశ్నింపఁగా, "పృథివి యందుండు సమస్త వస్తువులను సంగ్రహింపఁగలను" అని వాయువు చెప్పెను.

> "తస్మైతృణం నిదధా వేత దాదత్స్వేతి। తదుప
> ప్రేయాయ సర్వజవేన। తన్నశశాకాదాతుం।
> స తత ఏవ నివవృతే నైతదశకం విజ్ఞాతుం య
> దేతద్ యక్ష మితి॥"

ఆయన వాయువుసమీపమునం దొకతృణమును వైచి, "ఈతృణమును సంగ్రహించినయెడల బ్రహ్మాండమునందలి సమస్తవస్తువులను సంగ్రహింపఁ గలవు" అని నుడివెను. వాయువు తనశక్తినంతయు వినియోగించెను. కాని తృణమును కదలింపఁజాలక తిరిగి దేవతలయొద్దకు వచ్చి ఈమహనీయుఁ డెవ్వఁడో నాకుఁ దెలియ' దని చెప్పెను.

> "అథేన్ద్రమబ్రువన్ మఘవ న్నేత ద్విజానీహి
> కి మేతద్ యక్ష మితి త థేతి॥"

అనంతరము దేవత లింద్రునిఁ జూచి "ఇంద్రా! నీ వేగి యీమహనీయుఁడెవ్వఁడో దెలిసికొని రమ్ము" అనుమాటల కింద్రుఁడు సమ్మతించెను.

"త దభ్యద్రవత్ తస్మాత్తిరోదధే"

ఇంద్రుఁ డాయనయొద్ద కేఁగఁగనే యాయన యంతర్హితుఁ డయ్యెను.

"స తస్మి న్నేవాకాశే స్త్రియ మాజగామ బహు
శోభమానా ముమాం హైమవతీం తాం హోవాచ
కి మేతద్ యక్ష మితి॥"

అప్పు డింద్రుఁడు సువర్ణభూషితయు విద్యారూపిణియు శోభమానయు నగు నుమాదేవిని ఆకాశమునందు సందర్శించి యంతర్హితుఁడైన యామహాపురుషుఁ డెవ్వఁ డని యడిగెను.

"సా బ్రహ్మేతి హోవాచ బ్రహ్మణో వా ఏత
ద్విజయే మహీయధ్వ మితి తతో హైవ విదా
ఞ్చకార బ్రహ్మేతి॥"

ఆయన బ్రహ్మ. ఆయనయే నీకు జయమును గలిగించుట వలన మీరును మహిమాన్వితులై యున్నారు. కాని మీరు నిజశక్తిచేతనే జయించినార మని గర్వముతో నున్నారు. ఆయన మీకు శక్తి యొసంగనియెడల మీలో నెవ్వరికిఁగూడఁ గొంచెమైనను శక్తియుండదని తెలియఁజేయుటకుఁగాను మీ

కాయన కనఁబడెను. ఇట్లుమాదేవి చెప్పఁగా విని ఆయన బ్రహ్మ మని యింద్రుఁడు గ్రహించెను. ఇందువలన మనకు గర్వముఁజెందఁ గలిగినది కొంచెమైనను లేదుగదా? బ్రహ్మ శక్తి లేక చేతులు ముట్టుకొనఁజాలవు; కన్నులు చూడఁ జాలవు; చెవులు వినఁజాలవు; నాలుక రుచి చూడఁజాలదు; మనస్సు యోజింపఁజాలదు; బుద్ధి తనపనులను జేయఁజాలదు.

"శ్రోత్రస్యశ్రోత్రం మనసో మనో యద్వాచో హి వాచః।
స తు ప్రాణస్య ప్రాణః చక్షుష శ్చక్షుః॥"

ఆశక్తి "శ్రోత్రములకు శ్రోత్రములవంటిది; మనస్సునకు మనస్సువంటిది; వాక్యములకు వాక్యములవంటిది; ప్రాణమునకు ప్రాణమువంటిది; కన్నులకు కన్నులవంటిది." ఈ బ్రహ్మశక్తి లేకపోవుటవలన, ప్రాణము మనస్సు మొదలగు బాహ్యేంద్రియములన్నియు శక్తిహీనము లగును.

"కోహ్యేవాన్యాత్ కః ప్రాణ్యాత్ యదేష
ఆకాశ ఆనన్దో నస్యాత్॥"

"ఆకాశస్వరూపియు, ఆనందస్వరూపమునగు బ్రహ్మ ప్రకాశింపనియెడల నెవనిశరీరము పనిచేయఁగలుగును? జీవించి యుండఁ గలుగును?" సమస్తమా బ్రహ్మశక్తిమీఁదనే నిర్భరపడి యున్నప్పుడు మన మహంకారమును బొందుటకు మిగిలిన దేమున్నది? అప్పు దెచ్చుకొనిన ధనమువలన గర్వపడవచ్చునా? అప్పులవాండ్రు తమసొత్తును దాము [illegible] కొనిన

యెడల మన కేమి మిగిలి యుండును? మనకేమియు మిగిలి యుండనియెడల మనము పక్షిగ్ల మనుట నిక్కువము గాదా? ఆయన మన కప్పిచ్చి తిరిగి తీసికొనుమాట యేటుంపుము. ఆయన నీయొద్ద నుంచియున్నదానికి తగులెక్కఁ జెప్పుమని యడిగినప్పుడు, నీ వెట్టు లుందువో భావించుకొనుము. ఆయన పిలుపు రాఁగనే ప్రాణాతంకము కలుగదా? రక్తము శుష్కించిపోదా? కావున నాకు మరణము సంభవించినయెడల భయము లేదని చెప్పువాని నే నొక్కనినైనను జూడలేదు. కబీరు ఇటు నుడివియున్నాఁడు. "ఈబ్రహ్మాండమంతయుఁ దినుగుచుండుటను జూచి కబీరు విలపించుచుండెను. ఒక్క జంతువు గూడ యిబ్బుటిలోటియందుఁ దగులొక్కని నలుఁగక తప్పించుకొనఁజాలదు." నేను మూర్ఖుని వలె విదారితుఁడను గానియును నేను గర్వముఁజెందుచుండు విషయము లక్ష్యానికి లేవని యెవర్గైనను జెప్పవచ్చును. అట్టి వారిని "నీ వసేత్కృతమునకంటె తక్కువ విదారితుఁడవైతివని చెప్పుటకు నీకధికారమే లేదు. ఈవిధముగ పోల్చుకొనటునీకుశక్తిలేదు. వానిహృదయమును నీవుచూచితివా? వాని మనస్సును నీమనస్సును పరిశీలించి చూచికొంటివా?" అని ప్రశ్నింప నగును. ఆత్మదృష్టియొక్క లోపమువలన మన మనేక సమయములందు మన పాప విషయముసంబంధులమై యుందుము. కాని పరిశీలించి చూచుకొనునప్పుడు,

లుకలుకలాడుచుండు పాపములను చూడఁగలము. మనకుఁ గల గర్వమునకు కారణములెవ్వి? వీనికి మూలమెద్ది? అని స్థిరభావమున చింతించి చూచినయెడల వేనివలన మన మహంకారమును బొందుచున్నామో, అవి మన మహంకారమును బొందుటకు తగినకారణములు గాకుండుటయే కాక మిక్కిలి లజ్జను గలిగించునవి యని తెలిసికొందుము. ఆత్మపరీక్షవలన స్వీయదోష సముదాయములు సర్వదా సమ్ముఖముగ నున్నయెడల అహంకారము నశించును. మన మెప్పుడును మనదోషములవంక చూచుకొనక గుణముల వంకనే చూచుకొను చుండుటవలన అహంకారమును బొందు చుందుము. ఆత్మదృష్టివలన స్వకీయదోషములను దెలిసికొని సూక్ష్మానుసంధానము చేసి వానిని హృదయము నుండి పాఱఁద్రోలవలయును. స్థూలదోషములపట్టికను వ్రాసి యుంచు కొనవలయును. నిజదోషములను దలంచుకొను చుండినయెడల అహంకారము సమీపింపఁజాలదు. స్వదోష విషయములయందు సర్వదా జాగరూకుఁడై యుండువాఁడు దీనుఁడై యుండును. "ధూళికణమును బ్రశ్నించినను గూఢబాయెజీద్ తనకంటె శ్రేష్ఠుఁడు కాఁడని నుడువును." అని 'బాయెజీద్' ఫకీరువలె నుడువఁగలవాఁడెవ్వఁడు? ఒకానొకదినమునం దొకసాధువు రాజమార్గమునఁ బోవుచుండెను. ఒకఁడు మేడపైనుండి సాధువు నెత్తిమీఁదఁ బడు

నటుల నిప్పులను బోసెను. సహచరు లాగ్రహగ్రస్తులై అతని శిక్షించుట కగ్రేసరులైరి. సన్న్యాసి వారిని వారించి ప్రసన్న వదనమున "మీ రేమి చేయఁ బోవుచున్నారు? ఘోరాగ్ని కణములు వర్షించుట కుచితమగు మస్తకమునందు శీతలాంగారకణములు పడెను. ఇట్లు పడుట నాసౌభాగ్యము గదా?" అని నుడివెను. తనదోసములను సర్వదా చూచుకొనుచుండువాఁడీసాధువువలె దీనాత్ముఁడు కాకుండఁ జాలఁడు. అట్టివానిహృదయమునం దహంకారమున కణుమాత్రమైనను స్థానముదొరకదు. మనమంగల వందకొలఁదిదోషములనువ్రాసి చూచుకొనినయెడల మనసవిూపమునకు అహంకారము చేరఁజాలదు. ఈవిధమగు నాత్మపరీక్ష అహంకారనాశనమునకు మంచియుపాయము.

(౨) అహంకారమువలనఁ గలుగు నష్టములను యోజించినకొలందిని దానిపేరు వినుటకే భయము గలుగును. కౌమార బ్రహ్మచారి యగు సనత్సుజాతుఁడు ధృతరాష్ట్రునకు అహంకారమువలనఁ గలుగు నష్టాదశదోషములను చెప్పియున్నాఁడు.

"మదోష్టాదశదోషః స్యాత్ పురాయః ప్రతిక్రీతః
లోకద్వేష్యం ప్రాతికూల్య మభ్యసూయామృషావచః
కామక్రోధౌ పారతన్త్ర్యం పరివాదోఽథ పైశునమ్
అర్థహాని ర్వివాదశ్చ మాత్సర్యం ప్రాణిపీడనమ్

ఈర్ష్యామోహో౽తివాదశ్చ సంజ్ఞానాశో భ్యసూయితా
తస్మాత్ ప్రాఘునమాద్యేత సదా హ్యేతద్విగర్హితమ్.”

మహాభారతము. ఉద్యోగపర్వము.

“ మదముచే నావరింపఁబడినవాఁడు లోకులద్వేషమునకు పాత్రుఁ డగును. అట్టివాని నెవరును జూడరు. అహంకార పూరితుఁడు తనగౌరవమునకు లోపము గలుగుచున్నదని లేక కలుగుననుశంకను గల్పించుకొని పరులకు పలువిషయముల యందపకార మొనర్చుచుండును. ఇతరులప్రశంసను వినుట కిచ్చగింపఁడు. మంచివారిమీఁద దోషముల నారోపించుట కాతురుఁడై యుండును. తా నుచ్చస్థాన మాక్రమించుటకుఁ గాను ఇతరు లెవ్వరు తనతో సమానాదరణీయులు గాకుండు టకునై మిథ్యావాక్యములు నుడువుటకు సంకోచింపఁడు. తా నహంకారమును జెందువిషయమునందు మిక్కిలియాసక్తి గలిగియుండును. దానికి విరుద్ధముగ నెవరైనను మాటాడిన యెడల నీతఁడు క్రోధావేశపరవశుఁడగును. అభిమానమునం దింధనములువేయువాని కీతఁడు దాసుఁడైయుండును. ఇతనికి పరదోషకీర్తన జిహ్వాగ్రమునందు తాండవ మాడుచుండును. నానావిధము లగు దుర్మార్గముల నాశ్రయించి యుండుట వలన వీనికిఁ బ్రయోజనము గలదు. ఈతఁ డిందువలన నహం కారవిషయములను సంరక్షించుకొనుటకుఁగాను అనర్థమూలక మగు నర్థమును వ్యయముసేయుచుండును. వీని కితరులతోడ

వివాద మెడతెగకయుండును. వీనిహృదయమునందు పరుల
యైశ్వర్యమునకు పరితాపము రాజ్యము చేయుచుండును.
వీనికి ప్రాణిపీడన మొనర్చుట ముఖ్యవిషయమై యుండును.
ఈర్ష్యవలన వీనిచిత్తము తల్లడిల్లు చుండును. చిత్తచాం
చల్యము గలుగును. లోకమర్యాద నతిక్రమించి మాట
లాడుట వీని కొకముఖ్యలక్షణము. వీనికి యుక్తాయుక్త
జ్ఞానమునశించును. పరద్రోహచింత శల్యగతమైయుండును."
బాగుగ విచారించి చూచినయెడల ఏయహంకారిజీవనమందై
నను ఈయష్టాదశదోషములు కనఁబడుచుండును. ఇన్నిదో
షములను మోయుచుండువాని మనుష్యత్వము నిలిచి యుం
డుటకు వీలు లేదు గదా? కావున అహంకారివంటి కృపా
పాత్రుఁడు వేఱొక్కఁడు లేఁడనుట నిశ్చయము. అహంకారి
తా నుచ్చస్థానమున కేఁగుచున్నా నని తలంచు చుండును.
కాని వాస్తవముగఁ జూచినయెడల నధోగతియందు పడిపోవు
చుండును. వీనితోఁ బోల్పఁదగినదుఃఖి యీప్రపంచమునందు
మఱొక్కఁ డుండఁడు. వానియవస్థనితాంతముశోచనీయము.

అహంకారమువలనఁ గలుగుఫలము పతనము. కాఁబట్టి
అహంకారి యుచ్చస్థానమునకేఁగఁజాలఁడు. "స్వర్గరాజ్యము
దీనులదే గనుక దీనహృదయులు ధన్యులు." అని క్రీస్తు నుడివి
యున్నాఁడు. దీనహృదయుఁడు కానివానికి స్వర్గమునందు
ప్రవేశించుట కధికారమే లేదు. ఒకబంగాళికీర్తనయందు

భగవానుఁడీవిధముగ నుడివియున్నాఁడు. "అహంకారులగు పాపులు నన్ను చూడలేరు. నేను దీనజనబాంధవుఁడనని యెల్ల రకుఁదెలియును." భగవానుఁడు దీనజనబాంధవుఁడు. కాఁబట్టి అహంకారవ్యక్తి యాయనను దర్శింపఁజాలఁడు. అహంకార మున్నంతవఱకు హృదయమునం దీశ్వరుని దర్శింపఁజాలము. ఒకానొక మహమ్మదీయఫకీ రిట్లు నుడివియున్నాఁడు. "ప్రభువు ప్రకాశించునప్పుడు నేను లేను. నేనున్న యెడల ప్రభువు ప్రకాశింపఁడు. నాయప్రకాశమునం దాయనప్రకాశమును నాప్రకాశమునం దాయన యప్రకాశము నుండెను. ఈవిధముగ ముప్పదివత్సరములు గడచినవి. నేను దుఃఖించినకొలఁదిని "నే నుండవలెను లేక నీ వుండవలెను." అని భగవానుఁడు చెప్పియున్నాఁడు. "నేను" "ఆయన" అనునీరెండు నొక్కస్థలమునం దుండుటకు వీలులేదు. నేను సెలవు గైకొననియెడల ఆయన రాఁడు. 'నేను' అనుమాట యున్నంతవఱకును ఎన్ని ధర్మసాధనల నొనర్చిననుగూడ స్వర్గద్వారములు బంధింపఁబడియేయుండును. పాండవుల స్వర్గారోహణవృత్తాంతము దీనికి తగు నిదర్శన మని చెప్పవచ్చును. పంచపాండవులు స్వర్గమున కేఁగుచుండిరి. వీరిలో ప్రథమమున సహదేవుఁడు భూమిమీఁద పడిపోయెను. దీనిని జూచి భీముఁడు సహదేవుఁడు పడిపోవుటకుఁ గలకారణమును జెప్పుఁ డని ప్రశ్నింపఁగా ధర్మరా జిట్లనియె.

"ఆత్మనః సదృశం ప్రాజ్ఞం నైషోఽమన్యత కిఞ్చన ।
తేన దోషేణ పతిత స్తస్మా దేష నృపాత్మజః॥"

"తనతోఁబోల్పఁదగిన ప్రజ్ఞావంతుఁడు లేఁడని యీతఁడు దలంచుచుండువాఁడు. ఆదోషమువలననితఁడూపడిపోయెను." ఇట్లు నడిచి మిగిలియున్న ముగ్గురుసోదరులతోఁ గూడి ధర్మరా జేఁగుచుండెను. కొంచెముదూర మేఁగునప్పటికి నకులుఁడు పడిపోయెను. ఇందులకు కారణమేమని భీముఁడు ప్రశ్నింపఁగా ధర్మరా జిట్లనియె.

"రూపేణ మత్సమో నాస్తి కశ్చిది త్యస్య దర్శనమ్ ।
అధిక శ్చాహమేవైక ఇత్యస్య మనసి స్థితమ్॥
నకులః పతిత స్తస్మా దాగచ్ఛ త్వం వృకోదర॥"

"నాతో రూపమున సమానుఁడు లేఁడనియు అందఱికంటెనుగూడ నేనే రూపవంతుఁడనియుఁ దలంచుచుండుట వలన నితఁడు పడిపోయెను. కావున నోవృకోదరా ముందు నడువుము." పిమ్మట అర్జునుఁడు పడిపోఁగా కారణ మడిగిన భీమునిఁ జూచి ధర్మరా జిట్లనియె.

"ఏకాహ్నా నిర్దహేయంవై శత్రూనిత్యర్జునోఽబ్రవీత్ ।
నచతత్ కృతవానేష శూరమానీ తతోఽపతత్॥
అవమేనే ధనుర్గ్రాహీ నేష సర్వాంశ్చ ఫల్గునః ।
తథా చైతన్నతు తథా కర్తవ్యం భూతి మిచ్ఛతా॥"

"శౌర్యాభిమాని యగు నీతఁడు, 'నే నొకదినముననందే శత్రువుల నెల్లరను వధించెద'నని చెప్పుచుండెడువాఁడు. కాని అట్లు చేయఁజాలఁడయ్యెను. మఱియును, తాను ధనుర్ధరుల లో నగ్రగణ్యుఁడ నని తలంచి తక్కినధనుర్ధరుల నెల్లర గణన చేయకుండెను. ఆ కారణమున నితఁడు పడిపోయెను. మంగళ మును గోరువాఁ డెప్పుడు నీవిధముగఁ బ్రవర్తింపఁ జనదు." భీముఁడును ధర్మరాజును కొంచెముదూర మేఁగునప్పటికి, భీముఁడు పడిపోయెను. పడిపోయిన భీముఁడు ధర్మరాజును జూచి, తాను పడిపోవుటకుఁ గలకారణమును జెప్పు మని యడుగఁగా ధర్మరా జిట్లనియె.

" అతిభుక్తఞ్చ భవతా ప్రాణేన తు వికత్థసే ।
అనవేక్ష్య పరం పార్థ తేనాపి పతితః క్షితౌ ॥"

" నీవెక్కువగ భుజించి యన్యులబలమును లెక్కచేయక నిన్ను నీవు శ్లాఘించుకొనుచుండుటవలన నీవు భూతలమున పడితివి. " నిరహంకారుఁడగు ధర్మరాజొక్కఁడు మాత్ర మే స్వర్గమును జేరఁగలిగెను. భీమార్జుననకులసహదేవులు పడిపోవుటకు గర్వమేగదా కారణము? వీరు నానాగుణగణ విభూషితులై యుండియు, అహంకారపూరితులై యుండుట వలన స్వర్గమున కేఁగఁజాలరైరి. కాబట్టి అహంకారమున కిదియే ఫలమని యెఱుంగనగును. అహంకార మెట్టిపుణ్యాత్ము నైనను దగ్ధముగ నొనర్చును. అహంకారి పొందుహృదయ

వేదన కాద్యంతములు లేవు. ఇందున కొకవచనము నింగ్లీషు భాషనుండి చూపుచున్నాను. "అహంకారము సుఖమునకు గరళమువంటిది." అహంకారపూరితుని హృదయమునందు శాంతి యుండుటకు వీలు లేదు.

(క) తన్నుఁ దాను గొప్పవాఁ డనుకొనువాఁడు, మిగత వారెల్లరు, తనపాదతలమునందు మస్తకము లుంచఁదగినవా రని తలంచుచుండును. కాని అహంకారపూరితుఁ డగువానిని లోకులు గణన చేయకుండుటయు, అందువలన తనయాసకు తగిన సమ్మానమును బొందఁజాలక హృదయవేదనను బొందు చుండుటయును మన మనుదినమును చూచుచున్నాము.

(ఖ) అహంకారపూరితుఁడగువాఁడు, ఇతరులకుఁ గలుగు సమ్మానాదరములనుజూచి, తనకు ప్రాప్యమగుసమ్మానాదర ములకు లాఘవము గలుగు ననుశీఘ్రచే పరితపించును. మఱియును, వికలిత హృదయుఁడై ఇతరులయొక్క మర్యాదను నాశనము చేయుటకుఁగాను కుట్రలు పన్ను చుండును.

(గ) వాఁడు నాగొప్పతనమును, బాగుగ గ్రహింపలే దనియును, వీఁడు నాచరిత్రమహిమను వినుటకు విముఖుఁ డయ్యె ననియును, వాఁడు నాసమ్ముఖమం దెంతదూరమం దుండుట యుచితమో యంతదూరమం దుండలే దనియును, మొదలుగాఁగల చింతలవలన అహంకారి పరితపించు చుం డును. అందువలన హృదయశాంతి లోపించును.

ఇట్టి దుఃఖజీవి పృథివియందు మరెవ్వఁ డుండును? కావునఁ బ్రతివాఁడును, అహంకారమువలనఁ గలుగు చెడుగులనుగూర్చి చింతించుచు, సర్వదా దానినుండి విముక్తిఁ డగుటకుఁగాను ప్రయత్నించు చుండవలయును.

(3) ఊర్ధ్వదృష్టి గలిగి యుండుటయు, భ్రాంతి లేని చిత్తమున నితరుల సుగుణములతోడ తనగుణములను పోల్చి చూచుకొనుచుండుటయును అహంకారదమనమునకు మంచి సాధనములు. తా నేవిషయమునం దెంత యహంకారము గలిగియుండినను గూడ, ఊర్ధ్వదృష్టి గలిగి విచారించి చూచినయెడల, ఆవిషయమునందు తనకంటె గొప్పవారలనేకులు గాన్పించుచుందురు. ఈజగత్తునందు, ధనము, మానము, ధర్మము, జ్ఞానము, శౌర్యము, మొదలగువానియందు "నాకంటె శ్రేష్ఠులు లే" రని యెవరును నుడువఁజాలరు. ఏదో యొకవిషయమునం దెవఁడైనను పృథివియం దందఱికంటె శ్రేష్ఠుఁడై యుండవచ్చును. కాని మిగత విషయములలోఁ బెక్కువేలమందికంటె నికృష్టుఁడై యుండు ననుమాటను స్వీకరింపనివాఁ డుండఁడు. స్వగృహమునందుఁ గూర్చుండి నాకంటె గొప్పవారలు లేరని అనేకులు తలంపవచ్చును. అట్టివాఁడు గృహమును వదలి బయటికి వచ్చిన తనకంటె గొప్పవా రనేకులు కల రని తెలిసికొనును. స్వగ్రామమునందుఁ దాను గొప్పవాఁడనుకొనువాఁడు పట్టణమును ప్రవే

శించినయెడల వానిగొప్పతనము పలాయితమగును. రాజధానీ నగరమున కేఁగినయెడల పరిగణింపఁ దగినవారిలో నొకఁడనని తెలిసికొనును. అప్పుడు తన క్షుద్రత్వమునకుఁ దాను లజ్జించు ననుట నిక్కువము. మన యిరుగుపొరుగువారి సుగుణము లనుగూడ బాగుగఁ దెలిసికొనకుండుటవలన గొప్పవారమని విఱ్ఱవీఁగుచుందుము. నీచులని మనము దలంచుచుందువారిని గూర్చి యోజించినను గూడ, మనయందు లేని యనేకసుగుణ ములు వారియందుఁ జూడవచ్చును. అప్పుడు వారిని నీచు లని తలంచినందులకుఁగాను పశ్చాత్తాపమును బొందుదుము. ముట్టుకొనినయెడల మనకు పాతకము సంభవించునని తలం చుచుందువారియందు, సుగుణములు గనఁబడినప్పుడు వారిని దర్శించుభాగ్య మబ్బినయెడల ధన్యుల మగుదుమని తలంచు చుందుము. ప్రతిమానవునియందును గుణములు, దోషములు కనఁబడుచుండును. కాని, నాయందుఁగల దోషములు నీ యందు లేకుండవచ్చును. నీయందుఁగలదోషములు నాయందు లేకుండవచ్చును. ఈజగత్తునందు ప్రతిమానవుని చరిత్రను పరిశీలించి చూచినయెడల వారిలో నాకంటె నధముఁ డిం కొకఁడుండఁడని చెప్పఁగలను. అప్పుడెల్లరు నాకంటె నేదో యొకవిషయమునందు శ్రేష్ఠులుగ నున్నారని తెలిసికొం దును. భగవానుఁ డేవ్యక్తిని గాని నీచుఁ డని చెప్పుటకు మన కధికార మొసంగియుండలేదు. మన మనేకసమయముల

యం దితరులకార్యము గ్రహింపఁ జాలక వారిపైని దోష
ముల నారోపించి మనమే శ్రేష్ఠులమని తలంతుము. ఎవఁ డే
భావమున నేకార్యములను జేయుచున్నాఁడో దానిని గ్రహిం
పఁజాలక వానిని దోషములని వ్యాఖ్యానము చేయుటకు వెను
కంజవేయము. సత్యమును గ్రహింపఁజాలక దోషకీర్తనము
చేయుచుండుట మన కొకప్రధానరోగము. మనము పెక్కు-
వేమాఱు లితరులదోషములను జూపి మనగొప్పతనమును బ్రక
టించుకొని యుండవచ్చును. కాని చివరకు సత్యము బయ
ల్పడినప్పుడు మిథ్యాదోషారోపణము చేసినందులకుఁ గాను
మితిలేని లజ్జను బొందుదుము. హత్యచేసినాఁడని వినినంతనే
వానిని నరహంతకుఁ డని, పాషండుఁ డని, నుడువఁజనదు.
నిజము బయల్పడినప్పుడు నీవు పాషండుఁడని తలంచువాఁడు
దేవసముఁడు గావచ్చును. నిస్సహాయురాలగు సాధ్వీతిలక
మును ఒకఁడు చెఱఁబట్టు నుద్యోగించునప్పు డాసాధ్విని వాని
బారినుండి తప్పించుటకు వేఱుమార్గము లేక, చివర కానరా
ధముని యమసదనమున కనిపినవాఁడు పాషండుఁడా? లేక,
దేవసముఁడా? నీవు భ్రమచేత వానిని పాషండుఁడని నుడువ
సాహసించితివి. ఈవిధమగు భ్రమనుగూర్చి తాపసమాలయం
దొకమనోహరమగు కథ గలదు. దాని నిట నుదాహరించు
చున్నాను.

ఒకానొకప్పుడు "హాస్సన్" అనుతాపసి "దజలా"
నదీతీరమునంటి వెళ్లుచుండెను. తీరమునకు కొంచెము దూర

మందు కాఫ్రీవాఁడును మఱియొకస్త్రీయును దగ్గఱగఁ గూ
ర్చుండి కుండలోఁడ నేదియో త్రాగుచుండిరి. వీరిని చూచి
"నేను వీనివలె స్త్రీని వెంటనుంచుకొని కల్లుఁద్రాగను కావున
నేను వీనికంటె శ్రేష్ఠుఁడను." అని హాస్సన్ తలంచెను. ఇంత
లో నొకానొక నౌక తీరమును సమీపింపఁబోవుచు తరంగము
లతాఁకుడువలన మునిఁగిపోవుచుండెను. కాఫ్రీవాఁడది చూ
డఁగనే నదియందు దుమికి మునిఁగిపోవుచున్నవారిలో నొక్క
రను ఒడ్డునకుఁ జేర్చి బ్రతికించెను. ఈదృశ్యమువలన హాస్సన్
కాఫ్రీవానియందు ప్రకాశించుచున్న దైవభావమునుఁ జూచి వా
నికి వేలకొలఁది ధన్యవాదము లర్పించెను. తదుపరి వీరిద్దఱు
కొంతవడిమాటలాడిరి. ఆస్త్రీ వానితల్లి యనియు, త్రాగు
చున్నది నిర్మలోదకమనియు, కాఫ్రీవలన హాస్సను తెలిసి
కొనెను. చివరకు కాఫ్రీ హాస్సనుని చూచి "నీవంధుఁడవా
లేక నేత్రములు గలవాఁడవా? విచారించిచూడఁగా నీవంధుఁ
డవని స్పష్టమగుచున్నది." అని నుడువునంతలో హాస్సన్
లజ్జితుఁడై వానిపాదములుపట్టుకొని "నన్ను క్షమింపుము. నిజ
ముగ నేనంధుఁడను. నీవీనదినుండి ఆఱుగుర నుద్ధరించితివి.
కావున నామీఁద పరిపూర్ణానుగ్రహముంచి, అహంకారనదీ
ప్రవాహమునందుఁ బడి కొట్టుకొనిపోవుచున్న నన్ను రక్షిం
పుము." అని ప్రార్థింపసాగెను. ఇదిజరిగినతర్వాత, హాస్సన్
ఎప్పుడును దానితరులకంటె గొప్పవాఁడని కలయందైన

నను దలంపఁడయ్యె. ఒకదినమునం దొకానొకఁడు కుక్కను చూపించి "నీవు శ్రేష్ఠుఁడవా లేక ఈకుక్క శ్రేష్ఠమైనదా?" అని యాతనిని ప్రశ్నించెను. అందుల కాయన "నాధర్మజీవనము రక్షణను బొందినయెడల నేను కుక్కకంటె శ్రేష్ఠుఁడను. అట్లు గానిచో నాకంటెను నావంటి వేయిమంది కంటెను గూడ నీకుక్కయే శ్రేష్ఠమైనది." అని చెప్పెను. మనలో నొక్కఁడైనను 'నాధర్మము నిర్విఘ్నముగ సాగుచున్న' దని చెప్పఁగలవాఁ డున్నాఁడా?

(౪) పృథివితోడ మనకుఁగలసంబంధమునుగూర్చియు, జవాబుదారినిగూర్చియుఁ జింతించుచుండినకొలఁదిని మనదుర్బలత్వమును మనముగ్రహించుచుందుము. అందువలన అహంకారము తగ్గిపోవును. శరీరమునకును మనస్సునకును పరివారమునకును, సమాజమునకును, స్వదేశమునకును, జగత్తునకును సంబంధించినకర్తవ్యములనుగూర్చియు, వానిని నిర్వహించుటకుఁ జేయవలసినప్రయత్నములనుగూర్చియు, చింతించినయెడల విషాదము కలుగును. అందువలన మనము వైమగంతులు చాలవఱకు తగ్గిపోవుచుండును. మానవత్వమును నిర్వహించుకొనఁ గలందులకుఁగాను ఈశ్వరుఁడు మనకు కొన్నిశక్తులను ప్రసాదించియున్నాఁడు. కావున మనము మానవనామమున కర్హమగు కార్యముల నొనర్పవలయును. అందువలన నిట్టికార్యము లెన్ని చేసినారము, ఎన్ని చేయఁగలము, అని స్థిరచిత్తమున విచా

రించి చూచుకొనినయెడల మనలఘుత్వము మనకుం బూర్ణముగ వెల్లడియగును. అప్పు డహంకారము మనదరికిఁ జేరఁజాలదు. సాగరతుల్య మగు జ్ఞానమును, ప్రతాపమును, శౌర్యమును, ప్రేమయుఁ గల మహానుభావులు స్వకర్తవ్యములఁ దలంచుకొని "అయ్యో! నే నెంతవాఁడను. నావలన నెఱవేఱినది కొంచెమైనను లేదుగదా? నేను కొంచెమైనను నెఱవేర్పఁజాలను గదా?" అని విలపించుచుందురు. కావున కూపస్థమండూకములవలె నున్న మనము మనజ్ఞానమును, ప్రేమను గూర్చి డంబము లెట్లు పలుకఁగలము?

మనము నిర్వహింపవలసిన కార్యములను నిర్వహింపఁగలిగినను గూడ మనము అహంకారమును బొందవలసిన పని లేదు. కర్తవ్య కార్యములను నిర్వహించుట గూడ పొరపమేనా? తలిదండ్రులను భార్యాపుత్త్రులను బోషించుట ప్రతివానికిని విధాయకము. కాని యీ విధాయకకార్యమును జేసినందులకు అహంకారమును బొందనగునా? భర్తకు సేవఁ జేయుచున్నా నని భార్య అహంకారమును బొందనగునా? తండ్రిని పోషించి మహాఘనకార్యమును జేసితి నని విఱ్ఱవీఁగుపుత్త్రుఁ డుండునా? కర్తవ్యకార్యముల నిర్వహింపకుండుట యధర్మము. నిర్వహించుటవలన అహంకారమును బొందఁజనదు. జ్ఞానము ప్రేమ ధర్మము వృద్ధియైనకొలఁదిని జగత్తున కుపకారము చేయఁజాలనైతి నని మనోవేదనను

బొందుచుండవలయును; కాని యొనర్చినయెడల విఱ్ఱవీఁగవలసినపని లేదు. మనకు భగవానుఁడు ప్రసాదించిన శక్తులను క్రమముగ వినియోగపఱుపనియెడల దండనీయుల మగుదుము. క్రమముగ నుపయోగించినయెడల కర్తవ్య కార్యముల నెఱవేర్చినవారల మగుదుమే కాని గర్వము నొందఁజనదు. భూతకాలమునందుఁ బొంది యుండిన భ్రమను గూర్చియు, పతనమును గూర్చియు చింతించినయెడల మనదర్పము మ్లాన మగును. భూతకాలమందలి జీవనపర్యాలోచన చేసియుఁగూడ గర్వముతోడ భవిష్యత్తుదిక్కున కగ్రేసరుఁడైన వానిని మనము చూచియుండము.

(౪) అహంకార విషయములయొక్క యస్థిరత్వమును గూర్చి చింతించినయెడల అహంకారము తగ్గిపోవును. పృథివియం దెట్టియహంకారపూరితుని యవతారము నైనను మృత్యు వొక్కదినములో రూపుమాపును. మృత్యువునకు పూర్వమందుఁ గూడ అహంకారదూరులైనవారిని మనము చూడవచ్చును. ఎంతమంది జ్ఞానులు మూఢులైరి ? ఎంతమంది ధనికులు బిచ్చగాండ్రైరి ? ఎంతమందిమాన్యు లవమానితులైరి? ఎంతమందిప్రతాపవంతులు పరులకు పాదాక్రాంతులైరి? ప్రతాపమునం దద్వితీయుఁడగు "నెపోలియన్" "సెంటు హెలీనా"యందు బంధింపఁబడెను. మానాభిమానియగు "కార్డినల్ వుల్‌సీ" వృద్ధవయసునం దెక్కువ యవమానమును

బొందెను. జ్ఞానశిరోమణియగు "అగస్టు కామ్టి" మస్తిష్కము చెడి పిచ్చివాఁడయ్యెను. ఇఁక దరిద్రులైన ధనికుల సంఖ్య కంతమే లేదు గదా? రెండు దినములలో రూపము విరూప మగును గదా? కావున దేనిని స్థిర మని నమ్మి మన మహంకారమును బొందుదము?

(౬) నీ గుణకీర్తన జరుగు స్థలమునందు నీ వుండఁజనదు. ముఖ్యముగ స్వకీయగుణగానశ్రవణము అహంకారమును వృద్ధిపఱుచును. కావుననే సాధుపుంగవులు స్వగుణకీర్తనము జరుగు స్థలములయం దుండరు! స్వనామకీర్తనము మహాపకార మొనర్చును. మన మతిసామాన్యవిషయముల వలన నహంకారమును బొందుచుందుము. కావున మనకుఁ గల యహంకారవిషయములను లోకులసమ్ముఖమందు నుడివిన కొలఁదిని అహంకార మణఁగిపోవుచుండును. దీనికై లోకులసమ్ముఖమం దహంకారమును వెల్లడించుచు, సముచిత దండనను బ్రార్థించుట అహంకార దమనమునకు మహౌషధము. ఒకదినమున నొకసాధకుఁడు బాయెజి తాపసునియొద్దకు వచ్చి, "నేను ముప్పది వత్సరములనుండి 'రోజా' పాలన చేయుచున్నాను. కాని నాజీవితమునం దాధ్యాత్మికలక్షణములు కనఁబడకుండుటకుఁ గలకారణ మేమి?" అని యడిగెను. "ముప్పదివత్సరములే గాదు. మూఁడు వందలవత్సరము లీవిధముగఁ బ్రవర్తించినను గూడఁ బ్రయోజ

నములేదు.'' అని బాయేజి బదులుచెప్పెను. "దీనికిప్రతివిధా నమెద్ది?'' అని సాధకుఁడడుగఁగా బాయేజీ ఇప్పుడే బయలు దేఱుము. తలగొఱిగించుకొనుము. నీశరీరమునందుఁగల సౌందర్యోద్దీపకములగు పదార్థములను దొలఁగింపుము. ఈవస్త్రమును పరిత్యజించి కంబళిని కట్టుకొనుము. నీ వెఱిఁగినస్థలమున కేఁగుము. నీయొద్ద కొన్ని యాటవస్తువు లుంచుకొనుము. కనఁబడినపిల్లలను బిలిచి "నామెడమీఁద నొకదెబ్బ కొట్టినవాని కొకదానిని, రెండుదెబ్బలు కొట్టినవానికి రెంటిని ఇచ్చెదను.'' అని చెప్పి పిల్లలచేత దెబ్బలు తినుచు, అన్ని వీథులయందును దిరుగుము. నీ కెక్కువయవమానము గలిగిన స్థలమునందు నివాస మేర్పఱచుకొనుము. ఇదియే నీరోగము కుదురుటకు మహౌషధము.'' అని చెప్పెను. నిజముగా అహంకారమున కింతకంటె మంచిమందు లేదు. గర్వమును విడనాడి దీనుఁడవై సమస్తమానవులసమ్ముఖమునందు, స్వదోషకీర్తనను జేసికొనుచు, తా నిదివఱకహంకారము చూపించినవారియొద్దనుండి యనాదరణ నాహ్వానించుచుండినయెడల నీయహంకారము పలాయితే మగును. కాని యెల్లమానవుల సమ్ముఖమందును, సరళభావమున నిజదోషములను స్వీకరించుటవలన "నేను సరళస్వభావుఁడను, నన్నెల్లరును సరళస్వభావుఁ డని తలంచుచున్నారు'' అనునట్టియహంకారము గలుగవచ్చును. కాని యిట్టిభావోదయ మయినంతనే దీనిని

గూడ నెల్లరయెదుట వెల్లడింపుము. క్రమక్రమముగ నిట్లొనర్చుటవలన అహంకారము పలాయితమగును. అహంకారము పలాయిత మైనంతనే హృదయము పవిత్ర మగును. జీవనము ధన్యమగును. అహంకారమును నశింపఁజేసికొనుటకుఁగాను కొన్ని విశేషోపాయములను జెప్పియున్నాను. ఇందువలన సకలపాపములను జయించుటకుఁ జెప్పఁబడిన సాధారణోపాయములను మఱవఁజనదు. అహంకారమును నశింపఁజేసికొనుటకుఁగాను సాధారణోపాయములనుగూడ మనస్సునందుంచుకొనవలయును.

---

# మాత్సర్యము.

(౧) పరులపైని ప్రేమను విస్తరింపఁజేయుటవలన మాత్సర్యము నశించును. ప్రేమింపఁబడువానియైశ్వర్యమును జూచి ప్రేమించువాఁ డెప్పుడును విచారము నొందఁడు. మఱియు వానియభివృద్ధిని జూచినకొలఁదిని ఆనందము గలుగుచుండును. కాని మాత్సర్యగ్రస్తుల మగుటకు వీలు లేదు. కావున నీ వెవరియున్నతిని జూచి సహింపఁజాలకుందువో యట్టివారి సద్గుణముల నాలోచించినకొలఁదిని వానిపైఁద ప్రేమగలుగుచుండును. అందువలన మాత్సర్యము దూరమగును. ఇదే విధముగ నితరులను ప్రేమించుచుండినకొలఁదిని మాత్సర్యము తగ్గిపోవుచుండును. కావున నీహృదయమునందు మాత్సర్యము గలవారితోడ స్నేహము నెఱపుచుండవలయును.

(౨) మాత్సర్యమును బలపఱచునది సంకీర్ణత్వము. సుఖమును, సంభ్రమమును, సంపదయు నున్నంతవఱకు కంద అనుభవించిరనియు, నాకేమియు మిగులలేదనియుఁ దలంచుచుండువాఁ డితరులసుఖమును, సంభ్రమమును, సంపదనుజూచి కష్టపడుచుండును. పృథివియందుండు సుఖసంపదల కంతము లేదనియును ప్రతిమానవున కేదో యొకవిధమున శ్రేష్ఠత్వము

నొందుట కవకాశము గల దనియును, దలంచు చుండు వారలహృదయనిర్మలయందు మాత్సర్యము రాజ్యము చేయఁ గాలదు. ఉదారత వృద్ధియైనకొలఁదిని మాత్సర్యము నశించు చుండును.

(౩) మాత్సర్యమునకు ప్రధానసహచారి పరనింద. మాత్సర్యము వృద్ధియైనకొలందిని పరనింద జిహ్వాగ్రమునందు తాండవ మాడుచుండును. పరనింద తగ్గిపోయినకొలఁదిని మాత్సర్యము తగ్గిపోవుచుండును. ఈయభ్యాసమును నశింపఁజేసికొనుటకు రెండు మంచిమార్గములు గలవు. (క) నిందకుఁడు తనదోషములను సర్వదా చూచుకొనుచుండవలయును. స్వదోషముల సంబంధమునందు సర్వదా జాగరూకుఁడై యుండువాఁడు పరులను నిందించుటకుఁ బ్రయత్నింపఁడు. (ఖ) పరుల దోషములను వెదకక గుణములను మాత్రమే వెదకుచుండుట వలన గుణకీర్తనఁ జేయుకోరిక వృద్ధి యగును. అందువలన పరులను నిందించుస్వభావము తగ్గిపోవును. సర్వదా పరుల గుణకీర్తనముఁ జేయుచుండువారి సహవాసము చేయుట వలన మిక్కిలి మేలు గలుగును. మహాపాతుకునియందు గల గుణములనుగూడ వెదకి తెలిసికొని వానిగుణకీర్తనము జేయు చుండినయెడల హృదయ మానందపూర్ణమగును. నీవు నిందించుట కుత్సాహము గలిగియుండు వానిచరిత్రను పరిశీలించి గుణసంధానమును జేయుము. అందువలనఁ గొన్ని సుగుణములు

గనఁబడును. వీనిసంబంధమునం దెప్పుడు ప్రసంగింపవలసివచ్చి
నను గూడ గుణములనే పేర్కొనుచుండుము. వానిగొప్ప
తనమునే వెల్లడించుచుండుము. ఈవిధముగఁ జేయుచుండిన
యెడల పరులను నిందింపవలయు ననుకోరిక దూర మగును.
అందువలన నిర్మలానందము ననుభవింపఁగలవు.

(౮) బాగుపడుటకుఁగాను ఆతురుఁడ వై యుండుము.
ఇట్టి యాతురత గలిగియుండు వారిహృదయమం దీర్ష్య పని
చేయఁజాలదు. ఇట్టివ్యాకులత గలవాఁడు పరులసుగుణముల
వినుచు, వానినిర్మలత్వమును గ్రహించుచుఁ దా నున్నతికి
రాఁబ్రయత్నించును. కాని పరులను కుదృష్టితోఁ జూచుటకే
వాని కవకాశ ముండదు. పరులదోషకీర్తనము సత్పథమునకుఁ
గంటకమువంటి దని యెఱుంగుము. ఈర్ష్యాన్వితుఁ డెప్పుడు
నితరులకు నష్టమును గలిగించుటకు ప్రయత్నించుచుండును.
అందువలన నాతఁడు బాగుపడుటకే యవకాశ ముండదు.
బాగుపడవలయునను కోరిక ప్రబలముగ నుండువాఁడు పరుల
యందుండు మేలునుమాత్రమే గ్రహించి దానిని తనజీవితము
నందు జాగ్రత్త చేసికొనుటకుఁ బ్రయత్నించుచుండును.
వాఁడు తనతో సమానులగుటకు నితరులను క్రిందికి లాగక
తా నున్నతినిబొంది వారితో సమానుఁ డగుటకుఁ బ్రయత్నిం
చును. మాత్సర్యగ్రస్తుఁ డగువాఁడు నిజోన్నతిని మఱచి పరుల
పతనమునకుఁ బ్రయత్నించుచుండును. మాత్సర్యవిహీనుఁ డ

న్యులను క్రిందికి లాగి నేను వారితో సమానుఁడ నగుటకంటె నే నభివృద్ధినొంది వారితో సమానుఁడ నేల కాఁగూడ దని తలంచుచుండును. అట్టివాఁ డీర్ష్యానామమును విన్నమాత్ర మున నే లజ్జితుఁ డగును.

(౫) మాత్సర్యమువలనఁ గలుగునష్టములను గూర్చి యాలోచించుచుండుటవలన మాత్సర్యము నశించును. ఈర్ష్యాగ్నియందు ఆహుతిగ ప్రాణముల నర్పించువానియొక్క స్థితి మిక్కిలి శోచనీయము గదా? ఒక్కమానవుని గుణగానమును చేసి వేలకొలఁది మానవులు ధన్యు లని తలంచుచుండు నప్పుడు, అట్టివానిగుణముల నాకర్ణించినంతనే యీర్ష్యాన్వితుఁడు హృదయవేదనను బొందును. కావున వానివంటిహతభాగ్యుఁడింకొకఁ డుండఁడుగదా? దోషచింతనమును, దోషదర్శనమునువ్యవసాయముగాఁగలహతభాగ్యునిఁదలంచినంతనే హృదయము తల్లడిల్లు ననుట నిక్కువము. చంద్రునికళంకమును మాత్రమే చూడఁగలిగి, కుసుమమందలి కంటకములను మాత్రమే భావింపఁగలిగి, మృణాలకంటకముల మాత్రమే దెలిసికొనఁ గలిగినవానివంటి దుఃఖభాజనుఁ డీ జగత్తునందింకొకఁ డుండఁడు. ఈర్ష్యాళునిహృదయ మెప్పుడును కంటకాకీర్ణమును క్లేదపూర్ణమును నై యుండును. కావున సమస్త మానవులను భగవానుఁ డీర్ష్యానలమునుండి తప్పించునుగాత. హాలాహలతుల్య మైనయీర్ష్య హృదయమును కలవరపఱుచు

చుండును. ఈర్ష్యాన్వితుని కారోగ్యము చెడును. మనోదౌర్బల్యమేర్పడును. కర్తవ్యకార్యములను జేయుట కిచ్ఛయుండదు. చిత్తస్వాధీనత దూరమగును. ఈజగత్తునందు జరుగు వివాదములు మొదలగువాని కీర్ష్యయే గదా మూలము. గణనాతీతము లగు జాతులును, మానవులును ఈయగ్ని కాహుతులై యున్నారు.

(౬) ఇంకొకసంగతిని మనస్సునం దుంచుకొనినయెడల నీర్ష్యను దరిఁజేరనీచ్చుటకు లజ్జించెదము. లార్డుబేకన్ ఇట్లు నుడివియున్నాఁడు. "నిజగుణములు లేనివారలు పరుల గుణములను జూచి యీర్ష్యాన్వితు లగుచుందురు. పరునిగుణములను సంగ్రహింపఁగలనను నమ్మకము లేనివాఁడు, అతనిని క్రిందికిలాగి తనకుసమానునిగఁ జేసికొనుటకుఁ బ్రయత్నించుచుండును." పరులబాగును చూచి సహింపఁజాలనివాఁడు, ఈర్ష్యాన్వితుఁడై యుండును. బాగుపడుటకుఁ బ్రయత్నించువాఁడు మంచివానితో సమానుఁ డగుటకుఁ బ్రయత్నించుచుండును. వాఁడు పరుల కష్టమును నష్టమును గోరఁడు. పరులతో సమానుఁ డగుటకు శక్తిలేనివాఁడు క్రమక్రమముగ పరులుతనతో సమానులు గావలయునని కోరుచుండును. ఈర్ష్యకుఁ బునాది దుర్బలత్వము. దీనిని దెలిసికొనినవాఁ డెప్పుడును ఈర్ష్యాన్వితుఁడు గాఁడు.

# స్వేచ్ఛావర్తనము.

(౧) చిత్తము నియమాధీనము గానందువలన స్వేచ్ఛాప్రవర్తన గలుగును. చిత్తము నియమాధీనమైనయెడల స్వేచ్ఛాప్రవర్తనము తగ్గిపోవును. ఏదో యొకవ్రతమును, కొన్ని నియమములను ఏర్పఱచుకొని వానిని పాలించుటకుఁగాను సర్వదా యత్నింపవలయును. ఇందువలన చిత్తమును స్వాధీనము చేసికొనవచ్చును. ప్రతిదినమును, నియమానుసారముగ కార్యములను జేయుచుండినయెడల చిత్తసంయమము గలుగును. స్వేచ్ఛావర్తనము దూరమగును. మనస్సునకెప్పుడేదితోఁచిన నప్పుడు దానిని జేయుదుమనియు, నిశ్చితకాలమునందు చేయవలసిన కార్యము లిం కొకకార్యమువలన నుపేక్ష చేసితిమనియుఁ జేయవలసినకార్యములకు, కాలనిర్ణయము లేదనియును జెప్పుచు, కాలమును గడపువారు స్వేచ్ఛావర్తననుండి తప్పించుకొనుట దుస్తరము, కావున దైనికకార్యక్రమమును నిర్ధారణచేసికొని ఆక్రమమును దప్పక పాలించుచుండుట వలన మిక్కిలి మేలు గలుగును. కాలమును దప్పక కార్యములను నిర్వహించుచుండవలయు నను జాగ్రత్త గలిగియుండవలయును. నేటి సాయంకాల మెనిమిది గంటల కేదియో

యొక్క నిర్దిష్టకార్యమును జేయవలసియుండు ననుకొనుము. కాని యేడుగంటలనుండియే ఏ స్నేహితునితోడను మాటలాడు చుండుట, లేదా సంకీర్తనయందుండి గాని, సంగీతమునం దుండి గాని నిమగ్నమగుట, వీనిచే ఎనిమిదిగంటలప్పుడు చేయవలసినకార్యమును చేయఁజాలవైతి వనుకొనుము. ఇంతకంటె స్వేచ్ఛాప్రవర్తనమునుబలపఱుచునది మఱియొక్కటియుండదు. సంకీర్తన మొదలగువానివలనఁ గూడ నుస్మత్తుఁడవై నిర్దిష్టసమయములయందుఁ జేయవలసిన కార్యములను మఱచుట కోరఁదగినవిషయము గాదు. భగవన్నామస్మరణముకంటెను గూడ కర్తవ్యకార్యనిర్వహణము గురుతరమా యని యెవరైనను బ్రశ్నింపవచ్చును. కాని "కర్తవ్యకార్య నిర్వహణము గూడ నీశ్వరుని మహిమను బ్రకటించు నను వాక్యమును మఱచితివా?" అని ప్రత్యుత్తరంబొసంగినఁ జాలును. కర్తవ్యకార్యసాధనముకంటె సంకీర్తనం బణుమాత్రమైనను శ్రేష్ఠమైనది గాదు. సంకీర్తన మొదలగువానివలన హృదయము ప్రఫుల్లమగుటయేకాక, భక్తిరసపూరితమై కర్తవ్యకార్యసాధనార్థమై పుణ్యమునకుసాహాయ్యమొనర్చును. చైతన్యస్వామివలె సంకీర్తన యొక్కటియే జీవితమునందు కర్తవ్యకార్యముగఁ బెట్టుకొన్నవారి విషయము స్వతంత్రము. ఒకానొకప్పుడు బంగాళాదేశమునం దొకవిఖ్యాతభక్తుని సందర్శించుటకుఁగాను, మధ్యాహ్నకాలమునం దొకానొకఁడు పోయెను. వీరిరువురును భగవత్ప్రసంగమునందు మునిఁగి

యున్మత్తచిత్తులై యుండిరి. ఇంతలో సాయంకాల మాయెను. రెండవవానికి నెవరినో యొకరిని సాగనంపవలసిన నియమితకాలము సమీపించెను. అందువలన నేఁగుటకిచ్ఛ లేకున్నను, కర్తవ్యానురోధమువలన సెలవియ్యవలయు నని భక్తునిఁ గోరెను. ఆతనిని వదలుటకు భక్తునకిష్టము లేకున్నను గూడ కర్తవ్యకార్యమును దలంచి "నీవు కర్తవ్యపాలన కొఱకీమహత్తును వదలి పోవుచుండుటవలన నే నంతములేని సంతసము నొందుచున్నాను." అని చెప్పుచు సెలవిచ్చెను.

కార్యక్రమపట్టిక నేర్పాటు చేసికొని దానిప్రకారము ప్రవర్తించిన వారిలో బెంజమిన్ ఫ్రాంక్లిను ముఖ్యుఁడు. ఆయన దైనిక కార్యక్రమమును తనజీవనచరిత్రయం దుదాహరించి యున్నాఁడు. అది మిక్కిలి శిక్షాప్రద మై యున్నది.

ఈకార్యక్రమము ననుసరించి మన స్థితి కనుగుణముగ నొకకార్యక్రమపట్టికను సిద్ధము చేసికొనవలయును. అట్టి పట్టిక ననుసరించి ప్రవర్తించినయెడల స్వేచ్ఛాప్రవర్తనము దూర మగును.

(౨) భగవద్భక్తి లభ్య మగుటకు స్వేచ్ఛాప్రవర్తనము ఘోరశత్రువు.

మనము స్వేచ్ఛాప్రవర్తనకు దాసులమగుటవలన మనజీవితమునం దెంతవఱ కేగుణముల నార్జింపఁగలిగినదియు ఆత్మ

# బెంజమిన్ ఫ్రాంక్లిన్ గారి దైనిక కార్యక్రమపట్టిక.

| | గంటలు. | |
|---|---|---|
| ప్రాతఃకాలము. | ౫ | నిద్దురనుండి లేచుట. |
| ప్రశ్న = నేడు నేనెట్టి సత్కార్యములు చేయుదును. | ౬ ౭ ౮ | కాలకృత్యములు దీర్చుకొనుట-ప్రార్థన-కర్తవ్యకార్యములనిర్ధారణ - గ్రంథపఠనము-ప్రాతఃకాలభోజనము. |
| | ౯ ౧౦ ౧౧ | కార్యములు. |
| మధ్యాహ్నము. | ౧౨ ౧ | గ్రంథపఠనము, జమాఖర్చులెక్కలను జూచుకొనుట, మధ్యాహ్నభోజనము. |
| అపరాహ్ణము. | ౨ ౩ ౪ ౫ | కార్యములు. |
| సంధ్యాకాలము. | ౬ | |
| నేడు నేనెట్టిసత్కార్యము లొనర్చితిని? | ౭ ౮ ౯ | వస్తువులను యథాస్థానమందుంచుట. సాయంకాలభోజనము సంగీతము వాద్యములు మొదలగునవి. దినమొక్క కర్తవ్యసంబంధమునందాత్మపరీక్ష. |
| రాత్రి. | ౧౦ | నిద్ర. |

పరీక్షవలనఁ దెలిసికొనఁజాలము. ఫ్రాంక్లిను కొన్ని గుణ
ములను సమకూర్చి యేదినమునం దేగుణమును పూర్తిగఁ
గాపాడఁ గలిగినదియు, ఏదినమునందు దేనిని నిలుపుకొనఁ
జాలకుండినదియును దెలిసికొనఁగలందులకు సుందరమగుపట్టిక
నొకదాని నేర్పాటుచేసి యున్నాఁడు. ఈయుపాయ
మెల్లరకు ననుకరణీయము. అందువలన స్వేచ్ఛాప్రవర్తనయు
దూరమై హృదయము సద్గుణములచేత నలంకరింపఁబడును.
ఈయన పదమూఁడుగుణములను జేర్చి యం దొక్కొ-
క్కగుణమును సాధించుట కొక్కొక్కవారము నేర్పాటు
చేసియున్నాఁడు.

ఆవారమునం దాగుణముపై విశేషముగ దృష్టి యుంప
వలయును. అట్లనుటవలన నితరవానిపై నుదాసీనభావ
మును జూపింపఁ జనదు. ఒకపుస్తకమునం దొక్కొక్కపుట
యం దొక్కొక్కగుణమును పెద్దపెద్దయక్కరములతోడ
వ్రాయవలెను. ఈపుటయం దేడుదినముల పేర్లను వ్రాసి పార్శ్వ
మునందు కొన్నిగుణముల పేర్లు ఉదాహరింపవలెను. ఆవార
మునందు పుటకుపైని పెద్దయక్కరములతో వ్రాసినగుణము
మీఁద మిక్కుటముగ లక్ష్య ముంపవలయును. సాయం
కాలమునం దాత్మపరీక్ష చేసికొనునప్పుడు పూర్ణముగ
పాలింపఁజాలనిగుణమున కెదురుగా నల్లసిరాతో గుర్తు వేయు
చుండవలయును. ఫ్రాంక్లిను జీవనచరిత్రమునుండి ఇట్టిపట్టిక
నిం దుదాహరించుచున్నాను.

## పరిమితాహారపానీయములు.

| గుణములపేళ్లు. | ఆది | సోమ | మంగ | బుధ | గురు | శుక్ర | శని |
|---|---|---|---|---|---|---|---|
| వాక్సంయమము | | | | | | | |
| నియమానుసారముగ వర్తించుట | | | | | | | |
| కర్తవ్యసాధనయందు దృఢప్రతిజ్ఞ గలిగియుండుట. | | | | | | | |
| మితవ్యయము. | | | | | | | |
| పరిశ్రమకాలమును సరిగ నుపయోగ పఱుచుకొనుట. | | | | | | | |
| నిష్కాపట్యము | | | | | | | |
| న్యాయపరాయణత్వము | | | | | | | |
| స్థైర్యము తితీక్ష | | | | | | | |
| ఇంద్రియసంయమము | | | | | | | |
| వినయము | | | | | | | |

(౩) స్వేచ్ఛావర్తనమునకు ముఖ్యకారణము నిరంకుశ భావమునఁ బ్రవర్తించుచుండుట. నాయకుఁడుగాని శిక్షించు వాఁడుగాని లేనివాఁడు స్వేచ్ఛాప్రవర్తకుఁ డగును. కావున తనకు భక్తిభాజనుఁ డగువానియాజ్ఞ ననుసరించి ప్రవర్తించు చుండినయెడల స్వేచ్ఛాప్రవర్తన నశించును. సైనికుఁడు సేనాధిపతి కధీనుఁడై మెలంగుచుండువిధమున, శిష్యుఁ డొకగొప్పవాని కధీనుఁడై తదాదేశానుసారముగ కర్తవ్య కార్యములను నిర్వహించు చుండినయెడల స్వేచ్ఛా ప్రవర్తనము నాశన మగును. స్వేచ్ఛాప్రవర్తనమును నశింపఁ జేసికొనుట ప్రతివానికిని ఆవశ్యకము.

(౪) ప్రతిదినమును అప్పవాల్పక యొకటేదిక్కున కనేక నిమిషములవఱకు చూచుచుండుటవలనను, ప్రాణాయామము వలనను, స్వేచ్ఛాప్రవర్తనము తగ్గిపోవును. ఏకాగ్రచిత్తతను బలపఱుచుమార్గములన్నియు స్వేచ్ఛాప్రవర్తనమును నశింపఁ జేయును.

(౫) విధినిర్దిష్టనియమాధీనమై సౌరజగత్తునందు గ్రహములు సంచరించు చుండువిధమునుగూర్చి చింతించుచుండిన యెడల స్వేచ్ఛాప్రవర్తనము నశించి, జీవనము నియమబద్ధ మగును. ఈవిశ్వ మొకనియమమునకు బద్ధమై తిరుగుచున్న దో యనియు, సూర్యోదయ సూర్యాస్తమయములు నియమిత కాలమున జరుగుచున్న వనియును, చంద్రుఁ షోడశకళలు

నియమానుసారముగ వృద్ధిక్షయము లొందుచున్న దనియును, గ్రహములు నక్షత్రము లేదినమునం దెంతవఱకుఁ దిరుగుచుండ వలయునో అంతవఱకుఁ దిరుగుచుండు ననియును, నియమానుసారముగ నగ్ని మండుచున్న దనియు, వాయువు వీఁచుచున్న దనియు, మేఘములు సంచరించుచున్న వనియు, ఋతువులు దిరుగుచున్న వనియు చింతించుచుండువాఁడు నిర్దిష్ట నియమముల త్యజించి, నావికుఁడు లేని నావవలె స్వేచ్ఛాప్రవర్తనమునకు జీవితము నర్పింపఁజాలఁడు. ఈ బ్రహ్మాండమునం దంతట అవరించి ఒకటే మహాశక్తి కార్యములను నడపుచున్నదని గ్రహించి అవిధికి తల యొగ్గి ప్రవర్తించువాఁడు సౌభాగ్యవంతుఁడు. అట్టివాఁడు వయసు చెల్లినకొలఁదిని ఆనందమును బొందుచుండును. ఆవిధిని దెలిసికొనఁజాలక తరంగతాడిత కాష్ఠమువలె జీవనమును స్వేచ్ఛాప్రవర్తనకప్పగించువాఁడు హతభాగ్యుఁడు. అట్టివాఁడు వయసు చెల్లినకొలఁదిని సంతాపముచే దగ్ధుఁ డగుచుండును. భవిష్యదంధకారమును జూచి హతాశుఁ డగును. కావున మనము స్వేచ్ఛాప్రవర్తనను వదలి జీవనమును ధన్యత నొందించుకొందుముగాత.

---

# సాంసారిక దుశ్చింత.



సర్వదా సాంసారిక దుశ్చింత కలవారలు భక్తి సార్జింపఁ జాలరు. కావున సాంసారిక దుశ్చింతను నశింపఁజేసికొనుటకుఁ గాను ప్రతిమానవుఁడును బ్రయత్నింపవలయును.

(౧) అభావజ్ఞానము, లోకనిందాభయము, తగ్గినకొలఁదిని సాంసారికదుశ్చింత దూర మగుచుండును. మనకుఁ గల యభావములు మిక్కిలి కొంచెము లనియును, మనసర్వనాశమునకు మనచే కల్పించుకొనఁబడినయభావజ్ఞానమే కారణమనియును, ఇదివఱకే చెప్పియున్నాను. మనకు ప్రతిదినమును గావలసినపదార్థములు కొంచెము లని తలంప కుండుటవలన, ఈపదార్థము లేక జరుగు టెట్లు? ఆపదార్థము లేక జరుగు టెట్లు? ఈపదార్థము లేక నలుగురలోఁ దిరుగు టెట్లు? అని చంచలచిత్తులమగుచుందుము. "దినము లేదోవిధముగఁ గడచు ననియును, భూమికి వచ్చినవిధముననే భూమియం దుందు ననియును, అన్నముకొఱకుఁ బ్రయత్నించువారిని బ్రయత్నింపనిమ్మనియును; సమాజానురోధమువలన అభావకల్పనలను జేసికొనుట మూర్ఖత్వ మనియును, దలంచుచుండువాని హృదయమునందు సాంసారిక దుశ్చింతలు ప్రవేశింపఁజాలవు. భా

గృహనగలు చేయించువిధ మెట్టిదనియు తలిదండ్రులతద్దినము
నకు మిక్కుటముగ వ్యయపఱుచుటకు ధనమును సంపాదించు
విధ మెట్టి దనియు పరితాపమును బొందుచుండు వేలకొలంది
మానవులను మన మనుదినమును జూచుచుందుము. ఇట్టివా
రత్యంతకృపాపాత్రులు. వీరికిఁగల యభావజ్ఞానమును లోక
నిందాభయమును జూచినయెడల కష్టము గలుగుచుండును.

(౪) సద్విషయములయందు మనస్సు మగ్నమై యుండు
వానిని సాంసారికదుశ్చింతలు బాధింపఁజాలవు. సాధుపుంగ
వులసాంగత్యముచే పవిత్రములగుకార్యములయందును విద్యా
విషయకచింతయందును భగవద్విచారణయందును మగ్నమై
యుండువానిని సాంసారికదుశ్చింతలు సమీపింపఁజాలవు.
రాజనారాయణబోసుగారి "షికాల్ యెకాల్" అనునుప
న్యాసమునందలి రామనాథుని కథ నుదాహరించుచున్నాను.
రామనాథుఁడు న్యాయశాస్త్రమునందు నిమగ్నుఁడై యుం
టవలన నీతనిహృదయమునందు సాంసారికదుశ్చింత ప్రవేశిం
చుటకే వీలు లేకుండెను. సాంసారికాభావములనుగూర్చియే
రామనాథుఁ డెఱుంగఁడు. అతిదారిద్ర్యముతోడ నీతఁడు
కాలము గడపుచున్నాఁ డని ఇరుగుపొరుగువారు మాత్రమే
తలంచుచుండిరి. ఒకానొకదినమునం దీతనిదారిద్ర్యమును దూ
రము చేయుటకుఁగాను రాజాకృష్ణచంద్రుఁ డీయనగృహమునకు
వచ్చి "కొంచెమైనను మీకు అనుపపత్తిగలదా" యని ప్రశ్నిం

చెను. న్యాయశాస్త్రానుసారముగ "అనుపపత్తి" అనఁగా ఏ విధమగు సిద్ధాంతమునకు రామిని అనుపపత్తి యందురు. అందువలన రామనాథుఁడు తన్ను రాజు న్యాయశాస్త్రసంబంధమునసే ప్రశ్నించినాఁడనితలంచి "నాకు కొంచెమైనను అనుపపత్తి కానిపించుటలే" దని ప్రత్యుత్తరం బొసంగెను. అంత రాజు స్పష్టపడఁ గలందులకు "కొంచెమైనను నీకు అసంగతిగలదా" యనిప్రశ్నించెను. న్యాయశాస్త్రానుసారముగ "అసంగతి" అనఁగా అసమన్వయము కావున రామనాథుఁడు 'నాకు కొంచెమైనను అసంగతిలేదు. సమస్తమును సమన్వయింపఁగలిగి యున్నా' నని చెప్పెను. న్యాయశాస్త్రముగాక ఇంకొకచింతనీయవిషయము రామనాథుని చిత్తమునందు లేదని రాజు గ్రహించి తేటతెల్లమగుమాటలతో "పండితవరా? సంసార విషయమునందు నీకు చిక్కులు లేవా?" యని ప్రశ్నించెను. రామనాథుఁడు "లేవు చిక్కులు లేవు. నాకు కొంచెము భూమి గలదు. అందుల ఫలించుధాన్యము నాభుక్తికి సరిపోవును. ఈకానవచ్చు చింతచెట్టుయొక్క ఆకులతోడ నాభార్య యంబలి కాఁచును. దానిని భుజించి సుఖముగ నున్నాను. నాకు కష్టములు లేవు." అని బదులు చెప్పెను. ఇట్టి సంతోషమును కోరనివాఁ డుండునా? రామనాథునివలె నేదియో యొకసద్విషయమునందు మనస్సు మగ్న మైనవానిహృదయమునందు సాంసారికదుశ్చింత రాజ్యము చేయఁజాలదు.

(౩) మానవుఁడు తనకంటె తక్కువయవస్థయం దుండు వారినిగూర్చి విచారించుచుండినయెడల మనస్సు స్థిర మగుటయేగాక తనయవస్థతోడఁ దాను తృప్తి నొంది యుండును. సద్భావశతకమునందు కృష్ణచంద్రమజుందార్ ఈసంబంధమునందు వ్రాసినపద్దెములను సర్వదా మనమునం దుంచుకొనవలయును. ఈ పద్దెములభావ మిూక్రింద నుదాహరించుచున్నాను. "పాదరక్షలు లేనందువలన నేను మిక్కిలిమనోవేదనను బొందితిని. ఈమనోవేదనతోడ నెమ్మదిగా భజన సేయుటకు దేవాలయమున కేఁగితిని. అచ్చట నొకకుంటివానిని జూచుటవలన నామనోవేదన నశించెను. మనకంటె నెక్కువలేమి గలవారిని చూచినప్పుడు మనలేమి మనలను బాధింపఁజాలదు గదా? ఒకబాటసారి మహారణ్యమధ్యమునందుఁ త్రోవ తప్పి "నే నెట్టియరణ్యమునకు వచ్చితిని. చీఁకటివలన మార్గము కనఁబడుట లేదు. చలి మిక్కుటముగ బాధించుచున్నది. అని తలంచుచు బిగ్గరగ నేడ్చుచుండెను. ఈరోదనమును విని యింకొకబాటసారి యొకబావిలోనుండి యిట్లనియెను. "ఓబాటసారీ ఏడ్వకుము. ఇటువచ్చి నాయవస్థను చూడుము. నీవు చలికి వడఁకుచున్నను గట్టున నున్నావు. నే నూతియందుఁ గొంతువఱకు నీళ్లలోమునిఁగి గోడను బట్టుకొని తల మునిఁగిపోకుండునటుల చూచుకొనుచున్నాను. కావున నావంటియవస్థ నీకు సంభవింపనందులకుఁగాను భగవానునకు కృతజ్ఞుఁడవై యుండుము."

మనకంటె గొప్పవారియొక్క బాధ్యతయును, పలుకష్ట ముల కాకరమగు వారిజీవనమును భావించి చూచినయెడల మనపరితాపము తగ్గిపోవును.

(౪) నిర్జనస్థానమం దుండినయెడల సాంసారికదుశ్చింత వృద్ధి యగును. కావున సాంసారికదుశ్చింతాపీడితుఁ డెప్పుడును నిర్జనస్థానమునందు నివసింపఁజనదు. సంతుష్టచిత్తులగు వారితోడను సాధుపుంగవులతోడను కాలము గడపుచుండిన కొలఁదిని సాంసారికదుశ్చింత తగ్గిపోవుచుండును.

(౫) ఈవిషయమును గుఱించి జీససు చెప్పిన ఉత్కృష్టోపదేశ మిందుదాహరించుచున్నాను. “ నేనేమి తిందును? నేనేమి త్రాగుదును? నేనెట్టిదుస్తులను ధరింతును? అని చింతింపవలదు. ఆహారపానీయములకంటె నీప్రాణ మెక్కుడు గదా? దుస్తులకంటె నీశరీర మెక్కుడు గదా?”

ఆకాశమునం దెగురుచున్న పక్షులను జూడుము. అవి వ్యవసాయమును జేసి ధాన్యమును పండించుకొని కొట్లయందుఁ బోసి నిల్వయుంచుకొనుటలేదు. అయినను భగవానుఁడు వానిని బోషించుచున్నాఁడు. మీరు వీనికంటె పలుమడుఁగు లెక్కుడు గదా? మీలోనెవ్వరైనను యోజించి యొక మూరెడుపొడుగు పెరుఁగఁగలరా? దుస్తులకొఱకు మీ రేల యోజించెదరు? మెట్టతామరపూవు లెట్లెదుగుచున్నవో చూడుఁడు: అవి శ్రమపడుట లేదు. నూలు వడుకుట లేదు.

అయినప్పటికిని మహైశ్వర్యముం దున్న సాలమన్ మహా
రాజుగూడ నీపూవువలెఁ గనఁబడలేదు.''

‘‘అల్పవిశ్వాసులారా? నేఁ డుండి రేపు పోవునట్టిగడ్డి నే
భగవానుఁ డిట్లలంకరించి యుండఁగా మి మ్మింతకంటె
మిక్కుటముగ నలంకరింపఁడా? ఏమి భుజింతుము? ఏమిత్రా
గుదుము? ఏమితిందుము? ఎట్టివస్తువులను ధరింతుమను కోర్కు
లను విడనాడుఁడు. ఇవి యన్నియు మీకుఁ గావలయు నని
పరమదయామయుఁ డగుసర్వేశ్వరుఁ డెఱుంగును. మీరు
మొట్టమొదట నాధ్యాత్మికవిషయములను గూర్చి చింతించు
చుండుఁడు. మీకుఁ గావలసిన సమస్తపదార్థములు లభిం
చును.'' కావున రేపటినిగూర్చి చింతింపవలదు.

# కౌటిల్యము.

కౌటిల్యమువలన మనుష్యుఁడు భగవానుని మోసగింప నెంచును. భగవానునిమీఁద నణుమాత్రము ప్రేమఁజూపుట కైనను కౌటిల్యము పరమవిరోధి. సద్భావముననో లేక అసద్భావముననో సమస్త స్వార్థవిషయములను సంరక్షించు కొనుచు సాధుపుంగవుఁ డనుఖ్యాతిని పదుగురలో నార్జించు టకుఁగాను కుటిలుఁడు ప్రయత్నించుచుండును. భగవానుఁడు తనమోసమును దెలిసికొనఁ జాలఁ డని కుటిలుఁడు దలంచు చుండును. మనసటనలను సామాన్యబుద్ధి గలమనుజుఁ డెకనుఁగొనుచుండ మనమనఃకౌటిల్యము భగవంతునిముందర సాగు టెట్లు? భగవానుని నమ్మి సంసారకార్యములను నిర్వహింపక హృదయమునం దొకభాగమును భగవానునకును రెండవభాగమును విషయకార్యములకును నర్పించి ప్రవర్తించువాఁడు నితాంతము మూర్ఖుఁడు. "సంపూర్ణహృదయముతోఁ బ్రేమించినఁగాని నేను తృప్తినొందను. సంసారమును బ్రేమించువాఁడు నాభక్తుఁడు గాఁడు. వాఁడు సంసారములో నున్నవర్తకుఁడు." (బం॥ప॥) కొంతమంది విషయకార్యానురోధమువలన పాపము లొనర్చినను, పరోప

కారము మొదలగు సత్కార్యములవలన పుణ్యమును సంపాదింపఁ గలిగినయెడల పుణ్యమునందు పాపము పోను పుణ్యమే మిగిలినయెడల స్వర్గము లభించు నని చెప్పుదురు. ఇట్టి వారు నలువదిసేర్లపాలలో పదిసేర్ల గోమూత్రమును బోసి ముప్పదిసేర్ల మంచిపాలను దీసితి మని చెప్పవచ్చును. మఱియును, నిండుగ నీరుగల పాత్రమూతిని బిగించితి మని యును, అందువలన పాత్రె నున్న గంధ్రమునుండి నీరు కార దనియును జెప్పవచ్చును.

'ఇంద్రియాణాంతు సర్వేషాం యద్యేకం క్షరతీంద్రియమ్।
తేనాస్య క్షరతి ప్రజ్ఞా దృతేః పాత్రాది వోదకమ్॥'

మనుస్మృతి.

'చిల్లు మున్న జలపాత్రయందు జల ముండనితెఱంగుననే యింద్రియసముదాయమునం దేయింద్రియము వికృతి నొంది నను గూడ దానివలన ప్రజ్ఞ నశించును.' భగవానునిరాజ్యము నందు కౌటిల్యధర్మము నాచరించుటకు వీలులేదు. పశ్చిమదేశ మునం దొకఁడు కౌటిల్యధర్మము నాచరించుచుండెను. వాఁడు మహాపాపకార్యముల నొనర్చి ధనమార్జించుచు ప్రతి యాదివారము దేవమందిరమునకేఁగి బీదసాదలకు విస్తారముగ ధనమును దానము చేయుచుండెను. ఈతఁడు తనస్నేహితుల తోడ సంసారరక్షణకొఱకు పాపకార్యములు చేయుచు ధన మార్జించుచున్నా ననియును, దానికి బదులు ప్రతి యాది

వారము నియమము దప్పక బీదసాదలకు ధన మొసంగు
చున్నాననియును, కావున నే జేయుపాపములకంటె పుణ్య
మే యెక్కుడగుటవలన, స్వర్గము లభించుననియును, చెప్పు
చుండెడివాఁడు. వీఁడు తనయావులు దిరుగుటకు కంచె
తోడ దొడ్డిని గట్టింపవలయునని తలంచి, ఆపనిని ఒకా
నొక స్కాట్లండుదేశస్థునకు గుత్త కిచ్చెను. అతఁడు పనిని
పూర్తిచేసి సొమ్ము నిమ్మని కోరెను. అంత నిరువురును
దొడ్డియొద్ద కేఁగిరి. కాని కంచెలోనుండి సునాయాసముగ
ఆవులు దాటి పోఁగలిగినంతకంత లుండెను. యజమానుఁ డీ
కంతలను జూచి, ఆవు లిందుండి సునాయాసముగ పాఱిపోఁ
గలవు గాన నీ కెట్లు డబ్బిత్తు ననెను. కంత కిరువైపులను
మూఁడు నాలుగు రెట్లు కంప వేసి గట్టిగా కట్టినందువలన
ఆవులు దాటి పోవుటకు వీలు లేదని కంట్రాక్టరు బదులు
చెప్పెను. ఇందువలన కొంతదాఁక వీరుభయులును వివాద
పడి తుదకు "అయ్యా, మీరు చెప్పువిషయమును నే నెఱింగి
యున్నాను. కంత నుంచి దాని కిరుప్రక్కల నెంత
గట్టిగా కంచెవేసి కట్టిననుగూడ లాభము లేదు. కాని మీ
రాచరించుధర్మము ననుసరించి నేను దొడ్డిని గట్టితిని. మీరు
మీధర్మమున కుండుకంతలను మూసివేసికొనినయెడల, నేను
మీదొడ్డి కంతలను మూసివేయుదును." అని కంట్రాక్టరు
చెప్పెను. ఈవాక్యములవలన నాతనికుటిలబుద్ధి నశించెను.

కావున మన మెప్పుడును కుటిలధర్మము నాచరింపకుందుము గాక. ధర్మాధర్మము లొకదానికొకటి సరిపోవు నని తలఁచి ఆవును చంపి చెప్పులను దానము చేయుట మహాపాతకము గదా?

కౌటిల్యమునకు దాసులగువారలు అవసరమునుబట్టి రెండర్థముల మాటల నుడువుటవలన దోషము లేదని చెప్పుచుందురు. ఒకానొకబాలుఁడు పాఠశాలను దెఱవకముందె పాఠశాలకేఁగి తిరిగి యింటి కేఁగినాఁ డనుకొనుఁడు. ఆతనిసంరక్షకుఁడాబాలునిఁ జూచి పాఠశాల కేఁగితివా యని యడిగినప్పుడు పోయితి నని చెప్పు ననుకొనుఁడు. ఇట్టిజవాబులను కొంత మంది సమర్థింపఁ జూతురు. కాని భగవానుఁడు మన వాక్యములను చూడఁడు. మన మనోభావములను చూచుచుండును. రెండర్థము లిచ్చువాక్యము లనృతతుల్యములే. "సగము సత్యముతోఁ గూడుకొనినమిథ్యకంటె ఘోర మగు మిథ్య యింకొకటి లేదు." కుటిలబుద్ధియొక్క ప్రాణము, లెక్కలయం దుండును. భగవానుని మఱచి ధనము, మానము, యశము, ప్రఖ్యాతి మొదలగునవి వృద్ధి యగుటకును, అవి నిలిచి యుండుటకును, సంబంధించినవిషయములను లెక్కించుకొనుటయే కుటిలునికార్య మై యుండును. కౌటిల్యమెఱుంగనివాఁడు భగవానునిమీఁద లక్ష్య ముంచి సంసార కార్యములను నిర్వహించుచుండును. శ్రీరామకృష్ణ పరమ

హంస యీవిధముగ నుడివియున్నాఁడు. "సంసారకార్యము లను నిర్వహించుటకు, నమ్మకమైనవానికి ముక్త్యారునామా, వ్రాసి యిచ్చువిధముననే నీవు భగవానునకు ముక్త్యారు నామా వ్రాసి యిచ్చి నిశ్చింతభావమున నుండుము." సంసారమునం దీభావమున సంచరించుచుండువాఁడు శ్రేష్ఠుఁడు. వీనికి ధనము, మానము, యశస్సు మొదలగు వానియొక్క అభావజ్ఞాన ముండదు. ధనము, మానము, మొదలగువానిని లెక్కించుకొనుచుండువానికి ఆస పూర్తిగా నుండుటయే గాక హృదయశాంతి యుండదు. శ్రీరామకృష్ణ పరమహంస యొకచక్కనికథను చెప్పియున్నాఁడు. దాని నిం దుదాహరించుచున్నాను. "ఒకానొక మామిడి తోఁటలోని కిరువు రేఁగిరి. మామిడిచెట్లు పండినపంటతో నేలకు వంగియుండెను. ఇందొకఁ డీతోఁట ఎన్నియెకరములనియు, ఎకర మొకటింటికి ఎన్నిచెట్లుండు ననియు, చెట్టున కన్నిశాఖ లనియు, శాఖ కన్నిపండ్లనియు లెక్కించుచుండెను. రెండవవాఁడు చేతి కందినఫలములను గోసి భుజించుచుండెను. ఇంతలో తోఁటయందు సంచరించుట కధికారమును బొందినకాలము పూర్తియైనందువలన వీరిని తోఁటనుండి వెళ్లవలయుననితోఁట మాలి నుడివెను. రెండవవాఁడు కడుపునిండఁ బండ్లను దిని తృప్తుఁడై యుండుటవలన తోఁటను విడుచుటకు సంసిద్ధుఁడై యుండెను. కాని మొదటివానిగణన పూర్తి కానందుచేత

తోఁటను విడుచుట కిష్టపడని కారణమున కలహము సంభ
వించి అర్ధచంద్ర ప్రయోగములతోడ తోఁటను విడిచెను.''
కుటిలబుద్ధి గలవార లిదేవిధముగ సంసార విషయములను
లెక్కించుకొనుచు, కాలమును గడపుచుందురు. ఈలెక్కలు
పూర్తి గాకమునుపే వీరికి మరణ మాసన్నమగును. అప్పుడు
మితిలేని దుఃఖముతోఁ గూడుకొని యేడ్చుటకుఁ బ్రారంభిం
తురు. ఇట్టివారు ప్రప్రథమమున మిక్కిలి చతురులమని భావిం
తురు. కాని చిట్టచివరకు తమవంటి మూఢులు లే రని పరి
తపించెదరు.

(౧) సరళచిత్తుఁ డగుటకును, నిశ్చింతగ నుండుటకును,
బాలకులసాంగత్యము మిక్కిలి ప్రయోజనకారి. దుర్మార్గులు,
విషయలంపటులతోడ సాంగత్యమును వీడి సుకోమలహృద
యు లగు బాలకులతోడఁ గలసి మెలసి సంచరించుచుండిన
కొలందిని, కౌటిల్యము నశించుచుండును. ప్రాతఃస్మరణీయు
లగు మహానుభావు లెల్లరును బాలకులతోడఁ గలసి మెలసి
సంచరించుచుండిరి. "స్వర్గరాజ్యము పిల్లలదే గనుక చిన్ని
పిల్లల నాయొద్ద కనుపుము." అని క్రీస్తు ప్రార్థించియు
న్నాఁడు. త్రైలింగస్వామి పిల్లలను మిక్కుటముగా ప్రేమిం
చుచు, వారితోడఁ గలసి మెలసి ఆడుకొనుచుండెడివాఁడు.
ఈయనయొద్దనొకచిన్న బండి యుండెను. దానిమీఁదనీయన
గూర్చుండినప్పుడు పిల్లలాబండిని లాగుచుండెడివారు. పిల్ల

లను బండిమీఁదఁ గూర్చుండఁబెట్టి బండిని ఈయనలాగుచుం డెడివాఁడు. యోగులు బాలకులతోడ సంచరించుచు, వారి కంటె సరళచరిత్ర గలవా రగుచుండిరి. శ్రీరామకృష్ణపరమ హంసను చూచినవారెల్ల రాయనచరిత్ర బాలకులచరిత్రను బోలి యుండుననిచెప్పుచుందురు. ఆయన కప్పుడేది తోఁచిన నప్పుడు దానిని వెల్లడించుట కణమాత్రమైనను భయముఁజెం దువాఁడు గాఁడు. ఆయన సమాజానురోధమువలనఁ గాని, లోకభయమువలనఁ గాని మన సవలంబించుకపటము సెఱుఁ గనే యెఱుఁగఁడు. మహేశ్వరుఁడు, జ్ఞానసంకలినీతంత్రము నం దిట్లు చెప్పియున్నాఁడు.

'బాలభావ స్తథాభావో నిశ్చిన్తో యోగ ఉచ్యతే.'

"చింతారహితుఁడైన బాలకునివంటి హృదయము కల వానికి యోగము పరిపక్వ మగును" ఈభావము వృద్ధియైన కొలఁదిని కౌటిల్యము నశించుచుండును.

(౨) కపటము లేక స్నేహితులతో మాటలాడుచు, కలసి మెలసి తిరుగుచుండుటవలన కౌటిల్యము నశించును.

(3) సుందరమగు ప్రకృతిని సందర్శించుచుండుటయు, పవిత్రమును, మనోహరము నగు గానమును వినుచుండు టయు మొదలుగాఁ గల మనోరంజక విషయములవలన మిక్కిలి లాభము గలుగును. ఉదారస్వభావుఁ డగుటకును, సరళచిత్తుఁ డగుటకును చంద్రుని దర్శించుచుండుటయు పుష్పో

ద్యానములలో సంచరించుచుండుటయు నదీగర్భములయందుఁ దిరుగుచుండుటయు పర్వతశిఖరము లెక్కుటయు మొదలగు కార్యములు చాలసాహాయ్య మొనర్చును.

(౪) మహా పురుషుల చరిత్రలయం దణుమాత్ర మైనను కౌటిల్యము గాన్పింపదు. వారు కౌటిల్యమునకు దాసు లై యుండినయెడల జగత్పూజ్యులగుటకు వీలులేదుగదా? వారు స్వార్థరహితులును ఉదారస్వభావులును సరళచిత్తు లగుట వలననే సమస్తమానవులకు భక్తిభాజనులై యున్నారు. కావున వానిచరిత్రల ననుకరించుచుండినకొలఁదిని కౌటిల్యము మీఁద నసహనము జనించుచుండును.

(౫) లోకనిందనుగణనచేయకుండుట మిక్కిలియవసరము. మన మనేకసమయములయందు లోకులునిందింతురని భయము వలన కౌటిల్యమును జూపుచుందుము. కావున కౌటిల్యమును వృద్ధిచేయునది ప్రఖ్యాతి నార్జింపవలయునను కోరిక యైయుస్నది. లోకనిందకు భయపడక వివేకముయొక్క ఆదేశము ననుసరించి ప్రవర్తించువానియందు కౌటిల్య ముండుటకు వీలు లేదు. కాని యిట్లు ప్రవర్తించుచుండినను గూడ ప్రఖ్యాతి యు, సమ్మానమును లభించును.

# వదరుఁబోతుతనము.



వదరుఁబోతుతనమువలన చిత్తచాంచల్యము గలుగును. కావుననే యోగులు మౌనవ్రతము నవలంబించుచుండిరి. అందువలన వారియొక్క చిత్తచాంచల్యమును, హృదయ కాఠిన్యమును తగ్గిపోవుచుండెను. తాను మిక్కుటముగఁ బ్రేమించు పదార్థమును బహిరంగపఱుచుట కెవ్వఁడును ఇచ్ఛగింపఁడు. అన్నిటికంటెను మధుర మగు దానిని హృదయాంతరాళమునందు దాఁచుకొనుటకుఁ బ్రయత్నించుచుండును. "హృదయాంతరాళమునం దేమణి రహస్యముగ బ్రజ్వలించుచుండునో ఆమణి యెప్పుడైనను బజారున కమ్మకమునకు వచ్చునా?" (బం॥ప॥) ఇందువలననే గురుమంత్రమును వెల్లడించుట నిషిద్ధము. వాక్సంయమముయొక్క ఆవశ్యకతను దెలిసికొనిన "పిథాగోరసు" సంపూర్ణముగ మూఁడుసంవత్సరములు మౌనవ్రతము నవలంబించినఁగాని తనశిష్యుఁ డగుటకు వీలులేదను నిబంధన నేర్పాటు చేసియున్నాఁడు. వాక్సంయమము లేనివాఁడు భక్తుఁడగుటకు వీలులేదు. భగవద్గీతయందు భక్తుని లక్షణములను జెప్పుచు శ్రీకృష్ణుఁ డిటు నుడివియున్నాఁడు.

"మౌనవ్రతుఁ డగువాఁడు నాకు ప్రియుఁడు."

"తుల్యనిన్దాస్తుతి ర్మౌనీ సన్తుష్టో యేనకేనచిత్ ।
అనికేతః స్థిరమతి ర్భక్తిమాన్ మే ప్రియో నరః."
భగవద్గీత. భక్తియోగము. ౧౯.

"నిందాస్తుతులయందు సమానుఁడును వాక్సంయమము గలవాఁడును ఏమాత్రమునకైనను సంతుష్టి నొందువాఁడును నివాసరహితుఁడును, చంచలము గాని బుద్ధిగలవాఁడును నా యందుభక్తిగలవాఁడును నాకుఁబ్రియుఁడు." వదరుఁబోతు నకు సమస్తము పూజ్యము కావున ప్రతివాఁడును వాక్సంయ మము గలవాఁడు కావలయును. ఒకానొకమహమ్మదీయ సాధు వీవిధముగ నుడివియున్నాఁడు."నాలుకసంబంధమగు ఝురిని బంధించినయెడల హృదయాంతర్గత మగుఝురి బయ ల్పడును."

(౧) వదరుఁబో తగువాఁడు మౌనవ్రతము నవలంబింపవల యును. "మిక్కిలి యవసర మున్నయెడల వారమున కొక దినము మాటలాడుదును" అను నీవిధ మగునట్టి నియమను లేర్పాటు చేసికొనవలయును.

(౨) వదరుఁబోతు నిర్జనస్థానమందు నివసించుచుండుట మంచిది. కొలఁదికాలము నిర్జనస్థానమందు నివసించినయెడల వదరుఁబోతుఁదనము తగ్గిపోవును.

(౩) బెంజమిన్ ఫ్రాంక్లినువలె పట్టిక నొకదానిని వ్రాసికొని మౌనవ్రతము నవలంబించినయెడల మిక్కిలి మేలు గలుగును.

# కుతర్కేచ్ఛ.

ఏవిధమగు సిద్ధాంతమునకు రాని విషయములఁ గైకొనిగాని సరళత్వమునువీడి గానితర్కించుటను కుతర్కమందురు. కుతర్కము భక్తిపథమునకు మిక్కిలిప్రతికూలము. కుతర్కమువలన హృదయము కృశించును. చిత్తచాంచల్యము గలుగును. కావున సరళహృదయుఁడుగను స్థిరచిత్తుఁడుగను నుండవలయునని కోరువాఁ డెప్పుడును కుతర్కమునందుఁ బ్రవేశింపఁజనదు. జ్ఞానాభిమానియగు తార్కికునకును, ప్రేమ గల భక్తునకును బోల్చి రామానందరాయి యిట్లు నుడివియున్నాఁడు. "రసజ్ఞము కాని కాకి వేఁపపండ్లను బొడుచును. రసజ్ఞమగు కోకిల మామిడిపువ్వులను దినును. అభాగ్యుఁ డగుజ్ఞాని శుష్కజ్ఞానము నాస్వాదించును. భాగ్యవంతుఁడు కృష్ణప్రేమామృతమును పానముచేయును." (చైతన్య చరితామృతము.) తర్కమువలన నీశ్వరోపలబ్ధి కానేరదు. ఈశ్వరుఁడు మనుష్యబుద్ధి కతీతమగు విషయము. ఆయన—

"అప్రాప్య మనసా సహ"

అస్తీతి బ్రువతో న్యత్ర కథం తదుపలభ్యతే॥

కఠోపనిషత్.

“ఆయన ఉన్నాఁ డనుటకంటె నుపలబ్ధి నొందు టెట్లు?” మనస్సున కందనివిషయములఁ గైకొని తర్కము చేయుచుం డుటవలన కొంతమంది పిచ్చివాండ్రై యున్నారు. కవిశేఖ రుఁడగు మిల్టన్ ఈవిధమగు విషయములనుగూర్చి తర్కము చేయఁదగదని తెలుపుటకుఁగాను ఇట్టి యగమ్యవిషయములను గైకొని తర్కించువారలు సైతానునియనుచరు లని నుడివి యున్నాఁడు. వీరు తర్కవ్యూహమునందుఁ దగుల్కొని తిరిగితిరిగి బుద్ధిని చెడఁగొట్టుకొనుచుందురు. ఈకారణముననే నారదుఁడు భక్తిసూత్రములయం దిట్లు నుడివియున్నాఁడు. “వాదో నావలంబ్యః” “తర్కమునకు దిగవలదు.” కలకత్తా యందు విద్యార్థులు నివసించుస్థలములయం దీరోగము ప్రబ లమై యున్నది. ఇట్టిరోగమువలన నాక్రమింపఁబడిన బాలురు కుతర్కము జరుగుస్థలములయందు వసింపఁజనదు. సంగీతము వలనను, సంకీర్తనవలనను, భక్తిగ్రంథములను చదువుటవలనను సదాలోచనవలనను హృదయము సరళమగును. కుతర్కేచ్ఛ నశించును. కావున కుతర్కేచ్ఛ గలవారలు సంగీతము మొద లగువానివలన సరళహృదయు లగుటకుఁ బ్రయత్నించు చుండవలయును.

# ధర్మాడంబరము.



మనకుఁ గల ప్రధాన రోగములలో నొకటి ధర్మాడంబరము. మన మితరులసమీపమునందు ధర్మభావమును వెల్లడించుటకుఁగాను బహుప్రయత్నములుచేయుచుందుము. తన్ను భక్తుఁ డనియు, సాధుపురుషుఁ డనియు, ధార్మికుఁ డనియు, ఇతరులు దలంపవలయు నను కోరిక మానవునకు మిక్కుటముగ నుండును. ఇందువలన బాహ్యవేషములకొఱకుఁ బ్రయత్నించుచుందుము ; దీనివలన నాంతరంగిక ధర్మభావము క్రమక్రమముగ తగ్గుటయేగాక అనేకవిధములగు మనోవికారము లుత్పత్తి యగును. కావున నీకపటమునకు మహౌషధము కపటమే. కేశవచంద్రసేనులవారీసంబంధమునం దొకమంచి యుపదేశము నుపదేశించియున్నారు. "పృథివియందు కపటులయొక్కయు, ధూర్తులయొక్కయు, హృదయము హేయముగనుండును. కాని సాధువేషములనుధరించి, చూచుటకు బాగుగ నుందురు. కావున నో బ్రహ్మభక్తులారా! మీహృదయములను బాగుగ నుంచుకొనుఁడు. మీవేషములను హేయముగ నుంచుకొనుఁడు. మీహృదయములయందలి యమృతమును దాచుకొనుఁడు ...... ఓ బ్రహ్మసాధకులారా!

ఆత్మశుద్ధికొఱకు, చిత్తశుద్ధికొఱకు నీ వుపాసనఁజేయఁదలం
చినయెడల, నేకొంచెమాహారమునో భుజించి ముఖావసన్న
తనుఁ గప్పిపెట్టునటులనే ఉపాసనను చేయుచున్నా మని
యేరికిని దెలియనీయఁ జనదు. ...... లోకులసమ్ముఖ
మం దెప్పుడును, సాధుపురుషుఁడ ననెడి పరిచయమును
గలుగనీయఁజనదు. బాహ్యలక్షణము లేమాత్రముఁ గాన్పించి
ననుఁగూడ శాక్యసింహునివంటివిరాగి యనియు, క్రీస్తుని
వంటిపాపిబంధు వనియు, చైతన్యునివంటిమహాభక్తుఁడనియు
లోకులు దలంతురు. హృదయమునం దణుమాత్రమైనను వైరా
గ్యములేనివాని భుజముమీఁద నొక్క—కాషాయవస్త్రము గనఁ
బడినను గూడ వానిని లోకులు విరాగి యనియు, సన్న్యాసి
యనియుఁదలంచి వానిపాదధూళినిఁ గైకొనుటకుఁ బ్రయత్నిం
చుచుందురు. అయిదుపైసలు లేనివానిని అయిదులక్షలు గల
వాఁ డనుట లోకుల స్వభావము. లోకుల నిందాస్తుతులపై
అణుమాత్రమైనను నిర్భరపడఁ జనదు. మీరు ధర్మరక్షణ
కొఱకు పొందుకష్టము లిల్లిల్లు దిరిగి చాటఁజనదు. ఉపవ
సించినసంగతిని యేరికిని దెలియనీయఁ జనదు. ...... మన
మొకదినమునందు స్వహస్తపాకమును జేసికొని భుజించితి
మనుకొనుము. ఇంకొకదినమందు మంచిపండును భుజింప
లేదనుకొనుము. ఈసంగతి వార్తాపత్త్రికలయందుఁ బ్రచురింపఁ
బడినయెడల నెల్లరు "ఏమి? వీరివైరాగ్యము. ఈశ్వరునిపైని

వీరి కిట్టిగభీరానురాగము గలదు!'' అని నుడువుటకుఁ బ్రారం భింతురు. కావున భక్తులారా! జాగ్రత్త! ఇట్టిమాటలవలన వంచితులు గాకుఁడు. మీచెవులసమీపమున కిట్టివాక్యములు వచ్చునప్పుడు చెవులు మూసికొనుఁడు. ......... మీ రాత్మను దాఁచుకొనుఁడు. బాహ్యచిహ్నములవలన లోకుల ప్రశంసను, అనురాగమును సంపాదించుకొనవలయు నని ప్రయత్నింపకుఁడు. ......... నీవు ధర్మముయొక్క పరిచయమును లోకులసమ్ముఖమందుఁ జేయఁ దలఁచినయెడల నీకును జగత్తునకును ముప్పువాటిల్లును.'' ఈవిధముననే, "దానమును భగవత్ప్రార్థనను భగవదుపాసనను లోకు లెఱుంగకుండునటుల చేయుచుండవలయును.'' అని క్రిస్తుతనశిష్యుల కుపదేశించియున్నాఁడు. ప్రియమైనపదార్థమును బజారునందు విక్రయించుట కెవ్వఁడును బ్రయత్నింపఁడని వెనుకనే చెప్పియున్నాను. ధర్మాసక్తి గలవాఁ డెప్పుడును ధర్మము ధర్మమని పలవరించుచు ధార్మికుఁ డని లోకు లెఱుంగుటకుఁ బ్రయత్నింపఁడు. కాని యట్టివారి కార్యకలాపములయందు ధర్మభావము తనంతటతానే ప్రకాశించుచుండును. అగ్నిని కప్పిపెట్టుటకు వీలు లేనటులనే ధర్మమును గూడ కప్పిపెట్టుటకు వీలు లేదు. భక్తునినయనములను జూచినయెడల ననురాగి యని దెలియనగును. ధార్మికుఁడు పట్టువడునుగాని మనవలె ధర్మభావమును వెల్లడించుటకుఁ బ్రయత్నింపఁడు.

ఇందువలననే సాధువులు, మూఁడురాత్రులకంటె నొక్కచో నివసింపరు. మాబారిసాల కొకసాధువువచ్చి కొలఁదిదినములు నదీతీరమునం దుండెను. కాని యీయన సాధుపుంగవుఁడని యెవ్వరు నెఱుంగరైరి. తదుపరి యీయన భగవన్నామమును బాడుచు వీధులవెంటఁ దిరుగ నారంభించెను. పిచ్చివాఁడని తలంచి పిల్లలు వెంటఁబడి కేకలు వేయసాగిరి. కాని యీయన సాధుపుంగవుఁడని తెలిసికొనినంతనే లోకు లీయనను సన్మానింపసాగిరి. తదుపరి యీయన యాగ్రామమందు రెండుదినములు మాత్రమే యుండెను. ఈయన గ్రామాంతరమున కేఁగునప్పుడేల యేఁగుచున్నావని యొకానొకఁడు ప్రశ్నింపఁగా ఈస్థలమునం దధికముగ సన్మానముండుటవలన నుండఁజాల నని నుడివెను. అనఁగా లోకు లాయనను గ్రహించి నలువైపుల మూఁగు చుండుటవలన నాయన మా గ్రామమం దుండఁడయ్యె. అనేకులు సాధుపుంగవులు రహస్యముగ నుండుటకుఁ బ్రయత్నించుచుందురు. "శూన్యఘటమునకు శబ్ద మెక్కుడు." హృదయమునం దణుమాత్రమైనను ధర్మభావము లేని వార లాడంబరములు చేయుచుఁ దిరుగుచుందురు. ధర్మాడంబరము శూన్యహృదయమును దెలుపును.

శ్లో॥ అగాధజల సంచారీ వికారీ నైవ రోహితః ।
గండూషజలమాత్రేణ శఫరీ ఫర్ఫరాయతే॥

లోఁతులేని నీళ్ళయందుండుచిన్ని చిన్ని చేఁపలు శరీరమును గనఁబఱుచునట్లు అగాధజలములయందు నివసించు రోహిత మత్స్యము తనశరీరమును గనఁబఱుపదు. అగాధజలములోని యొకమత్స్యముయొక్క కథ నుదాహరించుచున్నాను. అహల్యాబాయి నామధేయము సర్వజనవిదితమే గదా ? ఆమె భర్త యెప్పుడును రామనామము నుచ్చరించుచుండువాఁడు గాఁడఁట. రామభక్తురాలగు అహల్యాబాయి యిందువలన మిక్కుటమగు మనోవ్యథ నొందుచు మాటిమాటికి భర్తను రామనామము నుచ్చరింపుఁడని పలువిధములఁ బ్రార్థింపసాగెను. కాని యీమెమాటలను హోల్కారు ప్రత్యుత్తరవిహీనుఁడుండెను. అందువలన ననుదినమును తనభర్తను భక్తునిగఁ జేయవలయునని శ్రీరాముని బ్రార్థింపసాగెను. ఇట్లుండ నొకానొకదిన ముదయమునఁ దామె ఆనందపరవశయై మంత్రిని బిలిపించి తన కీదినమునందు మితిలేనియానందముగలుగుచున్న దనియు ఆయానందమునకుఁ గలకారణమును నుడువ ననియుఁ జెప్పుచు, నీదినమున పట్టణమునం దానందోత్సవము జరుగ వలయును, వేలకొలఁది బ్రాహ్మణుల కన్నముఁ బెట్టింప వలయును బీదసాదలకు ధర్మము చేయవలయు నని యాజ్ఞాపించెను. తిరిగి ప్రశ్నించియు మంత్రి కారణమును కనుఁగొనఁ జాలఁ డయ్యె. మంత్రియాజ్ఞానుసారము పురవాసు లెల్ల రా దినమునం దానందోత్సవమునందు మునింగి యుండిరి. కార

ణము మాత్ర మెఱుంగరు. మల్హారీయానందోత్సవమును
జూచి కారణమును గనుఁగొనఁ బ్రయత్నించెను. కాని
ప్రతివాఁడును తల్లిగారియాజ్ఞ యని మాత్రమే విన్నవింపసా
గెను కాని, కారణమును వెల్లడింపఁజాలకుండెను. చివరకీయన
అహల్యాబాయియొద్దకేఁగి కారణమేమని యడిగెను. ఆమె
ప్రత్యుత్తర మొసఁగదయ్యె. అందువలన మల్హారువ్యాకుల
చిత్తుఁడై యహల్యమీఁద విరక్తిని గనఁబఱుచుటవలన నామె
యిట్లు విన్నవించుకొనియెను. "దేవా! నేఁడు నాకుఁ గలిగిన
యానందమునకు మేరలేదు. దానిని మీకుఁ దెలుపుటెట్లు? చిర
కాలమునుండి యున్న నాకోరిక నేఁడు ఫలించినది. అనేకదిన
ములనుండి మీ రిష్టనామము నుచ్చరింపుఁడని ప్రార్థించుచుంటి
నే మీపాదములమీఁదఁ బడుచుంటిని ఆ నామమును గత
రాత్రిస్వప్నమునందు మీ రుచ్చరించియున్నారు. నేను ధన్య
నైతిని. నామనోవాంఛ ఫలించెను. ఇందుకొఱకు ఆనందోత్స
వము జరుగుచున్నది." అని చెప్పుచుండఁగా మల్హారు
నివ్వెఱపడి చూచుచు "ఏనామము, ఏనామము, ఏనామము
నుచ్చరించితిని? ఏనామము?" అని యాతురతతో నడిగెను.
శ్రీరామనామ మని యహల్య నుడువఁగనే "అయ్యో! ఇంత
కాలమునుండి దాఁచుకొనియుండిన హృదయధనము బయల్ప
డెనా? బయల్పడెనా?" యని నుడువుచు, క్రిందఁబడి ప్రాణ
ముల విడిచెను. అహల్యాబాయి నిశ్చేష్టితయై, తనభర్త

సామాన్యుఁడు గాఁడనియు, మహాభక్తుఁడనియు, గ్రహించి, ఇట్టివాని సేవచేయుటవలన ధన్యునైతివనితలంచెను. శ్రీరామకృష్ణపరమహంస యీవిధముగఁ బాడియున్నాఁడు. "ఓ మనసా! నీహృదయమందుండు తల్లిని శ్రద్ధతో దాచుకొనుము. నీవు నేను తప్ప మఱి యెవ్వరిని నామెను చూడ నీయవలదు."

భక్తుఁ డెప్పుడును ధర్మపు డోలును వాయించుచుఁ దిరుగుచుంట కంగీకరింపఁడు. అతఁడు పృథివీసంబంధ మగు సడిచప్పుడు వినఁబడని నిర్జన స్థానమునందు నివసించుచు, హృదయముపీఠమునందు ప్రాణనాథుని ప్రతిష్ఠించుకొని యీవిధముగ నుడువును. "ఓ దేవా! రాత్రులుంబగళ్లును నీతో నే కాలముఁ బుచ్చుటకును, ఎవరికిని గనఁబడకుండ హృదయపీఠమునందు నిన్ను దాఁచుకొనుటకును, నే నత్యంతముగఁ గోరుచున్నాను." (బం॥ప॥) అహల్యాబాయిభక్తవంటి భక్తిరసపూర్ణము గానిహృదయము గలవారలు పరస్పరధర్మవాక్యములను బలుకకుండినయెడల ధర్మభావమును రక్షించుకొనుట దుస్తరము గదా? కావున మనవంటి భక్తిశూన్యహృదయములయందు, భక్తి సంచారమగుటకు ధర్మవాక్యములు మిక్కిలి ప్రయోజనములు. అయినప్పటికిని, ఆడంబరముకొఱకును, లోకులకు గనఁబడుటకును, ధర్మవాక్యములను పలుకరాదు. భక్తులగువారలితరుల హృదయ సీమల

యందు భక్తిబీజములు నాటుట కర్తవ్యము. అట్టివారు నుడువకున్నను గూఢ వారియొక్క భావములు, కనుచూపులు, వీనివలననే భక్తిప్రచార మగుచుండును. అహల్యాబాయి విశేషదృష్టి గలిగియుండినయెడల తనభక్త పరమభక్తుం డని తెలిసికొనియే యుండును.



# లోకభయము.

---

భక్తిపథమునకు లోకభయము విశేషము ప్రతిబంధకము. ఇందువలననే మన మనేకసమయములయందు సత్కార్యములను జేయఁజాలకుందుము. ఇంతియ గాదు. మనుష్యత్వము నే ప్రకటింపఁ జాలకుందుము. మాదేశమునం దొకపట్టణమునం దొక యుపాధ్యాయుఁ డుండెను. ఈతనికి లోకభయము మిక్కుటము. ఈయన తన యింటి దొడ్డి బావిలో నీరు తోడుకొను చుండుసమయమున స్నేహితుఁ డొకఁడు వచ్చెను. స్నేహితుఁడు వచ్చుచుండుటను జూచి నెమ్మదిగా బావిలోని చేదను జాఱవిడిచెను. స్నేహితుఁడు సమీపించి యేమి చేయుచున్నావని యడుగఁగా, "ఏమియు లేదు. బావిలోని నీ రేవిధముగ నున్నదో యని చూచుచున్నాను." అని బదులు చెప్పెను. ఇదే విధముగ మన మనేకసమయములయందు లోకభయమువలన, అబద్ధములు పల్కుచుందుము. అన్యాయముగవర్తించి, చివరకుపరమార్థమునుగూడఁబోఁగొట్టుకొనుచుందుము. భగవన్నామమును స్మరించుటకు, నేకాకిగ సంచరించుచు భగవత్తత్త్వమును గూర్చి విచారించుటకుఁ బ్రయత్నించి, లోకులు నవ్వుదురనియును, వెక్కిరింతు రనియును దలంచి ఆప్రయత్నమును మానుచుందుము.

సాధుభావమున సంచరించువాఁడీ లోకమునం దప్పు డప్పుడు నిందాభాజనుఁడై పలుకష్టములకుఁ బాల్పడవలసి యుండును. నే నెఱింగియున్న వాఁ డొకఁడు గవర్నమెంటు పనిని సంపాదింపవలయునని యత్నించెను. ౫౦ వత్సరములకు మించినవయస్సు గలవాఁ డుద్యోగమున కనర్హుఁడు. నీ వయస్సెంత యని ప్రశ్నించినప్పు డీతఁడు ౬౦ వత్సరములని చెప్పుటవలన గవర్నమెం టుద్యోగము లభింప దయ్యె. కావున నీతనిని నిజము జెప్పినందులకు నసేకులు పిచ్చివాఁ డని చెప్ప సాగిరి. ఈశ్వరునకు భయపడు చుండువానిని జూచి లోకులు పిచ్చివానినిగ పరిగణించుట సహజము గదా? దుర్నీతి దాయకము లగు కార్యములను సంస్కరించుటకుఁ బ్రయత్నించిన మహాపురుషుల చరిత్రలను జూచినయెడల వారు పొందినకష్టములు దెలియనగును. పాపమునకు విరుద్ధ ముగ భగవద్విధానమును ప్రచారముఁ జేసినందులకుఁగాను ఏసుక్రీస్తు శూలముపా లయ్యెను. నేఁటికినిగూడ మహాభక్తుఁ డగు చైతన్యుని పాపండుఁ డనువారు గలరు. ఒక్కొక సమయమందు సాధుమార్గావలంబు లగుపుత్త్రులకు వ్యతిరేక ముగ నానావిధోపాయము లవలంబించి నానాకార్యము లొనర్చుచుండు తండ్రులనుగూడ మనము చూచుచున్నాము. ఇంతకంటె విచారకరమగు విషయ మింకొకటి గలదా?

దేనికి విరుద్ధముగ వాదించువాఁడైనప్పటికిని సాధుపురు షుఁడైనయెడల భగవత్పదములయందు విశ్వాస ముంచి

విచలితుఁడు గాకుండును. ధర్మోద్ధారణకొఱకుఁ బెక్కు మంది మహాపురుషులు పాషండులవలన ప్రాణములను విడిచి యీలోకమును పవిత్రముగఁ జేసి యున్నారు. అట్టివారి చరిత్రలను చదువు చుండినయెడల మనజీవనము పవిత్ర మగును. వారి పదాంకముల ననుసరించి ప్రవర్తించునపుడు ప్రాణమును గూడ నర్పింపవలసి యుండును. కాని యప్పు డీలోకభయము లేశమైన నుండదు. రామప్రసాదసేనుఁ డీ విధముగఁ బాడియున్నాఁడు. "లోకులు నిన్ను పిచ్చివాఁ డని యనవచ్చును కాని, జయకాళీ, జయకాళీ యనిపల్కుము" (బం॥ ప॥) ఇది భక్తులకు మాత్రమే సంబంధించినవిషయము. మనకుఁ గూడ ప్రాణనాశనవిషయమునందు శంక లేనప్పుడు లోకనిందవలన పరమార్థమును త్యజింతుమా? ఈశ్వరుని సహవాసమున కాలము గడప నెంచువాఁడు లోకనింద కేల భయపడవలయును? ఒకానొకభక్తుఁడు ప్రఫుల్లచిత్తుఁడై యిట్లు పలికి యున్నాఁడు. "నీకును నాకును స్నేహము కుదిరినది. ఇందువలన లోకులు నన్ను నిందించుచున్నారు. వారియిచ్ఛ వచ్చినట్లు వారిని పలుకనిమ్ము. కాని నీవును నేనును సంతోషముతోడ కార్యములు చేయుచున్నాము. నీవును నేనును కర్తవ్యమును చేసినారము. పరస్పరబంధుత్వ సూత్రమువలన బంధింపఁబడి యుండుటచే మన యిరువురకు మేలైనది. ఎవరియిష్టము వచ్చినట్లు వారిని మాటలాడనిమ్ము.

కాని అందువలన మనకుఁ గలుగులాభనష్టములు లేవు.''
(బం॥ప॥) శ్రీకృష్ణునిమీఁద రాధకుఁగలవిశుద్ధప్రేమ నాధార
ముగఁ గైకొని యీ మొదటినిగాయి గందరగోళము చేయు
టకుఁ బ్రారంభించెను. అందులకు రాధ యిట్లనియె.
"నేను కృష్ణునియందు మోహపరవశురాల నైతి నని యిష్ట
మున్నయెడల నగరమునందుఁ జాటుకొనుము'' (బం॥ ప॥)
ఈభావముతోడ భక్తిపథమునం దగ్రేసరుఁడు గావలయును.
లోకులు దుర్మార్గుఁడని పిచ్చివాఁడని మూర్ఖుఁడని నుడివినను
బాధలు పెట్టినను గూడ గణనచేయఁ జనదు.

(౧) లోకభయమువలన మనసు పొందుచుండు కష్టము
లను, మనవలన సమాజమునకుఁ గలుగునష్టములను గూర్చి
చింతింపవలయును. ఒకానొకఁడు జిల్లాకోర్టునం దిరువది రూ
ప్యములవేతనమును సంపాదించుచుండెను. తాను బజారునకుఁ
బోయి కూరగలు దెచ్చుకొనిన లోకు లేమందురో యనుతలం
పున, అన్నము పెట్టి నెల ౧ కి రు. ౪-౦-౦ లు జీత మిచ్చు
పద్ధతిని ఒకసేవకుని నియమించుకొనెను. సేవకుని భోజన
మునకు ౪ రూప్యములును, జీతము ౪ రూప్యములును,
మొత్తము నెలకు ౮ రూప్యములగుచుండెను. మిగత పం
డ్రెండు రూప్యములు కుటుంబ పోషణకు చాలక పని గలిగి
వచ్చువారిమొద్ద నాయుద్యోగి చేయి చాఁచుచుండెను.
"అయ్యా! ఏమి చేయుదును? ప్రతిష్ఠ గల వంశమునందు

జన్మించినాఁడను. నాకు వచ్చు జీతము నీకుఁ దెలియును గదా! వంటబ్రాహ్మణుఁడు, పనిపాటలు చేయువాఁడు, లేనియెడల లోకులేమందురు? వంటవానిని నవుకరును పెట్టుకొనినయెడల సంసారమును పోషించుటెట్లు? ఏమి చేయుదును?' అని నుడువువారిని మనమనేకులను జూచుచున్నాము. కాని లోకు లేమందురో యను తలంపున ధర్మమునకు జలాంజలి సమర్పించువాఁ డెట్టి బుద్ధిమంతుఁడు? మనము లోకు లే మందురో యనుతలంపున దుర్నీతిదాయకము లగు నాటపాటలయందు కాలము గడపుటకు లజ్జింపము. "ఈదినమున బంధుని యింటియందు భోగమువాం డ్రాడుదురు. ఇట్టి యాటల కేఁగఁ గూడ దని నేను రెండుమూఁడుమాఱు లుపన్యసించి యుంటిని. కాని యిప్పుడేమి చేయుదును? ఆహ్వానపత్త్రిక కూడ వచ్చెను. వెళ్ళనియెడల లోకు లేమందురు? ఆ బంధువు దుఃఖింపఁడా? కావున వెళ్ళుటయె ముఖ్యము." అని యీవిధముగ యోజించి మన మనేకసమయములయందు చెడుకార్యములలోఁ జేరి బుద్ధిని చెడఁగొట్టుకొను చుందుము. అతిబాల్యవివాహములు పనికిరా వని తీవ్రముగ వాదించువాఁడు లోకులు బంధువు లేమందురో యనుతలంపున తన పుత్త్రులకు పుత్త్రికలకు బాల్యముననే వివాహ మొనర్చి, వారికి మిక్కిలినష్టమును గలిగించుచుండును. లోకభయమువలన తమకును, పరులకును నష్టమును గలిగించువారిని వేలకొలఁదిని జూచుచున్నాము.

(౨) మహాపురుషులజీవనచారిత్రములను బరిశీలించి చూచిన యెడల, వారు లోకుల కణమాత్ర మైనను భయపడక సత్య మని విశ్వసించినకార్యములను చేసియున్నా రని గ్రహింపఁ గలము. ఈభావము హృదయమునందు దట్టముగ నాటు కొనినకొలఁదిని లోకభయము నాశమగుచుండును. సత్యము కొఱకును, ధర్మముకొఱకును, మహాపురుషులు చూపిన తేజ స్సునందలి యొకకణము సోఁకినవాఁడైనను, లోకులకు వెఱ వఁడు. కావున మహాపురుషుల జీవనచారిత్రములను మాటి మాటికిని పఠించుచుండుట కర్తవ్యము.

(౩) ఇంకొకవిషయము మనస్సునం దున్నయెడల లోక భయము తగ్గిపోవును. ప్రథమమునం దొక విషయముమీఁద ద్వేషము గలిగియుండి చివర నావిషయముమీఁద ననురాగ ము గలిగియున్న వేలకొలఁది మానవులను మనము చూచు చున్నాము. ధర్మముతోడను సత్యముతోడను, గూడుకొని యుండుకార్యము లెప్పుడును జయ మొందుచుండును. ఎవరినో యొకరిని నిందించి జయలాభమును బొందితి నని తలంచు వాఁడు తనభ్రమను దాను దెలిసికొని ప్రథమమునఁ దాను నిం దించినవానికి పరమమిత్త్రుం డై యుండును. ఏదో యొకవిష యమున లేక ఎవఁడో ఒకవ్యక్తివిషయమున తండ్రి ఖడ్గధారి యైయుండఁగా పుత్త్రుఁ డావిషయమున లేక ఆవ్యక్తికి పరమ భక్తుఁడై యుండును. సంసారచరిత్రను జూచినయెడల నిట్టి

పుత్త్రిలను, తండ్రులను వేలకొలందిగాంచ నగును. ఏదో యొకసత్కార్యమును ప్రారంభించి చేయుచుండినయెడల ఆ కార్యమును నిందించువాఁడు గాని, లేక, వానిపుత్త్రిలుగాని యేదో యొకదినమం దాసత్కార్యమునఁ జేరి తీరవలయునను దృఢ విశ్వాసము గలవాఁ డెప్పుడును విరోధులు గల రను కారణమున సదుద్యమమును ద్యజింపఁడు. పృథివియం దెవరును మనపక్షమును సమర్థింపకున్నను, సత్యమును, ధర్మము నగు కార్యములు భగవదామోదము గలిగియున్న వని విశ్వసింపవలయును. త్రాసునం దొకవైపున నీశ్వరుని నుంచి రెండవవైపున పృథివి నంతయు నుంచినయెడల నేవైపునకు త్రాసు మ్రొగ్గును? నీ వేప్రక్క కేఁగుదువు?

ప్రధానకంటకముల నామములను నుడివి వానిని దొలఁగించుటకు ఉపాయములను నాచేత నైనంతవఱకు వివరించియున్నాను. ఈయుపాయములన్నిటిని బాగుగ యోజించి చూచినయెడల, మనస్సంబంధమగు కార్యము లధికముగఁ గన్పట్టును. దుశ్చింతను సచ్చింతవలనను, దుర్భావమును సద్భావమువలనను, నశింపఁజేయవలయును. సకలపాపములు మనస్సునం దుత్పత్తి యగును. ఆపాపములన్నిటినిధ్వంసముచేయఁగల శక్తిగూడ మనస్సునకే గలదు. యోగవాసిష్ఠరామాయణము నందు వసిష్ఠుఁడు శ్రీరామచంద్రునకు మనస్సుచేత మనస్సును జయింపనగునని దెలుపుటకొఱ కిట్లు నుడివియున్నాఁడు.

మన ఏవ సమర్థః స్యాన్ మనసో దృఢనిగ్రహే ।
అరాజకః సమర్థస్స్యాద్రాజ్ఞో రాఘవ నిగ్రహే ॥

"ఓరామ! మనస్సును దృఢముగ శాసింపఁగలశక్తి మనస్సునకు మాత్రమే గలదు. రాజుగానివాఁడు రాజులను శాసింపఁగలశక్తి గలిగియుండునా?" అధోముఖయుక్తై యున్నవృత్తులను మనస్సువలన నూర్ధ్వముఖములుగ నొనర్చుకొనవలయును. ఇంద్రియవృత్తి సమూహ మెప్పుడును బాహ్య విషయముల యందు సంచరించుచుండును. కావున వానిని సచ్చింతవలన నంతర్ముఖము లగునటులఁ జేసికొనినయెడల భక్తిపథమందలి కంటకముల నూడఁ బెఱుకవచ్చును.

మనస్యేవేంద్రియాణ్యత్ర మనస్యాత్మనియోజయేత్ ।
సర్వభావవినిర్ముక్తం క్షేత్రజ్ఞం బ్రహ్మణి న్యసేత్ ।
బహిర్ముఖాని సర్వాణి కృత్వా చాభిముఖాని వై ।
ఏతద్ధ్యానం తథా జ్ఞానం శేషస్తు గ్రంథవిస్తరః ॥ దతు॥

"సమస్తబహిర్ముఖేంద్రియములను అంతర్ముఖములుగఁద్రిప్పి మనస్సునందు సంయోగముచేయుము. మనస్సును ఆత్మతోడ సంయోగముచేయుము. అప్పుడు బాహ్యమందలిసమస్తభావములనుండి విముక్తుఁడవై ఆత్మను బ్రహ్మయందు స్థాపింపుము. అనఁగా నిదియే ధ్యానము, జ్ఞానము. మిగిలియున్న దంతయు గ్రంథవిస్తరము మాత్రము.

యదాసంహరతేచాయం కూర్మోఙ్గానీవ సర్వశః
ఇంద్రియాణీంద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞాప్రతిష్ఠితా॥

౫౮వ సాంఖ్యయోగము-భగవద్గీత.

"తాఁబేలు తనయవయవములను లోపలికి ముడుఁచుకొని యుండునట్లు, యోగి తన యింద్రియముల నన్నిటిని విషయములనుండి యుపసంహరించుకొనును. అప్పుడు వాని బుద్ధి నిశ్చల మగును.

ఇందువలన నెవ్వఁడును పనిపాటలను వీడవలయునని తలంపఁ జనదు. ఇంద్రియప్రవృత్తుల నంతర్ముఖులుగ నొనర్చి కార్యములను జేయుచుండవలయును.

బ్రహ్మణ్యాధాయకర్మాణిసంగంత్యక్త్వాకరోతియః।
లిప్యతే న స పాపేన పద్మపత్త్రమివాంభసా॥

౧౦ కర్మసన్న్యాసయోగము. భగవద్గీత.

"కర్మలను బ్రహ్మార్పణము చేసి, యాసక్తి విడిచి, వానిననుష్ఠించుచుండువాఁడు తామరాకునకు నీళ్లంటనితెఱంగున పాపములచేత స్పృశింపఁబడఁడు." ఈచెప్పఁబడినయుపాయములచేత కంటకములను దూరము చేసికొనఁగలిగినయెడల ననఁగా, శమ, దమ సాధన సంపత్తి యొనఁగూడినయెడల మానవుఁడు శాంతుఁడును జితేంద్రియుఁడును నగును. శాంతుఁడు గానిచో, దాస్య, సఖ్య, వాత్సల్య మధురరసముల యందుఁ జొరఁజాలఁడు.

ఈపసంహారమునందు కంటకవిషయములను గూర్చి యింకొకమాటను చెప్పుట యావశ్యకము. ఈ చెప్పఁబోవునది అనేకసమయములయందు మాఱువేషమును ధరించి మన కడ్డు వచ్చుచుండును. అప్పుడప్పుడు పాపము పుణ్యవేషధారి యై మనల నెదుర్కొనుచుండును. కావున నెప్పుడును తర్కముతోఁ గూడుకొని అట్టివానిమాయలకు లోఁబడకుండవలయును. అన్యాయకార్యములను జేసి, లేక, నపవిత్రవాక్యములను బలికి వానికొఱకు కణుమాత్ర మైనను పశ్చాత్తాపము నొందనివానికి వ్యతిరిక్తముగ వాదించుట లేక తగినశాంతిని గలిగించుట కర్తవ్యమని తలంతువు. అప్పుడు "క్షమింపుము క్షమింపుము; మిక్కిలిగ ప్రతివాదము చేయుటవలన లాభమేమి? ఈవిధముగ నెన్ని జరుగుచుండుట లేదు. కావున కొంచెము శాంతిని వహింపుము." అని యొకస్వరమును నడ్డుపడవచ్చును. అట్టివాఁడు పాపమునకు విరుద్ధముగ దండధారుఁ డైనవానిని నిషేధించి, క్షమను జూపించుచు, పాపమున కాశ్రయ మిచ్చినవాఁడగుచున్నాఁడు. కాని వాఁడు తన్ను క్షమావేషమును ధరించి పాపమాక్రమించుచున్నదని గుఱుంగఁడు. ఒకానొకఁడు భోజనమునకు మిక్కిలి కష్టములు పడుచున్నాఁడనుకొనుము. వానికి డబ్బిచ్చినయెడల దుర్వ్యయముఁజేయును. కావున దయార్ద్రచిత్తుఁడై వానికి దానము చేయువాఁడు పాపము పుణ్యవేషమును ధరించి తన్నువం

చించుచున్న దని యెఱుంగ నగును. క్రోధమునకు వశవ
ర్తియై యేదియో యొకకార్యము నొనర్చినపిమ్మట మనః
శాంతికిఁగాను "ఈకార్యము మంచిదే. దీనినిఁ జేయనియెడల
నాయొక్క కర్తవ్యములయందు లోపము గలిగి యుండును"
అని తలంచును. ఇచ్చట పాపమును, పుణ్య మని తెలుపు
టకుఁగాను, మనస్సునందు నానావిధము లగు వివాదములు
పుట్టుచున్నవి. మాయవేషమును ధరించియుండు పాపము
లనేకములను జూపవచ్చును. పాపము మాయవేషమును
ధరించి మనహృదయమునందు ఎప్పుడును ప్రవేశింప కుండు
నటుల సతర్కముగ మెలంగు చుండవలయును.



# అయిదవ ప్రకరణము.

---

## భక్తిమార్గమునకు సహాయములు.

భక్తి సాధించుటకొఱకు నవలంబింపవలసిన యుపాయము లను గుఱించి యోజించెదము. శ్రేష్ఠభక్తి యుదయమైన వారికి ఇతరసహాయములవలనఁ బ్రయోజనము లేదు.

"తాలవృంతేన కిం కార్యం లబ్ధే మలయమారుతే"

మలయమారుతము ననుభవించుచున్నవానికి తాటియాకు విసనకఱ్ఱవలన ప్రయోజనము లేదుగదా? భక్తియుదయింపని వాఁడు ప్రథమమునందు ఆర్తభక్తుఁడగుటకుగాని జిజ్ఞాసు భక్తుఁడగుటకుఁగాని అర్థార్థిభక్తుఁడగుటకుఁగాని ప్రయత్నింపవలయును. "మహాపాతకినాం త్వార్తే" మహాపాతకులకుఁ గూడ ఆర్తభక్తియందధికారము గలదని శాండిల్యుఁడు నుడివియున్నాఁడు. కావున ప్రథమమునందు నికృష్టభక్తి నవలంబించినయెడల తదుపరి ఉచ్చభక్తుఁడగుటకు వీలు గలదు. ప్రథమముననే రాగాత్మకభక్తి లేక అహేతుకభక్తి యంకురించినవారలు ధన్యులు.

ఆర్తభక్తుఁడును, జిజ్ఞాసుభక్తుఁడును, అర్థార్థిభక్తుఁడగుటకు వేఱుప్రయత్నమక్కఱలేదనియు, కష్టములయందుఁ దగుల్కొనునప్పుడు "ఆర్తభక్తుఁ" డగుననియును, స్వతస్సిద్ధముగ మానవుఁడు విమర్శనాజ్ఞానము గలిగి యుండుట వలన "జిజ్ఞాసుభక్తుఁ"డగు ననియును ధనము గావలసివచ్చినప్పుడు "అర్థార్థిభక్తుఁ"డగుననియును జెప్పవచ్చును. కాని మనము సమస్తసమయములయందును కష్టములను గ్రహించుటెట్లు? మనముభవరోగములవలన నాక్రమింపఁబడిపాపములచేత పీడింపఁబడుచున్నామని తెలిసికొనఁగలుగుచున్నామా? అటు లయినయెడల మనయీస్థితియందుందుమా? పవిత్రమగు విషయవిమర్శనలు మన హృదయమునందుఁ జొచ్చుటెట్లు? మనలో భగవత్తత్త్వమును దెలిసికొనవలయు నను వ్యాకులత గలవా రెందఱున్నారు? ఎంతధనము సమకూడిన దనియు, నన్నెవ రేమనిరనియు, నాపరివార మెట్లున్నదనియుఁ దలంచుచుండువిధమున భగవత్స్వరూప మెట్టిదనియు, ఆయనకుమనకుఁగల సంబంధ మేమనియు, పరిత్రాణకు మార్గ మేమనియు, విచారణ యెంతమందిహృదయములయందుఁ బుట్టుచున్నది? శ్రేష్ఠమగుధన మెద్దియో తెలిసికొనినయెడల దానినార్జించుటకు మన మర్థార్థిభక్తులము కావచ్చును. కాని మనలో "పుత్రం దేహి ధనం దేహి భాగ్యం భగవతి దేహి మే" అని ప్రార్థించుప్రార్థనలు మాత్రమే గనఁబడుచుండును. కాని

యీప్రార్థనయందైనను హృదయపూర్వకముగ "దేహి దేహి" యని మొఱలిడుచున్నామా? భగవానుఁడు మన ప్రార్థనలను విను ననుదృఢవిశ్వాసము మనకుఁ గలదా? కాఁబట్టి భక్తుఁడు గావలయు నన్నయెడల నాత్మచింతనుఁ గడుఁగ వలయును.



# ఆత్మచింత.



(౧) ప్రతిదినము నీదినమునం దేవిధముగ జీవనమును గడపితిననియు, సత్కార్యము లెన్ని చేసితిననియు, దుష్కార్యము లెన్ని చేసితి ననియు, పాపమునకు విరుద్ధముగ నెట్లు పోరాడితిననియుఁ, దలంచుచుండినయెడల శరీరము కంప మెత్తును; ఘోరవిపత్తునందుఁ దగుల్కొనియున్నానని గ్రహించును. అప్పుడు మనవంటి మూర్ఖులును, దురాశాగ్రస్తులును, మఱొకరుండ రని తలంతుము. చచ్చిపోవుదు నని తెలిసియుండియు, మనుష్యునివలె నగ్నియందు దుముకు జీవి మఱియొక టుండునా?

అజానన్ దాహార్తిం విశతి శలభో దీపదహనం।
న మీనోఽపి జ్ఞాత్వా వృతబడిశ మశ్నాతి పిశితం;

విజానంతో ప్యేతాన్ వయమిహ విపజ్జాలజటిలాన్
నముంచామః కామానహహ గహనో మోహమహిమా॥

శాంతిశతకము.

అగ్నిజ్వాలలయందుఁ దగులుకొని చచ్చిపోవుదు నని యెఱుంగక పతంగము దీపాగ్నియందుఁ బ్రవేశించుచున్నది. ఎరకు వేసినమాంసమును మ్రింగినయెడల గాలము గ్రుచ్చుకొను నని తెలియక మత్స్యము మాంసమును మ్రింగుచున్నది. కాని భోగవిషయములు విపత్పూర్ణము లనియును, భోగముల ననుభవించుటకుఁ బ్రయత్నించిన సర్వనాశ మగు ననియును, దెలిసియుండియు వీనిని మనము పరిత్యజించుట లేదు. అయ్యో! మోహమునకెట్టిభయంకరమగుశక్తి గలదు! ఇంద్రియసుఖములకొఱకుఁగాను, విషయభోగము లనుభవించుటవలన, మనయవస్థ యేవిధముగ నయ్యెనో విచారించి చూచుకొనుఁడు. ఎట్టియుత్కృష్టజన్మ మెత్తి యెట్టియవస్థ యందు పడియున్నాము? ఈదురవస్థను దాఁటుట కుపాయ మెద్ది? ఇంద్రియసేవవలన మనకు సర్వనాశము సంభవించినది గదా? ఒక్క యింద్రియసేవయే గాక పంచేంద్రియసేవఁ జేయుట కణమాత్ర మైనను లోపములు గాన్పించుటలేదు.

'కురంగ, మాతంగ, పతంగ భృంగ
మీనాః హతాః పంచభి రేవ పంచ ।

> ఏకప్రమాదీ సకథం న హన్యతే
> యః సేవతే పంచభి రేవ పంచ॥'

గరుడపురాణము.

కురంగములు, మాతంగములు, పతంగములు, భృంగములు, మీనములు అను పంచేంద్రియములలో నొక్కొక్కదాని సేవ యొనర్చి యొక్కొక్కటి ప్రాణమును గోల్పోవుచున్నది. ఇవి యేకేంద్రియసేవవలననే ప్రాణమును గోల్పోవునప్పుడు, పంచేంద్రియసేవవలన మనము ప్రాణమును గోల్పోవుటయం దాశ్చర్య మేమున్నది. హరిణము వ్యాధుని వంశధ్వనివలన మోహితమై కర్ణములతృప్తికొఱకు నాశమగుచున్నది. ఏనుఁగును పట్టుకొనుటకుఁగాను పెంపుడేనుఁగును వెంట నిడుకొని వెళ్లుదురు. ఈయేనుఁగుయొక్క యంగస్పర్శమున కడవియేనుఁగు భ్రమించి త్వగింద్రియ సుఖానుభవ మొందుట కున్మత్తమై పెంపుడేనుఁగును సమీపించి తొండముతోడ.తొండమును గాపి, యాడుటకుఁ బ్రారంభించి, చివరకు బంధింపఁబడి జీవితకాల మంతయు మృతప్రాయమై యుండును. పతంగ మగ్నిశిఖయొక్క సౌందర్యమును జూచి మోహించి దానియందు పడి దగ్ధ మగుచున్నది. చక్షువుల వాసనను తృప్తిపఱుచువారి కిదే గదా ఫలము. భృంగము పద్మగంధమువలన నాకర్షింపఁబడి పద్మమధ్యమునందుఁ జేరును. సాయ మైనంతనే ఱెక్కలు

ముడుంచుకొనిపోవుటవలన వెలుపలకు రాఁజాలక మఱుదిన మదయమునకు మరణించును. భృంగముయొక్క మృత్యువు నకు నాసికయే గదా కారణము? జిహ్వయొక్క భోగేచ్ఛ వలన మత్స్యము గాలమునకు గ్రుచ్చినయాహారమును మ్రింగి బాధపడి మరణించును. కురంగము కర్ణములవలనను, మాతంగ ము త్వక్కువలనను, పతంగము చక్షువులవలనను, భృంగము నాసికవలనను, మత్స్యము జిహ్వవలనను, నశించుచున్నవి. ఒక్కొక్క యింద్రియసేవవలన వీని కిట్టి గతి సంభవించి నప్పుడు పంచేంద్రియములతృప్తికొఱకుఁ బ్రయత్నించుమన కెట్టి గతి సంభవించునో యోజించుకొనుఁడు.

"సకథం నహన్యతే యః సేవతే పంచభి రేవ పంచ"

ఇంద్రియములభోగవాసనయం దింధన మిడి సర్వస్వమును గోల్పోయితిని. ఇంద్రియములలో నొక్కొక్కటియొక్కొక దిక్కునుండి దొంగవలె నాసర్వస్వమును దోఁచుకొని నా కెట్టిదురవస్థ నొడఁగూర్చుచున్నది? అని యాత్మచింతవలనఁ దెలిసికొనువాఁ డశ్రుజలములను గార్చుచు, భగవానునకిట్లు విన్నవించుకొనును.

జిహ్వైకతోఽచ్యుత వికర్షతి మా వితృప్తా
శిశ్నోఽన్యత స్త్వగుదరం శ్రవణం కుతశ్చిత్॥
ఘ్రాణోఽన్యత శ్చపలదృక్ క్వచ కర్మశక్తిః।
ర్బహ్వ్యః సపత్న్య ఇవ గేహపతింలునంతి॥ భాగవతము.

ఓయచ్యుతా! నాలుకయొక్క వాసనను తృప్తి పఱుప వలయు నని యెంత ప్రయత్నించినను గూడ తృప్తి నొందక ఇది యొకదిక్కునకు లాగుచున్నది. అంగ మొకవైపునకు లాగుచున్నది. ఉదర మింకొకదిక్కునకు లాగుచున్నది. కర్ణ మొకదిక్కునకును, నాసిక యింకొకదిక్కునకు లాగుచున్నవి. పలువివాహము లాడిన వానిని వాని భార్యలు నలుదిక్కులకు లాగి వేధించు విధమునసే యింద్రియ ప్రవృత్తులు నన్ను బాధించుచున్నవి. రామప్రసాద సేనుఁ డీయవస్థను మనమునం దుంచుకొని యీవిధముగఁ బాడియున్నాఁడు. "పంచేంద్రియముల పంచవాసనలతోడ నా గృహకార్యము లెట్లు నిర్వహింతును?" ఈయవస్థను దెలిసికొని దీనినుండి విముక్తుఁ డగుటకుఁగాను భగవానునిఁ బ్రార్థించువాఁడు శ్రేష్ఠుఁడగు "అర్థార్థుఁడు?

జిజ్ఞాసుభక్తుఁడు గావలయునన్నయెడల నాత్మచింతనఁ గడంగ వలయును. నిర్జనస్థానమునం దుండి యాత్మచింతనఁ గడంగినయెడల "నే నెవఁడ? ఎచ్చటనుండి వచ్చితిని? ఎందుకొఱకు వచ్చితిని? ఎవఁడు నన్ను పంపించినాఁడు? ఆయన యెట్టిరూపము గలవాఁడు? ఆయనతోడ నాకుం గలసంబంధ మెద్ది? తల్లిదండ్రు లెవరు? వారు నన్నేల ప్రేమింతురు? సోదరులను, బంధువులను, ప్రసాదించినవాఁ డెవఁడు? అగ్ని యేల వేడిని గలిగించుచున్నది? వాయు వేల శీత మొనరు

చున్నది? జల మేల తృష్ణను నివారణచేయుచున్నది?" అను
నీవిధమగు వేలకొలఁది ప్రశ్నలు పుట్టినకొలఁదిని మనస్సును,
ఆత్మచింతవైపున కగ్రేసర మగు చుండును. బాగుగ
విచారించి చూచినయెడల ప్రేమమయ మగుశక్తి యొకటి
జగన్మయ మై కార్యముల నడపుచున్న దని సుస్పష్టముగఁ
గనఁబడును. ఇదియుపలబ్ధియైనయెడల నీశక్తివిషయమునందు
విచారణ వృద్ధి యగు చుండును. ఇందువలన నీశక్తివైపున
కాకర్షింపఁబడి భక్తిపూర్ణుఁడ వగుదువు.

అర్థార్థి భక్తుఁడు గావలయు నన్నను గూడ, నాత్మచింత
యందు మునుంగవలయును. "నాకుఁ గల యభావము లెవ్వి?
నాకేమి గావలయును?" అనునట్టిది యాత్మచింతవలన నేనిర్ణయ
మగును. అభావములు, ప్రార్థనావిషయములు. స్థిర మైన
యెడల వీనిని గుఱించి హృదయము విప్పి యొకనియొద్ద
మాత్రమే వేఁడఁగలముగాని పలువురను వేఁడుటకిచ్చగింపము.
దమ్మిడి మొదలు మోక్షము పర్యంతము విన్నవించుకొనుట
కొక్కఁడుతప్ప నింకొకఁ డుండఁడు. సమస్తము నొక్కనికే
విన్నవించుకొను నభ్యాసము కుదిరినయెడల భక్తిపథము
నందలిప్రథమసోపాన మెక్కితి మని తెలిసికొనవలయును.

దొంగలయొక్కయు, మృగములయొక్కయు, రోగముల
యొక్కయు, భయమువలన నార్తుఁడై సామాన్యవిషయసుఖ
ముల సంబంధమునం దర్థార్థి యై మనఃపూర్తిగా భగ

వానునిఁ బ్రార్థించినయెడల నాప్రార్థన పూర్తి యగు
ను. కాని యది యకించిత్కర మని దెలిసికొనును. తామస
భక్తుఁడుగూడ నేకాగ్రచిత్తమున భగవానునిఁ బ్రార్థించు
టకు మొదలిడినయెడల వానిహృదయమునందుఁ గూడ
నీభావము గలుగును. ఏవ్యక్తి యేయభిప్రాయమునఁ బ్రార్థిం
చుటకుఁ బ్రారంభించినను భక్తిమార్గము దెలియఁబడును.

"క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి॥"

"అతిదురాచారుఁడాయనను బ్రార్థించుటకు మొదలిడి
నను అతిశీఘ్రముగ ధర్మాత్ముఁడై నిత్యశాంతిప్రాప్తుఁ డ
గును." భోగాభిలాషతోఁగాని, మోక్షాభిలాషతోఁగాని కృ
ష్ణునిఁ బ్రార్థించువానికి కృష్ణచరణములు ప్రాప్తించునని చై
తన్యప్రభువు సనాతనున కీవిధముగ నుపదేశించియున్నాఁడు.
"అన్యేచ్ఛలతోడ కృష్ణుని భజించినయెడల అడుగకున్నను
ఆయన తనపాదములను బ్రసాదించును. వీఁడు నన్ను పూజిం
చుచు, అమృతమును వీడి విషమును గోరునట్లు విషయ
సుఖములను గోరుచున్నాఁడు. కాని వానికి విషయసౌఖ్యము
లియ్యను. నాచరణామృతమును ప్రసాదించి విషయసౌఖ్య
ములను మఱపింతు నని కృష్ణుఁ డనును. ఆయనపదపల్లవము
లను గోరకున్నను గూడ సకలవాసనలు దూరమైనయెడల
వానికి భగవానుఁడు తనపాదపల్లవములను తనంతట తానే
ప్రసాదించును."

“ కోరికతోఁగూడుకొని శ్రీకృష్ణుని సేవించుటకు మొదలిడును. తదుపరి కోరికను వీడి దాసుఁడగును.” ధ్రువుఁడు రాజపదప్రాప్తికొఱకుఁ బ్రార్థింపఁ దొడంగి కృష్ణరసమును గ్రోల నారంభించినంతనే “కామమును వీడి దాసుఁడుగా వలయును” అనుకోరిక అతనికి పుట్టెను. ప్రార్థనఁజేయఁగాఁ జేయఁగా హృదయమునందు భావము పుట్టును. భావము పుట్టినంతనే ఆరాధన ప్రారంభమగును. ప్రథమమునఁ బ్రార్థనయందు స్వార్థము తప్ప మఱేమియు నుండదు. భగవత్సాన్నిధ్యమందు ప్రార్థనను జేయఁగాఁ జేయఁగా ననురాగము గలుగును. అనురాగము గలిగినంతనే ఆయనమహిమను కీర్తించుట కిచ్ఛ గలుగును. ఆయనస్తుతిగానమును వినినకొలఁదిని హృదయ మానందభరితమై ఆయనమహిమను కీర్తించుచుండుట కన్వేషించు చుండును. ఈవిధముగ నన్వేషణేచ్ఛ వృద్ధియైనకొలందిని ఆయన మహిమయు రూపమును బోధగట్టుచుండును. అందువలన చిత్తమానందభరితమై జయజయధ్వనిని జేయుచుండును. భావము మిక్కుటమైనకొలఁదిని స్తుతియు మహిమకీర్తనమును,స్వరూపకీర్తనము మొదలగునవి బాహ్యవస్తువు లని బోధపడును. అప్పుడు అన్నికోరికలను వీడి మాటలాడక ఆయనసమీపమందుఁ గూర్చుండి కేవల మా సుందర మోహనరూపరాశిని చూచుచుండవలయు ననుకోరిక పుట్టును. దీనినే ధ్యాన మందురు. ధ్యాన మనఁగా కేవలము

స్వరూపచింతయే. ఈయవస్థయందు "సత్యశివసుందర రూపము నీహృదయమందిరమందు రాజ్యముచేయుచుండును. నీవు వివశుఁడవై ఆయన శ్రీచరణములను శరణుఁ జొచ్చి యుందువు." ప్రేమ ప్రబలమగునప్పుడు సమాధి లేక లయము గలుగును. శరీరము గల దనుజ్ఞానమును వీడి ధ్యానముఁ జేయుచుఁ జేయుచు సమ్మత్తుఁడై పతంగ మగ్నియందు దుముకునటుల భగవానుని రూపాగ్నియందు చిత్తము పడిపోవును. "నేను" "నీవు" అను భేదము ధ్యానమువఱకు మాత్రమే యుండును కాని సమాధియందు "నేను" అనుమాట యుండదు. కేవలము "నీవు" అనుమాటయే యుండును. అనఁగా "నేను" అనునది "నీవు" అనుదానియందు లయమై పోవును.

---

## శ్రీ చైతన్యోక్తములైన
# పంచ సాధనలు.

సత్సంగమును, కృష్ణసేవయు, భాగవతమును, హరినామ కీర్తనము, తీర్థసేవయు, భక్తిసాధనకు సహకారులని శ్రీ చైతన్యులవారు సనాతనున కుపదేశించి యున్నారు. ఈ విషయమును గూర్చియే రూపగోస్వామికూడ భక్తిరసామృత సింధువునందుఁ జెప్పియున్నాఁడు.

---

# సత్సంగము.

దుర్మార్గసహవాసము భక్తిమార్గమున కాటంకమును గలిగించునటులనే, సన్మార్గసహవాసము భక్తిమార్గమునకు సాహాయ్య మొసంగును. ఇందువలననే భక్తిశాస్త్రములయందు సత్సంగమును గూర్చి పలుతావులఁ జెప్పఁబడియున్నారు.

సంగం న కుర్యా దసతాం శిశ్నోదరతృపాం క్వచిత్।
తస్యానుగ స్తమ స్యంధే పత త్యంధానుగాంధవత్॥

భాగవతము.

అబద్ధము లాడువానితోడను, ఇంద్రియలోలునితోడను, నెప్పుడును గలసి నివసింపవలదు. ఇట్టివాని సహవాస మొనర్చినయెడల అంధుని ననుకరించువాఁ డంధకారమునందుఁ బడువిధముననే అంధకారమయ మగు నరకమునందుఁ బడిపోవుదువు.

సత్యం, శౌచం, దయా, మౌనం, బుద్ధిర్హ్రీర్యశః క్షమా।
శమో దమో భగశ్చేతి యత్ సంగాద్యాతి సంక్షయం॥

భాగవతము.

దుస్సాంగత్యమువలన సత్యమును, శౌచమును, దయయు, మౌనమును, బుద్ధియు, లజ్జయు, యశమును, క్షమయు, శమమును, ఐశ్వర్యమును నశించును.

తేష్వశాంతేషు మూఢేషు ఖండితాత్మస్వసాధుషు।
సంగం న కుర్యాచ్ఛోచ్యేషు యోషిత్క్రీడామృగేషు చ॥

భాగవతము.

జితేంద్రియులు కాని వారితోను, మూఢులతోను, దేహమే నిత్యమనుకొనువారితోను, సాధువులు కానివారితోను, సాంగత్యముచేయఁ జనదు.

వరం హుతవహజ్వాలాపంజరాన్తరవస్థితిః।
న శౌరిచింతావిముఖ జనసంవాసవైశసం॥

భక్తిరసామృత సింధువు.

ఎఱ్ఱఁగా కాలిన యినుపపంజరమందైనను నివసింప వచ్చునుగాని, భగవచ్చింత లేనివాని సహవాసమున నివసించుట కర్తవ్యముగాదు. ఇదేవిధముగ భక్తి నార్జించుటకు సత్సంగము మిక్కిలి సహకారి యని కీర్తించియున్నారు.

"భక్తిస్తు భగవద్భక్తసంగేన పరిజాయతే
రవిశ్చరశ్మిజాలేన దివా హన్తి బహిస్తమః"
సంతఃసూక్తిమరీచ్యౌఘైశ్చాంతర్ధ్వాంతంహిసర్వథా॥

బృహన్నారదీయము.

భగవద్భక్తులసహవాసమువలన భక్తి జనించును. సూర్యకిరణములు బాహ్యమందలి చీఁకటిని వినాశనముఁ జేయును. సత్పురుషులయొక్క సద్వాక్యకిరణ జాలములు హృదయాంధకారమును నాశనముఁ జేయును.

సతాంప్రసంగా న్మమ వీర్యసంవిదో
భవంతి హృత్ కర్ణరసాయనాః కథాః॥
తజ్జోషణాదాశ్వపవర్గవర్త్మని
శ్రద్ధారతి ర్భక్తి రనుక్రమిష్యతి॥ భాగవతము.

సాధుపుంగవులు నాయొక్క శక్తిసామర్థ్యములను గూర్చి ముచ్చటించుకొందురు. అట్లు ముచ్చటించుకొనుటవలన వారి వీనులకును హృదయమునకును ఆనందముగ నుండును. ఇట్టి సంభాషణ వినుచుండుటవలన క్రమక్రమముగా శ్రద్ధయు, రతియు,భక్తియుజనించును.ప్రహ్లాదుఁడిట్లుచెప్పియున్నాఁడు.

నైషాం మతి స్తావ దురుక్రమాంఘ్రిం।
స్పృశ త్యనర్థాపగమో యదర్థః।
మహీయసాం పాదరజోభిషేకం
నిష్కించనానాం న వృణీతయావత్॥ భాగవతము.

విషయాభిమాన శూన్యు లగు సాధుపుంగవుల పాదధూళి వలన, నభిషిక్తుఁడు గానంతవఱకు ఎవ్వరి మనస్సుగూడ సంసారవాసనలు నశింపఁ జేసికొనుటకును భగవానుని చరణ పద్మము లాశ్రయించుటకును బ్రయత్నింపదు. సాధుపుంగవుల లక్షణములనుగూర్చి భగవానుఁ డిటు నుడివియున్నాఁడు.

శ్లో॥ సంతోఽనపేక్షా మచ్చిత్తాః ప్రశాంతాః సమదర్శనాః॥
నిర్మమా నిరహంకారా నిర్ద్వంద్వా నిష్పరిగ్రహాః॥
భాగవతము.

కొంచెమైనను ఫలమున కపేక్షింపరు. వారు నాయందు చిత్తము గలవారై సత్ప్రతిగలిగి సమదర్శనులై మమకార రహితులై నిరహంకారులై యుందురు.

తితిక్షవః కారుణికాః సుహృదః సర్వదేహినాం।
అజాతశత్రవః శాంతాః సాధవః సాధుభూషణాః॥

భాగవతము.

దుఃఖమును సహించువాఁడును, దయార్ద్రహృదయుఁడును, సకలజీవములయందు ప్రీతిగలవాఁడును, అజాతశత్రుఁడును, శాంతుఁడును, సుశీలము గలవాఁడునుగ నుండవలయును.

ఇట్టియాదర్శమానవుం డెచ్చోట దొరకు నని యెవరైనను ప్రశ్నింపవచ్చును. దుర్లభమేయైనను, పైని చెప్పినవిధముగ జీవనయాత్ర గడపుమహాత్ములకొఱకుఁ బ్రయత్నించినయెడల అట్టివారు గనఁబడుదురు. శ్రీరామకృష్ణ పరమహంసస్వామియొక్కయు, నవద్వీపమందలి చైతన్యదాస్ బావాజీయొక్కయు దర్శన మనాయాసలభ్యము. ఇట్టి మహానుభావుల దర్శన మబ్బుచున్న నేఁడు సాధుపుంగవులు గాన్పింప రని చెప్పుటను నే నంగీకరింపను. కాని యట్టివారిసన్నిధి కేఁగవలయునను కోరికమాత్రము మనయందుఁ గన్పట్టకున్నది. గాజీపురమందున్న "పావహారీబాబాను" కాశియందలి "భాస్కరానందస్వామి" ని దర్శించుట కష్టమగు విషయము గాదు

గదా? ఇందువలన సాధుపుంగవు లెల్లస్థలములయం దున్నా
రనుట నిక్కువము. దర్శింపవలయునను కోరిక గలవారలకు
మాత్రమే దర్శనమబ్బును. ఆదర్శ సాధుపుంగవు లనేకులు
దొరకకున్నను, వెనుక చెప్పఁబడినగుణములను, కొలఁదిగనో
గొప్పగనో జీవనమునం దాయత్తముఁ జేసికొనిన వారలు
పలువురు లభింతురనుట నిక్కువము. ఇట్టి సాధుపుంగవుల
సహవాసము చేయుచుండినయెడల మనచరిత్ర బాగుపడు
ననుట నిక్కువము. కావున మనఃపూర్తిగా భగవన్నామ
మును స్మరించుచుండు భక్తునిపాదధూళిని గైకొనుట విహి
తమని మనము దలంపవలయును. ఇట్టివారి సహవాసము
చేయుటవలన మనము బాగుపడుదుమని నిస్సంశయముగఁ
జెప్పవచ్చును. సత్సంగమువలనఁ గలుగు మహోపకారమునకు
జాగాయియొక్కయు, మాధాయియొక్కయు, చరిత్రలే ప్రబ
లసాక్ష్యములు. నారదుఁడు సత్సంగమువలన నవజీవనలాభ
ము నొందెను. ఈయన దాసీపుత్రుఁడు. సాధుసేవయందు
నియుక్తుఁడై యుండెను. సాధుసేవవలనఁ గలుగుఫలమును
గూర్చి యీయన వ్యాసున కీవిధముగ నుడివియున్నాఁడు.

ఉచ్ఛిష్టలేపాననుమోదితో ద్విజైః ।
సకృత్ స్మభుంజే త దపాస్తకిల్బిషః ।
ఏవం ప్రవృత్తస్య విశుద్ధచేతస ।
స్తద్ధర్మ ఏవాత్మరుచిః ప్రజాయతే॥ భాగవతము.

బ్రాహ్మణుల యనుమతిని గైకొని వారియుచ్ఛిష్టభోజన పదార్థములను భుజించుచుండువాఁడను. అందువలన నాపాపములు దూరమై విశుద్ధచరిత్రుఁడ నైతిని. తదుపరి వారవలంబించిన భాగవతధర్మముపైని నా కభిరుచి గలిగెను.

తత్రాన్వహం కృష్ణకథాః ప్రగాయతా ।
మనుగ్రహేణాశృణవం మనోహరాః ।
తాః శ్రద్ధయా మేనుపదం విశృణ్వతః ।
ప్రియ శ్రవ స్యంగ మ మాభవ ద్రుచిః॥

భాగవతము.

వారు మనోహరమగు కృష్ణకథను గానముచేయుచుండిరి. వారి యనుగ్రహమువలన ప్రతిదినము దాగానమును వినుచుండుటచేత భగవానునిమీఁద నా కభిరుచి జన్మించెను.

ఇదం శరత్ ప్రావృషికా వృతూహరేః ।
ర్విశృణ్వతో మేనుసవం యశోమలం ।
సంకీర్త్యమానం మునిభిర్మహాత్మభిః ।
ర్భక్తిః ప్రవృత్తాత్మ రజస్తమోపహా॥

భాగవతము.

ఈవిధముగ శరత్కాలమందును వర్షాకాలమందును మునులవలన కీర్తింపఁబడుచుండిన హరియొక్క నామస్మరణమును, ప్రాతఃకాలమునందును మధ్యాహ్నమునందును సాయంకాలమునను, వినుచుండుటవలన నాకు రజస్తమోనాశనకారి యగు భక్తి యుదయించెను. యవనహరిదాసు

వంగదేశములోని "బెనాఫోలెగ్" వనమందు భక్తిసాధనను జేయుచుండెను. అప్పుడీయనవైరాగ్యమును నాశనము చేయగలందులకుగాను, రామచంద్రఖానుడు సుందరియైన వేశ్య నొకదానిని బంపించెను. వేశ్య యావనమున కేగి యా యననిష్ఠను చెడఁగొట్టఁగలందులకుఁగాను, సమయము వేచి, వాకిటఁ గూర్చుండియుండెను. యవనహరిదాసు తనకుటీరము నందు కూర్చుండి హరినామస్మరణఁ జేయుచుండెను. ఈయన నామకీర్తన పూర్తియగునప్పటికి సూర్యోదయమయ్యెను. తిరిగి మరుదినమునందు వేశ్యవచ్చి సమయమునకు వేచియుండెను. కాని ఆయన నామజపము పూర్తి యగునప్పటికిఁ దెల్లవాఱు చుండెను. మూఁడవదినమునఁ దెల్లవాఱుచుండఁగా, హరినామ శ్రవణమువలన వేశ్యాహృదయముమాఱి హరిదాసునిపాదముల

శా॥ వారల్ కృష్ణుచరిత్రముల్ సదువఁగా
వర్ణింపఁగాఁ బాడఁగా।
నారావంబు సుధారసప్రతిమమై
యశ్రాంతమున్ వీనులం।
దోరంబై పరిపూర్ణమైన మది సం
తోషించి నే నంతటం।
బ్రారంభించితి విష్ణుసేవ కితర
ప్రారంభ దూరుండనై॥

౧౦౭ ప్రథమస్కంధము భాగవతము..

మోదంబడి కన్నీరు వరదలైపాఱ నేడ్చుచు "భక్తవరా! నేను మహాపాపినిని. నేఁజేసినపాపములు అనంతములు. కావున నీపాపినియం దనుగ్రహముంచి కరుణింపుము." అనిప్రార్థింపఁ జొచ్చెను. సత్సంగమువలననే గదా వేశ్య మహాభక్తురాలాయెను. తదుపరి గొప్పగొప్ప వైష్ణవులీమెను సందర్శించి ధన్యులమైతిమని దలంచుచుండిరి. శ్రీరామకృష్ణపరమహంసయొక్క పాదధూళివలన పవిత్రులైనవారిని మన మెంత మందిని ఎఱుంగము? సాధుపుంగవుల దర్శనము లభింపనప్పుడు పలువురొకచో చేరి భగవదాలోచనయు, భగవత్సంకీర్తనమును జేసికొనుచుండ వలయును. దీనినిగూడ సత్సంగ మందురు. కావున నిందువలన మనజీవనము భక్తిపథమునం దున్నతి నొందుచుండును.

---

# కృష్ణసేవ.

---

కృష్ణసేవ యని నుడువునప్పు డాసేవ యనేకవిధములుగ గ్రహింపవచ్చును. చైతన్యులవా రింకొక్కస్థలమునందు పంచ సాధనలను జెప్పునప్పుడు కృష్ణసేవనుఁబరివర్తనముగ "శ్రీమూర్తి" సేవయని చెప్పియున్నాఁడు. శ్రీమూర్తిసేవవలన భక్తులైన

వారలనేకులుగలరు. చైతన్యస్వామి శ్రీకృష్ణమూర్తి నేలక్ష్య మందుంచుకొని శ్రీమూర్తి యని నుడివియున్నాఁడు. ఎవఁడే దేవతోపాసకుఁడో వాఁడా దేవమూర్తి సేవఁ జేసినయెడల భక్తి లభ్యమగును. రామప్రసాదుఁడును, రాజా రామకృష్ణుఁడును, రామకృష్ణపరమహంస మొదలగువారలు, కాళీమూర్తిని సేవించుచుండిరి. శ్రీరామకృష్ణపరమహంస కాళిని బూజించి పరమభక్తుఁ డాయెను. భావపూరితుఁడై యీయన యొకప్పుడు కాళీమూర్తిని పుష్పములతోడ నలంకరించుచుండెను. ఇందొకప్పుడు దేవియొక్క చరణములయందు కమలములు లేక బిల్వదళములు పెట్టి ఆయపూర్వచరణశోభా సందర్శనము వలన, నానందపరవశుఁ డగుచుండెను. ఒక్కొకప్పుడు రామప్రసాదసేనుఁడు, కమలకాంతుఁడు, నరేశచంద్రుఁడు మొదలగు శక్త్యుపాసకుల విరచితములగు, గానములను బాడుచుండెడివాఁడు. మఱియొకప్పుడు, కృతాంజలిబంధుఁడై యేడ్చుచు "అమ్మా, నను దయతో చూడవమ్మా? రామప్రసాదునిపైని దయను చూపించి నామీఁద నేల దయఁజూపవమ్మా? అమ్మా? నే నేశాస్త్రము తెలుంగను: పండితుఁడను గాను; నాకేమియుఁ దెలియదమ్మా? కొంచెమైనను దెలిసికొనవలయు నని ప్రయత్నింపనమ్మా? తల్లీ? నను దయతోఁ జూచెద వా లేదా? నాప్రాణములు పోవుచున్నవమ్మా? తల్లీ, దర్శనమిమ్మా? అమ్మా, నేనష్టసిద్ధులను గోరుటలేదు. లోకుల

లోకమర్యాదను గోరుటలేదు. లోకులు నన్ను పొగడవలయునని గణన చేయవలయు నని, మర్యాద చేయవలయు నని, గోరుట లేదమ్మా! ప్రత్యక్షముగమ్ము." అని ప్రార్థనను చేయుచుండెడి వాఁడు. ఈ ప్రార్థన గంభీరమును, ఉన్నతభావపూరితమునై యున్నది. ఈయన కాళీపూజ నొనర్చి ధన్యుఁ డయ్యెను. ఈయనహృదయమునందు నిష్కామభక్తి గంగాప్రవాహమువలె ప్రబలవేగమున సంతతధారగాఁ బ్రవహించుచుండెను. (౮)

రామప్రసాదసేనుఁడు కాళీపూజఁ జేయుచు, భావమువలన వివశుఁడై యిట్లు గానము చేసియున్నాఁడు. "అమ్మా, నీవు పిచ్చిదానవు. నీమగఁడు పిచ్చివాఁడు. ఇంకొక పిచ్చివాఁడున్నాఁడు. వాఁడు నీచరణ సాన్నిధ్యముకొఱకు పిచ్చివాఁడైన రామప్రసాదుఁడు." (౭౦॥ పద్దెము.) కృష్ణసేవవలన భక్తిపదప్రాప్తి నొందినవారిలో ముఖ్యుఁడు అంబరీషుఁడు.

స వై మనః కృష్ణపదారవిందయో ।
ర్వచాంసి వైకుంఠ గుణానువర్ణనే ।
కరౌ హరే ర్మందిరమార్జనాదిషు ।
శ్రుతిం చకారాచ్యుతసత్ కథోదయే॥ భాగవతము.

ఈయన తనమనస్సు కృష్ణపాదారవింద చింతనమందును, వాక్యములు వైకుంఠ గుణానువర్తనమందును, కరములు హరిమందిర మార్జనమునందును, కర్ణములు అచ్యుతుని సత్ప్రసంగ శ్రవణమునందును నియమించెను.

శ్లో॥ పాదౌ హరేః క్షేత్రపదానుసర్పణే।
శిరో హృషీకేశ పదాభివందనే।
కామం చ దాస్యే న తు కామకామ్యయా।
యథోత్తమశ్లోకజనాశ్రయా రతిః॥ భాగవతము.

ఇతఁడు హరిక్షేత్రమునందుఁ దిరుగుటకు తనపాదద్వయమును, హృషీకేశుని చరణములకు మ్రొక్కుటకు తన మస్తకమును నియమించెను. భోగ్యవిషయ సముదాయమునం దను

సీ. చిత్తంబు మధురిపు శ్రీపాదములయంద
పలుకులు హరిగుణ పఠనమంద।
కరములు విష్ణుమందిర మార్జనములంద
శ్రవములు హరికథా శ్రవణమంద।
చూపులు గోవింద రూపవీక్షణమంద
శిరము గేశవ నమస్కృతులయంద।
పదము లీశ్వర గేహ పరిసర్పణములంద
కామంబు చక్రి కైంకర్యమంద।

తే॥ సంగ మచ్యుతజనతనుసంగమంద।
ఘ్రాణ మసురారి భక్తాంఘ్రి కమలమంద।
రసన దులసీదళములంద రతులు పుణ్య
సంగతులయంద యారాజచంద్రమునకు॥

౧౩౬ నవమస్కంధము. భాగవతము.

గష్ఠుఁడుగాక, భగవానుని, దాసునిభావమున వానిని భోగించుచుండెను. ఈయన భగవద్భక్తుల నాశ్రయించి యుండు శ్రేష్ఠభక్తిని సంపాదించుటకు నీవిధముగఁ జేయుచుండెను. ఈవిధముగఁ జేయఁగాఁ జేయఁగా.

శ్లో॥ గృహేషు దారేషు సుతేషు బంధుషు।
ద్విపొత్తము స్యందన వాజపత్తిషు।
అక్షయ్య రత్నాభరణాయుధాది।
ష్వనంత కోశే ష్వకరో దసస్పృహామ్॥ భాగవతము.

ఇతఁడు గృహముమీఁదను, భార్యాపుత్త్రుల మీఁదను, బంధువులమీఁదను, ఏనుఁగులమీఁదను,రథాశ్వములమీఁదను, సైన్య రత్నాభరణములమీఁదను, అస్త్రములు మొదలగు వానిమీఁదను గొంచెమైనను నాసక్తిలేనివాఁడయ్యె. ఇందు వలన నీయన హృదయమునందు శ్రేష్ఠభక్తి రాజ్యముచేయ సాగెను. మనస్సు హరి పదపద్మములయందు లగ్నమైయుండెను. మాగ్రామమందు రామకృష్ణుఁడను పేరుగల రజక విప్రుఁ డుండెను. ఆతఁడు తన గృహమందున్న రాజ రాజేశ్వరుఁడను కృష్ణమూర్తిని సేవించుచుండెడివాఁడు. ఒక దినము పగలు పండ్రెండుగంటలప్పు డాయన గృహమునందు జరుగు సంకీర్తనను విని నేఁడు రామకృష్ణుని గృహమునం దెదియో యుత్సవమని దలంచి నేనువానిగృహమున కేఁగితిని. అప్పుడక్కడ చూచినదానిని నేనెప్పుడును మఱచిపోఁజాలను.

రాజరాజేశ్వరుని మందిరమున కెదుట నేలపై నొకపిల్ల పడి యుండెను. ఈపిల్ల రామకృష్ణుని మనుమరాలు. ఈపిల్లను, రాజరాజేశ్వరుని మందిరమును జుట్టి సంకీర్తనను జేయుచుం గొందఱు దిరుగుచుండిరి. రామకృష్ణుని కన్నులనుండి సంతత ధారగా నీరుకారుచుండెను. ఇతఁడొకమారు కీర్తననుబాడు చుండెను. మఱొక్కమారు రాజరాజేశ్వరుని ప్రసాదమును బాలికచేఁ దినిపించుచుండెను. ఒక్కొకమారు తెప్పవాల్పక రాజరాజేశ్వరునివంకఁ జూచుచు, చేతులు జోడించుకొని యిట్లు విన్నవించుకొనుచుండెను. "ఓదేవా! ఈపిల్లను దీసికొని వెళ్లఁదలఁచినయెడల నిప్పుడే దీసికొనిపొమ్ము. సంకీర్తన జరుగుచున్నందువలన నిప్పుడీస్థలము బృందావనతుల్యము. లేనియెడల బ్రతికింపుము." ...... ఈపిల్లకు "కలరా" వచ్చెను. కలరా నయము కాఁగలందులకా పిల్లను రాజరాజేశ్వరుని సమ్ముఖమందు పరుండఁబెట్టి ప్రసాదమును దినిపించుచు, రాజరాజేశ్వరునిఁ బ్రార్థించుచుండిరి. ఈదృశ్యమును జూచి నేను నిర్విణ్ణుఁడనైతిని. ఇట్లు కొంతవడి సంకీర్తనజరిగినపిమ్మట నీపిల్లను ఇంటిలోనికి తీసికొని వెళ్లిరి. సాయంకాలము రామకృష్ణుఁడు మాయింటికివచ్చి పిల్లయారోగ్యముగ నున్నదని నుడివెను. సరళసాధకులకు, పూజయు, హోమమును, యజ్ఞమును భక్తిని సంపాదించుకొనుటకు విశేష సహకారులు. విగ్రహములందు విశ్వాసము లేనివారలును,

విగ్రహపూజకు వ్యతిరేకమగు ధర్మము గలవారును, ప్రకృతి
యందు భగవానుని నుపలబ్ధినొంది యీశ్వరచింతయు, లీలా
కీర్తనము మొదలగువానిని జేసినయెడల కృష్ణసేవయొనర్చిన
వార లగుదురు. సృష్టియొక్క యాశ్చర్యరచనాకౌశలమును
జూచినయెడల నెవరిచిత్తము భగవానునియందు మగ్నముగా
నుండును? మహర్షులు ప్రకృతియందంతటను నిండియున్న
భగవచ్ఛక్తిని సందర్శించి ఇంద్రుఁడు, వరుణుఁడు, వాయు
వు, అగ్ని, మొదలగు వేఱు వేఱు నామధేయములతోడ నాశ
క్తిని బూజించి యుండిరి. వేదము లీశక్తియొక్క స్తవము
లతో నిండియున్నవి. ఈమహాపురుషుల పదాంకముల ననుస
రించి, ప్రకృతియందు భగవద్విలాసమును గాంచుటకుఁ
బ్రయత్నించువారు భక్తిని సంపాదించి కృతార్థు లగుదురు.
ప్రతీచ్య సాధుపుంగవులలోఁ గవియగు "వర్డ్సువర్త్" అను
నాయన ప్రకృతియందు భగవానుని నుపలబ్ధి నొందినవారిలో
ముఖ్యుఁడు. ఈయన ప్రకృతిమధ్య కేఁగి, భగవానునితోడ
గలిసినభావము ఆయనవలన సంకలితమైనపరివ్రాజకునిచిత్తరువు
నందు ప్రతిఫలించుచున్నది. ప్రభాతారుణకాంతిని, సూర్యాంశు
స్నాతయగు వసుంధరను, మహాసాగర నీలాంబురాశిని
సువర్ణకిరణరంజిత మేఘమాలలు మొదలగు ప్రకృతియొక్క
మనోహర దృశ్యములను పరివ్రాజకుఁడు చూచుచు, భగవ
త్ప్రేమయందు మునిఁగిపోయెను. బ్రహ్మానంద సంభోగము

వలన వానిచిత్తవృత్తులు కట్టఁబడియెను. "వర్డ్సువర్తు" యొక్కప్రాణ మీవిధముగ ప్రకృతి దర్శనమువలన భగవత్ప్రేమయందు మగ్నమై యుండెను. మహర్షులు విశ్వమయమగు భగవత్స్వరూపమును ఉపలబ్ధినొంది ప్రకృతిని ఈశ్వరుని యొక్క విరాడ్రూప కల్పనను జేసియున్నారు. భగవత్ప్రాప్తికొఱకు చెప్పఁబడిన యుపాయములలో నొక ముఖ్యమగు నుపాయము నిం దుదాహరించు చున్నాను.

ఖం వాయు మగ్నిం సలిలం మహీంచ ।
జ్యోతీంషి సత్వాని దిశో ద్రుమాదీన్ ।
సరిత్ సముద్రాంశ్చ హరేః శరీరం ।
యత్ కించ భూతం ప్రణమే దనన్యః॥ భాగవతము.

ఆకాశమును, వాయువును, అగ్నిని, జలమును, పృథివిని, నక్షత్రములు మొదలగు గ్రహములను, భూతములను, దిక్కులను, నదులను, ఇట్టి సమస్త పదార్థములను హరి యొక్క శరీరమని దలంచి నమస్కరించుచుండుము. చేతనాచేతన వస్తువులతోఁ గూడుకొనియుండు నీసమస్త ప్రకృతి యందును "తమేవభాంత మనుభాతిసర్వం తస్యభాసా సర్వమిదం విభాతి" అజ్యోతిర్మయుని శక్తినే సమస్తము ననుకరించుచున్నదనియును, ఆయన ప్రకాశమువలన చూడఁగలుగు సమస్తమును ప్రకాశమానమగుచున్నదనియును జూడఁగలము. "జలస్థలములయందును, చంద్రసూర్యులయందును, అనలమం

దును, హరియున్నాఁడు. విశ్వమంతయు హరిమయమై యున్నది.'' (బం॥ ప॥) మన మీవిధముగ భగవానుని బ్రార్థించుచుండవలయును. "సూర్యుఁడేవిధముగ సహస్రకిరణముల తోడ జగత్తునంతయు బ్రకాశింపఁ జేయుచున్నాఁడో అదే విధముగ సతిప్రేమయందును తల్లిప్రేమయందును నీప్రేమ సహస్రముఖములఁ బ్రకాశించుచున్నది. అభ్రభేదియగు నచల శిఖరమునకేగినను, ఘననీలాంబు సాగరమున కేగినను, మ రెచ్చటి కేగినను, నచ్చట నీవుందువు. రవికిరణములయందు నీ శుభ్ర కిరణములు గలవు. శశాంకునియందు నీజ్యోతి గలదు. మేఘములయందు నీవర్ణము గలదు. సజననగరములయందుఁ గాని, విజనవిపినములయందుఁ గాని, నీవుందువు. ఇంతయేల ? ఎచ్చటికేగిన నచ్చట నీవుందువు.'' ( బం॥ ప॥ )

మ॥ కలఁ డంభోధిఁగలండు గాలిఁ గలఁడా
కాశంబునం గుంభినిం ।
గలఁ డగ్నిన్ దిశలం బగళ్ల నిశలన్
ఖద్యోత చంద్రాత్మలం ।
గలఁడోంకారమునం ద్రిమూర్తులఁ ద్రిలిం
గవ్యక్తులం దంతటం ।
గలఁడీశుండు గలండు తండ్రి వెదకం
గా నేల నీయాయెడన్ ॥

క॥ ఇందుఁగలఁ డందులేఁడని
సందేహము వలదు, చక్రి సర్వోపగతుం, ।
డెందెందు వెదకి చూచిన
నందందే గలఁడు దానవాగ్రణి వింటే॥

౨౭౫ సప్తమస్కంధము.

---

# భా గ వ త ము.

---

ధర్మగ్రంథములను జదువుచు వినుచుండుటవలన మిక్కిలి మేలు గలుగును. భగవానుని స్వరూపవర్ణనమును, లీలాకీర్తనమును, శక్తిప్రచారమును, భక్తులచారిత్రములుగల గ్రంథములను జదువుటవలనను వినుటవలనను చిత్తము భక్తిమార్గమునం దగ్రేసర మగుచుండును. ఇందువలననే చైతన్యుఁడు భాగవతమును బ్రధానసాధనముగ నుడివియున్నాఁడు. ఇతిహాసమును, విజ్ఞానశాస్త్రము మొదలగునవి భగవానుని లీలలను మహిమను వెల్లడించియీశ్వరభక్తిని గల్గించును. కావున నీగ్రంథములు గూడ భాగవతముగనే పరిగణింపఁబడును. గ్యాలన్ అను విఖ్యాత ప్రతీచ్య పండితునకు భగవానుఁడు గలఁడను విశ్వాసము లేకుండెను. కాని యితఁడు మానవదేహతత్త్వమును పరిశీలించుటవలన మనుష్యశరీరముయొక్క ఆశ్చర్యఘటనా

విధానమును, నరములు, ఎముకలు, మాంసము మొదలగు వానియొక్క రచనాకౌశలమును, జూచి భగవద్భక్తుండై యీశ్వర మహిమసంబంధమునం దతిమనోహర మగుగ్రంథ మునురచించెను. సత్సాంగత్యము చేయుటకు వీలులేనివారలు భాగవతమును పఠించుచుండినయెడల నాలోపము నివారిత మగును.

---

# నామ కీర్తనము.

---

నామకీర్తనమును, నామశ్రవణమును, నామజపమును భక్తినార్జించుకొనుటకు మంచిసాధనములు. నామమహిమను కీర్తించిన వారిలో చైతన్యుం డగ్రగణ్యుండు. ఆయన మాటి మాటి కిట్లు నుడువు చుండెడివాండు.

హరేర్నామ, హరేర్నామ, హరేర్నామైవ కేవలం।
కలౌనాస్త్యేవ నాస్త్యేవ నాస్త్యేవ గతి రన్యథా॥

ఈయన సుబుద్ధిరాయులకు పాపవిమోచనకొఱ కుపదేశ మిచ్చునప్పుడిట్లు నుడివియున్నాండు. "నీవొకమాఱు భగ వన్నామోచ్చారణను జేసినయెడల నీసమస్తపాపములు నశిం చును. రెండవమాఱుచ్చరించినయెడల శ్రీకృష్ణుండు నీవాండ గును." ఒకానొకదినమునందు యవనహరిదాసు, పండితుల

తోడ నామమహిమను గూర్చి విచారించుచు, నీవిధముగ నుడివియున్నాఁడు. కొందఱు "భగవన్నామ స్మరణవలన పాపములు నశించుననియు, మఱికొందఱు ముక్తిగలుగు ననియు చెప్పుదురు. కాని హరిదాసిట్లు చెప్పుచున్నాఁడు. శ్రీకృష్ణుని నామస్మరణవలన నాయనయందు ప్రేమజనించును. ముక్తియు, పాపనాశనమును, భగవన్నామ స్మరణవలనఁ గలుగు ఫలితములలో నధమమైనవి. సూర్యోదయమైనంతనే భూమిమీఁదనుండు సమస్తపదార్థములను మనము చూడ గలము. చీకటియం దేపదార్థమును చూడఁజాలము." (చైతన్యచరితామృతము) ఋషభనందనుఁడు జనకమహారాజున కిట్లు నుడివియున్నాఁడు.

ఏవంవ్రతః స్వప్రియనామకీర్త్యా ।
జాతానురాగో ద్రుతచిత్త ఉచ్చైః ।
హసత్యథోరోదితి రౌతిగాయ ।
త్యున్మాదవన్నృత్యతి లోకవాహ్యః॥ భాగవతము.

భగవానుని, నామలీలాకీర్తనవ్రత మవలంబించువాఁడు, భగవానుని నామకీర్తనను జేయుచుండుటవలన వాని హృదయమం దనురాగోదయమగును; చిత్తము ద్రవీభూతమగును; ఇందువలన నీతఁ డొకప్పు డుచ్చైఃస్వరమున నవ్వును. మఱొకప్పుడు రోదనముఁజేయును; ఇంకొకప్పుడువ్యాకులచిత్తమున నఱచును; వేఱొకప్పు డున్మాదివలె నృత్యముఁ జేయును.

నామకీర్తనము చేయుచుండుటవలన క్రమానుగతముగ హృద
యమునందు ప్రేమ సంచరించును. ప్రేమ సంచరించినకొలఁ
దిని పాపములు నశించును.

అంహః సంహరదఖిలం సకృదుద
యాదేవ సకలలోకస్య ।
తరణిరివతిమిరజలధిం జయతి
జగన్మంగలం హరేర్నామ॥ పద్యావళీ.

ఒక్కమారు లేశమాత్రమైన నీనామ ముచ్చరించినయెడల
సమస్తమైనవారిపాపము లన్నియు దూరమగునో, ఆపాప
తిమిరజలధిని దాఁటుటకు ఆజగన్మంగళ హరినామము నావ
వలె జయయుక్తమగును గాక.

చేతోదర్పణమార్జనం భవమహాదావాగ్నినిర్వాపణం।
శ్రేయఃకైరవచంద్రికావితరణం విద్యావధూజీవనం।
ఆనందాంబుధివర్ధనం ప్రతిపదం పూర్ణామృతాస్వాదనం।
సర్వాత్మస్నపనం పరం విజయతే శ్రీకృష్ణసంకీర్తనం॥

పద్యావళీ.

శ్రీకృష్ణసంకీర్తనమువలన సహృదయదర్పణము శుద్ధమై
చిత్తమునందలి సమస్తకళంకములు దూరమగును. మహాదా
వాగ్నివలె మనల నెల్లప్పుడు దగ్ధముచేయుచున్న విషయవా
సనలు నశించును. చంద్రకిరణములకు కలువలు వికసించువిధ
మున నే శ్రీకృష్ణసంకీర్తనమువలన నాత్మయొక్క శ్రేయస్సు

వికసించును. బ్రహ్మవిద్య "అసూర్యస్పశ్యారూప" వధువు వంటిది. అంతఃపురములోని యంతఃపురమునందు నివసించు వధువువలె బ్రహ్మవిద్య హృదయాంతర్గతమందు దాఁగియుండును. ఇది సాధారణులయొద్దఁ బ్రకాశింపఁ జేయఁదగినవిషయముగాదు. "గుహ్యాతిగుహ్యాం శ్రీకృష్ణసంకీర్తనమ్" ఆ బ్రహ్మవిద్య కిది జీవనస్వరూపము. దీనివలన నానంద సాగరము పొంగి పొరలుచుండును. ఇచ్చట ప్రతిపదమందు పూర్ణామృతాస్వాదనము. ఇందువలన మానవుఁ డీరసమునందు మునిఁగి యాత్మను మఱచుచుండును.

ప్రతి దిన మేదో యొకసమయమునందు స్నేహితు లందఱొక చోటఁ జేరి నామసంకీర్తనను జేయుటకంటె నానందకర మగు విషయమింకొకటి లేదు. నిజముగా నప్పు డానందరసము పొంగి పొరలును. హృదయమునందు శాంతి గలుగును. విషయావాసనలు తిరోహిత మగును. క్రమము దప్పక నామ సంకీర్తనను జేయుచుండినయెడల మానవుఁడు కృతార్థుఁ డగును. నామకీర్తనఁ జేయవలసిన పద్ధతినిఁ గూర్చి చైతన్యుఁ డీవిధముగ తనశిష్యమండలికి బోధించియున్నాఁడు.

తృణాదపి సునీచేన తరోరపి సహిష్ణునా ।
అమానినా మానదేన కీర్తనీయః సదా హరిః॥

తృణముకంటె నీచుఁడవై, వృక్షమునకంటె సహిష్ణుత గలవాఁడవై, అభిమానమును త్యజించి పరులను సన్మానించుచు

సదా హరినామకీర్తనను జేయుచుండుము. భగవానునినామ
ములయం దేయేశక్తి కనంబడుచుండునో ఆయాశక్తిని నామ
కీర్తనసమయమునందుఁ జింతించుచుండవలయును. అట్లు
చేయనియెడల నామకీర్తనవలనఁ బ్రయోజన ముండదు. ఆ
మోదముకొఱకుఁ జేయునామకీర్తన నిష్ప్రయోజనము. నామ
జపముఁ జేసినయెడల, ఆనామార్థమును, ఆనామశక్తిని
గ్రహింపవలయును. మంత్రరూపమున జపించు నామార్థమును,
నామశక్తిని గ్రహించుట యత్యావశ్యకము.

మంత్రార్థం మంత్రచైతన్యం యో న జానాతి సాధకః ।
శతలక్షప్రజప్తోపి తస్య మంత్రో న సిద్ధ్యతి॥

మహానిర్వాణ తంత్రము.

మంత్రార్థమును మంత్రశక్తిని గ్రహింపనివానికి నూఱు
లక్షలు జపముచేసినను గూడ మంత్రసిద్ధి కానేరదు. తగిన
గురువువలన నేదియో యొకనామమున దీక్షితుఁ డగుట
వలన మిక్కిలి మేలు గలుగును. అట్టి వాఁడు మహా
సౌభాగ్యవంతుఁడు. తగినగురువు లభింపనియెడల తన కే
నామముమీఁదఁ బ్రేమ యుండునో ఆనామమును జపించు
చుండవలయును. ఈవిధముగఁ జేయుచుండినయెడల భగ
వానుఁడు తగినగురువును లభింపఁజేయును. జపముచేయ
వలసినవిధానమునుగూర్చి మహర్షులి ట్లుపదేశించియున్నారు:

ప్రణవో ధనుః శరో హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్య ముచ్యతే ।
అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్ ॥

ముండకోపనిషత్తు.

ప్రణవము ధనుఃస్వరూపముగను, ఆత్మ శరస్వరూపముగను, బ్రహ్మ లక్ష్యముగను ఉండవలయును. స్థిరప్రశాంతచిత్తమున ప్రణవధనువును, టాంకారమొనర్చినయెడల ఆత్మ బ్రహ్మ లక్ష్యమును భేదించును. శర మేవిధముగ విద్ధపదార్థమునందు తన్మయత్వము నొందునో అదేవిధముగ ఆత్మ బ్రహ్మయందు తన్మయత్వము నొందును. చాంచల్యవిహీనుఁడై ప్రణవమంత్రమును జపించుచుండినయెడల, ఆత్మ బ్రహ్మయందు లీనమగును.

విధియజ్ఞాజ్జప యజ్ఞో విశిష్టో దశభిర్గుణైః ।
ఉపాంశు స్స్యాచ్ఛతగుణః సాహస్రో మానసః స్మృతః ॥

మనుసంహిత.

దర్శపూర్ణిమాదులగు విధియజ్ఞములకంటె జపము దశగుణములు శ్రేష్ఠము. అంతకంటె ఉపాంశుజపము నూఱుగుణములు శ్రేష్ఠము. మానసజపము వేయిగుణములు శ్రేష్ఠము. జపము మూఁడువిధములు. ఉచ్చ్చరవమున, జపించు జపము మొదటిది. దగ్గఱివారికిఁగూడ వినఁబడకుండఁ జేయు నుపాంశుజపము రెండవది. మూఁడవది మానసజపము.

జప్యేనైవతు సంసిద్ధ్యో
బ్రాహ్మణో నాత్ర సంశయః ।

> కుర్యాదన్యన్న వాకుర్యా
> న్మైత్రో బ్రాహ్మణ ఉచ్యతే॥
>
> మనుసంహిత.

బ్రాహ్మణుఁడు యాగములు మొదలగునవి చేసినను జేయ కుండినను జపమువలన సిద్ధిలాభము నొందుననుటకు సందేహ ములేదు. యాగములు మొదలగునవి చేయకుండిననుగూడ జప మువలన సిద్ధిలాభమునొందవచ్చు ననుట నిస్సంశయము. జప మునకు మూఁడు కాలములు ప్రశస్తమైనవి. (౧) బ్రాహ్మము హూర్తము=సాధకులు బ్రాహ్మముహూర్తమునైని విశేష పక్షపాతము గలిగియుందురు. ఈ కాలమునందలి ప్రభాత వాయువు భగవానుని సన్నిధానమునుండి భక్తులయొద్దకు స్వర్గవార్తలను దీసికొనివచ్చుచుండుననియు, భక్తులవార్త లను భగవానునియొద్దకుఁ దీసికొనివెళ్లుచుండుననియు, మహా మ్మదీయసాధువులు నుడివియున్నారు. (౨) ప్రదోషము. (3) నిశీథ జపముచేసికొనుటకు ప్రశస్తమగుస్థానము లిందుఁ జెప్పఁబడినవి.

> పుణ్యక్షేత్రం నదీతీరం గుహా పర్వతమస్తకం ।
> తీర్థప్రదేశాః సింధూనాం సంగమః పావనం వనమ్ ।
> ఉద్యానాని వివిక్తాని బిల్వమూలం తటం గిరేః ।
> దేవతాయతనం కూలం సముద్రస్య నిజం గృహం ।

సాధనేషు ప్రశస్తాని స్థానాన్యేతాని మంత్రిణామ్।
అథవా నివసేత్తత్ర యత్ర చిత్తం ప్రసీదతి ॥

కులార్ణవతంత్రము.

పుణ్యక్షేత్రములు, నదీతీరములు, గుహలు, పర్వతశృంగములు, తీర్థస్థానములు, నదీసంగమస్థానములు, పవిత్రవనములు, నిర్జనోద్యానవనములు, బిల్వవృక్షమూలములు, గిరితటములు, దేవతామందిరములు, సముద్రకూలములు, స్వగృహము, చిత్తాహ్లాదకరమగు స్థలములును, ప్రశస్తమైన స్థానములు. ధర్మద్వేషులు దుశ్చరిత్ర గలవారలు ఉండుస్థలములును, క్రూరజంతువులుండు స్థలములును, సర్పభయము గలస్థానములును జపము చేసికొనుటకు పనికిరావని కులార్ణవతంత్రాభిప్రాయమై యున్నది. క్రమముఁ దప్పక శ్రద్ధగా జపముచేయుటవలనఁ గలుగు లాభమును "కబీరు" తన జీవితమునం దనుభవించి యున్నాఁడు. జపముచేయుటవలన భగవానునియందు మనస్సు మగ్నమగును. నలువైపులయం దాయనమాత్రమే కనఁబడును; సమస్త బ్రహ్మాండము భగవన్మహిమతోడ నిండియుండును.

# తీర్థయాత్ర.



తీర్థయాత్రల వలనను లేక తీర్థములయందు నివసించుట వలనను, భక్తిభావము వృద్ధి యగుచుండును. తీర్థములను పుణ్యస్థలము లని యేల చెప్పుచున్నారనఁగా,

ప్రభావా దద్భుతా ద్భూమేః సలిలస్య చ తేజసా ।
పరిగ్రహా న్మునీనాం చ తీర్థానాం పుణ్యతా స్మృతా ॥

కాశీఖండము.

"భూమియం దేదియో యద్భుతప్రభావమును, జలముల యం దేదియో యద్భుతతేజమును ఉండుటచేతను, లేక మును లు నివసించుటవలనను, తీర్థములకు పుణ్యస్థలత్వము చెప్పఁబడును. జ్వాలాముఖతీర్థమునందు, గిరినుండిపడుచున్న కణములను, సీతాకుండమునందలి వేఁడినీటిని [illegible]నాగమునందు మంచుచేతఁ గప్పఁబడినపర్వతశృంగమును, హరిద్వారమునందు రమణీయ భాగీరథీసలిలములను, దర్శనము చేసిన వారి హృదయములు భక్తిరసపూరితము లగు ననుటకు సందియము లేదు గదా? బృందావనమునందు శ్రీకృష్ణుని స్మరించి, నవద్వీపమునందు చైతన్యలీలలనుదలపోసి, బుద్ధగయ యందు బోధివృక్షముక్రిందఁ గూర్చుండి, అయోధ్యయందు శ్రీరామచంద్రునికీర్తిని స్మరించి

నప్పు డెవరి హృదయమునందు పవిత్రభావము లుదయింపవు? ఇంతియ గాక తీర్థములయందుండు మహాపురుషులసాంగత్యమువలన కృతార్థులైనవారిని దలంచుకొనినయెడల హృదయమునందు భక్తి జన్మింపదా?

---

# ఆత్మనివేదనము.

---

కాయేన వాచా మనసేంద్రియైర్వా
బుధ్ధ్యాత్మనా వానుసృతస్వభావాత్ ।
కరోతియద్యత్సకలం పరస్మై
నారాయణాయేతి సమర్పయే త్తత్ ॥

భాగవతము.

మనోవాకాయములవలనను, ఇంద్రియములవలనను, బుద్ధిచిత్తములవలనను, జేయుకార్యము లన్నియు, పరాత్పరుం డగు నారాయణునియందు సమర్పింపుము.

శ్లో॥ యత్కరోషియదశ్నాసి,యజ్జుహోషి దదాసియత్
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్॥

నవమోధ్యాయము ౨౭ భగవద్గీత.

ఓయర్జునా, నీ వొనర్చుకర్మను, భుజించుపదార్థములను, వేల్చు హవిస్సులను, చేయు దానములను, తపస్సును, నాకు సమర్పణము చేయుము.

మనస్సును, వాక్యములను, చింతలను, కార్యములను, భగవానునికి అర్పణము చేయుటకు బ్రయత్నించువాని హృదయము పవిత్రమును భక్తిసంపూర్ణము నగును. కావున భగవానునకు నివేదన చేయనిదియు ఏకార్యమును జేయక ఏవాక్యమును బలుకక, ఏయోచన చేయ కుండవలయు నను భావము హృదయమునందు దృఢముగ నాటుకొని యుండిన యెడల తనంతట తానుగనే చిత్తము భక్తిసంపూర్ణ మగును. సకలవిషయములయందు నాయనను స్మరించు చున్న యెడల, నట్టి మానవుఁ డాయనవలన రక్షింపఁబడును.

భక్తి నార్జించు విషయమునందు భగవానుఁ డుద్ధవున కుపదేశించినవిషయము క్రింద నుదాహరించుచున్నాను.

శ్రద్ధామృతకథాయాం మే శశ్వన్మదనుకీర్తనం।
పరనిష్ఠా చ పూజాయాం స్తుతిభిః స్తవనం మమ
ఆదరః పరిచర్యాయాం సర్వాంగైరభివందనం।
మద్భక్తపూజాభ్యధికా సర్వభూతేషు మన్మతిః॥
మదర్థేష్వంగచేష్టా చ వచసా మద్గుణేరణం।
మయ్యర్పణం చ మనసః సర్వకామ వివర్జనం
మదర్థేర్థ పరిత్యాగో భోగస్య చ సుఖస్య చ।

ఇష్టం దత్తం హుతం జప్తం మదర్థం మద్వ్రతంతపః।
ఏవంధర్మైర్మనుష్యాణా ముద్ధవాత్మనివేదినాం।
మయిసంజాయతే భక్తిః కోన్యోర్థోస్యావశిష్యతే॥

భాగవతము.

ఓయుద్ధవా! నాయొక్క అమృతతుల్యమగు కథలయందు శ్రద్ధయు, సర్వదా నాయొక్క నామకీర్తనమును చేయుచుండుటయు, నాపూజయందు నిష్ఠ గలిగియుండుటయు, స్తుతి వలన నాయొక్క స్తవము చేయుచుండుటయు, నాపరిచర్యయం దాదరమును గలిగియుండుటయు, నాకు సర్వాంగముల తోడ వందనము లర్పించుటయు, నాభక్తులను విశేషముగ పూజించుచుండుటయు, నాగుణములను గానమును చేయుచుండుటయు, నాయందు మనస్సునర్పించి, అన్యాభిలాషలను వర్జించుటయు, నన్ను బొందుటకుఁగాను, అర్థమును, సుఖమును, భోగములను పరిత్యజించుటయు, నాకొఱకు యజ్ఞమును హోమమును, దానములను, జపములను, తపములను, వ్రతములను, జేయుచు నాకాత్మనివేదనను జేయుచుండువానికి నాయందు భక్తి జనించును. అట్టివానికి అర్థము లేదనుజ్ఞాన ముండదు. కావున వాఁడు కృతార్థుఁ డగును.

# ఏకాగ్రతాసాధనము.

సమస్తసాధనములకు నేకాగ్రచిత్తము గలిగియుండుట ముఖ్యము. ఏకాగ్రచిత్తము లేనియెడల నేవిధమగు సాధనవలనను మానవుఁడు కృతకృత్యుఁడు కాఁజాలఁడు. చిత్తచాంచల్యము భక్తిసాధనకుఁ బ్రధానమగు నంతరాయము. ఆత్మచింతకు గడంగు నప్పుడు చిత్తచాంచల్యము వలన చిత్త మిటు నటుఁ బోవుచుండును. అందువలన ఆత్మచింతయొక్క గాఢత్వము తగ్గిపోవును. ఇట్టిస్థితియందుఁ దెలిసికొంటి మనుకొనుటయంతయు, శూన్యము. ఒకమహాపురుషునియొద్దకేగి యుపదేశమును వినుచుందుమనుకొనుము. ఉపదేశము వినునప్పుడు గృహములోని సంగతులు జ్ఞాపకమునకువచ్చుటవలన ఆయనయొక్క యుపదేశములను గాలియందుఁ గలిపి విషయచింతయందు నిమగ్నులమగుదుము. ఇట్టిచిత్తచాంచల్యము మన కనుభవవేద్యమే గదా? నాను జపమును జేయుటకు బ్రయత్నింతును. చేతియందు మాలతిరుగుచునే యుండును, నాలుక కదలుచునే యుండును. కాని చిత్తము పసులసొమ్మునుహరించుటకుఁ బ్రయత్నించుచుండును. సంకీర్తనయందు గంతులు వేయుచుందుము. కాని చిత్తమేదో యొకవ్యాపారమునందు మునిఁగియుండును. బృందావనమునందు గోవిందదేవుని మందిరమున మంగళహారతిని

జూచుచుందుము. కాని చిత్తమునందు స్వగ్రామములోని సొంతచెలువును బాగుచేయించుటకు పన్నాగములు పన్ను చుందుము. శయనసమయమునందు భగవానుని బ్రార్థింతుము. ఆయన వచ్చును. కాని మన మెక్కడ నుందుము? చింతాకు కోసికొనిపోయినాఁడనియెవనితోడనో కలహించుచుందుము. కావున నిట్టిచిత్తచాంచల్యముగలవాఁడు భక్తిపథమునం దగ్రే సరుఁడు కాఁజాలఁడు. భక్తిసాధనవిషయమునందుఁ జెప్ప బడినచొప్పునఁ బ్రవర్తించుచుండునెడల చిత్తచాంచల్యము నశించును. చిత్తచాంచల్యము దూరమగుటకుఁగాను మహర్షి పతంజలి యెనిమిదిసూత్రములను చెప్పియున్నాఁడు.

"(౧) తత్ప్రతిషేధార్థ మేకతత్త్వాభ్యాసః॥"

యోగసూత్రములు.

చిత్తచాంచల్యనివారణార్థము తనయొక్క యభిమత తత్త్వమునందు మనస్సును నిలుకడ చేయవలయును. క్రమ ముదప్పక యొకటేవిషయమునందు మనము నిలిచియుండుట వలన నేకాగ్రచిత్త మేర్పడును. అందువలన చిత్తచాంచల్య ము నశించును.

"(౨) మైత్రీకరుణాముదితోపేక్షాణాం సుఖదుఃఖ పుణ్యాపుణ్యవిషయాణాం భావనాత శ్చిత్త ప్రసాదనమ్"

సుఖించువానిపై నీర్ష్య లేక వానితోడ మిత్రత్వము గలిగి, దుఃఖితునిమీఁద నుదాసీనత్వమును జూపక కృపను గనఁబఱుచుచు, పుణ్యాత్మునిపైని ద్వేషము లేక పుణ్యానుమోదనమును సంతసమును గలిగి, పుణ్యాత్ముఁడు కానివానికార్యములయందు ద్వేషము లేక యుపేక్ష నవలంబించుచుండునెడలఁ జిత్తము ప్రఫుల్లమగును; అందువలన చిత్తచాంచల్యము నశించును. రాగద్వేషాదులు చిత్తచాంచల్యమును వృద్ధిపఱుచుచుండును. కావున కరుణ మైత్రి మొదలగువానివలన రాగద్వేషములను సమూలముగ నశింపఁజేసికొనినయెడల మనఃప్రసన్నత గలుగును. మనఃప్రసన్నతవలన నేకాగ్రచిత్తమేర్పడును.

"(౩) ప్రచ్ఛర్దనవిధారణాభ్యాం వా ప్రాణస్య"

ప్రాణాయామమువలన నేకాగ్రచిత్తము గలుగును. సమస్తేంద్రియవృత్తి సముదాయము ప్రాణవాయువుమీఁద నాధారపడి యుండును. మనస్సుయొక్కయు, ప్రాణముయొక్కయు, స్వవ్యాపారములయందు పరస్పరసంబంధమును గలిపి సమస్తేంద్రియవృత్తులను నిరోధించుటవలన ప్రాణమునకు జయమును గలిగించినయెడల నేకాగ్రచిత్తమేర్పడును. ప్రాణాయామమును తగుగురువులయొద్దనే అభ్యసింపవలయును. గురువు లేక ప్రాణాయామమునకుఁ బ్రయత్నించినయెడల కీడు గలిగినను గలుగవచ్చును.

"(౪) విషయవతీ వా ప్రవృత్తి రుత్పన్నా స్థితినిబన్ధనీ॥"

నాసాగ్రమునందు చిత్తమును ధారణచేసినయెడల దివ్య గంధజ్ఞానమును, జిహ్వాగ్రమునందు రసజ్ఞానమును, తాల్వగ్రమందు రూపజ్ఞానమును, జిహ్వామధ్యమునందు స్పర్శజ్ఞానమును, జిహ్వామూలమునందు శబ్దజ్ఞానమును, జన్మించును. ఈ విధమగు జ్ఞానము జన్మించుటవలన నేకాగ్రచిత్త మేర్పడును. ఈయుపాయమును యోగశిక్షను బొందినవారలు మాత్రమే గ్రహింపఁగలరు.

"(౫) విశోకా హి జ్యోతిష్మతీ"

శోకశూన్యుఁడును, సాత్త్వికభావపూర్ణుఁడు నైనవానికి స్థిరచిత్త ముండును. సాత్త్వికభావ మవలంబించినవాఁడు రజోభావమును దూరము చేసికొనఁగలఁడు; లేశమైనను శోకమును బొందఁడు. అందువలన వానికి చిత్తచాంచల్యము గలుగదు.

"(౬) వీతరాగవిషయం హి చిత్తమ్"

విషయవాసనలను త్యజించినవాని చిత్తమును గూర్చి చింతించుచుండినయెడల నేకాగ్రచిత్త మేర్పడును. సాధుపుంగవుల చాంచల్య రహిత చిత్తములనుగూర్చి విచారించువాఁడు చిత్తచాంచల్య విముక్తుఁ డగును.

"(౭) స్వప్ననిద్రాజ్ఞానావలంబనం వా"

స్వప్నము లేక నిద్ర జ్ఞానాలంబనమైనయెడల చిత్తము స్థిరమగును. సుందరమగు దేవతా యొక్క స్వప్నవిషయ మును చింతించుచుండినయెడలను, సుఖముగ నిద్రించితిని గాని కొంచెమైనను చిత్తచాంచల్య మెఱుఁగనని మాటిమా టికి చింతించుచుండినయెడలను చిత్తము స్థిరమగును.

"(౩౯) యథాభిమతధ్యానాద్వా"

మనఃప్రీతి పుట్టునట్టి వస్తువును ధ్యానించుచుండినయెడల నేకాగ్రచిత్తము గలుగును. చంద్రుఁడు మొదలగువానిని, శరీరమునందలి నాడీచక్రములు మొదలగువానిని క్రమాను గతముగ ధ్యానమొనర్చుచుండినయెడల చిత్తము స్థిరమగును. ప్రియమగు వస్తువునుగూర్చి చింతించుచుండినయెడల ప్రాణ మున కానందము గలుగును. ఆయానందమును మనస్సు విడువఁజాలదు. అందువలన నేకాగ్రచిత్త మేర్పడును. ఇంద్రియలాలసాజనితాసక్తి గలిగిన వ్యక్తిని గాని, వస్తువును గాని, ధ్యానించుటవలన చిత్తచాంచల్యము గలుగును.

నిర్మలప్రేమ కునికిపట్టగుదానిని చింతించుటవలన నేకా గ్రచిత్తమేర్పడును. ఈవిషయమునం దొకకథ గలదు. ఒకా నొకబాలుఁడు వేదాధ్యయనమునకై యొకగురువునొద్ద జేరెను. అధ్యయనసమయమునందు బాలునిదృష్టియిటునిటు తిరుగుచుండుటను జూచి, నీచిత్తచాంచల్యమునకుఁ గారణ మేమని గురువు ప్రశ్నించెను. బాలుఁడు "నాకత్యంతప్రియ

మగుమహిష మొకటి గలదు. అది తలంపునకు వచ్చినపుడెల్ల నాచిత్తము చంచల మగుచుండును.'' అనిచెప్పెను. గురువు: "అటు లయినయెడల వేదాధ్యయనమునుమాని కొంతకాలము నీప్రియమహిషమునుగూర్చి చింతించుచుండుము." అనియాజ్ఞాపించెను. అట్లే ఆపిల్లవాఁ డొంటరిగఁ గూర్చుండి మహిషమునుగూర్చి చింతించుచుండెను. కొన్నిదినములు గడచిన తర్వాత గురు వాబాలుఁడున్నగదికిఁగలచిన్నవాకిటికిప్రక్కఁ గూర్చుండి "నీవిటురమ్ము, వేదాధ్యయనమును జేయవలయును." అని పిలువ, బాలుఁడు వచ్చెను. అందువలన వీనికింకను స్థిరచిత్తము కుదురలేదని గ్రహించి, గురువు తిరిగి బాలుని మహిషధ్యానమునం దుండవలయునని యాజ్ఞాపించెను. బాలుఁడు తిరిగి మహిషధ్యానమం దుండెను. కొన్నిదినములు గడచిన పిమ్మట గురువు తిరిగి ఆవాకిటిప్రక్కనుగూర్చుండి శిష్యునిఁ బిలిచెను. కాని, బాలుఁడు "నేను మీయొద్ద కేవిధముగ వత్తును? మహిషశృంగములచేత నడ్డగింపఁబడుచున్నాను.'' అని చెప్పెను. అనుడువు లాలించి మహిషముమీఁద బాలునికి సమాధి కుదిరినదనియును, స్థిరచిత్త మేర్పడిన దనియును గ్రహించి బాలునిఁజూచి గురువు "ఇటురమ్ము. నిన్నుకొమ్ము లడ్డగింపవు. నేను దానికి తగుపనిచేయుదును.'' అనిచెప్పెను. అంత నాబాలుఁడు గురువును సమీపించి వేదాధ్యయనమున కుపక్రమించెను. మహిషధ్యానమువలన నేకాగ్రచిత్త మేర్పడి

బాలుఁ డత్యల్పకాలములోనే వేదపాఠమునందు విఖ్యాత పండితుం డయ్యెను.

త్రాటకసాధనము (ఏదయిననొకవస్తువుమీఁద దృష్టినిలిపి యుండుట) చిత్తము స్థిరమగుటకు మంచిసాధనము.

ఉపసంహారము నందు భక్తియొక్క సాధన సంబంధ మునం దొకవాక్యము చెప్పుట యావశ్యకము. సాధన సంబంధమందుఁ జెప్పఁబడిన యుపాయముల నవలంబించి, యిందువలన భగవానునిఁ దెలిసికొను శక్తి గలిగిన దని గాని, లేక స్వశక్తివలన భగవానుని బంధింపఁగల నని గాని, యెవఁడును దలంపఁ జనదు. మనుష్యుఁడు భగవానుని పొందుటకుఁ జేయు కార్యము లత్యల్పములు. అల్పశక్తి గల మనుష్యుఁడు చేయు స్వల్పకార్యమువలన అనంతశక్తి మంతుఁడగు భగవానుఁడు వశుఁడగునా? కాని భక్తవత్స లుఁడు తనంతటతానుగ భక్తులకు వశుఁ డగుననుమాట సత్య ము. ఒకదినము యశోద శ్రీకృష్ణుని త్రాటితోఁ గట్టుటకుఁ బ్రయత్నించి, త్రాటిని దెచ్చి కట్టఁబోఁగా నాత్రాడు రెండం గుళములు తక్కువాయెను. ఇంకొకత్రాడు దెచ్చి దీనికి ముడి వైచి కట్టఁబోఁగా నీత్రాడు గూడ రెండంగుళములు తక్కు వాయెను. ఇదేవిధముగ గృహమునందలి త్రాళ్లన్నియు ముడివేసి కట్టఁబోయినను గూడ రెండంగుళముల త్రాడు

చాలదాయెను. అంత యశోదయు, గోపికలును విస్మయ చిత్తలై చూచుచుండిరి.

> "స్వమాతుః స్విన్నగాత్రాయా విస్రస్తకబరీస్రజః।
> దృష్ట్వా పరిశ్రమం కృష్ణః కృపయాసీత్ స్వబన్ధనే॥"
>
> భాగవతము.

తల్లిశరీరమునుండి చెమటబిందువులు వచ్చుచుండుటను, కొప్పు వీడి శ్రమపడుచుండుటను జూచి కృపాపరవశుఁడై కృష్ణుఁడు తనంతట తానుగనే బంధింపఁబడెను.

> "ఏవం సన్దర్శితా హ్యఙ్గ హరిణా భృత్యవశ్యతా।
> స్వవశేనాపి కృష్ణేన యస్యేదం సేశ్వరంవశే॥"
>
> భాగవతము.

"ఈవిధముగఁ జూపించిన కృష్ణునకు బ్రహ్మాండములు బ్రహ్మాండాధిపతు లధీనులై యున్నారు. కాని యాయన యెవరి యధీనుఁడును గాఁడు కాని యాయన సర్వదా తన భృత్యులకు వశుఁడై యుండును."

ఎవ్వరును భగవానుని సాధనవలనను, స్వశక్తివలనను వశముచేసికొనఁజాలరు. కాని యాయన కెవరు దాసులో వారి కాయన దాసుఁడైయుండును. సాధనవలనను స్వశక్తి వలనను భగవానుని వశము చేసికొందు మని తలంచుట శుద్ధ భ్రమయనిగ్రహింపవలయును. [తృణముకంటెనుగూడ నీచుఁడ

వని సాధనచేయుదు, నాయనకృపబలముఁగాక సాధనబలమున నాయనను పొందఁజాలరని తెలియుమా. నాయనను పొందును భగవానుఁ డట్టివానిసాధనముఁ మెచ్చి వానియందుఁ గృపఁ జూపును.



ఆ॥ ఒడలఁ జెమట పొడమ నుత్తరీయము జాఱ,
వీడి యున్న తుఱుము విరులు రాలఁ,
గట్టరానితన్నుఁ గట్టెద నని చింతఁ,
గట్టుకొనిన తల్లిఁ గరుణఁ జూచి॥

కం॥ బంధవిమోచనుఁ డీశుఁడు,
బంధింపఁ దెనంగు జనని పాటోర్చి సుహృ,
ద్బంధుఁడు కావున జననీ,
బంధంబునఁ గట్టువడియెఁ బాటించి కృపా॥

# ఆఱవ ప్రకరణము.

## భక్తునియొక్క లక్షణములు: భక్తియొక్క క్రమము.

అకస్మికముగా భగవత్కృప గలిగి కృతార్థులైనవారి విషయము స్వతంత్రము. కాని యట్టిభాగ్యవంతు లెంద ఱున్నారు? మనవంటివారలు భక్తి నార్జించుటకు పలుమార్గ ముల నవలంబింపవలయును. భక్తిబీజమును నాటుటకు హృదయక్షేత్ర మేవిధముగ నుండవలయునో ఆవిషయమును గూర్చి మనమిప్పుడు యోజింతము. కావున భక్తి యేవిధముగ పరి పక్వమగును, భక్తునిజీవమునం దేయేలక్షణములు క్రమవికా సమును జెందుచుండు ననువిషయమునుగూర్చి తెలిసికొనుటకు మనము ప్రయత్నింపవలయును.

మహాభక్తుఁడగు ఋషభనందనుఁడు హరిభక్తులను, ఉత్త ములనియును, మధ్యములనియును, అధములనియును, మూఁడు భాగములుగ భాగించియున్నాఁడు.

౧ అధమభక్తుని లక్షణములు.

> అర్చాయామేవ హరయేపూజాంయః శ్రద్ధయోహతే।
> నతద్భక్తేషు చాన్యేషు సభక్తః ప్రాకృతః స్మృతః॥
>
> ఏకాదశస్కంధము, భాగవతము.

శ్రద్ధగాఁ బ్రతిమార్చనను జేయుచు, హరిభక్తులను గాని
యితరులను గాని, పూజచేయ కుండువాఁడు, అధమ
భక్తుఁడు. అనఁగా హృదయమునందు భక్తి జనించుటవలన
వాఁడు క్రమక్రమముగా మధ్యమభక్తుఁ డగును. విగ్రహార్చ
నను చేయనివారిలోఁగూడ నీశ్వరునియందు శ్రద్ధమాత్రము
జనించి, యీశ్వరుని నామమును స్మరించుచు, భగవదుపా
సనను జేయు ప్రవృత్తి జనించి, భగవద్భక్తులనైనఁగాని,
లేక తదితరులనైనఁగాని విశేషశ్రద్ధయుండనివాఁడు నికృష్ట
భక్తుఁడు. ఈ శ్రేణిలోని భక్తులు పనుకార్యములు చేయుటను
వినుదీయరుగాని, అప్పుడప్పుడు హృదయవేదనమాత్రము
పొందుచుందురు. వీరికి మానవులయెడఁ బ్రేమ యుండదు;
అహంకారపూరితులై యుందురు. వీరికి శత్రువుల నణఁగఁ
గొట్టవలయు ననుతలంపుపూర్తిగ నుండును. క్రోధలోభములకు
వశులైయుందురు. కాని భగవానునియం దణుమాత్రము శ్రద్ధ
యుండును. వీరిహృదయ మత్యల్పపరిమాణముగ మాత్రమే
శుద్ధమైనదని తలంపవలయును.

౨ మధ్యమభక్తుని లక్షణములు.

ఈశ్వరే తదధీనేషు బాలిశేషు ద్విషత్సు చ ।
ప్రేమమైత్రీకృపోపేక్షా యః కరోతి స మధ్యమః ॥
భాగవతము.

ఈశ్వరునియందు ప్రేమయు, భక్తులతోడ స్నేహమును,
మూర్ఖులపైని కృపయు, శత్రువులపై నుపేక్షాభావమును గలిగి

యుండువాఁడు మధ్యమభక్తుఁడు. అధమభక్తునికంటె మధ్య
మభక్తుని హృదయక్షేత్ర మనేకవిధముల పరిశుభ్రమైన దని
తలంపవలయును. ఈశ్వరునియందు శ్రద్ధకు మాఱుగ ననురాగ
మును; భక్తులపైని ప్రేమయు, సాధుపుంగవుల సాంగత్యము
నందాసక్తియు, మూర్ఖులమీఁద నసహనమునకుమాఱుగ కృప
యు, శత్రువులను హింసింపవలయు ననుద్వేషమునకు మా
ఱుగా, ఉపేక్షాభావమును మధ్యమభక్తునియందుఁ గాన్పించు
చుండును. కాని వీనికి సమస్తమానవులయందును, సమత్వ
మింకను కుదురలేదు. భగవద్భక్తి ప్రవాహమువలన సమస్త
మొకటే యాకారమును బొందలేదు.

3 ఉత్తమభక్తుని లక్షణములు.

న యస్య స్వః పర ఇతి విత్తేష్వాత్మని వా భిదా ।
సర్వభూతసమః శాన్తః స వై భాగవతోత్తమః ॥

ఆత్మభేదము లేక, ధనము మొదలగు వానియందు, స్వపర
భేదజ్ఞానమును మఱచి, సర్వభూతసమత్వము గలిగి యింద్రియ
ములను మనస్సును సంయమము చేసికొనువాఁ డుత్తమ
భక్తుఁడు.

సర్వభూతేషు యః పశ్యే ద్భగవద్భావ మాత్మనః ।
భూతాని భగవత్యాత్మ న్యేష భాగవతోత్తమః ॥

సర్వభూతములయందును భగవానుని నిరతిశయైశ్వర్య
మును జూచుచు, సమస్తపదార్థములను భగవానుఁ డధి

స్థించి యున్నాఁడని తెలిసికొనువాఁ డుత్తమభక్తుఁడు.

> గృహీత్వాపీంద్రియైరర్థాన్ యో న ద్వేష్టి న హృష్యతి
> విష్ణోర్మాయామిదం పశ్యన్ స వై భాగవతోత్తమః॥

ఈసంసారవిషయములన్నియు విష్ణుమాయ యని గ్రహించి భోగ్యవిషయవస్తువుల నింద్రియములచేత గ్రహించియుఁ గూడ నణుమాత్రమైనను సంతసమునుగాని, దుఃఖమునుగాని, పొందనివాఁ డుత్తమభక్తుఁడు.

> దేహేంద్రియప్రాణమనోధియాం యో
> జన్మాప్యయక్షుద్భయతర్షకృచ్ఛ్రైః।
> సంసారధర్మైరవిముహ్యమానః।
> స్మృత్యా హరేర్భాగవతప్రధానః॥

హరినామస్మరణచేయుచు, దేహమును, నింద్రియములు, ప్రాణము, మనస్సు, బుద్ధిధర్మములు జన్మమృత్యువులు, క్షుధాపిపాసలు, కష్టములు మొదలగు సాంసారికధర్మములయందు విముఖుఁడు గానివాఁ డుత్తమభక్తుఁడు.

> న కామకర్మబీజానాం యస్య చేతసి సంభవః।
> వాసుదేవైకనిలయః స వై భాగవతోత్తమః॥

వాసనాజనితకర్మబీజములు మొలకలెత్తని హృదయము గలిగి వాసుదేవునియందే సంపూర్ణముగ నిర్భరపడి యుండువాఁ డుత్తమభక్తుఁడు.

నయస్యజన్మ కర్మాభ్యాం నవర్ణాశ్రమజాతిభిః।
సజ్జతేస్మి న్నహంభావో దేహేవై స హరేః ప్రియః॥

జన్మమును, కర్మమును, వర్ణమును, ఆశ్రమమును, జాతిని అవలంబించి ఆత్మబుద్ధి గలుగనివాఁడు హరికి ప్రియుఁడు. వాఁ డుత్తమభక్తుఁడు.

భువనవిభవహేతవే ప్యకుణ్ఠ
స్మృతి రజితాత్మ సురాదిభిర్విమృగ్యాత్ ।
న చలతి భగవత్పదారవిన్దా
ల్లవనిమిషార్ధ మపి యః స వైష్ణవాగ్ర్యః॥

అరనిముసము సేపు భగవానునిపాదారవిందములనుండిమనస్సును దూరముచేసికొనినయెడల త్రిభువనైశ్వర్యముల కధికారి నగుదునను నాశవలనను కూడ నాకర్షింపఁబడక భగవానుని పాదపద్మములకంటె నింకొక సారవంతమగువస్తువు పృథివియందు లేదనువిశ్వాసమున, హరిగతప్రాణుఁడై దేవతాదులకుఁగూడ దుర్లభ మగు, భగవచ్చరణములమీఁదనుండి మనస్సును అర్ధనిమిషమైనను గదలయ్యనివాఁడు భక్తులలో నగ్రగణ్యుఁడు.

భగవత ఉరువిక్రమాఙ్ఘ్రి శాఖా
నఖమణిచన్ద్రికయా నిరస్తతాపే।
హృది కథ ముపసీదతాం పునః స
ప్రభవతి చన్ద్ర ఇవోదితే ర్కతాపః॥

భగవానుని నఖమణి చంద్రికలవలన భక్తునిహృదయమం దలి కామాదిపాపములు దూరమగును. కావున అట్టివాని హృదయమునందు విషయవాసనలకు స్థలము దొరకునా? చంద్రోదయ మయినంతనే నిదాఘముయొక్క తాప మెవరినైనను బాధింపఁగలదా?

విసృజతి హృదయం న యస్య సాక్షా
ద్ధరి రవశాభిహితో ప్యఘౌఘనాశః ।
ప్రణయరశనయా ధృతాంఘ్రిపద్మః
స భవతి భాగవతప్రధాన ఉక్తః ॥

ఎవని నామమును అకస్మాత్తుగా నుచ్చరించినను గూడ మహాపాపతరంగములు నశించునో అట్టివానియొక్క చరణపద్మములకు ప్రణయబంధనముచేత బద్ధుఁడైనవాని చిత్తము హరిని విడువఁజాలదు. అట్టివాఁడు భక్తశ్రేష్ఠుఁడు. భగవానుఁడీవిధముగ భక్తుల లక్షణములను జెప్పియున్నాఁడు.

శ్లో॥ అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ ।
నిర్మమో నిరహంకార స్సమదుఃఖసుఖః క్షమీ ।
సన్తుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః॥
మయ్యర్పితమనోబుద్ధి ర్యో మద్భక్త స్స మే ప్రియః॥
౧౩-౧౪ భక్తియోగము-భగవద్గీత.

సర్వభూతములయందు వైరము లేక, సర్వప్రాణులకు మిత్రుఁడై, దయగలవాఁడై, మమకారాహంకారములు లేని

వాఁడై, సుఖదుఃఖములను సమానముగాఁ జూచుచు, నోర్పు గలిగి, నిత్యసంతోషియు, ధ్యానపరుఁడును, అచంచలమనోవృత్తి గలవాఁడును, సందేహము లేనివాఁడును, మనోబుద్ధులను నాయందుంచి నాకు భక్తుఁడగువాఁడు, నాకు స్నేహితుఁడు.

యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చయః
హర్షామర్ష భయోద్వేగై ర్ముక్తో యస్సచ మేప్రియః॥
౧౫ భక్తియోగము-భగవద్గీత.

ఎవనివలన నెల్లజనులకును, నెల్లజనులవలన నెవనికిని భయము లేదో, సంతోషమునకును, భయమునకును, అసూయకును నెవఁ డతీతుఁడై యుండునో అట్టివాఁడు నాకు మిక్కిలి ప్రియుఁడు.

అనపేక్ష శ్శుచి ర్దక్ష ఉదాసీనో గతవ్యథః।
సర్వారంభ పరిత్యాగీ యో మద్భక్త స్స మే ప్రియః॥
౧౬ భక్తియోగము - భగవద్గీత.

అపేక్షారహితుఁడై, పవిత్రుఁడై, వ్యథలు లేనివాఁడై పక్షపాతము లేక భయము లేనివాఁడై కర్మకు ఫలములను గోరక నాకు భక్తుఁడుగ నుండునట్టివాఁడు నాకు మిక్కిలి ప్రియుఁడు.

యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి।
శుభాశుభ పరిత్యాగీ భక్తిమాన్ యస్స మే ప్రియః॥
౧౭ భక్తియోగము - భగవద్గీత.

సంతోషమునకును, ద్వేషమునకును, దుఃఖమునకును, ఆశకును, శుభాశుభముల కతీతుండై నాయందు భక్తిగలవాఁడు నాకు మిక్కిలి ప్రియుఁడు.

సమ శ్శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః ।
శీతోష్ణసుఖదుఃఖేషు సమ స్సఙ్గవివర్జితః ।
తుల్యనిన్దాస్తుతిర్మౌనీ సన్తుష్టో యేనకేనచిత్ ।
అనికేతః స్థిరమతి ర్భక్తిమాన్మే ప్రియో నరః ॥

౧౮. ౧౯ భక్తియోగము-భగవద్గీత.

పగవారియందును, స్నేహితులందును, మానావమానములయందును, శీతోష్ణములయందును, సుఖదుఃఖములయందును, సమానుఁడై సంగరహితుఁడై మౌనమును జెందినవాఁడై లాభ మైనంతటను సంతుష్టుఁడై, నివాసరహితుఁడై స్థిరం పనిబుద్ధిగలవాఁడై నాకు భక్తుఁడగువాఁడు నాకు మిగుల ప్రియుఁడు.

యే తు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే ।
శ్రద్దధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః ॥

౨౦ భక్తియోగము-భగవద్గీత.

నేనే పరమగతి యనినమ్మి, ఈయమృతప్రదమగు ధర్మమును విశ్వసించి, నేను జెప్పినవిధమున శ్రద్ధతో నడుచుకొనుచుండువాఁడు నాభక్తు లందఱికంటె నాకు మిగుల

ప్రియుఁడు. శ్రేష్ఠతమభక్తుని సర్వోత్కృష్టలక్షణములను గూర్చి భగవానుఁ డుద్ధవున కీవిధముగఁ జెప్పియున్నాఁడు.

న కించిత్ సాధవో ధీరా భక్తా హ్యేకాన్తినో మమ।
వాఞ్ఛన్త్యపి మయాదత్తం కైవల్య మపునర్భవమ్॥

భాగవతము.

సాధువులును, ధీరులునగు నాప్రియభక్తులకుఁ గోరిక లుండవు. నేను వారికి మోక్షమొసంగవలయు నని తలంచినను గూడ వారు దానిని వాంఛింపరు.

న పారమేష్ఠ్యం న మహేన్ద్రధిష్ణ్యమ్
న సార్వభౌమం న రసాధిపత్యమ్।
న యోగసిద్ధీ రపునర్భవం వా
మయ్యర్పితాత్మేచ్ఛతి మద్వినాన్యత్॥

నాభక్తుఁడు బ్రహ్మపదమును, ఇంద్రపదమును, సార్వభౌమపదమును, పాతాళలోకాధిపత్యమును, యోగసిద్ధిని మోక్షమునుగూడఁ గోరఁడు. వానికి నామీఁదఁదప్ప నింకొక వస్తువుమీఁదఁ గోరిక యుండదు.

ఈసందర్భమునం దొకమాట మనస్సునం దుంచుకొనుట యావశ్యకము. శ్రేష్ఠభక్తుఁడు గావలయునన్నయెడల సంసారమును త్యజింపవలయు నని యెచ్చటను జెప్పఁబడియుండ లేదు. ఉత్తమభక్తులగువా రెప్పుడును విషయవాసనలకు చిత్తమునందు స్థానమియ్యరు. సంసారధర్మములయం దెప్పు

డును మోహపరవశుఁడై యుండఁడు. శత్రువులను మిత్త్రులను నిందాస్తుతులను మానావమానములను సమానముగఁ జూచుచుండును. కావున మన మిట్టిస్థితికి రాఁగలందులకుఁ బ్రయత్నింపవలయును.

భగవద్గీతయందు భగవానుఁ డర్జునునకు సంసారమును త్యజింపవలయునని యుపదేశించి యుండలేదు. మఱియును సంసారమును త్యజింపకుండునటుల నుపదేశించియున్నాఁడు. విషయవాసనారహితుఁడై శత్రువులయందును మిత్త్రులయందును మానావమానములయందును సమానబుద్ధి గలిగి గృహధర్మములనునిర్వహించుచుండవలయునని శ్రీకృష్ణుఁడర్జునునకు నొక్కి చెప్పియున్నాఁడు. శ్రీకృష్ణుఁడు దుర్యోధనునకు విరుద్ధముగ యుద్ధముచేయు మని యర్జునునకుఁ జేసిన యుపదేశము ధర్మరక్షణకొఱకుఁ గాని, శత్రుత్వమును జూపుటకొఱకుఁ గాదు. ధర్మరక్షణకొఱకు మన మన్యాయమును అధర్మమును శాసింపవలసి యుండును. అనేకసమయములయందనేకులను విరుద్ధముగ దండధారులము గావలసియుండును. కాని యట్టిసమయములయందు చిత్తవికారము గలుగకుండుటకు జాగ్రత్తగా నుండవలయును. ద్వేషమునకు హింసకు, క్రోధము మొదలగువానికిఁ జిత్తమునందు స్థాన మొసంగఁబడదు. ఇప్పు డధమభక్తుఁ డేవిధముగ శ్రేష్ఠభక్తుఁ డగు ననువిషయమును గూర్చి విచారింతము. భగవద్గీత

యందు భగవానుఁడు "దురాచారుఁడగువాఁడైనను నిరతము నన్నే భజించుట కారంభించినయెడల శీఘ్రముగ ధర్మాత్ముఁడగును. నిత్యశాంతి ప్రాప్తినొందును" అని చెప్పియున్నాఁడను విషయమును బూర్వమందే చెప్పియున్నాను. శ్రీమద్భాగవతమునందు భగవానుఁ డుద్ధవున కిట్లు నుడివియున్నాఁడు.

బాధ్యమానోఽపి మద్భక్తో విషయై రజితేన్ద్రియః।
ప్రాయః ప్రగల్భయా భక్త్యా విషయై ర్నాభిజాయతే॥

భాగవతము.

జితేంద్రియులు కానిభక్తులు విషయోపభోగములయం దాబద్ధులై యుండినను గూడ నాయందునుండు ప్రగల్భభక్తివలన విషయములచేత పరాజితులు గారు.

యథాగ్నిః సుసమృద్ధార్చిః
కరోత్యేధాంసి భస్మసాత్।
తథా మద్విషయా భక్తి
రుద్ధవైనాంసి కృత్స్నశః॥

"ఓయుద్ధవా, అగ్నియూర్ధ్వశిఖమై ప్రజ్వలిత మగునప్పుడు కాష్ఠములను భస్మముచేయువిధముననే మద్విషయకమగు భక్తి ప్రదీప్తమైనయెడల సమస్తపాపముల నొక్కుమ్మడిగ భస్మముచేయును."

భగవానునిమీఁద భక్తి వృద్ధియైనకొలఁదిని పవిత్రత వృద్ధి యగుచుండును. మనము భక్తిభాజనులగువారిని అనుకరించు చుండుటకు మన మెప్పుడును ప్రయత్నించుచుందుము. ఇదే విధముగ భగవానునిమీఁద భక్తి గలిగినవారిహృదయములం దాయనస్వరూపము క్రమక్రమముగఁ బ్రకాశించుచుండును. భగవానుఁడు "శుద్ధ మపాపవిద్ధం" ("పరిశుద్ధుఁడు, పాప రహితుఁడు.") ఈశ్వరుఁడు పవిత్రస్వరూప మనుజ్ఞానము గలిగినవాఁడు కళంకితుఁడగుట కిచ్చగించునా? మధురముగ నుండుపదార్థమును సంపాదింపవలయు నని ప్రతివాఁడును బ్రయత్నించుచుండును. కావున భక్తి వృద్ధియైనకొలఁదిని భగవానునిగుణములను అనుకరించుచుండుటకు నిచ్ఛపొడము చుండును. భక్తిపథమునం దగ్రేసరుఁ డైనకొలఁదిని భగ వానుని గుణగణముల ననుకరింపవలయు ననుకోరిక బలముగ నుండును. ఇందువలన పాపము నాశనమగును. విషయవాస నలు దూరమగును. ఆనందస్వరూపుని లేశమాత్రము ప్రేమిం చుట కారంభించినను, హృదయమునం దానందము పొంగి పొరలుచుండును. ఇందువలన, విషయాసక్తి మొదలగునవి యసహ్యముగఁ దోఁచి వానిదిక్కునకు చిత్తమేఁగుట కిచ్చగిం పదు. భక్తివృద్ధియైనకొలఁదిని పాపములు నశించుచుండును. భగవాను డర్జునున కీవిధముగఁ జెప్పియున్నాఁడు.

దైవీహ్యేషా గుణమయీ మమమాయాదురత్యయా।
మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తితే॥
౧౪ విజ్ఞానయోగము-భగవద్గీత.

నాయందు పుట్టి త్రిగుణాత్మకమైన నామాయ నెవరు నతిశయింపఁ జాలరు. నన్ను శరణుచొచ్చినవా రీమాయ నతిక్రమింపఁ గలరు. చైతన్యుఁ డీక్రమమును సనాతనున కిట్లు చెప్పియున్నాడు. "ధనమునవలన సుఖము గలుగును. సుఖమువలన దుఃఖము నశించును. కాఁబట్టి భక్తివలన శ్రీకృష్ణునియందు ప్రేమ పుట్టును. అందువలన శ్రీకృష్ణునియం దభిరుచి గలిగి భవబంధములు నశించును." (చైతన్యచరితామృతము.) హరిభక్తివలన హృదయమునందుఁ బుట్టు జాగరణ శక్తిచేత, అవిద్య సమూలముగ నాశనమగును.

కృతానుయాత్రా విద్యాభి ర్హరిభక్తి రనుత్తమా।
అవిద్యాం నిర్దహ త్యాశు దావజ్వాలేవ పన్నగమ్॥
పద్మపురాణము.

దావానలము సర్పములను భస్మీపటల మొనర్చు విధము ననే హరిభక్తివలన నాత్మశక్తులు మేల్కొనుటయే గాక, అవిద్యను భస్మము చేయును. అవిద్య దూరమైనకొలఁదిని భగవత్పదములయందు నిష్ఠ జనించును; నిష్ఠ వృద్ధియైన కొలఁదిని భగవద్విషయ శ్రవణము, కీర్తనము మననము మొదలగువానియందు రుచిపుట్టును. రుచి యధికమైనకొలఁ

జని ఆసక్తి జన్మించును. ఆసక్తి జన్మించినంతనే భావము గలుగును. భావము గలిగినయెడల ప్రేమోదయ మగును.

ఆదౌ శ్రద్ధా తతః సఙ్గ స్తతోఽథ భజనక్రియా ॥
తతోఽనర్థనివృత్తిః స్యా త్తతో నిష్ఠా రుచి స్తతః ।
అథాసక్తి స్తతో భావ స్తతః ప్రేమా భ్యుదఞ్చతి ॥
సాధకానా మయం ప్రేమ్ణః ప్రాదుర్భావే భవే త్క్రమః॥

భక్తిరసామృత సింధువు.

ప్రథమమున శ్రద్ధజన్మించును దానివలన సజ్జనసాంగత్యము లభించును. తదుపరి భజన గలుగును. ఇందువలన పాపములు నశించును. పాపములు నశించినయెడల నిష్ఠ కుదురును; అనంగా భగవానునియం దేకాగ్రచిత్త మేర్పడును. ఆయనయం దేకాగ్రచిత్త మేర్పడినయెడల, భగవానునియొక్క మాధుర్యము విశేషభావమున నుపలబ్ధ మగుటయే గాక, శ్రవణ కీర్తన మననములయందు రుచి జన్మించును. రుచి జన్మించిన యెడల ఆసక్తి గలుగును. ఆసక్తివలన భావోదయమగును. భావోదయమువలన ప్రేమ జనించును. భక్తిరసామృతసింధువునందు ప్రేమోదయక్రమ మిట్లు చెప్పఁబడియున్నది.

‘ప్రేమ్ణస్తు ప్రథమావస్థా భావ ఇత్యభిధీయతే ।’

ప్రేమయొక్క ప్రథమావస్థనే భావ మందురు.

‘శుద్ధసత్త్వవిశేషాత్మా ప్రేమసూర్యాంశుసామ్యభాక్
రుచిభిశ్చిత్తమాసృణ్య కృదసౌ భావ ఉచ్యతే॥’

ఎయ్యదిశుద్ధసత్త్వగుణములచే హృదయమునలంకరించునో, ఎయ్యది చిత్తమును నిర్మలముచేయునో, ఎయ్యది సూర్యుని కాంతివంటి ప్రేమయో అయ్యదియే "భావ"మని చెప్పఁబడుచున్నది. భావము జన్మించినవానియందుఁ గనఁబడులక్షణము లిట్లు చెప్పఁబడియున్నవి.

క్షాన్తి రవ్యర్థకాలత్వం విరక్తి ర్మానశూన్యతా ।
ఆశాబన్ధ స్సముత్కణ్ఠా నామగానే సదారుచిః
ఆసక్తి స్తద్గుణాఖ్యానే ప్రీతి స్తద్వసతిస్థలే।
ఇత్యాదయోనుభావాః స్యు ర్జాతభావాఙ్కురే జనే॥

"భావము" మొలకెత్తినవారియందు, క్షాంతియు, అవ్యర్థకాలత్వమును, విరక్తియు, మానశూన్యతయు, ఆశాబంధమును, సముత్కంఠయు, సదా నామగానమునందు రుచియు, భగవానుని గుణకథనమునం దాసక్తియు, ఆయన వసతిస్థలములయందు ప్రీతియు మొదలగు లక్షణములు గాన్పించుచుండును.

(౧) క్షాంతి='క్షోభహేతావపిప్రాప్తే క్షాన్తి రక్షుభితాత్మతా' క్షోభకు హేతువులగు, రోగములును, శోకము మొదలగునవి సంభవించినప్పుడు చిత్తసంక్షోభము లేకుండుటను క్షాంతి యందురు.

(౨) అవ్యర్థకాలత్వము = సర్వదా భగవన్నామమును స్మరించుచు, మననము చేయుచుండుటను "అవ్యర్థకాలత్వ"

మందురు. భగవానుని మఱచియున్న కాలమంతయు వ్యర్థము. కావున భోజనాదియావశ్యకకార్యములయందుఁ దగులొంగియున్నను సర్వదా భగవానునియందే చిత్తముండుట వలన వానికాలము వ్యర్థము గాదు.

(3) విరక్తి = "విరక్తిరింద్రియార్థానాం స్యాదరోచకతా స్వయమ్" ఇంద్రియభోగ్యవిషయసముదాయములమీఁద మనసు పోనీకుండుటను విరక్తి యందురు. భోగము గలిగినవాని చిత్తమునందు భోగాసక్తియుండదు. కాని యట్టివాఁడు భగవానునకు దాసుఁడనని తలఁచి యెంతవఱకు ఇంద్రియభోగముల ననుభవించుట కర్తవ్యమో యంతవఱకు ననుభవించు చుండును.

(4) మానశూన్యత = అనఁగా, అభిమానరహితచిత్తము గలిగియుండుట.

(5) ఆశాబంధము = "ఆశాబంధో భగవతః ప్రాప్తిసంభావనా దృఢా."

'నేను భగవానుని పొందఁగల' ననుదృఢవిశ్వాసము గలిగి యుండుటను ఆశాబంధ మందురు.

(6) సముత్కంఠ = "సముత్కంఠా నిజాభీష్టలాభాయ గురులుబ్ధతా"

అభీష్టసిద్ధికొఱ కత్యంత లోభము గలిగి యుండుటను సముత్కంఠ యందురు.

(౭) సదాగానమునందు రుచిగలిగి యుండుట="నామ గానే సదారుచిః" ఆయన గుణకీర్తనమునం దాసక్తి గలిగి యుండుట.

(౮) తద్వసతిస్థలములయందు ప్రీతి = ప్రథమమునందు భక్తులకు తీర్థములయందు ప్రీతి జనించును. తదుపరి భగవానుని సర్వవ్యాపకత్వము హృదయంగమ మైనకొలఁదిని సర్వస్థలము లాయనవాసస్థలములనుభావము గలుగును. అందువలన చివరకు విశ్వమయప్రీతియం దాత్మవిస్మృతుఁ డగును. భావాంకురములు పొడసూపుచుండు వాని హృదయము, పూర్వోల్లిఖిత మగు గుణగణములచేఁ బ్రకాశించుచుండును. భగవానుని నామస్మరణము కీర్తనము, మననము మొదలగు వానివలన

"సాత్త్వికాః స్వల్పమాత్రాః స్యురత్రాశ్రుపులకాదయః."

భక్తిరసామృత సింధువు.

అశ్రువులు పులకలు మొదలగు సాత్త్వికభావములు కనఁబడును.

తే స్తంభస్వేదరోమాఞ్చాః స్వరభేదోఽథ వేపథుః
వైవర్ణ్య మశ్రుప్రలయ ఇత్యష్టౌ సాత్త్వికాః స్మృతాః

భక్తిరసామృత సింధువు.

స్తంభము, స్వేదము, రోమాంచము, స్వరభేదము, కంపము, వైవర్ణ్యము, అశ్రువులు, ప్రళయము నని సాత్త్వికభావము లెనిమిది విధములు.

౧ స్తంభము:—

స్తంభో హర్ష భయాశ్చర్యవిషాదామర్ష సంభవః।
తత్ర వాగాదిరాహిత్యం నైశ్చల్యం శూన్యతాదయః.

హర్షము, భయము, ఆశ్చర్యము, విషాదము, క్రోధము వీనినుండి స్తంభభావము పుట్టును. స్తంభభావముగలిగినయెడల మాటలాడుటకు శక్తియుండదు. శరీరము నిశ్చలమగును. బాహ్యేంద్రియ వ్యాపారములు కట్టుపడును. హర్షము, భయము, విస్మయము మొదలగునవి నానాకారణములవలనఁ గలుగును. వీని కొకటిరెండుదృష్టాంతములఁ జూపుచున్నాను. భగవానుని మాధుర్యమును దలంచినకొలందిని హర్షము గలుగవచ్చును. భగవానుని దర్శనము లభింప దనుకారణమున భయము గలుగవచ్చును. భగవానునియందుండువిరహచింతనమువలన విషాదము గలుగవచ్చును. భగవానునిలీలాకౌశలములను జూచినకొలఁదిని విస్మయము గలుగవచ్చును. ఆయనను నిందించువారిమీఁద క్రోధముగలుగవచ్చును. లేక, అనేకప్రార్థనలను జేసినను గూడ నాయనదర్శనము లభింప లేదని భావించుటవలన, ఆయనమీఁద క్రోధము గలుగవచ్చును.

౨ స్వేదము:—

స్వేదో హర్షభయక్రోధాదిజః క్లేదకర స్తనోః

హర్షమువలనను, భయమువలనను, శరీరమునందుఁ గలుగు చెమటను స్వేద మందురు.

౩ రోమాంచము:—

రోమాఞ్చనం కిలాశ్చర్య హర్షోత్సాహభయాదితః।
రోమ్ణా మభ్యుద్గమ స్తత్ర గాత్రసంస్పర్శనాదయః॥

విస్మయము, హర్షము, ఉత్సాహము, భయము మొదలగువానివలన రోమాంచ మగును.

౪ స్వరభేదము:—

విషాద విస్మయామర్ష హర్షభీ త్యాదిసంభవమ్।
వైస్వర్యం స్వరభేదః స్యా దేషగద్గది కాదికృత్॥

విషాదము, విస్మయము, క్రోధము, ఆనందము, భయము వీనివలన, స్వరభేదము గలుగును. స్వరభేదమువలన వాక్యములు తడఁబడును.

౫ కంపము:—

విత్రాసామర్షహర్షాద్యై ర్వేపథు ర్గాత్రలౌల్యకృత్॥

భయము, క్రోధము, హర్షము మొదలగువానివలన కంపము గలుగును.

౬ వైవర్ణ్యము.—

విషాదరోషభీత్యాదే ర్వైవర్ణ్యం వర్ణవిక్రియా।
భావజ్ఞై రత్రమాలిన్యకార్శ్యాద్యాః పరికీర్తితాః॥

విషాదము, క్రోధము, భయము మొదలగువానివలన వర్ణవికారముగలుగును. దీనిపేరు వైవర్ణ్యమందురు. ఇందువలన మలినత్వమును, కృశత్వమునుగలుగునని భావజ్ఞులు చెప్పుదురు.

౭ అశ్రువులు:—

హర్షరోషవిషాదాద్యైరశ్రు నేత్రే జలోద్గమః ।
హర్షజేఽశ్రుణి శీతత్వ మౌష్ణ్యం రోషాదిసంభవే ।
సర్వత్ర నయనక్షోభరాగసంమార్జనాదయః ॥

హర్షము, క్రోధము, విషాదము మొదలగువానివలన నేత్రములయందు జలము ఉద్భవించును. వానినే యశ్రువు లందురు. హర్షజనితాశ్రువులు శీతలములును, రోషజనితాశ్రువులు ఉష్ణములుగనుండును. సర్వసమయములగు నశ్రువులవలన, నయనచాంచల్యమును, రక్తిమయును, సమ్మార్జనమును సంభవిల్లును.

౮ ప్రలయము:—

ప్రలయః సుఖదుఃఖాభ్యాం చేష్టాజ్ఞాననిరాకృతిః ।
అత్రానుభావాః కథితా మహీనిపతనాదయః ॥

సుఖదుఃఖములనుండి, ఇంద్రియచేష్టలును జ్ఞానమును లోపించుటను ప్రలయమందురు. దీనివలన భూమియందు పడుట మొదలగు సాత్త్వికభావములు హృదయమునం దంకురించు వారి కీభావములు సమగ్రభావమున వికాసమునొందవు. కాని యివి కొంచెముగ మాత్రము ప్రకాశించుచుండును. శ్రీరూప గోస్వామి సాత్త్వికభావ వికాసముయొక్క నాలుగు మెట్లను ఈవిధముగఁ జూపించియున్నాఁడు.

ధూమాయితా స్తే జ్వలితా దీప్తా ఉద్దీప్తసంజ్ఞితాః।
వృద్ధిం యథోత్తరం శాన్తసాత్త్వికాః స్యు శ్చతుర్విధాః॥

భక్తిరసామృత సింధువు.

ఈసాత్త్వికగుణములు, వృద్ధియైనకొలందిని ౧ ధూమాయితము, ౨ జ్వలితము, ౩ దీప్తము, ౪ ఉద్దీప్తము, అను నాలుగవస్థలను బొందును.

౧ ధూమాయితము.

అద్వితీయా అవిాభావా అథవా సద్వితీయకాః।
ఈషద్వ్యక్తా అపహ్నోతుం శక్యాధూమాయితామతాః॥

ఒకటి లేక రెండుభావము లత్యల్పముగఁ బ్రకాశమును జెందునప్పుడు వానిని రహస్యముగనుంచుకొందురు. ఆయవస్థను ధూమాయిత మందురు. దీనికి దృష్టాంతము.

ఆకర్ణయ న్నఘహరా మ్మురవైరికీర్తిం।
పక్ష్మాగ్రమిశ్రవిరలాశ్రు రభూత్ పురోధాః।
యస్తా టగోచ్ఛ్వసిత లోమకపోల మీషత్।
ప్రస్విన్న నాసిక మువాహ ముఖారవిన్దమ్॥

పాపవైరి యగు శ్రీహరియొక్క కీర్తిని వినినకొలఁదిని పురోహితునికను లెప్ప లశ్రుజలముతో నిండును. కపోలము లెట్టిపడును. నాసిక ఘర్మయుక్తము నగును.

౨. జ్వలితము.

తే ద్వౌ త్రయో వా యుగపద్ యాన్తఃస్వప్రకటాం దశామ్
శక్యాఃకృచ్ఛ్రేణనిహ్నోతుం జ్వలితా ఇతికీర్తితాః॥

రెండు లేక మూఁడుసాత్త్వికభావములొకసమయమునందు ప్రకాశించునప్పుడు వానిని అతికష్టముమీఁద దాఁపనగును. ఆయవస్థను జ్వలిత మందురు. దీనికి దృష్టాంతము.

> నిరుద్ధం బాష్పాంభః కథ మపి మయా గద్గదగిరో,
> హ్రీయా సద్యో గూఢాః సఖి విఘటితో వేపథు రపి॥
> గిరిద్రోణ్యాం వేణౌ ధ్వనతి నిపుణై రింగితనయే।
> తథాప్యూహాం చక్రే మమ మనసి రాగః పరిజనైః॥

ఓసఖీ దూరమందున్న గిరిగహ్వరములనుండి వేణునాదము వినఁబడుచున్నప్పుడు నేను బాష్పవారిని నిరోధింపఁగలిగితిని. లజ్జచే నిబద్ధమైనగద్గదస్వరమును రహస్యముగ నుంచుకొంటిని. కాని శరీరకంపము నివారించుకొనఁజాలనైతిని. అందువలన బుద్ధిమంతులగు పరిజనులెల్లరు నేను కృష్ణానురక్తనైతి నని సందేహమును బొందుచున్నారు.

౩ దీప్తము.

> ప్రౌఢాం త్రిచతురా వ్యక్తిం పఞ్చ వా యుగపద్గతాః।
> సంవరీతు మశక్యా స్తే దీప్తా ధీరై రుదాహృతాః॥

వృద్ధినొందిన మూఁడు నాలుగు లేక యైదుసాత్త్వికభావము లొకసమయమునందుఁ బ్రకాశించినయెడల వాని నెప్పుడు డాఁచుకొన శక్తి యుండదు. ఈయవస్థను పండితులు దీప్త మని చెప్పియున్నారు. దీనికి దృష్టాంతము.

నశక్తిముప వీణానే చిర మధత్త కంపాకులో
నగద్గద నిరుద్ధవాక్ ప్రభు రభూ దుపశ్లోకనే,
క్షణోఽజని న వీక్షణే విగలదశ్రుపూరః పురో
మధుద్విషి పరిస్ఫురత్యవశమూర్తి రాసీ న్మునిః॥

నారదుఁడు శ్రీకృష్ణుని దర్శించుటవలన శరీరము కంపమునొంది వీణను మీటుట కశక్తుఁడయ్యెను. స్వరము గద్గదమగుటచేత స్తవమును జేయఁజాలక పోయెను. చక్షువు లశ్రుపూర్ణము లగుటవలన దర్శనముఁ జేయఁజాలక వివశాత్ముఁడై యుండెను.

౪ ఉద్దీప్తము.

ఏకదా వ్యక్తిమాపన్నాః పఞ్చషట్ సర్వఏవవా ।
ఆరూఢాః పరమోత్కర్ష ముద్దీప్తా ఇతి కీర్తితాః॥

అయిదారు లేక అన్ని సాత్త్వికభావము లొకకాలమునందుఁ బ్రకాశించుచు పరమోత్కర్షము నొందు నవస్థను "ఉద్దీప్తము" అని చెప్పుదురు.

చైతన్యుఁడు జగన్నాథమునందు రథమునకు ముందుగా నృత్యముఁ జేయుచుండినప్పటి యాయన స్థితిని మనమునం దుంచుకొనవలయును. చైతన్యప్రభునియందు "సాత్త్వికభావములన్నియు నేకకాలమునం దుదయమయ్యెను. రోమాంచమగును. శరీరమందలిమాంసఖండము లిటిటికి కదలుచుండును.

నప్పుడు జ్వలిత, దీప్త, ఉద్దీప్త, అనునవస్థల నొందును. భావము నుండియే ప్రేమ యుదయించును.



# ఏడవ ప్రకరణము.



## ప్రేమ.

సమ్యఙ్మసృణితస్వాన్తో మమత్వాతిశయాఙ్కితః।
భావః స ఏవ సాన్ద్రాత్మా బుధైః ప్రేమా నిగద్యతే॥

భక్తిరసామృతసింధువు.

హృదయమును, సంపూర్ణముగ నిర్మలముగను మిక్కిలి మమతాయుక్తముగను, నెక్కువ ఘనీభూతముగను జేయు నట్టి భావమును, "ప్రేమ" యందురు.

అనన్యమమతా విష్ణౌ మమతా ప్రేమసఙ్గతా।
భక్తిరిత్యుచ్యతే భీష్మప్రహ్లాదోద్ధవనారదైః॥

నారద పంచరాత్రములు.

ఇతరవిషయములయందు మమత లేక, విష్ణువునందు మాత్రమే మమతఁగలిగించు ప్రేమనే భక్తియని, భీష్ముఁడు, ప్రహ్లాదుఁడు, ఉద్ధవుఁడు, నారదుఁడు మొదలగువారు చెప్పియున్నారు. నారదుఁడు "సా త్వస్మిన్ పరమా ప్రేమరూపా" యనియును, శాండిల్యుఁడు "సా పరానురక్తిరీశ్వరే" యనియును భక్తిసంజ్ఞలొసంగియున్నారు. భక్తవరులహృదయ మెంతనిర్మలముగ నుండును, వారిచరిత్రలయం దేయేలకొన

ములు గాన్పించుచుండును, వారు సర్వభూతములయందెట్టి భావము గలిగియుందు రనువిషయమునుగూర్చి ఋషభసందనుఁడగు హరి జనకునకుఁ జెప్పినవాక్యములను, అర్జునునకు శ్రీకృష్ణుఁ డుపదేశించినవాక్యములను బేర్కొనియున్నాను. ఇప్పుడు భగవానునితోడ భక్తులకుఁ గలసంబంధమునుగూర్చి భక్తిగ్రంథములలోఁ జెప్పఁబడినవానిని జెప్పెదను. భావము గాఢమై ప్రేమగా పరిణమించినప్పుడు భగవానుని స్మరణ మననకీర్తనములవలన, సాత్త్వికభావములు క్రమక్రమముగా, జ్వలిత దీప్తోద్దీప్తావస్థలను బొందు నని వెనుకనే చెప్పియున్నాను. ఈ భావమును లక్ష్యమునందుంచుకొని శాండిల్యమహర్షి భక్తిమీమాంసయం దిట్లు చెప్పియున్నాఁడు. "తత్పరిశుద్ధి శ్చ గమ్యా లోకవ ల్లిఙ్గేభ్యః॥" సాధారణముగ మనుష్యునకును మనుష్యునకును గలసంబంధము వారి ప్రవర్తనలవలన నెట్లు బయల్పడునో, అట్లే భక్తునకు నీశ్వరునియెడఁ గలప్రేమ మనము ఈశ్వరునిఁగూర్చి ముచ్చటించునప్పుడు అశ్రువులు రోమాంచము మొదలగు చిహ్నములచేత బహిర్గతమగును. భగవానునిమీఁద భక్తునకుఁ గలయనురాగమును పరీక్షించుటకు శాండిల్యుఁడు కొన్ని లక్షణములను బేర్కొనియున్నాఁడు.

"సమ్మాన బహుమాన ప్రీతి విరహేతరవిచికిత్సామహిమఖ్యాతి తదర్థప్రాణస్థాన తదీయతా సర్వతద్భావాప్రాతికూ

ల్యాదీని చ స్మరణాద్భక్తిబాహుల్యాత్" సమ్మానము-బహుమానము-ప్రీతి-విరహము-ఇతరవిచికిత్సా - మహిమఖ్యాతి-తదర్థప్రాణస్థానము-తదీయత-సర్వతద్భావము- అప్రాతికూల్యము-మొదలగువానిని స్మృతివలన గ్రహింపవచ్చును. శాండిల్యసూత్రములకు భాష్యమును రచించిన స్వప్నేశ్వరుఁడు ప్రతిలక్షణమునకును దృష్టాంతములను జూపించియున్నాఁడు.

### అర్జునుని సమ్మానము.

ప్రత్యుత్థానఞ్చ కృష్ణస్య సర్వావస్థో ధనఞ్జయః।
న లఙ్ఘయతి ధర్మాత్మా భక్త్యా ప్రేమ్ణా చ సర్వదా॥

భారతము.

ధర్మాత్ముఁడగు ధనంజయుఁడు, సర్వకాల సర్వావస్థలయందును, శ్రీకృష్ణునియాగమనమును భక్తిప్రేమలతోడ ప్రత్యుత్థానము చేయుచుండును. కాని, దీని నెప్పుడును నుల్లంఘించి యుండఁడు.

### ఇక్ష్వాకుని బహుమానము.

పక్షపాతేన తన్నామ్ని మృగే పద్మే చ తాదృశే।
బభార మేఘే తద్వర్ణే బహుమానమతిం నృపః॥

నృసింహపురాణము.

ఇక్ష్వాకుఁడు భగవత్పక్షపాతి యై, ఆయన నామమునందును, ఆయన సదృశములగు మృగములయందును, పద్మముల

యందును, తద్వర్ణ విశిష్టములగు మేఘములయందును మిక్కిలి సమ్మానమును జూపుచుండువాఁడు.

## విదురుని ప్రీతి.

యా ప్రీతిః పుణ్డరీకాక్ష తవాగమనకారణాత్ ।
సా కి మాఖ్యాయతే తుభ్యమన్తరాత్మాసి దేహినామ్॥

భారతము.

"ఓ పుండరీకాక్షు, నీ యాగమనమువలన నాకుఁ గలిగిన ప్రీతిని నీకెట్లు విన్నవింపఁగలను? నీవు దేహధారుల కంతరాత్ముఁడవు. సమస్తము నెఱుంగుదువు" అని చెప్పుచున్న విదురుని హృదయమునం దానందామృతము పొంగి పొరలసాగెను.

## గోపికలవిరహము.

గురూణా మగ్రతో వక్తుం కిం బ్రవీమి న నః క్షమం
గురవః కిం కరిష్యన్తి దగ్ధానాం విరహాగ్నినా॥

విష్ణుపురాణము.

గురుజనులసమ్ముఖమందు మాటలాడఁగలశక్తి మాకులేదు. కాని యేమిమాట్లాడుదుము? విరహాగ్నిచే దగ్ధుల మగుచున్న మమ్ము గురువు లేమి చేయఁగలరు?

## ఉపమన్యుని యితరవిచికిత్స.

భగవానునిఁ గాక యితరు లెవ్వరిని గణనసేయకుండుటను ఇతర విచికిత్స యందురు.

అపి కీటః పతఙ్గో వా భవేయమపి కర్మాజ్ఞయా।
న తు శక్ర త్వయాదత్తం త్రైలోక్య మపి కామయే॥

మహాభాగవతము.

శంకరుని యాజ్ఞవలన నేను కీటకము గాని పతంగ ముగాని కావచ్చును. అయినప్పటికిని, ఓయింద్ర! త్వత్ప్రదత్తమగు త్రిభువనైశ్వర్యమును గోరను.

## యమునిమహిమఖ్యాతి.

భగవానునిమహిమను వర్ణించుటను మహిమఖ్యాతి యందురు.

నరకే పాచ్యమానస్తు యమేన పరిభాషితః।
కిం త్వయా నార్చితో దేవః కేశవః క్లేశనాశనః॥

నృసింహపురాణము.

యముడు నరకమందుండువానినిఁజూచి "నీవు క్లేశనాశనుఁడగు కేశవుని నర్చించి యుండలేదా?" అని యడిగెను.

స్వపురుష మభివీక్ష్య పాశహస్తం
వదతి యమః కిల తస్య కర్ణమూలే।
పరిహర మధుసూదనప్రపన్నాన్
ప్రభు రహ మన్యనృణాం న వైష్ణవానామ్॥

విష్ణుపురాణము.

యముడు పాశహస్తుండగుతనదూతను జూచి "నీవు మధు

సూదనుని నాశ్రయించి యుండు మానవులను వదలుము. నే నితరప్రజలకు ప్రభువను గాని వైష్ణవులకుఁ బ్రభువను గాను.

## హనుమానుని తదర్థప్రాణస్థానము.

(ఆయనకొఱకు జీవధారణము.)

యావ త్తవ కథా లోకే విచరిష్యతి పావనీ ।
తావత్ స్థాస్యామి మేదిన్యాం తవాజ్ఞా మనుపాలయన్॥

రామాయణము.

నీయొక్క పావన చరిత్రము లోకమున ప్రచారము గలిగియుండునంతవఱకు, నీయాజ్ఞను పాలించుచు పృథివియం దుందును.

## ఉపరిచరవసువుయొక్క తదీయత.

(నాయొక్క సమస్తమును భగవానునిదే యనుజ్ఞానము)

ఆత్మా రాజ్యం ధన ఞ్చైవ కళత్రం వాహనం తథా ।
ఏత ద్భాగవతం సర్వ మితి తత్ ప్రేక్షతే సదా ॥

మహాభారతము.

ఉపరిచరవసువు, నిజరాజ్యమును, ధనమును, భార్యను, వాహనములు మొదలగు సమస్తమును, భగవానుని వని సర్వదా తలంచుచుండెను.

## ప్రహ్లాదుని సర్వతద్భావము.

(సర్వత్ర భగవానునిప్రతిభను చూచుచుండుట.)

ఏవం సర్వేషు భూతేషు భక్తిరవ్యభిచారిణీ ।
కర్తవ్యా పణ్డితై ర్జ్ఞాత్వా సర్వభూతమయం హరిమ్॥

హరి సర్వభూతమయుఁడని తెలిసికొని పండితులు సర్వభూతములయం దచలభక్తి గలిగియుండుదురు.

## భీష్మునియప్రాతికూల్యము.

(భగవానుఁ డాయుధమును గూడ పట్టననియెను. కావున దాని సాధనముకొఱకు (గదాంగపకలయు సమాఖ్యానము) శ్రీకృష్ణుఁడు భీష్ముని సంహరింపుటకు ప్రయత్నించినప్పుడు భీష్ముఁ డిట్లనియెను.

ఏహ్యేహి దేవేశ జగన్నివాస ।
నమోఽస్తు తే శార్ఙ్గగదాసిపాణే ।
ప్రసహ్య మాం పాతయ లోకనాథ ।
రథా దుదగ్రాద్భుతశౌర్యసఙ్ఖ్యే॥ భారతము.

“ఓ దేవ! రమ్ము, రమ్ము, ఓ జగన్నివాసా! ఓ శార్ఙ్గగదాధారీ! నీకు నమస్కారము. ఓ లోకనాథా! ఈ ఘోర యుద్ధమునందు నీవు బలవంతముగా నన్ను క్రిందఁ బడఁ ద్రోయుము.”

బహుమానమునుగూర్చి రామప్రసాదునియొక్క గాన మొకటి కలదు. “జగన్మోహినీస్వరూపిణి యగుమాత కృష్ణకేశిని, అందువలన నేను కృష్ణవర్ణమును ప్రేమించెదను.”

గుహుఁడిట్లు నుడివియున్నాఁడు. "నవనీలమేఘములను బొడగాంచినపుడెల్లను, నా నేత్రములనుండి ఆనందబాష్పములు రాలుచుండెను." (నీలమేఘశ్యామవర్ణుఁడగు రామచంద్రుఁడు మనస్సునకుఁ బొడగట్టుటవలన.)

రామప్రసాదసేనుఁ డిట్లు పాడియున్నాఁడు, "నాహృదయాభ్యంతరమందు ఆనందస్వరూపిణి యగుమాత సర్వదా తాండవమాడుచున్నది. నే నెట్టిస్థితియం దున్నను ఆపవిత్ర నామమును మఱచిపోను. నేను కన్నులు మూయుటతోడ నే కపాలమాలినిని హృదయమందు సందర్శించెదను. నావిషయజ్ఞానమంతయు నంతరించును. నన్నందఱు పిచ్చివాఁడందురు. ఎవరియిష్టము వచ్చినట్లు వారిని నుడువనిమ్ము. తుద కాదేవి నే నేను చేరుదునుగాక."

దీనిని ప్రీతి యందురు. ఒకానొకదినమున విదురునిభార్య స్నానము చేయుచుండఁగా, శ్రీకృష్ణుఁడు, విదుర! విదుర! యని పిలుచుచు గృహద్వారమును సమీపించెను. విదురుని భార్య శ్రీకృష్ణుని మృదుమధురస్వరమును విని ప్రేమవలన వివశయై వస్త్రమును గట్టుకొనుటనుమఱచి శ్రీకృష్ణునియొద్దకు పరుగిడుచు వచ్చెను. వెంటనే శ్రీకృష్ణుఁడు తనయుత్తరీయము నామెపైఁ బడవైవఁగా నామె యావస్త్రమును జుట్టుకొని, మిక్కిలి వ్యాకులభావమున శ్రీకృష్ణుని కరములను బట్టుకొని గృహములోనికి కొనిపోయెను. కాని యేవిధముగ సమ్మానింపవలయునో యెఱుంగక ఆనందపరవశ యై మిక్కిలి దరి

ద్రావస్థయందున్న తాను కృష్ణునకు తినుట కేమి పెట్టుదునా యని విచారించి, యస్తిమితచిత్తయై చిట్టచివరకుసువాసనతోఁ గూడిన మంచితీర్థమును అరఁటిపండ్లను శ్రీకృష్ణునియొద్దకుఁ దెచ్చి యానందపరవశురాలై, అరఁటిపండొలిచి శ్రీకృష్ణునికి పైతొలుకూడ పెట్టెను. శ్రీకృష్ణుఁడు, భక్తులు పెట్టు విషము నైనను ప్రీతితో భుజించును కావున ప్రసన్న వదనముతోడ నారఁటిని భుజించెను. విదురుఁడు రాజసభనుండివచ్చి యీ కార్యమునుఁజూచి యాశ్చర్యమొంది తనభాగ్యను దూలనాడు టకుఁ బ్రారంభించెను. ఇందువలన నామె తాను చేసినపనిని దెలిసికొని మిక్కిలి లజ్జకు రాలాయెను. ప్రీతికి నింతకంటె నుత్కృష్టమగు దృష్టాంత మింకొకటి కానరాదు.

విరహమునకు పరిపూర్ణదృష్టాంతము శ్రీచైతన్యుఁడు. ఆయన విరహసంబంధమునందు వైష్ణవులు రచించిన కవిత. నొకదానిని ఇం దుదాహరించుచున్నాను.

విరహప్రారంభము:—

“గౌరాంగుఁడు తలవంచుకొనికన్నీళ్లుకార్చుచు, భూమి మీఁద ఏలవ్రాయుచున్నాఁడు. సువర్ణచ్ఛాయగలవాని దేహము పాలిపోయినది. రాత్రులంతయు మేల్కొనును. అణుమాత్రమైనను నిద్రలేదు. ఆయనను స్పర్శించినవారిని ప్రేమపూరితలోచనములతోడఁజూచుచుండును. చేతులయందు తల పెట్టుకొని, దీర్ఘనిశ్వాసములవిడుచును. గోవిందదాసునిదప్ప మిగత స్త్రీపురుషులనందఱను రక్షించినవానిలక్షణము లివియే.

విరహభావము:—

గౌరచంద్రుఁడు బొమ్ము కొట్టుకొనుచు, హా, నాథా, హా, నాథాయని యేడ్చుచుండెను. నిట్టూర్పు నిగిడ్చి బాష్పపూరితలోచనములతోడ గదాధరునివంక చూచును. శరీరమంతయు చెమటలు గ్రమ్మ తదేకనిష్ఠతోఁ జూచుచుండును. విరహాగ్నిచే నాయన మనశ్శరీరములు దగ్ధములగుచుండెను. కాని దేహము భస్మమగుటలేదు. ఎక్కడకుఁ బోవునది ఏమి యోజించునది యెవరును చెప్పఁజాలరు. గౌరాంగుఁ డిట్లుండుటకు కారణము చెప్పు మెట్లని హరిదాసు నడుగుచున్నాఁడు. రాధికాప్రేమయం దీతఁ డిట్లుండె నని జ్ఞానదాసు చెప్పెను.

విరహోన్మాదము:—

గౌరాంగునకు రాత్రింబవళ్లు తెలియుట లేదు. కారణము లేక నవ్వును. భావమున వివశుఁడై యుండును. అకస్మాత్తుగా ఉచ్చైస్స్వరమునఁ బాడుటకు మొదలిడి నాప్రాణనాథుఁ డెచ్చట నని కేకలు వేయును. గడగడవణఁకుచు, చేతులు పైకెత్తి యెగిరి దుముకుచు, గిరగిర తిరిగి నృత్యముచేయుచు ప్రలాపవాక్యములు పలుకును. నిమీలితలోచనములతోడ భగవానుఁడా! భగవానుఁడా! అనికేకలువైచుచు, తిరిగివెక్కి వెక్కి యేడ్చును. రాధికాప్రేమవలన గౌరాంగుఁ డిట్లాయె నని "నరహరి" నుడివెను. కలియుగములోని మానవకోటిని రక్షించుట కాయన యిట్టిభావములతో నవతరించెను. నన్నేల ముక్తినుండి వంచించెను?

విరహముయొక్క దశవిధదశ:—

సుందరుఁడగు గౌరాంగుఁడు బావిదరిలోపడి పొరలును. మూర్ఛవచ్చుటవలన శ్వాస కొంతవరకు ఆగిపోవును. ఆయన శిష్యబృంద మున్నవైపులను జేరి వీక్షించును. స్త్రీపురుషు లందరు ఆయనవంకఁ జూచి యేడ్తురు. పశుపక్షు లన్నియు నేడ్చును. కాని యోదార్చఁబడఁడు.

విరహమును గూర్చి కబీరు వ్రాసియున్న పద్యముయొక్క భావము నిం దుదాహరించుచున్నాను. "విరహము లేనితనువు శూన్యము. విరహమే రాజు. విరహముననుభవింపనివానిహృదయముశ్మశానతుల్యము." "నవ్వుమానవ్వుము, స్వామినిబొందఁ జాలవు. ఏడ్చువాఁడే యోగమును బొందును. నవ్వుచు నవ్వుచు స్వామిని బొందఁగలిగినటు లైనచో స్వామిని విడుచువాఁ డెవ్వఁడు?"

తులసీదాసుని యుత్తర విచికిత్స. "మేఘములు మిక్కుటముగ వర్షించుచుండును. గర్జనములు సేయుచుండును. పిడుగులు పడుచుండును. కాని చాతకము మేఘములను వదలి యింకొకరిని జలమునకు వేఁడదు గదా?" (హిందీపద్యము యొక్క భావము.) భగవానుఁ డెన్ని కష్టములు పెట్టినను గూడ భక్తుఁ డాయనను గాక యితరుల నెవ్వరినిం జూడ నైనను జూడఁడు.

రామప్రసాదుని యితర విచికిత్స. ఈయన "ఇతర విచికిత్స" వలన నానందభరితుండై జగత్తునం దందఱను తృణ సమముగం దలంచెను.

"మహేశ్వరి నాతల్లియైనప్పుడు నే నీలోకమునం దితరులను జూచి భయపడుదునా? ఆనందమయి యగు నాతల్లి యొక్క రాజ్యమునం దానందముగ నివసించుచున్నాను." భగవానునిం గాక యితరులను గణన సేయకుండుటయు, చూడకుండుటయు, ఆనందముగ సంచరించుటయును, ఇతర విచికిత్సయొక్క లక్షణములు.

మహిమఖ్యాతిసంబంధమునం దింకను దృష్టాంతములను జూపింప నక్కఱలేదని తలంచుచున్నాను.

తదీయత.—దీని నొకచక్కనికీర్తనమూలకముగాం జూపించు చున్నాను.

"మన మందఱ మంగడిలోనుండు బొమ్మలవలె నున్నాము. ఆయన సంతోషముకొఱకు మనము నాట్యము చేయుచున్నాము. ఆయన మనలను బ్రతికించినప్పుడు బ్రతుకుచున్నాము. ఆయన యాజ్ఞననుసరించిపాడుచున్నాము. నృత్యము చేయుచున్నాము. మంచిచెడుగు లాయనకుం దెలియును. ఆయన యేది మంచి దనునో యదియే మంచిది. మన మేమనుటకు వీలు లేదు. మనసంతోషములన్నియు నా

యన శక్తిమీఁద నాధారపడి యున్నవి. మనలో కొంద
ఱము గెలుచుచున్నాము. కొందఱ మోడిపోవుచున్నాము.
ఒకటే సూత్రమునందు మనమందఱము బంధింపఁబడి ఆయన
యాజ్ఞ ననుసరించి ప్రవర్తించుచున్నాము. ఆయనయాజ్ఞ నను
సరించి పండుకొనుచున్నాము, మేల్కొందుచున్నాము, లేచు
చున్నాము, పరుగెత్తుచున్నాము. మన మాయన చేతియం
దుండు పాచికలము." బంగాళీకీర్తన తాత్పర్యము.

పరమభక్తుని ముఖమునం దీవిధమగు గానము శోభించుట
సహజమే గదా? రామప్రసాదునియొక్క తదర్థప్రాణస్థా
నము, సర్వతద్భావము నీగానమునందు చక్కఁగఁ బ్రకాశించు
చున్నది. "ఆమెను మనము సాష్టాంగదండప్రణామము
లాచరింపవలయును. నిద్రయందుఁగూడ నామెను ధ్యానించు
చుండుము. ఆమెచుట్టు తిరుగుచున్నట్లెంచుచు నగరము
చుట్టు తిరుగుచుండుము. నీచెవులను సోఁకినవన్నియు ఆమె
మంత్రములే యని భావింపవలయును. అనఁగా వర్ణమాలయం
దున్నవర్ణము లన్నియు ఆమెనామముయొక్క సాంకేతిక
ములు. జగత్తంతటను తల్లి నిండియున్నదని రామప్రసాదుఁడు
సంతోషముతో చెప్పువాఁడు. భుజించుట యనఁగా మాత
కాహుతి యిచ్చుట యని తలంపుము"

తదర్థప్రాణ మీగానమునందు విశేషరూపమున ప్రకా
శించుచున్నది. "ఆమెయందు ప్రేమతోఁ గరఁగనిహృద

యముగల యీ దేహమువలన ప్రయోజనమేమి? కాళీనామము నుచ్చరింపని నాలుక నాలుక గాదు. ఆమెరూపమును చూడనికన్నులు కన్నులు గావు. కాళీదేవి పాదములయందు సమర్పింపనిహృదయము హృదయము గాదు. ఆమె నామధేయమును వినునప్పుడు కన్నులవెంట నీరు రానియెడల, చెవులు చెవులు గావు. కాళీదేవి పాదపద్మములను మంచి గంధముతోడను, జపా పుష్పములతోడను బిల్వపత్త్రిముల తోడను పూజింపనిచేతులు చేతులు కావు. కాళీగృహమున కేగనిపాదములు పాదములు గావు."

అప్రాతికూల్యము. "నీ వేది యొనర్చినను మంచిదే." అనుభావము గలిగి యుండుటను ఏసుక్రీస్తు "నీయిచ్ఛపూర్ణముగ నెఱవేఱుంగాక" అని చెప్పియున్నాఁడు. భక్తుఁడగు 'జాబ్' తనపుత్త్రులను పుత్త్రికలను మిగత సర్వస్వమును గోల్పోయి యిట్లనియెను. "నీవునన్ను హత్యచేసినను గూడ నిన్నే నేను విశ్వసింతును." అప్రాతికూల్యము యొక్క మూలమంత్రమిది. "నీవు నన్నే స్థితియందుంచినను గూడ నదియే నాకు పరమశుభము. కావున నిన్నెప్పుడు మఱువకుందును గాక."

భక్తియొక్క యింకొక భావమును జూపుచున్నాను.

తదర్పితాఖిలాచారః సణ్ కామక్రోధాభిమానాదికమ్ ।
తస్మిన్నేవ కరణీయం తస్మిన్నేవ కరణీయమ్॥

వారదభక్తి సూత్రములు.

బాహ్యాంతర సమస్తకార్యములను, భగవానునియం దర్పించి, కామము, క్రోధము, అభిమానము మొదలగునవి వానియందే సంతృప్తిని బొందనిమ్ము.

ఆత్మక్రీడ, ఆత్మరతి, యని భక్తి రెండువిధములు. భక్తులు భగవానుని నాలింగనముచేసికొని, చుంబనముచేసికొనుచు, ఆయనను వక్షస్థలమునం దుంచుకొని రాత్రింబగళ్ళు కాలము గడపుదురు, ఆయన గాన్పింపనియెడల నున్మత్తులగుచు, ఆయన దొరకనియెడల "కుహు కుహు జల్పతోః" అని ఇనువురును నేదిరా మాటలాడుకొనుచు కాలమును గడపుచుందురు. శ్రీచైతన్యుని జీవనమునుండి ఈభావములను సాక్ష్యమును గైకొనవచ్చును. "హాస్యము" కూడ నీరసము నందు పూర్ణుఁడు.

ప్రేమయుండు స్థలమునందే క్రోధాభిమానము లుండును. శ్రీచైతన్యుఁడు క్రోధాభిమానముల ననేకపర్యాయములు వెల్లడించి యున్నాఁడు. రామప్రసాదుఁడు వివిధముగ క్రోధాభిమానములతోడ గానము చేసియున్నాఁడు. "నీవు నాకు కలుగఁజేసిన కష్టములవలనను, కలుగఁజేయుచున్న కష్టముల వలనను నిన్ను తల్లీ యని యిప్పటికిని విడువను. తల్లితల్లీ యని నిన్ను పలుమారు పిలిచితిని. నీవు చెవుడు గాని గ్రుడ్డిదానవు గాని వచ్చినదా? కుమారుఁ డిట్టిశోకమం దుండ తల్లి బ్రతికి యున్న ఫల మేమి? నేను గృహస్థుఁడను. నీవు నన్నిప్పుడు

సన్న్యాసిని జేసితివి. ఇంతకంటె ననర్థ మేమి చేయఁగలవు? ఇంతకంటె నాకెట్టికష్టమును గలిగింపఁగలవనఁగా ఇంటింట బిచ్చ మెత్తింపఁగలవు? తల్లి మరణించుటవలన పిల్లవాఁడు బ్రతుకకుండునా? నీకుమారునియందు శత్రుభావమును చూపుట నీ సూత్పుత్వమునకు లోపము గదా? పునర్జన్మ నిచ్చుట కంటె మిక్కిలి కీడేమిచేయఁగలవు." ఈయభిమానము జగత్తునం దతులము. భక్తుఁడు మాత్రమే యిట్టి యభిమానము గలిగియుండుననుట యతిశయోక్తి గాదు. భక్తునిఁగూర్చి చైతన్యుఁడు శ్రీరూపగోస్వామి కీవిధముగ నుడివియున్నాఁడు.

భక్తనిభేదము ననుసరించి భక్తిరసము, శాంతము, దాస్యము, సఖ్యము, వాత్సల్యము, మాధుర్యము, అని యైదువిధములు.

౧ శాంతము.

శాంతుఁడు గానంతవఱకును భక్తి ప్రారంభము గాదు. శాంతిరసము భక్తికి ప్రధానసోపానము. ఈశ్వరునియందు నిష్ఠయు, సంసారవాసనలను త్యజించుటయు, నను నీరెండుగుణములు శాంతిరసమునం దుండును. ఈరెండుగుణముల ననుసరించియె భక్తియుండును. ఆకాశమందలిశబ్దసముదాయము సమస్తభూతములయందుండువిధముననే శాంతిరసమునందలి యీగుణద్వయమునందే దాస్య సఖ్య వాత్సల్య మధుర రసము లుండును. ఈశ్వరునియందు మమత శాంతిరసమునం

యుండదు. కాని యీశ్వరుని స్వరూపజ్ఞానమాత్ర ముండును, అనఁగా ఆయన పరబ్రహ్మ పరమాత్మ యను జ్ఞానముండును.

౨ దాస్యము.

దాస్యభక్తుని చిత్తమునందు మమత జనించును. భగవానుఁడు ప్రభువనియు, తాను దాసుఁడనియు స్థిరవిశ్వాసమున భగవానునకు సతతము సేవఁ జేయును, ఆయనయం దంతములేని గౌరవమును జూపించుచుండును. అతఁడు భగవానుని దాసుఁడ నని చెప్పుకొనుట కానందమును బొందుచుండును. ఎట్లు వేగిన సేవకుఁడు ప్రభుసేవయం దాతురుఁడై యుండువిధముననే, దాస్యభక్తుఁడు భగవత్సేవయం దాతురుఁడై యుండును. దాస్యభక్తునకు కృష్ణసేవ గాక మఱేదియు రుచింపదు. ఇతఁడు భగవానుని యేవిధమగు కోరికను గోరఁడు. ప్రహ్లాదుని సేవకు సంతుష్టుఁడై భగవానుఁ డిట్లనియెను.

ప్రహ్లాద భద్రభద్రం తే ప్రీతోఽహం తే సురోత్తమ।
వరం వృణీష్వాభిమతం కామపూరోఽస్మ్యహం నృణామ్॥

“ఓ ప్రహ్లాదా నీకు మంగళమగుఁగాక. నేను నీవిషయమునందు ప్రీతుఁడ నైతిని. నేను మానవులయభిలాషలను పూర్ణము సేయుచుందును. కావున నీ కభీష్టమగువరమును గోరుము.” భగవానుని వాక్యములకు ప్రహ్లాదుఁ డీవిధముగఁ బ్రత్యుత్తరం బొసంగెను.

మామాం ప్రలోభ యోత్పత్త్యా
సక్తం కామేషు తై ర్వరైః
తత్సఙ్గభీతో నిర్విణ్ణో ముముక్షు స్త్వా ముపాశ్రితః॥
భృత్యలక్షణ జిజ్ఞాసు ర్భక్తం కామే ష్వచోదయః।
భగవన్ సంసారబీజేషు హృదయగ్రన్థిషు ప్రభో।
నాన్యథా తేఽఖిలగురో ఘటేత కరుణాత్మనః।
యస్త్వాశిష ఆశాస్తే న స భృత్యః స వై వణిక్।
ఆశాసానో న వై భృత్యః స్వామి న్యాశిష ఆత్మనః।
న స్వామీ భృత్యతః స్వామ్య
మిచ్ఛన్ యో రాతి చాశిషః॥
అహం త్వకామ స్త్వద్భక్త।
స్త్వం చ స్వా మ్యనపాశ్రయః॥
నాన్యథే హావయో రర్థో రాజసేవకయో రివ।
యది దాస్యసి మే కామా న్వరాం స్త్వం వరదర్షభ।
కామానాం హృ ద్యసంరోహం భవత స్తు వృణే వరమ్।
ఇన్ద్రియాణి మనః ప్రాణ ఆత్మా ధర్మో ధృతి ర్మతిః।
హ్రీః శ్రీ స్తేజః స్మృతిః సత్యం యస్య నశ్యన్తి జన్మనా
విముఞ్చతి యదా కామా న్మానవో మనసి స్థితాన్।
తర్హ్యేవ పుణ్డరీకాక్ష భగవత్త్వాయ కల్పతే॥

భాగవతము.

“నేను స్వభావసిద్ధముగ కామానాసక్తుఁడను. అట్టినాకు వరము నిచ్చెద ననునాసను జూపింపవలదు. నేను కామశక్తికి భీతుఁడనై దానినుండి విముక్తుఁడ నగుటకు నీయాశ్రయమును బొందియున్నాను. ఓప్రభూ, భృత్యున కుండవలసిన లక్షణములు నాయందుఁ గలవో లేవోయని పరీక్షించుటకు సంసారమునకు బీజస్వరూపమును హృదయబంధనరూపము నగు కోరికయందు ప్రవృత్తునిఁగాఁ జేయుచున్నావని తలంచుచున్నాను. కానియెడల ఓవిశ్వగురూ, కరుణామయుఁడవగు నీ విట్టిగాశను గల్పింతు వేల? ఓభగవానుఁడా, నిన్ను వరమును గోరువాఁడు నీభృత్యుఁ డెప్పుడును గాఁడు. వాఁడు నిశ్చయముగ వర్తకుఁడు. కోరికగలిగి స్వామిసేవఁ జేయుభృత్యుఁడు భృత్యుఁడు గాఁడు. మఱియును స్వామిత్వమును వాంఛించి భృత్యునకు గోరికలను గలిగించుస్వామి స్వామి గాఁడు. కావున నేను నిష్కామభక్తుఁడను. నీ వుద్దేశ రహితుఁడ వగుస్వామివి. కావున రాజునకును సేవకునకు నుండుసంబంధమువలె మనయిరువురకును గోరికలతోఁ బ్రయోజనము లేదు. ఓవరదాతా, వరము నియ్యఁదలఁచిన యెడల నేవిధముగఁ గోరికయు నాహృదయమునం దంకురింపకుండునట్లు వరమును బ్రసాదింపుము. కామము గలిగిన యెడల మనస్సును, ప్రాణమును, ఆత్మయును, ధర్మమును, ధైర్యమును, బుద్ధియు, హ్రీయు, శ్రీయు, తేజమును, స్మృతియు,

సత్యము మొదలగునవన్నియు నష్టమగును. ఓపుండరీకాక్షా, హృదయమునందలి కోరికలను పరిత్యజించుమానవుఁడు నీయైశ్వర్యలాభము నొందుటకు యోగ్యుఁడగును." బంగాళారాజధానియం దొకజిల్లాకలెక్టరాఫీసునం దొకఁడు పేష్కారు పనిని జేయుచుండెను. ఆయన భక్తిభావము గలవాఁడగుటవలన పూజపూర్తియగునప్పటికి రెండుజాములు దాఁటుచుండెను. కాలమునకు కచ్చేరికి రాకుండుటవలన కలెక్టరీయనను ఉద్యోగమునుండి తొలఁగించెను. అంత నీయన స్వగ్రామమునకేఁగక కాళీఘట్టమునుజేరి, చిన్నికుటీరమును నిర్మించుకొని భిక్షమెత్తుకొని జీవించుచు కాళీసేవఁ జేయుచుండెను. తనపేష్కారుని దురవస్థను విని కలెక్టరు కాళీఘట్టమునకు వచ్చి యీయనను జూచి జాలినొంది "నిన్ను తిరిగి నీయుద్యోగమునందు నియమించితిని. నీవు పదునొకండుగంటలకే కచ్చేరికి రానక్కఱ లేదు. నీపూజ యయినతర్వాతనే రావచ్చును." అని చెప్పెను. పేష్కారు 'అయ్యా! నేను మీకు బహుకాలముగ ఋణపడియున్నాను. కాని నన్ను క్షమింపవలయును. నే నిప్పుడొక్కప్రభువునకుమాత్రమే భృత్యుఁడనైయున్నాను. నేనుభిక్షమెత్తి యుదరపోషణము చేసికొనుచున్నప్పటికిని, ఆప్రభువును వదలి యింకొకరిసేవఁ జేయుటకిచ్ఛగింపను. ఈయవస్థయందు నేను బొందుచున్న యానందమును మీరు నాకు నెలకు వేయిరూప్యము లొసంగినను గూడ

పొందఁజాలను. కావున నన్నాశ్రయింపుఁడు. శేషించియుండు నాయవధియును కాశీగంగల సేవలయందు వినియోగింపుము" అని చెప్పెను. ఈమాటనతిరిగి యయోధ్యాపురమునఁ బ్రవేశింపలేదు. దాస్యభక్తుఁ డనఁగా నిట్టివాఁడు.

౩ సఖ్యము.

సఖ్యోపాసనమునందు గాఢసంప్రేమము లుండవలెను. ఆత్మసమజ్ఞానమును, భగవానునియెడ పరిపూర్ణ విశ్వాసమును, భగవానునితోఁడ బొత్తుగాఁటయు, ప్రేమవివాదమును, అభిమానమును, ప్రేమాశ్రుకములు మొద లగునవి యుండును. భగవానునికంటె ప్రియమగువస్తు వింకొకటి లేదను నమ్మకము గలిగియుండుటయే సఖ్యోపాసనముయొక్క ప్రధానలక్షణము. గుహుఁ డిట్లు నుడివియున్నాఁడు.

"నహి రామాత్ ప్రియతరో మమాస్తి భువి కశ్చన"

రామాయణము.

పృథివియందు శ్రీరామునికంటె ప్రియతముఁ డింకొకఁడు నాకు లేఁడు. సఖ్యరసాస్వాదు లగు భక్తులప్రాణములందలి భావమును, శ్రీదాముఁడు, తనసఖుఁ డగు శ్రీకృష్ణునియొద్ద నీవిధముగ వెల్లడించెను.

త్వంనః ప్రోజ్ఝ్య కఠోరయామునతటే కస్మాదకస్మాద్గతో,
దిష్ట్యా దృష్టిమితో౽సి హన్త నిబిడాశ్లేషైః సఖీన్ప్రీణయ,

బ్రూమః సత్య మదర్శనే తవ మనాక్ కా ధేనవః కే వయమ్ ।
కిం గోష్ఠం కిమభీష్ట మిత్యచరితః సర్వం విపర్యస్యతి॥

"ఓ కఠోరుఁడా! నీవేల ఆకస్మికముగా మమ్ము యమునా నదీ తటమునందు విడిచి వెళ్లితివి? కాని సౌభాగ్య విషయ మేమనఁగా తిరిగి నిన్నుఁ జూడఁగలిగితిమి. ఇప్పుడు నిబిడాలింగనమువలన నీసఖులకుఁ సంతుష్టిని గలిగింపుము. నీదర్శనము గానియెడల ధేనువులును, మేమును, ధేనువుల విషయమున మేము చేయవలసిన కార్యములును, కోరికలును, యోజనలన్నియును తలక్రిందులగు ననుసత్యమును నీకుఁ జెప్పుచున్నాము."
ప్రేమించుటయనిన నిదేవిధముగ నుండును. భక్తిరసామృత సింధువునందు శ్రీరూపగోస్వామి ప్రియసఖులచేష్టలనీవిధముగ వర్ణించియున్నాఁడు.

నిర్జితీకరణం యుద్ధే వస్త్రే ధృత్వాస్య కర్షణమ్ ।
పుష్పాద్యాచ్ఛేదనం హస్తాత్ కృష్ణేన స్వప్రసాధనమ్ ।
హస్తాహస్తి ప్రసఙ్గాద్యాః ప్రోక్తాః ప్రియసఖీ క్రియాః॥

యుద్ధమునందు శ్రీకృష్ణుని ఓడించుటయు, ఆయన వస్త్రమును బట్టి లాగుటయు, ఆయనవస్త్రములను ధరించి ఆకర్షించుటయు, ఆయనచేతియందున్న పుష్పములను లాగుకొనుటయు, వానిని దా నలంకరించుకొనుటయు, కొంచె కొంచెముగా, పరస్పరాకర్షణము జేసికొనుట మొదలగునవి ప్రియసఖులకార్యములు. హృదయాంతర్గతమగు భావముతోడ భగవానునితోఁ గ్రీడించువాఁడుమాత్రమే సఖ్యరసమునందలి

మాధుర్యము ననుభవింపఁగలఁడు. "ఎవరు గెలిచెదరో చూచెదము, నీవో, నేనో." (బం॥ ప॥) ఇట్లనుచు భక్తుఁడు ప్రేమయుద్ధమునకుఁ గడంగును; భగవానుని తన ప్రేమచే బంధించును. రామప్రసాదుఁడు కాళిని చెఱయందుఁ బెట్టియున్నాఁడు. "త్వన్నామశ్రవణము మత్కర్ణాభరణము. త్వన్నామస్మరణము మత్కంఠాభరణము. ప్రేమ నాకంఠమాలగా నున్నప్పుడు నాకితరాలంకారములేల?" భక్తుఁడు భగవానునకు తన యలంకారములను బెట్టును. అంధుఁడగు బిల్వమంగళుఁడు, బృందావనమున కేఁగుచుండెను. శ్రీకృష్ణుఁడు బాలుఁడై యాయనకు మార్గమును జూపుచుండెను. శ్రీకృష్ణుని స్పర్శింపవలయు ననుకోరిక బిల్వమంగళునకు మిక్కిలిగ నుండి ఆయన హస్తమును బట్టుకొనెను. వెంటనే శ్రీకృష్ణుఁడు చేతిని విదిలించికొని పలాయితుఁడయ్యెను. అంత బిల్వమంగళుఁడు

> హస్తావుత్క్షిప్య నిర్యాసి బలాత్ కృష్ణ కిమద్భుతమ్।
> హృదయాద్ యది నిర్యాసి పౌరుషం గణయామి తే॥

"కృష్ణా, నీవు బలవంతముగ నాహస్తమును వదలించుకొని వెళ్లితి వనుటయందు పౌరుషమే మున్నది? కాని, నాహృదయమునుండి వెళ్లఁగలుగుశక్తి నీకుండినప్పుడు గదా నీకు పౌరుషము గలదని తలఁతును." ఇది సఖ్యరసమునకు మంచి యుదాహరణము.

## ౪ వాత్సల్యము.

వాత్సల్యరసమునందు భగవానుఁడు గోపాలుఁ డగును. భక్తుఁడాయనను పుత్త్రునివలెఁ బ్రేమించును; స్నేహము నెఱపును; ఒడియందుఁ బెట్టుకొనును. కాని మన మీభావమును గ్రహించుట మిక్కిలి కఠినము. వాత్సల్యరసమున కుదాహరణముగా నొక బంగాళీకీర్తనతాత్పర్యము నిం దుదాహరించుచున్నాను. "వ్రజరాజా వినుము. స్వప్నమునందు గోపాలుఁడు కనిపించెను. ఆయన యెక్కడి కేఁగెను. వెన్న పెట్టు మని యేడ్చెను. చంద్రునితో సమాన మగు మోము, బాష్పపూరిత లోచనములు, గలగోపాలుఁడు నాచేలాంచలముఁ బట్టుకొని లాగినాఁడు. వెన్న పెట్టుమని యేడ్చినాఁడు. వానిమొదల నంటియున్న దుమ్మును దులిపి చంక నెత్తుకొని చేలాంచలముతో మోము తుడిచినప్పటికిని నాహృదయచంద్రుఁడు, చంద్రునికొఱకేడ్చుచుండెను. సహస్రచంద్రులకంటె మిన్నయగుమోము గలగోపాలుఁ డీచంద్రునికొఱ కేల యేడ్వవలయును. నిష్కళంక శశి యగు నీపాదములక్రింద నెంత మంది చంద్రులు దొరలుటలేదని నే నంటిని. ఆయననీలమేఘకాంతిగల శరీరమునకు దుమ్మువలన బూడిదవర్ణము వచ్చియుండెను. అమ్మా వెన్నఁ బెట్టు మని యడిగినయాస్వరమెంత మృదుమధురముగ నున్నది. అయ్యో! పాపము! వెళ్లి పొమ్మనిచెప్పితిని. గోపాలుని నెట్టివైచినాకిప్పుడు వీలులేదని చెప్పితిని."

ఈకీర్తనయందు వాత్సల్యరసాస్వాదము పొంగి పొరలు చున్నది. వాత్సల్యరసమున కింతకంటె మంచి యుపమాన మింకొకటి గానరాదు. యశోదాదేవి స్తనములనుండి క్షీర ధారలు ప్రవహించుచుండెను. ఆమెప్రాణము వాత్సల్య ప్రేమచేత నిర్భరమై యుండెను. గోపాలమూర్తి యామెహృ దయమునందు మెఱుపుదీఁగవలె మెఱయుచుండెను. ఈమె హృదయమునందు గోపాలవిరహాగ్ని మండుచుండెను.

ఈకీర్తనలయందలి యాధ్యాత్మికభావ మతిమనోహరము. భగవానుఁడు గోపాలవేషమును ధరించి భక్తునియొద్దకు వచ్చి ప్రేమభిక్ష నొసంగును. దానిని భక్తుఁడు కొంచె మాదరించి తదుపరి విముఖుఁ డయ్యెను. అప్పుడు గోపాలునిఁ గానక, భక్తుఁ డనుతప్తహృదయజ్వాలికలచే బాధ నొందుచుండెను. "నేఁడు స్వప్నమునందుఁ గనఁబడిన గోపాలుఁ డెక్కడనో దాఁగికొనెను." అని యశోద తనభర్తకుఁ జెప్పెను. భగవా నుఁడు భక్తునకు మెఱుపుదీఁగవలెఁ గనఁబడి మఱుఁగగుచుం డును; భక్తునితోడ దాఁగురుమూఁతలాడుకొనుచుండును. "నేనిక్కడ నున్నాను. నీచేతనైనయెడల నన్ను ముట్టుకొ నుము." అని చెప్పుచు "నీ వెక్కడ దాఁగితివి? నేను నిన్ను కనుఁగొనలేను. నిన్ను వెదకుటవలన నలసటఁ జెందినప్పుడు, నీవు నాహృదయమునందు "ఓ" యని కేక వేయుచున్నావు." (౨౦॥ కీర్తన.)

చపలచిత్తుఁ డగుబాలుఁడు, యశోదచేలాంచలమును బట్టుకొని వెన్న పెట్టుమని గోడ్చుచుండెను. అనఁగా నాయన భక్తులప్రేమకొఱకు పిచ్చివాఁడగుచుండెను. చంద్రుఁడమృతమును గురియునటులనే భక్తుఁడు ప్రేమను వర్షించుచుండును. భగవానుఁ డొకచంద్రుఁడు. భక్తుఁడు రెండవచంద్రుఁడు. భగవానుఁ డకలంకప్రేమశశి యగుటవలన, భక్తచంద్రులను కోట్లకొలఁది యొక్కచోఁ జేర్చినను గూడ నాయనతో సమ మగుటకు వీలు లేదు. ఆయన యనంతప్రేమసాగరము. కావున నాయన పాదపద్మములయందుఁ బడియున్న భక్తచంద్రులను లెక్కింపఁజాలముగదా? ఆయన "నాచంద్రుఁడు నాచంద్రుఁ డనుచు నాభక్తు లెచ్చట? నాభక్తుల ప్రేమ యెచ్చట?" నని యాక్రందనము సేయుచుండును. ప్రేమజలధి "ఇంకను ప్రేమ గావలయును" అని తరంగనాదములతోడ బొబ్బరిల్లుచుండును. కావున సర్వదా భక్తునిప్రేమకొఱకు భగవానుఁడు లోలుపుఁడై యుండును.

గోపాలుఁడు ప్రేమను బొందనియెడల ధూళియందు పడి దొరలును. ఆయన యెప్పుడును భక్తులయొక్క ప్రేమ నార్జించుకొనుటకు నాతురుఁడై యుండును. కాని యాయాతురత నెవరు గ్రహింపఁగలరు? ప్రేమకొఱ కాయన నీలవర్ణశరీరము దుమ్మునందు పడి దొరలుచుండును. భగవానుని నిర్లక్ష్యము చేసినయెడల భక్తునిప్రాణము, చింతాప్రవాహమునందు మునింగి కొట్టుకొనుచుండును.

## ౫. మాధుర్యము.

మధురరసమును గురించి చెప్పనేల? కాని మధురరస మతిమధురము. మధురరసము చిత్తమునందు సంచరింపఁ దొడంగిన భక్తుఁడు, సతి యేవిధముగ పతినిఁ దప్ప నితరుల నెఱుంగదో అదేవిధమున భగవానునిఁగాక యితరుల నెఱుంగకుండును. అందువలన సంపూర్ణముగ భగవానున కాత్మ సమర్పణము చేసి భక్తుఁ డిట్లనును.

"నీయందమును దలఁచుకొనినప్పుడు నా నేత్రములు బాష్ప పూరితములగును. నీమంచితనమును దలఁచుకొనినప్పుడు దాని యందు నామనస్సు మగ్నమగును. నాప్రత్యంగము నీప్రత్యంగ మును గోరుచుండును. నాశరీరమంతయు నీశరీరముకొఱ కాతురత నొందుచుండును. ఇంతకంటె మధురతర మగుస్థితి యింకొకటి లేదు. ఈస్థితియందు సతికిని పతికిని గలసంబంధమే భగవానునకు భక్తునకునుండును. శ్రీచైతన్యుఁ డీభావమునందు నిమగ్నుఁడై యుండెడివాఁడు. చైతన్యుఁడు భగవానుఁడును, రాధయు, శ్రీకృష్ణుఁడును; జీవాత్మ పరమాత్మయు నిందుల కుదాహరణములు. మధురభావ కుసుమ సౌగంధముచే పరిపూర్ణమగు చిత్తము గలభక్తుని ప్రాణము ఊర్ధ్వదిక్కునుండి యూర్ధ్వ దిక్కున కేగుచుండును. ఈస్థానము కామ వికారము గలవారి దృష్టికి కోటియోజనముల దూరమందుండును. అచ్చట రాత్రి యనునది లేదు. పవిత్రతా ప్రకాశమువలన సమస్తదిక్కులును ప్రకాశించుచుండును. పాపపిశాచము మోహినీరూపమును ధరించి యచ్చటికి రాఁ

జాలదు. ఆదివ్యధామమందు ప్రమదోద్యానవనములోని నిభృత స్థానాంతర్గతమందు హృదయనాథుఁడు తనభక్తున కీవిధముగఁ జెప్పును. ఒకరిమీఁదనొకరు చూచుకొనుచు, సంతోషమువలన పరవశులై ప్రేమ నిట్లు ప్రకటించుకొందురు. "కొంతవడి పోట్లాడుదురు. మఱికొంతవడికి కౌఁగిలించుకొని యొకరినొకరు స్తోత్రము చేసికొందురు. ఒకరినొకరు చూచుకొనినవ్వుచుకొని కన్నీళ్ళు కార్చెదరు." ఆధ్యాత్మికసంబంధమగు క్రీడనుగ్రహించుటకు మన కధికారము గలదా? మధురరసమునం దీఁదుచు చైతన్యుఁడు శ్రీక్షేత్రమునందు జగన్నాథుని సందర్శించి యీవిధముగ గానముచేసియున్నాఁడు.

"ఎవరికొఱకు నేను ప్రేమాగ్నిచేత దగ్ధుఁడ నైతినో అట్టి నాప్రాణనాథుని చిట్టచివరకు చూచుట తటస్థించెను." భగవానుని యనుగ్రహమువలన చైతన్యునివలె మన మెల్లరము నట్టి మదనాగ్నిహోత్రమునందు దగ్ధులమగుదుముగాక. పిశాచమదనుఁడు భూతలమునుండి శాశ్వతముగ నిర్వాసితుఁ డగును గాత. కామగంధవిహీన మగుపవిత్రాగ్ని సమస్తమానవుల హృదయసీమలయందుఁ బ్రజ్వలించుచుండును గాత.

మధురరసమునందు మునిఁగియుండువానికి బాహ్యకర్మ లుండవు; వేదవిధులను గమనింపఁడు. మధురభావనిమగ్నుఁ డగు "హాఫీజు" శాస్త్రోక్తకర్మలను పరిత్యజించియుండెను. ప్రేమమయుఁ డెవరిహృదయమునందు ప్రకాశించుచున్నాఁ

డో యట్టివానికి తులసీతావళములవలనఁ గాని, ఇతరబాహ్య కర్మలవలనఁగాని ప్రయోజనము గలదా? "ఎవ్వనిహృదయము నందు ప్రేమమయుఁడగు ప్రభువు ప్రకాశించుచుండునో వానికి ఈమాలలతో పని యేమి? ఈపూజావిధానములును, ఈపూజాద్రవ్యములును వాని కెందులకు?" (బం॥ పద్దము) భక్తుఁడు ప్రేమరసపానమత్తుఁడై, లజ్జాభయములను విడిచి, జాతికులభేదములను సముద్రమునందుఁగలుపును. ఇతఁడానందమువలన నుత్ఫుల్లచిత్తుఁడై ప్రేమమహిమను గానముచేయుచుండును.

"బిల్వమంగళ" మను నాటకములో "పాగలిని" యొక్క మధురరసమును ఉత్కృష్టమైనదిగాను వని చెప్పవచ్చును. భగవానుని యాహ్వానము భక్తురాలిహృదయము నెట్లు కలవర పఱచునో చూడుఁడు. "వినుము అదిగో వంశీధ్వని వినఁబడుచున్నది. ఆహా! నా కెట్టియున్మాదమును గలిగించుచున్నది; కదంబవృక్షముక్రింద నొంటరిగా నాకై "అతఁడు వేచియుండి వేణువును వాయించుచు ప్రేమయొలుకు మోవులతో దమార్గము వంకఁ జూచుచున్నాఁడు. నా ప్రేమవలన నున్మత్తుఁడై వంశితో నన్ను మాటిమాటికి పిలుచుచున్నాఁడా. నేను వెళ్లని యెడల కన్నీళ్లు గార్చుచు వ్యాకులితహృదయుఁడైపోవును." ఈమె హృదయవంశీగాన మాలించుచు వివశయై యుండెను. బృందావనమునందలి గోపికలయొక్క కామవిహీన మగు ప్రేమ మధురరసమునకు ఉత్కృష్టాదర్శము. వారి విరహా

న్మాద ముఖ్యచైతన్యునియందుఁ దప్ప మిగతవారియందుఁ గానరాదు. దాఁగురుమూఁత లాడుకొనుట భగవానునకు చిరాభ్యాసమని పూర్వమందే చెప్పియున్నాను. అటులనే గోపికలతోడ నాడుకొనుచు నీశ్వరుఁడంతర్హితుఁడయ్యెను. అందువలన గోపికలున్మాదగ్రస్తలై, భగవానుని నన్వేషింపఁ దొడఁగి, అచేతనము లని తలంపక, వృక్షముల సంబోధించి యీవిధముగ పలుకఁ దొడఁగిరి.

దృష్టో వః కచ్చి దశ్వత్థ ప్లక్షన్యగ్రోధ నో మనః ।
నన్దసూను ర్గతో హృత్వా ప్రేమహాసావలోకనైః ॥
కచ్చిత్ కురవకాశోక నాగపున్నాగచంపకాః ।
రామానుజో మానినీనాం గతో దర్పహరస్మితః ॥
కచ్చిత్తులసి కల్యాణి గోవిన్దచరణప్రియే ।
సహ త్వాలికులై ర్బిభ్ర ద్దృష్టస్తేఽతిప్రియోఽచ్యుతః ॥
మాలత్యదర్శి వః కచ్చి న్మల్లికే జాతియూథికే ।
ప్రీతిం వో జనయన్యాతః కరస్పర్శేన మాధవః ॥
చూతప్రియాలపనసా సనకోవిదార ।
జంబ్వర్క బిల్వబకుళామ్రకదంబనీపాః ।
యేఽన్యే పరార్థభవకా యమునోపకూలాః ।
శంసన్తు కృష్ణపదవీం రహితాత్మనాం నః ॥ భాగవతము.

ఓ యశ్వత్థ, ప్లక్ష, న్యగ్రోధ వృక్షములారా! చిఱునవ్వులతోడ చిత్తములను హరించిననందనందనుఁ డెచ్చటికి కేఁగెనో

మీరు చూచితిరా? ఓ కురవక, అశోక, నాగ, పున్నాగ, చంపకవృక్షములారా! మానినులమానభంగ మగునట్టి చిఱునవ్వు లొలయు శ్రీకృష్ణుఁ డిప్పటి కేఁగెను? ఓ కల్యాణీ, గోవిందచరణప్రియా తులసీ! నీ కతిప్రియుఁడైనయచ్యుతుఁడు నిన్ను పాదపద్మములయందు ధరించియుండును. కావున నాయనను నీవు చూచితివా? ఓ మాలతీ, మల్లికా, యూధికా వృక్షములారా! కరస్పర్శవలన మీ కానందమును గలిగించి మాధవుఁ డీదిక్కున కేఁగినాఁడా? ప్రియాళ, పనస, కోవిదార, జంబ్వర్క, బిల్వ, వకుళామ్ర, నీప, కదంబ వృక్షములారా! మీరు యమునానదీతీరవాసులై పరుల కుపకారము చేయుటకు జన్మించియున్నారు. హతభాగ్యగాంద్ర నగు మాకు శ్రీకృష్ణుఁ డిప్పటికేఁగెనో చెప్పుఁడు." హృదయమును స్పర్శించు నీగీతములోఁ బోల్పఁదగిన గీతము జగత్తునం దరులము. గోవిందవియోగమువలన వినాగోపికలవలెఁ జూపించిన విరహము రెండవది గై యున్నది.

విరహతాపమువలనను, ప్రేమోన్మాదమువలనను, గౌరాంగుఁడు తిరుగుచుండెను. గౌరాంగుఁడు ఆటలను వదలినాఁడని తలఁచుటకు నాహృదయము శోకించుచున్నది. తనకు కనఁబడిన చేతనాచేతనవస్తువులను జూచి, నాప్రియుఁడు, గోపాలుఁడు ఎచ్చటికి పోయెనని యడుగును. దుఃఖమునందు పడి దొరలును. లేచి పరుగెత్తును. రాధామోహన కవీశ్వరుని

హృదయ మిది చూచినమాత్రముననే కరఁగిపోవుచున్నది. దానికి నింతకంటె మృత్యువే మేలు."

శ్రీచైతన్యుఁడు విరహమువలన తల్లడిల్లుచు శ్రీకృష్ణుని నిర్దయుఁడు కఠినుఁడు నని సంబోధించుచుండెను. మఱియొకప్పు డభిమానమువలన నిఁక నాతనినామమును స్మరింప నను దృఢసంకల్పము గలవాఁ డగుచుండెను. కాని ప్రాణము యొక్క తీవ్ర వేదన నాఁపుకొనఁజాలక తత్తఱమునొందుచుండెను. అందువలన నాయననామ ముచ్చరింపక గోపికల నామము నుచ్చరించుచుండెను. ఇంకొకప్పుడు దీనినంతయు మఱచి "కృష్ణా, దర్శనమిమ్ము దర్శనమిమ్ము" అని కేకలు వేయుచుండెను. "అతనిహృదయమునందు దుఃఖము, అస్థైర్యము, వ్యాకులత, ఆతురత, ఆనందము, మొదలగునవి ప్రవహించుచుండెను. వీని కంతకును అతనిప్రేమోన్మాదమే కారణము. ఏవిధముగ మత్తగజములు చెఱకుఁదోఁటపైఁ బడి ధ్వంసము చేయునో అదేవిధముగ ఈభావములన్నియు నాతని నణఁగఁ ద్రొక్కుచుండెను. అతనిశరీరము ఆనందభారముచే క్రుంగుచుండెను. ప్రేమోద్దీపిత మైన హృదయముతో భగవానుని నిటుల సంబోధించుచుండెడివాఁడు.

శ్లో॥ హే దేవ హే దయిత హే భువనైకబన్ధో ।
హే కృష్ణ హే చపల హే కరుణైక సిన్ధో ।
హే నాథ హే రమణ హే నయనాభిరామ ।
హాహా కదా ను భవితాసి పదం దృశో ర్మే॥

౪౦ శ్లో॥ కృష్ణకర్ణామృతము.

విరహవిషజ్వాలలు పుట్టినయెడల హృదయమునం
దమృతము స్రవించుచుండును. "కృష్ణప్రేమయొక్క చరిత్ర
మతివిచిత్రము. అతితీవ్రమాస్వాదనమును వేడిచెఱకుగడతోఁ
బోల్పవచ్చును. నోటికి వేఁడిగానుండినను దానిని నీవు త్యజిం
పవు. ప్రేమాస్వాదనము చేసినవాఁడే ప్రేమయనుదానియందు
విషామృతములు మిశ్రితములైనవని కనుఁగొనును" (చైతన్యచరి
తామృతము) "నేను పుట్టినప్పటినుండియు వానిసౌందర్య
మును చూచుచున్నను నా నేత్రముల కింకను తృప్తి గలుగ
లేదు. అనేకవత్సరంబులనుండి నేను వానిని నావక్షఃస్థలంబు
నందుఁ బెట్టుకొనుచున్నాను కాని నాహృదయమున కింక
ను తనివి తీఱలేదు. తిరిగి తిరిగి వానితేనెలొలుకుపలుకులను
వినుచుంటిని గాని ఆపలుకులలో నొక్కమాటయైనను నా
చెవిని బడినట్టులేదు. మేమిరువురమును గలసి యెన్నిరాత్రు
లనో గడపితిమి కాని వానిప్రేమ నింకను గ్రహింపఁజాలకు
న్నాను" (చైతన్యచరితామృతము) ఈస్థితియందు హృదయము
లోనిభావమును గ్రహించు టెట్లు? హృదయవల్లభుని వక్షఃస్థ
లమును జీల్చి దానియందు భక్తుని గ్రుచ్చినను గూడ నాస పూ
ర్తిగాదు. భగవానునివక్షముతోడ వక్షమును ముఖముతోడ
ముఖము నుంచుట యనుదానిని మన మణుమాత్రమైనను గ్ర
హింపఁగలమా? కాని యీశ్రుతి చెప్పుదానిని మాత్రము
గ్రహింపఁగలము. "స్వాదస్య సఖ్యమితి." ఈయనసఖ్య
ము మధురము. "రసో వై సః" ఈయన రసస్వరూపుఁడు.
బిల్వమంగళుఁ డిట్లు చెప్పియున్నాఁడు

# భక్తియోగము.

మధురం మధురం వపు రస్య విభో
ర్మధురం మధురం వదనం మధురమ్।
మృదుగన్ధి మృదుస్మిత మేత దహో।
మధురం మధురం మధురం మధురమ్॥

ఆవిభునిశరీరము మధురము. ముఖము మధురము. ఈయన మృదుమందహాసము మధురము. అంతయును మాధుర్య మయము.

సౌమ్యా సౌమ్యతరా శేష సౌమ్యేభ్య స్త్వతిసున్దరీ।
చండీ.

'సుందరము పైటియు సుందరము అంతయును సుందరము. అతిసుందరము.' ఈయనను వక్షఃస్థలమునం దుంచుకొనువాని సుఖమున కంతములేదు. అట్టివాఁడు ధన్యుఁడు. వానికులము ధన్యము. వాఁడు నివసించుదేశము ధన్యము.

ఇహలోకమునందు భక్తియొక్క పరమోత్కృష్ట యింత వఱకు నుండును. దీనికంటె మేలుగా నమానంతయమునుగూర్చి చెప్పఁగలవాఁ డెవ్వఁడు?

# ఉపసంహారము.



భక్తివలన పవిత్రుఁడగువాఁడు మహాసౌభాగ్యవంతుఁడు. అట్టిభక్తుని పాదరేణువులను ముట్టుకొనుభాగ్యము గలిగినను గూడ మనము పావనుల మగుదుము. భగవానుఁడు భక్తులకు దాసుఁడై యుండును. శ్రీమద్భాగవతమునందు భగవానుఁ డిట్లు చెప్పియున్నాఁడు.

అహం భక్తపరాధీనో హ్యస్వతన్త్ర ఇవ ద్విజ ।
సాధుభిర్గ్రస్తహృదయో భక్తైర్భక్తజనప్రియః॥

నేను భక్తుల కధీనుఁడనై యుండుటవలన పరాధీనుఁడను. నేను భక్తులను మిక్కుటముగఁ బ్రేమింతును. కావున భక్తులు నాహృదయమును బ్రమింగియున్నారు. అందువలన లేశమైనను గూడ నాహృదయమువీఁద నా కధికారము లేదు.

నాహ మాత్మాన మాశంసే మద్భక్తైః సాధుభి ర్వినా।
శ్రియం చాత్యన్తికీం బ్రహ్మన్ యేషాం గతి రహం పరా॥

నాకైశ్వర్యమక్కఱలేదు. ఏభక్తులు నన్ను పరమగతిగా నెంచుకొనెదరో వారికొఱకు నన్ను నేను దానముచేసికొనఁ గలను.

# భక్తియోగము.

యే దారాగారపుత్త్రాప్తాన్ ప్రాణాన్ విత్తమిమం పరం।
హిత్వా మాం శరణం యాతాః కథం తాం స్త్యక్తుముత్సహే॥

భార్య, గృహము, పుత్త్రులు, ఆప్తులు, ప్రాణము, ధనము, ఇహలోకము, పరలోకము మొదలగు వానియం దు మమతను విడనాడి నన్నే శరణు చొచ్చినవారిని నే నేవిధముగ పరిత్యజింపఁగలను?

మయి నిర్బద్ధహృదయాః సాధవః సమదర్శనాః।
వశే కుర్వన్తి మాం భక్త్యా సత్స్త్రియః సత్పతిం యథా॥

సన్మార్గప్రవర్తనఁ గల భర్తను భార్య వశముచేసికొను నటులనే సమదర్శులగు సాధువులు నాయందు హృదయము ను లగ్నముచేసి నన్ను వశముచేసికొందురు.

మత్సేవయా ప్రతీతం చ సాలోక్యాదిచతుష్టయమ్।
నేచ్ఛన్తి సేవయా పూర్ణాః కుతోऽన్యత్ కాలవిద్రుతమ్॥

నా సేవవలన పరితృప్తులైనవారు ఆసేవవలన లభించు సాలోక్యాదిచతుర్విధ పురుషార్థములను గూడ వాంఛింప నప్పుడు, లయమును బొందు క్షణస్థాయిక విషయములను గురించి చెప్పన దేమున్నది?

సాధవో హృదయం మహ్యం సాధూనాం హృదయం త్వహమ్।
మదన్యత్ తే న జానన్తి నాహం తేభ్యో మనాగపి॥

సాధుపుంగవులు నాహృదయము, నేను సాధుపుంగవుల హృదయము నై యున్నాను. వారు నన్నుఁదప్ప నన్యమె ఱుంగరు. నేను వారిని దప్ప నన్యమెఱుంగను.

"భగవానుఁడు బలిచక్రవర్తిహృదయద్వారమున ప్రేమ పాశముచే బంధింపఁబడినట్లు భక్తునకు వశమై యుండును. భక్తునికంటె నుత్కృష్టుఁ డైనవాఁ డెవఁడు?

మోదన్తే పితరో నృత్యన్తి దేవతాః

సనాథా చేయం భూ ర్భవతి॥ నారదభక్తిసూత్రము.

"పితృదేవత లానందమును బొందుదురు. దేవతలు నృత్య ముచేయుదురు. నేనిటివఱకు సనాథుఁడను గేఁడు సనాథుఁ డ నైతిని" ఇట్టిభక్తుఁడు పాద మిడుస్థలము పవిత్రమగును. దీనిని స్పర్శించినవాఁడు వజ్రతుల్యుఁ డగును. ఈతఁడు నాలుదిక్కుల గృహలోకముయొక్క శోభతోను, పూర్ణేందు జ్యోతివలనను బ్రకాశించుచుండును. వాని యంగచేష్టలవలన నలుదిక్కులయందు స్వర్గపరిమళము వీఁచుచుండును. వాని ప్రేమవాక్యములవలనను పాపులహృదయకమలములు వికసించు చుండును. వానిప్రతికార్యమందును మందాకినీనదీజలముల ధారాళధార జగత్తును ప్లావిత మొనర్చుచుండును. వానిప్రతి చింతయందును సంతప్తపృథివిపైని ప్రేమకుసుమరాశి వర్షించు చుండును. మర్త్యలోకమునం దాయననామమున నానంద కోలాహలములు జరుగుచుండును. స్వర్గమునం దాయనవిజయ

